# దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు - తులనాత్మక పరిశీలన

( **Dravidian Prosody - A Comparative Study**

డా॥ కె. సర్వోత్తమరావు, ఎం. ఏ., పిహెచ్. డి.



ంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి

# దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు - తులనాత్మక పరిశీలన

**( Dravidian Prosody - A Comparative Study )**

డా॥ కె. సర్వోత్తమ రావు, ఎం. ఏ., పిహెచ్.



శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాల

తిరుపతి

# అంజలి

పరిశోధన చేయాలని, పి. హెచ్ డి. పట్టం పుచ్చుకోవాలని అనుకొంటున్న రోజులలో నాకు అవకాశం ఇవ్వడమేగాకుండా పరిశోధనకు తగిన చక్కని అంశాన్ని సూచించి అమూల్యములయిన సలహాలను ఇస్తూ ప్రోత్సహించినవారు నా మనసులో మెదిలే మాన్యులు ఆచార్య జి యస్. రెడ్డిగారు.

నా సిద్ధాంతవ్యాసాన్ని చాల ఓపికతో పరిశీలించి సార్థకమయిన పర్యవేక్షణా బాధ్యతను నిర్వహించినవారు సహృదయులు, గురుతుల్యులు, ఆచార్య జి. నాగయ్య గారు.

నా సిద్ధాంతవ్యాసం పిహెచ్. డి పట్టానికి తగిందని విలువకట్టినవారు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు, ఆచార్య తూమాటి దొణప్పగారు, ఆచార్య సుబ్బరామప్పగారు.

నా సిద్ధాంతవ్యాసం విశ్వవిద్యాలయంవారు ప్రచురించ తగినదని తమ ఆమోదం ప్రకటించినవారు ఆచార్య జి. వి సుబ్రహ్మణ్యంగారు, ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మగారు.

నా సిద్ధాంత గ్రంథానికి అభినందన పలికినవారు మా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య జి యస్. రెడ్డిగారు, ఆచార్య జి. నాగయ్యగారు.

నేనొకచోట పుస్తక ప్రచురణ మరోచోట సాగడంవల్ల కొన్ని తప్పులు దొరిలాయి. అయినా తక్కువ వ్యవధిలో నా సిద్ధాంతగ్రంథాన్ని ముద్రించడానికి అంగీకరించడమే గాకుండా అన్నమాటను నిలబెట్టుకొన్నవారు శ్రీ ప్రకాశరావుగారు.

అందరికి కృతజ్ఞతలు.

తిరుపతి — డా॥ కె. సర్వోత్తమ

26-2-1986

# అభినంద

**ఆచార్య. జి. యస్. రెడ్డి**
ఉపాధ్యక్షులు
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి.

మానవసమాజాల్లో – అది ఆటవిక సమాజమైనా, నాగరిక సమాజమైనా, భాషకున్న ప్రయోజనాలు రెండు : 1. నిత్యవ్యవహారంలో పరస్పర భావప్రకటన : 2. భాషారూపమైన వినోదం. వినోదవాంఛ మానవ ప్రకృతికి సహజలక్షణం. భాష ఆవిర్భవించిన తొలిదశలోనే ప్రాక్తన మానవుడు భాషాపరంగా కల్పించుకొన్న ఒక వినోదరూపమే పాట. పాటకూడా మాటలమయం. కాని పాటల్లోని మాటల కూర్పు కొంత విలక్షణమైంది. విలక్షణమైన మాటలకూర్పు వినోదాత్మకం: మానసోల్లాసకరం.

పాటలు పలురకాలు. భాషలేని మానవసమాజం లేనట్లే పాటలలేని మానవ సమాజాలూ లేవు. పాటల్ని విశ్లేషిస్తే వాటిలోని మాటలకూర్పులో ఒక నడక, లయ, గతి, చెవికింపుకల్గించే అనుప్రాసాదిశాబ్దికసౌందర్యం మొదలైన లక్షణాలు కన్పిస్తాయి. ఈ లక్షణాలు అసవుగా ఆవిర్భవించిన పాటల్లోను, లేదా ప్రయత్న పూర్వకంగా రచించిన పాటల్లోను గోచరిస్తాయి. ఈ లక్షణాలను విశ్లేషించి, వివరించి, క్రోడీకరిస్తే అదొక శాస్త్రమౌతుంది. ఏ శాస్త్రపరిణామంలోనైనా ముందు లక్ష్యం తర్వాత లక్షణం. సాహిత్య పరిణామంలో పాటలు / గేయాలు తొలిదశ. మలిదశ కవిత్వం. ఆటుతర్వాత గద్యం. గాన ప్రధానమైన గేయాలకు, పఠన ప్రధానమైన కవిత్వానికి సాదృశ్యభేదాలున్నాయి. ఛందోబద్ధమైంది కవిత్వం. ప్రపంచంలో అతిపురాతన రచనలైన వేదాలు ఛందః ప్రధానాలు. అతిప్రాచీన కాలంలోనే ఛందస్సును ఒకశాస్త్రంగా రూపొందించిన ఘనతకూడా మన భారత దేశానిదే. సంస్కృత ఛ్ఛందస్సు వేదకాలంనుంచి విస్తృతంగా, వైవిధ్యభరితంగా వికసించింది. సంస్కృత ఛ్ఛందః ప్రభావం ద్రావిడభాషా కావ్యవాఙ్మయంమీద కూడా ప్రసరించింది. దేశీయమైన ద్రావిడ ఛందోలక్షణాలు సంస్కృత ప్రాకృత

రచనల్లోను గోచరిస్తుంది. కాబట్టి భారతీయ భాషాఛందస్సుకు సంబంధించిన పరిశోధనలో ఆయాభాషల ఛందస్సును చారిత్రకంగాను, వివరణాత్మకంగాను పరిశీలించవచ్చు. ఇట్టి పరిశోధన ఇటీవల కొంత జరిగింది. భిన్న భాషలకు సంబంధించిన ఛందస్సును తులనాత్మకంగా కూడా పరిశీలించవచ్చు. భారతీయ భాషల తులనాత్మక ఛందఃపరిశీలన చెప్పుకోదగినంత జరగలేదు ఇది పరిశోధకులకు కొత్తపొలం: మంచిపంటభూమి. తులనాత్మక ఛందః పరిశోధనలో ఉత్తరార్యభాషల ఛందస్సును, లేదా దాక్షిణాత్య భాషల ఛందస్సును వేర్వేరుగా గ్రహించవచ్చు. లేదా భిన్నభాషాకుటుంబాలకు చెందిన పై రెండింటిలోని సామ్యభేధాలను, పరస్పర ప్రభావాలను కూడా తులనాత్మకదృష్టితో చూడవచ్చు ప్రస్తుతం డా॥ సర్వోత్తమరావు ప్రచురించిన ఈ గ్రంథం దాక్షిణాత్యభాషా ఛందస్సుకు సంబంధించిన తులనాత్మక రచన. ప్రధానంగా దేశి ఛందస్సుకు పరిమితం. ఇట్టి పరిశీలన ఇంతకు ముందు తెలుగులో కొంత జరిగింది. కాని అది పైపై చూపుల పరిశీలన మాత్రమే. దాక్షిణాత్య దేశి ఛందస్స్వరూపాన్ని సమగ్రంగా, తులనాత్మకంగా ప్రదర్శించే గ్రంథమిది. నాకు తెలిసినంతవరకు ఇట్టి తులనాత్మక రచన ఇతర దక్షిణదేశభాషల్లో లేదు. అందువల్ల డా॥ సర్వోత్తమరావుగారిది అపూర్వపరిశోధన: ప్రశంసనీయమైన రచన. ఇతర భాషల్లోకి కూడా అనువదించపదగిన యోగ్యత, ప్రామాణికతగల గ్రంథమిది. ఇట్టి గ్రంథాన్ని పండితలోకానికి అందిస్తున్న డా॥ సర్వోత్తమరావు అభినందనీయులు

ఈ గ్రంథ రచనలో ప్రశంసార్హమైన గుణాలు మూడున్నాయి. అవి 1. విషయవిశ్లేషణలో సౌలభ్యం. 2. విషయవ్యక్తీకరణలో స్పష్టత. 3. సోదాహరణ ప్రాధాన్యత. ఛందస్సు అందరినీ ఆకర్షించే విషయంకాదు. కాని పై గుణాలవల్ల ఈ గ్రంథానికి పఠనసౌలభ్యం సిద్ధించింది. కాబట్టి సాధారణ సాహిత్య జిజ్ఞాసువులుకూడా ఈ గ్రంథాన్ని చదవవచ్చు. దాక్షిణాత్యదేశి ఛ్ఛందస్సులో ప్రధానంగా తమిళ తెలుగు కన్నడ మళయాళ భాషల్లోని 1. కావ్యవాఙ్మయఛందస్సును 2. జానపదవాఙ్మయ ఛందస్సును 3. ఆధునిక ఛ్ఛందస్సును ఈ గ్రంథం సుప్రసన్నంచేస్తుంది. కాబట్టి ఆంధ్రేతరులు కూడా ఈ గ్రంథాన్ని రచయిత డా॥ సర్వోత్తమరావుని ప్రశంసించగలరని నా నమ్మకం. ఈ మార్గంలో దాక్షిణాత్య ఉత్తరార్యభాషా ఛందోరీతుల్నికూడా డా॥ సర్వోత్తమరావు తులనాత్మకంగా పరిశోధించాలని నా కోరిక.

— జి. యన్. రెడ్డి

**ఆచార్య జి. నాగయ్య,**
తెలుగు అధ్యయన శాఖాధ్యక్షులు,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
**తిరుపతి.**

# అభినందన

దాక్షిణాత్యభాషలైన తమిళ, కన్నడ, ఆంధ్ర, మలయాళ భాషల్లో - దేశిచ్ఛందోరీతులు, జానపదచ్ఛందస్సులు, ఆధునికచ్ఛందస్సులు మీద బహురీతుల దృష్టిని ప్రసరింపజేసి తులనాత్మకంగా, శాస్త్రీయంగా, సమగ్రంగా, ప్రప్రథమంగా పరిశీలన, పరిశోధన గావించి ఈ గ్రంథాన్ని లోకానికందించిన డా॥ కె. సర్వోత్తమరావుగారు మిక్కిలి అభినందనీయుడు. పిహెచ్. డి. పట్టాన్ని అందించిన సిద్ధాంతవ్యాసమైనా ఇది ఉత్తమస్థాయికి చెందిన పరిశోధనాత్మక, తులనాత్మక విమర్శ గ్రంథం. ఈ పరిశోధన నా పర్యవేక్షణలో జరగడం నాకు గర్వకారణం.

డా॥ సర్వోత్తమరావుగారు పరిశోధనా పూర్వకమైన బోధనానుభవం, బహుభాషా పాండిత్యంగల రచయిత. సూటిగా సహేతుకంగా కొంతవరకు ముక్తసరిగా చక్కని రచన చేయగల సమర్థుడు. విషయ వ్యక్తీకరణలోను విమర్శనాత్మక పరిశీలనలోను, రచయితకుగల ప్రావీణ్యం ఈ గ్రంథంలోని ప్రతిపుటలోను ప్రతిబింబిస్తుంది. డా॥ సర్వోత్తమరావు గారి తులనాత్మక పరిశీలనను ఆంధ్రలోక మభినందించి ఆదరించి ప్రోత్సహిస్తుందని నా విశ్వాసం. బహుభాషా పాటవం, పరిశోధన సామర్థ్యంగల డా॥ కె సర్వోత్తమరావుగారు ఇట్టి పద్ధతుల్లో భారతీయ సాహిత్యాలను తులనాత్మక దృష్టితో పరిశీలించి మరికొన్ని గ్రంథాలను ప్రచురించాలని నా కోరిక. అమూల్యమైన ఈ పరిశోధక గ్రంథ ప్రచురణకు ప్రోత్సహించిన శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన ఆచార్య జి. యన్. రెడ్డిగారికి అభినందనలు.

తిరుపతి **ఆచార్య జి. నాగయ్య**

26-2-1986

# విషయసూచిక

# ఉపక్రమణిక

పాటలలోను, కావ్యములలోను లయకును, ప్రకృతికిని అనుకూలముగా ఆయా కవులు రచించిన రచనలను, తరువాతి లాక్షణికులు పరిశీలించి వాని నడక ఈ రీతిగా నున్నదని నిరూపించుటకై వానిని ఛేదించి కొన్ని సూత్రములను రచింతురు. అట్టి సూత్ర సముదాయమునకే ఛందశ్శాస్త్రమని పేరు ఛందస్సు వ్యాకరణమువలె కేవలము శాస్త్రము కాదు. ఛందోబద్ధ రచనలవలన కలుగు అనుభూతి కళాతత్త్వమునకు సంబంధించిన అంశము. కనుక విమర్శకులు ఛందస్సును శాస్త్రదృష్టితోను, కళాతత్త్వ దృష్టితోను పరిశీలింతురు.

"ఛందో హీనో న శబ్దో స్తి
న చ్ఛంద శ్శబ్ద వర్జితమ్" అని

భరతుడు ఛందస్సునకును, శబ్దమునకు నున్న అవినాభావ సంబంధమును చాటెను[1]. ఆయా శబ్దములందుగల లయ విన్యాసములే ఛందో రూపములుగా కవిత్వములో ప్రతిభాసించును. ఛందస్సు ఆవశ్యకతను గురించి డబ్ల్యు. పి. కేర్ **(W. P. Ker)**

**"Prosody may be boredom but it is impossible to understand poetry without it"**

అని నిష్కర్షగా తెలిపెను.[2]

మార్గ దేశీ భేదములు సంగీత నాట్యభాషలందున్నట్లే కవిత్వ విషయమున కూడ కలదు. ఈ భేదములను కన్నడ కవులు, కన్నడ లాక్షణికులు తొలుత ప్రస్తావించిరి. ఆపై తెలుగు కవులు వానిని ప్రస్తావించిరి. కవిత్వమున ఈ భేదము లేర్పడుటకు అనేక హేతువు లున్నవి. ఆచార్య జి. ఎన్. రెడ్డిగారు

"ప్రపంచ భాషల్లో శిష్ట సాహిత్యాన్ని పండించుకొన్న తొట్టతొలిభాష సంస్కృతమే. భారతీయ సంస్కృతిని సాహిత్యాలనూ, జాతినీ, జాతి జీవనాన్ని ప్రభావితం చేసిన భాషకూడా సంస్కృతమే. ద్రావిడాది సంస్కృతేతర భాషా సంస్కృతులు మీద ప్రసరించిన ప్రభావం ఎక్కువే అయినా అది ఏకోన్ముఖంకాదు. చాల వరకు పరస్పరం ఆదాన ప్రదానం. ఉత్తరదేశ భాషా సాహిత్యాలలో కూడా

ద్రావిడ సంబంధ లక్షణాలు ఉన్నాయి. అతి ప్రాచీన కాలం నుండి భారతీయ సంగీత నాటక సాహిత్యాది సంప్రదాయ ప్రవంతిలోని మార్గ-దేశి అనే రెండు పాయలు ఏర్పడ్డానికి ఇదే కారణం".3 అని ఊహించిరి.

మార్గ-దేశి విభాగము కేవలము లక్షణా భేదము వలననే భిన్నముకాదు. ఈ విభేదములలోని వైలక్షణ్యమును గురించి ఆచార్య జి. నాగయ్యగారు

"సంస్కృత భాషా సాహిత్య లక్షణ ప్రభావము భాసింపజేయుచు, ఉభయ భాషా పండితులకు ఉద్దేశింపబడి వారి ఆదరాభిమానములను అనివార్యముగ నపేక్షించు నట్టి ప్రౌఢకవిత మార్గకవిత అనియు, ప్రత్యక్ష సంస్కృత ప్రభావమును ప్రతిబింబింప జేయక కథావస్తువు, వర్ణనలు, భావము, భాష, రీతులు అలంకారములు, కవి సమయములు, ఛందస్సు, సాహిత్య ప్రక్రియలు మొదలగు వానియందు దేశి లక్షణములను ప్రధానముగా ఆరోపించుకొని దేశీయ ప్రజాజీవితమునకు సన్నిహితముగ జన సామాన్యమున వ్యాప్తి కొరకు ఉద్దేశింపబడిన ప్రజాకవిత దేశి కవిత అనియు స్థూలముగ నిర్వచింపవచ్చును".4 అని స్పష్టము చేసిరి.

మార్గ దేశి కవితారీతులు రెండును వేరు వేరు కావు. ఒకదాని ప్రభావము మరొక్కదానిపై ఉన్నది ఈ అభిప్రాయమునే ఆచార్య తి. కోదండరామయ్యగారు

"మార్గ దేశి భేదములకు కాలమొక్కటే నిర్ణాయక ప్రమాణము కాదు. ఏ కవీశ్వరుని కవిత్వమయినను పూర్తిగా మార్గ కవిత్వ శాఖకును పూర్తిగా దేశి కవిత్వ శాఖకును చేరుటకు వీలుండదు"5 అని తెలియజేసిరి.

అందువలన మార్గదేశి లక్షణములు నియతములు కావని, కాలభేదము, కవిత్వ భేదముల బట్టి వాని లక్షణములు మార్పు నొందుచుండునని, ఒక కాలమున దేశి కవిత్వముగా పరిగణింపబడినది ఆ తరువాతి కాలమున మార్గకవిత్వముగా పరిగణింప బడినదని చెప్పచ్చును.

మార్గ దేశి భేదములను ఛందశ్శాస్త్రానుగుణముగా అన్వయించినవారు శ్రీ బంవారు తమ్మయ్యగారు6 కేవలము సంస్కృత ఛందో గ్రంథములలో ప్రసిద్ధము లయిన అక్షరగణాదులతో కూడిన స్రగ్ధరాదులు మార్గమని, దేశీయములయిన కందము

గీతము మొదలయిన మాత్రాగణబద్ధములయిన పద్యములు దేశి కవితకు చెందినవని శ్రీ తమ్మయ్యగారు భావించిరి. అట్లే దేశీయములయిన మాత్రాచ్ఛందస్సుల నుండి పుట్టిన జాతిపద్యములుగల రచన దేశి కవిత అని శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు భావించిరి.[7]

ద్రావిడ భాషలలో తమిళము, కన్నడము, తెలుగు, మలయాళములు ప్రసిద్ధములు. ఈ భాషలలో విశిష్ట వాఙ్మయమున్నది. ఈ భాషలపై సంస్కృత ప్రభావము లేకపోలేదు. ఈ ప్రభావమును గురించి ఆచార్య కె. కె. రాజాగారు

"The influence of Sanskrit on the Dravidian Literatures has been continuous and comprehensive and has affected not only the language and style but also the themes and patterns as well as the conventions and ideals of the literature .... Except in the case of Tamil which has been ancient and independent literature little affected by the impact of Sanskrit literature and keeping its individuality even when assinilating some of the influences of Sanskrit and all the other Dravidian Literatures as fully saturated with Sanskrit Literary traditions and their main works are free translations and adaptations or feeble imitations of the Sanskrit models[8]" అని తెలియ జేసిరి. తమిళముపై సంస్కృత ప్రభావము లేకపోలేదు. కాని తమిళకవులు, లాక్షణికులు ఆ ప్రభావమును అరికట్టగలిగిరి. కాని కన్నడాంధ్రములపై సంస్కృత ప్రభావము ప్రాచీనకాలము నుండి కనిపించును. మలయాళముపైగల సంస్కృత ప్రభావము అర్వాచీనమే. కన్నడాంధ్ర మలయాళములందు మార్గపద్ధతికే పైచేయి. ఈ భాషలందుగల సంస్కృత ఛందో విశేషములను పలువురు పరిశీలించిరి. కాని తమిళము, కన్నడము, తెలుగు, మలయాళములలోని దేశిచ్ఛందోరీతులను తులనాత్మకముగా పరిశీలించినవారు లేరు.

(1) తెలుగు కన్నడ మలయాళములపై సంస్కృత ప్రభావ మధికము. కనుకనే అందలి మాత్రాగణములు కూడ గురు లఘువులతో వర్గీకరించుట జరిగినది.

కాని తమిళములోని పద్యలక్షణము గణ పద్ధతి స్వతంత్రమై ఇతర దాక్షిణాత్య భాషల కంటె విలక్షణముగ కన్నడాంధ్ర మలయాళములందువలె తమిళమునందును మొదట అక్షరములను బట్టియే పద్యనిర్మాణము జరుగుచుండెనని, 'అశైపద్ధతి' తరువాతి పరిణామమని డాక్టర్ ఎ. సి. చెట్టియార్‌గారు అభిప్రాయపడిరి.[9]

సంస్కృతములోని మాత్రాగణములకు కన్నడాంధ్రములలోని మాత్రాగణములకు భేదమున్నది. దాక్షిణాత్య భాషలలోని ఛందోరీతుల పరిశీలనము వలన తమిళ ఛందస్సులో గణ విభాగము తక్కిన భాషలందువలె గాక ప్రత్యేకముగా నున్నట్లు విదితమగును. తమిళములోని 'శీర్' నిర్మాణపద్ధతి కన్నడాంధ్రము లందలి దేశీయగణ నిర్మాణమునకు మార్గదర్శకమైనట్లు గుర్తింపవచ్చును. దాక్షిణాత్య భాషలలో దేశీయ గణములందు మాత్రాసంఖ్య నియతము కాదని కూడ తెలిసికొనవచ్చును. సంస్కృతమునందు లేని దేశీయ గణముల స్వరూప స్వభావములను తెలిసికొనుటకు దాక్షిణాత్యదేశిచ్ఛందో రీతుల పరిశీలన అవసరము.

(2) దేశి చ్ఛందస్సులకు లౌకిక సంస్కృతమునందలి పద్యములకువలె నాల్గు పాదములుండుట నియతముగాదు. తమిళములో అక్షర గణబద్ధములగు ఉత్పలాది సంస్కృత వృత్తములు లేవు. కాలక్రమమున దేశ్యజాతులలో కూడ పాద సంఖ్యా నియమమేర్పడుటకు సంస్కృత వృత్తముల ప్రభావమే కారణమని తెలియుచున్నది. దాక్షిణాత్యదేశి పద్యములలోని పాదనియతిని గుర్తించుటకు దేశి చ్ఛందో రీతుల తులనాత్మక పరిశీలన ముఖ్యము.

(3) తమిళము నందలి 'మోనై' తెలుగు వడిని పోలినది. తమిళ మోనై భేదములలో పొళిప్పుమోనై, ఒరూఉ మోనై, అను రెండింటికి మాత్రము తెలుగులో ప్రచారము. తక్కిన మోనై విభేదములు జానపద గేయములందు మాత్రమే కనిపించును. తమిళమునందు సరూపాక్షర యతి ఐచ్ఛికమే గాని తెలుగునందువలె నియతము కాదు. కన్నడములో సరూపాక్షర యతి లేదు. మలయాళములో 'యతి-మోనై' రెండును గలవు.

తమిళములో ప్రాసను 'ఎదుగై' అని అందురు. తమిళములో 'మోనై' వలె 'ఎదుగై' కూడ ఐచ్ఛికమే కన్నడములో ప్రాసకు అత్యంత ప్రాధాన్యమున్నది.

మలయాళమునందుకూడా యతికంటె ప్రాస ముఖ్యము. తెలుగులో ప్రాస కేవలము ఐచ్ఛికమే.

సంస్కృతములో లేని ప్రావళ్ళు రెండును తమిళ ఆంధ్ర మలయాళ భాషలలో నున్నవి. ఇవి తెలుగు సాహిత్యమునకు ప్రత్యేక లక్షణములు. యతి ప్రాసలనునవి అలంకారము కొఱకు కవులు కొందరు తెచ్చిపెట్టుకొనినవి కావు. ఇవి క్రీస్తుశకము నకు ముందే తమిళ వాఙ్మయములో సహజముగా నిల్చిన ప్రాచీన ద్రావిడ కవితా సంప్రదాయములుగా నున్నవని దాక్షిణాత్య దేశిచ్ఛందోరీతుల తులనాత్మక పరిశీలనము వలన విదితమగు చున్నది.

4) తమిళములో మలయాళమునందు కంటె చాల ముందుగా కావ్యరచన జరిగినది. క్రీ. శ. 12, 13 శతాబ్దులనాటి మలయాళ పద్యగ్రంథములలోని పద బంధములు, వ్యాకరణము లందేగాక ఛందస్సులోగూడ తమిళ ప్రభావము గోచ రించును. ఈ శతాబ్దులలో తమిళమాతృకగల ఛందోరీతులు మలయాళమున చోటు చేసికొనినవి. కాని కాలక్రమమున మలయాళ ఛందస్సంతయు సంస్కృతమయమైనది తమిళమాతృకగాగల మలయాళ ఛందోరీతుల తెలిసికొనుటకు తమిళ మలయాళము లందలి ప్రాచీనదేశిచ్ఛందోరీతుల సంబంధమును పరిశీలించుటకు ఈ తులనాత్మకచర్చ తోడ్పడును.

5) కన్నడాంధ్రదేశి చ్ఛందములలో పెక్కింటికి, సమానములగు పద్యములు తమిళములో కనిపించుచున్నవి. తెలుగులోని అక్కరలు, రగడలు, సీసములకు 'ఆశిరియప్పా' ఛందముతో సంబంధము కలదు. ఆటవెలది, తేటగీతులకు తమిళము నందలి 'ఇన్నిశైవెణ్బా' తో సామ్యము చెప్పుటకు వీలున్నది. తమిళ కన్నడాంధ్ర పద్యముల సన్నిహిత సారూప్య సంబంధము నిరూపించుటకు తమిళ ఆంధ్రదేశి చ్ఛందోరీతుల తులనాత్మక పరిశీలన దోహదము చేయును.

6) కీర్తనై, కుమ్మి మొదలగు పాటలందేగాక వెణ్బా, ఆశిరియప్పా మొదలగు పద్యములందును లయానుసారముగ హల్లును పెక్కుమాత్రలుగ పొడిగించి పాడుట తమిళపద్ధతి. మఱియు తమిళమునందు కవులే 'లయను' సూచింతురు. మలయాళ ఛందోరీతులన్నియు గానప్రధానములే లయ లేక గతినిబట్టి మలయాళ పద్య పాద

ములను విభజింతురు. తమిళ మలయాళ ఛందోరీతులలోని గతి లేక లయను గుర్తించు టకు తమిళ మలయాళ దేశిచ్ఛందోరీతుల తులనాత్మకచర్చ మిక్కిలి యుపకరించును.

7) కన్నడభాషలో తెలుగులో కంటె ముందుగా కావ్యరచన సాగినది. నన్నయాది తెలుగుకవులు కన్నడ వాఙ్మయమునందలి ఛందోవిశేషముల ననుక రించిరి కన్నడములోని అక్కరలు, రగడలు మొదలగునవి తెలుగులోకూడ ప్రవే శించినవి తెలుగు ద్విపదకు కన్నడ ఛందోవతంసతో పోలికకలదు. కన్నడాంధ్ర ముల రెంటను కందము, ఉత్సాహము. దండకములకు విశేషప్రచారమున్నది. ఇట్లు కన్నడాంధ్రభాషలలోని ఛందస్సామ్యముల నెరుగుటకు ఆ భాషలలోని ఛందోరీతుల తులనాత్మక పరిశీలన సహకరించును.

8) తమిళములోని కుమ్మి, చిందు పద్యరీతులకు, కన్నడములోని త్రిపదులకు, తెలుగులోని ద్విపద రగడలకు, మలయాళములోని మంజరి, కిళిప్పాట్టులకు జానపద గేయసరసులే మాతృకలు. జానపదగేయములలోని ఛందోరీతులకు కావ్యగౌరవము గలిగించిన మహాకవులు దాక్షిణాత్యభాషలలో పెక్కురున్నారు. కనుక దాక్షిణాత్య భాషలలోని జానపదచ్ఛందోరీతుల సంబంధము తెలిసికొనుటకు కూడ ఈ తుల నాత్మక పరిశీలన మిక్కిలి యుపకరించును.

9) ప్రాచీన దేశిచ్ఛందస్సులలో విప్లవాత్మకమగు మార్పులు గావించిన మహా కవులు దాక్షిణాత్యభాషలలో పెక్కురున్నారు. నూతన ఛందోరీతులను సృష్టించి క్రొత్తప్రయోగములను చేసినవారును ఉన్నారు. ప్రాచీనదేశిచ్ఛందోరీతులలో క్రొత్త రీతుల నెరుంగుటకు ఆధునికగేయ చ్ఛందస్సులలో క్రొత్త భేదములను గుర్తించుటకు ఈ తులనాత్మక చర్చ తోడ్పడును.

10) దాక్షిణాత్య భాషలన్నిటిలోను వచనకవిత యున్నది ఈ వచనకవిత లక్షణములు వాని పరస్పరసంబంధము, పరిణామములు చర్చించుటకు ఆయాభాషల లోని దేశిచ్ఛందోరీతులను తులనాత్మకముగా పరిశీలించుట అవసరము.

ఇంతటి వ్యాప్తిని, వైశిష్ట్యమును, ప్రాముఖ్యమును పొందిన దాక్షిణాత్యదేశి చ్ఛందోరీతుల తులనాత్మక పరిశీలనమును గూర్చిన సమగ్ర పరిశీలన పరిశోధన జరుగలేదు. శ్రీ చేకుమళ్ళ రాజగోపాలరావుగారు 'A comparative Prosody

of Dravidian Languages' అను సిద్ధాంతములో తమిళ కన్నడాంధ్ర భాషలలోని గణయతిప్రాసలను గూర్చి మాత్రము చర్చించిరి. శ్రీ చిలుకూరి నారాయణరావుగారి 'మాత్రాచ్ఛందస్సులు' అను వ్యాసము సంస్కృత ప్రాకృత తమిళ కన్నడాంధ్ర భాషలలోని ఛందోవిషయములను పరామర్శించును. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి 'దక్షిణదేశ భాషాసారస్వతములు – దేశి' అను గ్రంథములో దాక్షిణాత్య దేశిచ్ఛందోరీతుల తులనాత్మక చర్చ కలదు.

ద్రావిడ భాషా శాస్త్రవేత్తల సంఘము (Dravidian Linguistic Association) ద్రావిడ భాషల ఛందస్సామ్యములను గురించి యొక విద్వద్గోష్ఠి 1974 వ సంవత్సరములో జరిపి తులనాత్మక పరిశీలనమునకు విశేషమయిన దోహదము కల్పించినది.

డా॥ జి. నాగయ్యగారు దాక్షిణాత్య సాహిత్య సమీక్ష (మొదటి సంపుటము) గ్రంథములోని 'దాక్షిణాత్య సాహిత్యములు–దేశి' అను వ్యాసములో తమిళ కన్నడ ఆంధ్ర మలయాళ భాషలలోని దేశి చ్ఛంద స్సామ్యములను విశదముగా పరిశీలించిరి.

పైన పేర్కొనిన ఛందో విషయకమగు వ్యాసములు, సమీక్షలు సమగ్ర పరిశోధన గ్రంథములు గావు. కావుననే దాక్షిణాత్య భాషలలోని దేశిచ్ఛందోరీతులను ప్రత్యేకముగా గ్రహించి, అభిమానించి, తమిళ కన్నడాంధ్ర మలయాళ భాషలలో వెలువడిన ఛందోవిషయముల పరామర్శించి, పూర్వ విమర్శకుల సద్విమర్శలను పాటించి దాక్షిణాత్య దేశిచ్ఛందో రీతుల ప్రత్యేక ప్రాముఖ్యములను వివరించుటయే ఈ పరిశోధన లక్ష్యము.

## సంఖ్యా సూచి :


1. నాట్య శాస్త్రము 15, 21, 40
2. **Form and Style – P 10**
3. దాక్షిణాత్య సాహిత్య సమీక్ష (మొదటి సంపుటము) కు వ్రాసిన ప్రవేశిక.
4. దాక్షిణాత్య సాహిత్య సమీక్ష (మొ. సం) పుట 100
5. దేశికవితోద్యమము – పాల్కురికి సోమన పాత్ర – పుట 298
6. మార్గదేశికవితలు – ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక – ఖరనామ సంవత్సరం.
7. తెలుగు భాషలో ఛందోరీతులు పుట 14
8. **The influence of Sanskrit and the Dravidian Literature with special reference to Malayalam- Indian Literature Vol 16- P - 45.**
9. **Advanced studies in Tamil Prosody p 19**

# 2. ఛందస్స్వరూపము - ప్రయోజనములు

## 2. 1. ఛందశ్శబ్ద ప్రయోగము :-

ఛందశ్శబ్దము చాల ప్రాచీనమయినది. ఈ శబ్దము వైదిక లౌకిక వాఙ్మయము లందు వివిధార్థములలో ప్రయుక్తము. వేదములు చదువుకొన్నవారికి ఛాందసులని వ్యవహారము. అనగా ఛందస్సు తెలిసినవారని సారాంశము. ఛందము పద్యమే కానక్కరలేదు. శ్లోకములు విరివిగా గల ఋగ్వేదమునకు, గద్యభాగమెక్కువగా గల యజుర్వేదమునకు సంగీతధర్మమునకు ప్రాధాన్యమున్న సామవేదమునకు ఛందమని పేరు. వేదచ్ఛందము లభిన్నములనుటకు

"గౌః సూరిః నాదః ఛందః స్తోత్రనామాని"[1]

"ఛందాంసి యస్య పర్ణాని

యస్తం వేద స వేదవిత్"[2]

"ప్రణవశ్ఛందసా మివ"[3]

అను వాక్యములు ప్రబలాధారములు.

జనులు వివిధ వస్త్రములతో తమతమ దేహములను ఆచ్ఛాదించుకొనునట్లు ఛందములు మంత్రార్థములను ఆచ్ఛాదించునని ఛాందోగ్యోపనిషత్తు విశదీకరించును[4].

శతపథ బ్రాహ్మణములో ఛందశ్శబ్దము ప్రజాపతి, దిక్కు, ప్రాణము, అంతరిక్షములను అర్థములందు ప్రయుక్తము[5] సామవేద తాండ్య బ్రాహ్మణములో ఇంద్రియములు ఛందములుగా నిరూపితము.[6] కౌషీతకీ బ్రాహ్మణములో ప్రాణములే ఛందములుగా చెప్పబడినవి.[7]

వాయు,[8] విష్ణు,[9] మత్స్య[10] పురాణములలో సూర్యరథాశ్వములు ఛందములైనట్లు వివరణ కలదు వీనిబట్టి వైదిక వాఙ్మయమున ఛందశ్శబ్దమునకు అలౌకికార్థము లున్నట్లు స్పష్టము. ఒక్క ఋక్ప్రాతిశాఖ్యలో మాత్రము ఏకాక్షర ఛందను మొదలుకొని గాయత్రి, ఉష్ణిక్ మొదలయిన ఛందములందు గల పెక్కు వృత్తముల వివరణ కనిపించును[11]

నిఘంటువులలో ఛందశ్శబ్ద వివరణము కలదు ఛదనః పద్యేభిలాషేచ గాయత్రి ప్రముఖం ఛన్దః

ఇచ్ఛా సంహిత యోరార్షే
ఛన్దే వేదే చ ఛన్దసి — కౌశికావృత్తి
ఛన్దః పద్యేచ వేదేచ
స్వైరా చారాభిలాషయోః — మేదినీకోశః
ఛనయతి ఆహ్లాదయతి — హలాయుధకోశ

పై పరిశీలన వలన ఛందశ్శబ్దమునకు సంహిత, ఆర్షగ్రంథము, ఇచ్ఛలేక అభిలాష, అనియంత్రితాచారము, గాయత్ర్యాది ఛందస్సులు మొదలగు అర్థము లున్నట్లు స్పష్టము.

తమిళములో పద్యలక్షణమును తెలియచేయు శాస్త్రమునకు 'యాప్పు' అని పేరు. కాని యాప్పుకు పర్యాయముగా పాట్టు – తూక్కు – తొడప్పు – చెయ్యుళ్ అను పదములు కూడ వాడుచున్నారు. వీని వివరణ 'Tamil Lexicon'లో విస్తృతముగ కలదు.

యాప్పు - Yappu – n < యా T apu –

**Binding, tying, Poetry Ligature Stretched across the pot like portion of yal - Graduvated serial order of treatises to be studied one of 11 cirappu Payiraon, Affection as binding persons together, Resolution, Steadiness, firmness, Fitness, Snake.**

యాప్పు అనగా కట్టబడునది. రాగ తాళాదులతో కూడి పాడుట కనువైన పదబంధము కలది అని అభిప్రాయము.

పాట్టు n **Pattu** < పాడు

**Singing, Chanting - Song, hymn, that which is sung or adapted to music – music. Verse of Stanza. Poem, Word, Abuse.**

'పాట్టు' అనగా పాట పాడబడునది అని సామాన్యార్థము.

తొడర్పు - < తొడర్ - see తొడర్పి

**Attachment, friendship - Verse. Poem, Rule Principle, Stickness**

—Tamil Lexicon Vol iv - 2081

గణ యతి ప్రాసాదుల వలన పదములు పరస్పరము సంబంధము కలిగి యుండుట 'తొడర్పు' కాగలదు.

తూక్కు - Tooku.

Poem – A Pause which helps in determining the metrical nature of a verse. Dancing music A musical mode of which there are seven kinds according to talam - A variety of time measure - consisting of two matras - Corresponding to Kuru.

—Tamil Lexicon *V*ol iv - 2010

రాగ తాళ సంయోగము 'తూక్కు' ప్రధాన లక్షణమని ఫలితార్థము.

ఛందశ్శబ్ద పర్యాయ పదములలో కడపటిది 'చెయ్యుళ్' తమిళ వాఙ్మయములో ఈ 'చెయ్యుళ్' శబ్దము విశాలార్థములో ప్రయుక్తము తొల్కాప్పియమును గూర్చి సిద్ధాంత వ్యాసము వెలువరించిన డా॥ ఇలక్కువణార్‌గారు

**'Literature is called *S*eyyul in Tamil. Seyyul means that which is composed. Now it denotes Poetry'**[12] అని వివరించిరి.

శ్రీ వి. ఎస్ చెంగల్రాయ పిళ్లైగారు

**'The seyyul meant only written composition without regard to its quality, may also be noticed from the old use of such expressions as Pattudai Seyyul, Urai Seyyul and Soothira Seyyul.'**[13]

అనియు చెయ్యుళ్ శబ్దమును గూర్చి చర్చించిరి.

తొల్కాప్పియకర్త 'చెయ్యుళ్'ను రెండు విధములుగా వర్గీకరించెను. నియత లక్షణములతో నిర్బంధముగా కూర్చుట యొక తెగకు చెందినది కాగా, పాదాది నిర్బంధములు లేక కూర్చుట రెండవ వర్గమున చేరును. ఈ విభాగమువలన పద్య కావ్యములు మొదటి విభాగమునందును, గద్య కావ్యములు, సూత్రరచనలు రెండవ విభాగమునందును చేరును. రచనా ప్రణాళిక ననుసరించి పరిశీలింపగా గద్యమునందు కంటె పద్యములో నియమనిబంధనము లెక్కువ యగుటవలన 'చెయ్యుళ్' అనగా పద్యమనియే స్థిరపడినది.

కన్నడ భాషలో పద్యలక్షణమును తెలియజేయు శాస్త్రమునకు 'ఛందస్సు' అని వ్యవహారము. కన్నడ వాఙ్మయములో ఛందోంబుధి, ఛందస్సార, ఛందోర్ణవ, ఛందస్సంపుటములను పేరుగల గ్రంథములున్నవి. వీనిబట్టి ఛందశ్శబ్ద వ్యాప్తి స్పష్టము.

డా॥ కర్కిగారు మహారాష్ట్రిభాషలో దేశిచ్ఛందోరీతులను మాత్రము ఛందస్సు అను పేరుతో వ్యవహరించుట వలన కన్నడములోని అంశగణములతో కూడిన దేశిచ్ఛందో రీతులను కూడ అట్లే వ్యవహరింప వచ్చునని విశదీకరించిరి.[14]

తెలుగులో పద్య లక్షణమును తెలియజేయు శాస్త్రమునకు 'ఛందస్సు' అని పేరు. అచ్చతెనుగులో దీనికి పర్యాయ పదము కానరాదు. పైగా తెలుగులో ఛందోదర్పణము, బాలబోధచ్ఛందము, ఆనంద రంగరాట్ఛందము, ఛందస్సార సంగ్రహములను గ్రంథనామములు ఛందశ్శబ్దవ్యాప్తిని నిరూపించును.

మలయాళ భాషలో ఛందశ్శబ్దము కంటె 'వృత్త' శబ్దమునకు వాడుక ఎక్కువ మలయాళ లాక్షణికులు సంస్కృత వృత్తములను మాత్ర గణములతో కూడిన వానిని దేశిచ్ఛందోరీతులను 'వృత్తములు'గా గ్రహించిరి. వృత్తమంజరి, భాషా వృత్తదీపిక, వృత్త వివేకం మొదలగు ఛందో గ్రంథముల పేర్లుకూడా పై సత్యమును నిర్ధారించును.

ఇక నాలుగు భాషలలోను భిన్ననామము లేర్పడుటకు కారణ మరయుదము.

పద్యలక్షణ నిరూపణములో రెండుపద్ధతులున్నవి. మొదటిది బాహ్యస్వరూప కథనము. రెండవది అంతస్స్వరూప ప్రదర్శనము. ఈ రెండుపద్ధతులను దృష్టి

యందుంచుకొని తమిళ లాక్షణికులు చెయ్యుళ్ - పాట్టు - తూక్కు - తొడర్పు అను పేర్లు పెట్టియుండవచ్చును.

కన్నడాంధ్రములందు ఛందశ్శబ్దము గ్రహింపబడుటకు సంస్కృత ప్రభావమే ప్రధాన కారణమగును. పద్యములు వృత్తములయినను, జాతులయినను, ఉపజాతులయినను వాని ప్రయోజనము ఆహ్లాదము నొడగూర్చుటయే. కనుక విస్తృతార్థమగు ఛందశ్శబ్దమును కన్నడాంధ్ర లాక్షణికులు గ్రహించి యుండవచ్చును.

మలయాళములో మణిప్రవాళశైలికి ప్రచార మెక్కువ. మరియు ఆ భాషలో తమిళ ఛందోరీతులు, దేశి చ్ఛందోరీతుల కంటె సంస్కృత వృత్తములకే ప్రచారము కనుక మలయాళలాక్షణికులు వృత్తశబ్దమును విశాలార్థమున ప్రయోగించి యుండుట.

## ?. 2. ఛందశ్శబ్దము - రూపనిష్పత్తి :-

ఛందశ్శబ్ద రూప నిష్పత్తి రెండు రకములుగా పరిశీలింప వచ్చును. మొదటిది వ్యాఖ్యాతల అభిప్రాయములు. రెండవది విమర్శకుల అభిప్రాయములు.

చది ఆహ్లాదే[15]. ఆహ్లాదమును గలిగించునది యేదియో అదే ఛందస్సు. వేదములు తెలిసినవారికి ఆహ్లాదమును కలిగించునది వైదిక ఛందస్సు అని అభిప్రాయము.

ఛది ఊర్జనే[16] బలిష్ఠునిగా చేయునది యేదియో అదే ఛందస్సు. వేదాధ్యయనము విప్రుని ఊర్జస్వితుని చేయుననుట యిందలి ఆశయము.

ఛద అపవారణే[17] ఏది మూయించునో ఏది నివారించునో అది ఛందస్సు. పాపములను, దోషములను వేదములు ఆచ్ఛాదించును. అనగా నశింపజేయునని భావము

ఛందాంసి ఛాదనాత్[18] ఛందము ఛాదకమని అర్థము. మంత్రము ఛందోమయము. మరణమునకు భయపడిన దేవతలు త్రయీ విద్యను ప్రవేశించి ఛందములతో తమ్ము ఆచ్ఛాదించుకొనిరి. కనుక ఛాదనమువలన ఛందస్త్వము సిద్ధించినది. ఈ అభిప్రాయమునే 'మక్డనాల్' **(Macdonal)**

**"Chandas occurs in one passage of the Atharva-veda in the adjectival compound Brihachhandas which is used of a house and mustle mean having a large roof"[19]** అని ఆవరణార్థమున్నట్లు స్పష్టము చేసెను.

డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు చ్ఛందశ్శబ్దమును గూర్చి

"చద్ అను ధాతువుతో సంబంధము కలది ఛందశ్శబ్దమని యాస్కుడు నిర్వచించెను కాని సంతసిల్లు, సంతసింపజేయు అను నర్థముగల 'ఛద్' ధాతువుతో సంబంధముకలదిగా ఛందశ్శబ్దము నిర్వచనీయమని నా యభిప్రాయము"[20] అని తెలియజేసిరి. శ్రీ చిలుకూరి నారాయణరావుగారు ~~వ్యాఖ్యానమున~~

'లాటిను భాషలో ఛందస్సును స్కందో అని అందురు. Scando స్కందో అనగా ఛేదించుట, విభజించుట. లయానుకూలముగా వాక్య సమూహము విభక్తమై ఆహ్లాదమును కలిగించుట ఛందమగును'[21] అని పేర్కొనిరి.

డా॥ గ్రియర్సన్ (Grearson) ఛందశ్శబ్దము నుండి జెండ్ (zand) ఏర్పడినదని భావించిరి. కాని పార్శీ పండితుడగు ఫామ్ (Form గ్రియర్సన్ వాదమును త్రోసిపుచ్చుచు

**'The Sanskrit word Chandas is not identical with the Aryan word Zand. The former in to literal signifies moon and the latter the name of the character which the *P*arsee Scriptures represent, hence I may conclude that the word Zand is not a corruption of the sanskrit word chandas'**[22] అని వ్రాసిరి.

ఛందశాస్త్రమునకు ఛందోవిచితి ఛఅనిపేరు. ఛందసాం విచితిర్యత్ర, ప్రతి శ్ఛందసాం ప్రత్యాయకం శాస్త్రమని శబ్దకల్పద్రుమము శాసించుచున్నది.[23] పైగా యదక్షర పరిమాణం తచ్ఛందః అని కాత్యాయనుడు స్పష్టము చేసెను.[24]

'ఛందశ్శాస్త్రము – అవతరణ వికాసముల' గురించి సిద్ధాంత వ్యాసము వెలువరించిన డా॥ ఎం. వి. సత్యనారాయణగారు ఛందశ్శబ్దమును విపులముగా చర్చించి వివిధ వ్యుత్పత్తుల నిట్లు క్రోడీకరించిరి.[25]

చన్ద (చది) భ్వాదిక సంఖ్యా 7.8
ఛన్ద (ఛది) భ్వాదిక సంఖ్యా 9
ఛన్ద (ఛది) చురాదిక సంఖ్యా 1.10

ఛన్ద (అకారాన్త, ఛన్ద, ఛది) జిజంతమ్ సంఖ్యా 9

ఛద చురాదిక సంఖ్యా 2.9

ఛందయతి ఆహ్లాదయతి ఇతి ఛందః అని అమరము. ఛందము ఆహ్లాదకము. మంత్రాత్మయను దేవతకు, మంత్ర ద్రష్టయగు ఋషికి, మంత్ర శ్రోతలగు మానవాళికి అభిమతార్థ రూపమయిన ఆహ్లాదమును కలిగించునది ఛందస్సు. పై వాక్యములకు లౌకిక సమన్వయము చేసినచో వర్ణపద సంయోజనము వాక్యనిర్మాణములోని ప్రత్యేక లక్షణములు, అక్షరములు లేదా పదముల ఆవృత్తి, నియమపూర్వక విచ్ఛేదము, స్వరాందోళనములవలన ఛందస్సు పాఠకులకు ఆహ్లాదము కలిగించునని సమన్వయింప వచ్చును. ఈ అభిప్రాయమునే శ్రీ రావూరి దొరసామిశర్మగారు

"విషయమును నియమిత సంఖ్యాక్షర పాద సంవృతము గావించి శ్రవణ సుభగత్వమును చేకూర్చుటచే పద్యమునకు పద్యలక్షణమునకు ఛందస్సను వ్యవహారము కలిగినదని చెప్పవచ్చును. ... నియమ బద్ధమైన దేది యాహ్లాదకరమగుచున్నదో అది ఛందస్సు"[26] అని తెలిపిరి.

పై అభిప్రాయములలో ఛంద్ ధాతుజన్యము ఛందమను రూపనిష్పత్తి సమంజసముగానున్నది. కళల ప్రధాన ప్రయోజనము ఆనందమొసగుట. లలిత కళలలో కవిత్వము ఉత్తమోత్తమము. భావము, భాష మొదలయిన కవిత్వాంగముల కంటె ఛందమువలన పాఠకులు ఉద్విగ్నులగుదురు. ఉద్వేగముతో కూడిన ఆకర్షణ వలన కవిత్వము పండిత పామర రంజకమగును. అందువలన సంతసిల్లు, సంతసింపజేయు అను అర్థముగల ఛంద్ ధాతుజన్యమును ఛందముగా నెన్నుట తగును.

## 2. 3. ఛందస్సు - లయ

'లయ' శబ్దము సంస్కృతము, గతి, చలనమను అర్థము గల లీఙ్ శ్లేషణే ధాతువునుండి 'లయ' శబ్దము పుట్టినది. తాకుట, చేరుట, కరుగుట, గాఢమగు ఏకాగ్రత, పాటల తాళగతి, నడకలలోని విరామములు పై శబ్దార్థములు. 'లీయంతే నృత్య గీతాదయోస్మిన్నితిలయః' అని గురుబాల ప్రబోధిక.

భరతుడు "ఛందోక్షర పదానాం వా
సమత్వం యత్ ప్రకీర్తితమ్
కలా కాలాంతర కృతః
స లయో నామ సంజ్ఞితః"[27]

అని లయలక్షణమును పేర్కొనెను. అతడే ఛందోహీనమైన శబ్దము లేదని, శబ్ద వర్జితమయిన ఛందస్సు లేదని వివరించెను.

సంగీత శాస్త్రములో లయ యనగా క్రియానంతర విశ్రాంతి క్రియ యనగా సశబ్ద నిశ్శబ్దములను తాళముల విభేదములు. సశబ్దమనగా ఘాతము. నిశ్శబ్ద క్రియ యనగా కేవలము హస్తాంగుళి వ్యాపారము. సశబ్ద నిశ్శబ్ద తాళములకు మధ్యనున్న విశ్రాంతి లయ యని అభిప్రాయము.

పద్యమునకు ప్రాణము లయ ఛందస్సు అంతస్స్వరూపము లయ. లయ వలననే శబ్దమునకు ఛందస్సునకు గల అవినాభావ సంబంధము తెలియును. ఛంద మనగా నేమియో తెలియని పామరులు కూడ నేవో పదములను లయబద్ధముగా అల్లుకొని పాడు కొందురు వ్యక్తిలోని అంతరంగ భావోద్వేగములను సంచలింప చేయ గలిగినది లయ. దూరాన వినిపించు వాద్యధ్వనికి తన్మయుడై బాలుడు గెంతునట్లు పాటలయందలి లయ రమ్యతకు మానవుడు ఆకర్షితుడగును. అయోరజముల నాకర్షించు అయస్కాంతమువలె లయబద్ధమగు ఛందస్సు పాఠకుల నాకర్షించును. లయ రమ్యత వలన బహిరింద్రియ ప్రవృత్తి క్రమముగా నశించును. అంతరింద్రియ సంచలనమునకు అవకాశ మేర్పడును.

ఆంగ్లములో కూడ లయ ప్రాధాన్యమున్నది. జార్జి సెయిన్ట్స్‌బరీ (**George Saints bury**)

**"Rhythm is an orderly arrangement but no necessarily correspondent succession of sound"**[29]

ఫయర్ (**Fyre**) మహాశయుడు లయ రెండు విధములు – అర్థ ధ్వనిలయలు అర్థలయ గద్యములందు ధ్వని లయ పాటలందు ప్రస్ఫుటమగునని పేర్కొనెను[30]

అరిస్టోక్సెనస్ అను లక్షణవేత్త లయలో భాష, నాద ఆంగికచలనములను మూడు అంశములున్నట్లు నిరూపించెను[31].

Oxford నిఘంటువులో Rhythm మాటకు గల వివరణ పరిశీలించ దగినది.

"*M*etrical effect produced in verse, prose music or motion by the relations in quality, stress, time or energy between the syllables, words, notes or movements that succeed each other.

సుప్రసిద్ధ తమిళ విమర్శకులు డా॥ ఎం. వరదరాజన్‌గారు

"పాటలలోని శబ్దలయ పరవశత్వమును కలిగించుటకాక ఊహాలోక విహారము నకు కూడ దోహదము చేయును. శ్రవణేంద్రియము వలన శబ్దలయ అనుభూతము కాగా కల్పనల వలన మనస్సు భావోద్వేగము నొందును"32 – అని విశదీకరించిరి.

విఖ్యాత కర్ణాట విమర్శకులు శ్రీ శివరామఐతాళ్‌గారు

"'భాష-ఛందస్సు' – ఈ రెండింటిని గూర్చి ఆలోచించునప్పుడు సంగీత మును గూడ దృష్టియందుంచుకొనవలయును. శబ్దపరంపర భాష బాహ్యస్వరూపము నాదపరంపర సంగీతముయొక్క శరీరము. ఆఘాతపరంపర ఛందశ్శరీరము. ఇది కేవలము లయవలన మాత్రము సాధ్యమగును"33 – అని పేర్కొనిరి.

డా. డి ఎన్. కర్కిగారు –

"ఛందస్సుయొక్క ముఖ్యాంగము లయ. పద్యమూలాధారమే లయ. నాదము నకు ప్రాస, అనుప్రాస సర్వమేళనములు పోషకములగును. లయవ్యాప్తివలన కావ్యము విశ్వవ్యాపకత్వము నొందును"34 అని లయధర్మమును వివరించిరి.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు 'ఛందస్సు లయకు'గల సంబంధము

గీతిగతమైన యేలయ సంబద్ధతకలదో యదియే పద్యగతమైన ఛందస్సు. అన్యత్రవ్యాప్తమగు శబ్దమునందు నవ్యక్తముగానున్న లయను కావ్యమందుగల ఛందస్సు వ్యక్తముచేయ సుసమర్థమగుచున్నది 35లో అని విశదీకరించిరి.

డా॥ సి॥ నారాయణరెడ్డిగారు –

కవిత్వమన్నప్పుడు గణనియమము లేకున్నను కనీసము లయయైన నుండుట వాంఛనీయము.36 అని లయ ప్రాధాన్యము నుగ్గడించిరి.

మలయాళ విమర్శకులు కూడ తమ భాషయందు లయకు అత్యంత ప్రాధాన్య మున్నదని పేర్కొనుచున్నారు. శ్రీ కుట్టికృష్ణమారర్ మలయాళ ఛందోరీతులను గణము ననుసరించిగాక లయగతి ననుసరించి వర్గీకరింపవలయునని భావించిరి[37] శ్రీ కె. ఆరుముగంగారు – లయసిద్ధికై పద్యాంశములను దీర్ఘము చేయుట లేదా సంకుచితము గావించుట ఛందోధర్మమనియు, గానానుకూల్యమనుసరించి సమానత్వము స్థాపించుటలో కవులకు తగిన స్వాతంత్ర్యము కలదనియు తలంచుచున్నారు.[38]

పై పరిశీలనమువలన ఆంగ్ల తమిళ కన్నడాంధ్ర మలయాళ భాషలందు 'లయ'కు సముచితస్థానము కలదని రూఢియైనది. గేయధర్మము నాదరించిన తమిళ మలయాళ ఛందోరీతులందు లయ సుస్పష్టము. కాని సంస్కృత మర్యాదలనతివేల ముగా గ్రహించిన కన్నడాంధ్రములందు గుప్తలయకు స్థానముకాని ఆధునిక నవ్య ఛందోరీతులందు 'లయకు' విశేష ప్రాముఖ్యమున్నది.

ఛందస్సునకు శ్రుతి, లయ, తాళములు ప్రధాన గుణములు. లయ సహజ సిద్ధము. తాళము కళాధర్మము. సంగీతములో గాని ఛందోవిధానములో గాని వాచ్యార్థములేదు. వ్యంగార్థము మాత్రమే.

## 2. 4. ఛందస్సు – కవిత్వము

రసాత్మకమగు భావము కవిత్వము. కవిత్వమునకు భావము ప్రాతిపదిక భావవ్యక్తీకరణమునకు భాష తోడ్పడును. భావము తగిన రచనా విధానమునందున్న గాని కవిత్వము పరిణతికే పొంది సమగ్రత నొందజాలదు. భావమంతరంగముకాగా భాష శరీరమగును.

శబ్దము సమస్తేంద్రియముల సంవేదనా సంస్కారముల నుద్దీపింపజేయును. అట్టి శబ్దపుంజమును ఛందస్సు తన స్వరధారలో ప్రవహింపజేయును. దీనివలన సారళ్యసౌకుమార్యములతో భావపరిపుష్టి ఏర్పడి రసనిష్పత్తికి దోహదము కలుగును. హృదయములో తొణికిసలాడు ఆనందాతిశయమును వ్యక్తులందరు మాటలలో ప్రకటింపజాలరు. కనుక కళాత్మక ప్రయోజనమును సాధించు భాష సామాన్యభాష కంటె విశిష్ట మగుచున్నది. అట్టి కవిత్వమునకు ఛందస్సు అవసరమా లేదా అను అంశములో విమర్శకాభిప్రాయములు భిన్నరీతుల నున్నవి.

సంస్కృత లాక్షణికులలో పెక్కురు ఛందస్సును గురించి యంతగా పట్టించుకొనలేదు పద్య, గద్య చంపూకావ్యములను విభజన ననుసరించి వారిదృష్టి రసభావాదులపై నున్నంతగా ఛందముపై లేదని తలంపవలసి యున్నది. ఒకటి మొదలు 26 అక్షరముల వఱకు గల ఛందోరీతులు, ప్రస్తారవిధానముల ననుసరించి భావయుక్తభాష యంతయు ఛందోమయముగా కనిపించుట సహజము. కేవలము ఛందోబద్ధమైన శబ్దసమూహమును కవిత్వముగా నే లాక్షణికుడును సమ్మతింపడు. అట్లయిన వైద్య గణిత వ్యాకరణ గ్రంథములు నిఘంటువులు కవిత్వమున చేరవలసి యుండును. అట్లే గద్యకావ్యములు కవిత్వము కాకపోవలసి వచ్చును. లయ విన్యాసములేని గద్యమును కవిత్వముగా పరిగణించుట కష్టము.

ప్రాకృత లాక్షణికులు మాత్రము ఛందస్సు ప్రాధాన్యమును నొక్కి వక్కాణించిరి. ఛందస్సులేని కావ్యమును సభలో చదివెడివాడు ఆత్మ వినాశనమును కొని తెచ్చుకొనువని ప్రాకృత పైంగళము స్పష్టము సేయుచున్నది.[39]

ఆంగ్ల విమర్శకులలో జాన్సన్(Johnson) ప్రొ॥ కోర్తోప్(Prof Courthope) కార్లైల్ (Carlyle) మొదలగువారు కవిత్వమునకు ఛందస్సు అవసరమని స్పష్టము చేసినవారిలో ప్రముఖులు[40]

ohnson :-

Poetry is metrical Composition

Prof Courthope :

Poetry is the art of producing pleasure by the just xpression of imaginative thought and feeling in metrical language.

Carlyle :

For my own part I find considerable meaning in old vulgar distinction of being metrical, having music.

Leigh Hunt :

Fitness or unfitness for song or metrical excitement make all the difference between poetical spirit demands it that the circle of its enthusiasm beauty and power is incomplete without it.

దాక్షిణాత్య భాషలలో తమిళ లాక్షణికులు, విమర్శకులు కవిత్వమునకు ఛందస్సు అనివార్యమని భావించినవారే పెక్కురు. కాని ఆధునిక విమర్శకులలో డా॥ ఎం. వరదరాజన్‌గారు మాత్రము

"ప్రాచీనులు సహజమగు శబ్దలయను గుర్తించి సమభివృద్ధి గావించిరి. క్రమముగా లాక్షణికులు వాసికి లక్షణముల నేర్పరచిరి. కథలు లాక్షణికాను మతమునకు ప్రాకులాడుట వలన కవిత్వమునకు కృత్రిమ రూపత్వము కలిగినది. ఇట్టి లక్షణమునకే 'యాంటు' అని పేరిడిరి లక్షణములు లేకున్నను కవిత రాణించును అని స్పష్టము చేసిరి

దాక్షిణాత్య భాషావిమర్శకులలో ఆంధ్రులు తదితరులకంటె ఛందస్సు కవిత్వ మున కవసరమా కాదా అనుటను గూర్చి సుదీర్ఘచర్చ గావించినవారని చెప్పవచ్చును. కవిత్వమునకు ఛందస్సు శోభావహమని కొందరు తలంపగ, శృంఖలాబంధనమని మరికొందరు భావించుచున్నారు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ~~వ్యాఖ్యానము~~ –

"కవిత్వము ఛందస్సులోనే వ్రాయవలయును. అట్లు వ్రాయనిచో కవిత్వము కాదు.[42] అని శాసించిరి.

శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు –

"శ్రుతిలయను సాధించుటకే ఛందస్సు ఏర్పడినది. గద్యరచయిత యెంత ప్రయత్నించినను ఛందస్సాధితసులైన శ్రుతిలయలను సమకూర్పలేదు" అని ఛందః ప్రయోజనములను పేర్కొనిరి.

డాక్టర్ దివాకర్ల వెంకటావధానిగారు ఛందస్సునకు కవిత్వమునకు గల సంబంధమును[42A]

"ఛందస్సువలన కవిత్వమునకు అధిక సౌందర్యమావహిల్లు ననుటలో విప్రతి పత్తిలేదు. దాని ప్రాముఖ్యము మనస్తత్వమునకు సంబంధించినది. కవితోచిత వస్తువునకు ఛందస్సునకు గల సంబంధము యాదృచ్ఛికమైనను, ఛందస్సునందలి శ్రుతిసహితలయాన్వితత్వము కావ్య పరమ ప్రయోజనమైన రసానందమును కలిగించు టకు నెక్కువ తోడ్పడును[43] అని విశదీకరించిరి.

డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు –

ఛందస్సు లేనిదే కవిత్వము లేదనుట సాహసము. అట్లే ఛందోబద్ధమైన ప్రతిరచన కావ్యఖండమనుటకు వీలులేదు గ్రేవ్ వంటి మహాకవుల పద్యగద్య రచనలలో తారతమ్యము చూపుట కష్టము. ముక్తఛందములకు చెందిన గీతాంజలియు, ఆంధ్రమందలి సింహగిరి నరహరి వచనములు, తాళ్ళపాకకవుల సంకీర్తనములు, క్షేత్రయ్య పదములు కవిత్వగుణము పరాకాష్ఠనందుకొన్న రచనలుగా నున్నవి. ఈ విధముగా పరిశీలింప ఛందస్సు కవిత్వమున కనివార్యమను వాదము పరాస్తము కాగలదు"44 అని నిర్ధారించిరి.

శ్రీ కె. వి రాఘవాచార్యగారు –

భావావేశమునకు ఛందస్సునకు అవినాభావ సంబంధమున్నది. భావావేశము ఛందమును ప్రేరేపించును. అట్లే ఛందస్సుకూడ భావావేశమును ప్రేరేపించును. కవిపొందిన భావావేశము పాఠకునియందు కల్గించుటకు ఛందము తోడ్పడును...... ఛందోబద్ధముగాని కవిత్వమున భావము బిగువు, బలము కలిగియుండదు"45 అని అభిప్రాయపడిరి.

శ్రీ వి రాజగోపాలరావు –

'ఎచట రసముండునో యచటనే కవిత్వమున్నది. కవిత్వము గుణములో నున్నదిగాని గణములోలేదు. రసాత్మకమైన భావమేదియైన కవిత్వమే – అది ఛందో బద్ధము కావలయుననిలేదు'46 అని తర్కించిరి.

శ్రీశ్రీ కవికి–ఛందస్సునకు నుండవలసిన బాంధవ్యమును గూర్చి –

"ఛందస్సు గుర్రంవంటిది. గుర్రం ఎటు తీసుకుపోతే అటల్లా పోయేవాడు అశ్వికుడు కానట్లే ఛందస్సులాగుకు పోయినట్లు ।వాసేవాడు సంవిధానజ్ఞుడు కాడు. మరి ఆ ఛందస్సును లొంగించుకొని దానిచేత చిత్రవిచిత్రరీతులలో కదం త్రొక్కిన వారినే ప్రశంసిస్తాము".47 అని శ్లాఘించిరి.

డాక్టర్ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు –

"సాహిత్యోద్యమములు కొన్ని ఛందస్సును గూడ నాశ్రయించి యుండును... వివిధ భాషల యందలి యుద్యమముల తీరుతెన్నులను పరిశీలించి చూసినపుడు

ఛందస్సు నాశ్రయించిన యుద్మమములే తక్కిన యుగ్మమములకంటె సంఖ్యలో నధికముగా నుండునట్లు గోచరము కాకమానదు"48 అని తులనాత్మకపరిశీలనము చేసిరి.

పై చర్చలవలన ఆంధ్రఛందోమర్శకులలో కవిత్వమునకు ఛందస్సు వలదనువారి కంటె, ఛందస్సువలన కవిత్వమునకు శోభ వాటిల్లునను వారి వాదమునకు బల మున్నట్లు స్పష్టము. ఛందస్సు వలదనువారుకూడ 'లయ' తప్పక యుండవలయునని పేర్కొనుట గమనింపదగినది. ఛందస్సువలదనుట, స్వీకారార్హమనుట కవి ప్రతిభ ననుసరించియుండును ప్రాగల్భ్యములేని కవి ఛందోబద్ధరచన గావించినను నీరసమె. కవితధరించు బాహ్యావేషం ఛందస్సు. సంగీతమువలె కవి భావనలకు ఛందస్సుబలము చేకూర్చును. అర్థప్రాధాన్యములేని శబ్దసంయోజనమువలన కలిగెడు రాగాదులే చిత్తాకర్షకమగునపుడు, రససంభరిత పదసంయోజనముగల కవిత్వము సహృదయుల నలరించుటలో నాశ్చర్యము లేదు

## 2. 5. ఛందస్సు - ప్రయోజనములు

ఛందస్సువలన పెక్కుప్రయోజనములున్నవి. ఛందస్సు ప్రధాన లక్షణము ఆహ్లాదకత్వము. కవిత్వప్రయోజనములగు రమ్యత, ఆనందానుభూతి, స్థిరత్వములను గుణములు ఛందస్సువలన సుస్థిరమగును. ఛందోనియమసహితమగు భాష శక్తివం తము, సుందరవంతము, శ్రావ్యమునయి యుండుట తటస్థించును. కవిత్వమునకు రసభావములు మాత్రముగాక వానితో శ్రుతిరంజకత్వము సఫలమగుటకు ఛందస్సు కూడ నావశ్యకము. లయాన్వితముగానున్న పద్యమునుగాని గద్యమునుగాని చదువు చున్నప్పుడు మనః శ్రవణేంద్రియములు రెండును సుఖించుచున్నవి. కనుకనే 'ఛందమన్నిటిలో నవశ్యంబుకాదె' అని అప్పకవి నొక్కి వక్కాణించెను.

ఛందస్సు సంగీతముతో ముడివడియున్నది ప్రాచీన వాఙ్మయము పరిశీలించిన యెడల సంగీతరహితకావ్యము, కావ్యరహిత సంగీతము కానరావు. వేదములు సంగీతాత్మకములు. ఛందోబద్ధములు. విశేషతః సామవేదము గానాత్మకము, వేదములు స్వరప్రధానమగుట వలన సంస్కృత లాక్షణికులు 'స్వరము'ను ఛందోంగముగా విస్తరించి చెప్పిరి. సంగీతచ్ఛందములకుగల అవినాభావ సంబంధమునుగూర్చి జార్జి థాంప్సన్ (George Thompson)

"In Ancient Greece, poetry was wedded to music. There was no purely instrumental music - music with out words and a

great deal of the finest poetry was composed for musical accompaniment"[49] అని పేర్కొనెను.

కావ్యమున ఛందస్సు లయోత్కర్షనాపాదించి తద్వారా రసానందప్రాప్తికి నధికముగా తోడ్పడును. కవితావిహారమునకు ఛందస్సు భంగకరమని భావించి తొలగించుటవలన ఛందస్సు కలిగించు సహజసంగీత మాధుర్యముకూడ నశించు చున్నది. కవిత్వ మందలి ఛందోరూపము పాఠకులను మరొకప్రపంచమునకు కొని పోవును. సంగీతమునందువలె పదము లర్థమైనను గాకపోయినను సామాన్యులు ఛందస్సువలన పరవశత్వమొందుచుండుట కిదియే కారణము.

ఛందస్సునకు రసమునకు ప్రగాఢసంబంధము కలదు. కావ్యములందు భావ రసానుగుణముగా ఛందముల నెన్నుకొనుట తెలిసినదే. మహాకవి కాళిదాసు రతిదేవి విలాపవర్ణనకు 'వియోగిని' వృత్తమునెన్నుకొనుట యిట్టిదే. శౌనకమహర్షి త్రిష్టుప్, జగతీచ్ఛందములు సర్వభావసమర్థకములని

సర్వాణి భూతాని మనోగతిశ్చ
స్పర్శా చ గంధాశ్చ రసాశ్చ సర్వే
శబ్దాశ్చ రూపాణి చ సర్వ మేతత్
త్రిష్టుప్జగత్యో సము పేతి భక్త్యా[50]

శ్లోకములో స్పష్టము చేసెను. ఈదృష్టితో భరతుడు నాట్యశాస్త్రమునందును, క్షేమేంద్రుడు సువృత్త తిలకమునందును, మమ్మటుడు కావ్యప్రకాశమునందును, భోజుడు సరస్వతీ కంఠాభరణము నందు రసౌచిత్య ఛందోరీతులను వివరించిరి

సంస్కృతాలంకారికులవలె నాంగ్లవిమర్శలుకూడ ఛందస్సునకు రసమునకు గల బాంధవ్యమును పరిశీలించియున్నారు. ఎల్. ఆర్ బ్రాండర్ (L. R. Brander) సుందర ఛందస్స్వీకారమువలన భావాభివ్యంజనము సుకరమగునని పేర్కొనెను.[51]

ఎల్. అబెర్‌క్రోంబె (L. Abercrombie)

కవి తన అనుభవములను ఛందోమాధ్యమమున శ్రోతృమనముల జాగృతము చేయగలడని ... ... "Metre can effect certain feelings in the mind then the metre will be expression of these feelings since by its means the poet, who experiences can provoke them in the hearers mind and to that in his expression on ,he external side"-[52] వాక్యము

లలో స్పష్టము చేసెను రసస్ఫూర్తికి ఛందస్సు సహాయపడునని ఫలితార్థము. దేవతా స్తుతి, ప్రియప్రవాసము, ప్రకృతివర్ణనలు గద్యమందుకంటె ఛందోబద్ధరచనలందు శోభించును. జటిల సమాస బంధుర రచన భీకర వాతావరణమును, మధురమంజుల వాగ్విన్యాసము శృంగారము నుద్దీపింప సమర్థములు. పదసంయోజనమునకు ఛందస్సు తోడయి రసోద్దీపమునకు సహాయపడును.

ఛందస్సు ధారణాశక్తి కెన్నోవిధముల తోడ్పడును. పద్యములందు పదముల కూర్పు లయానుగుణముగా నమర్పబడియుండుటయే యిందులకు కారణము. ఛందో రాహిత్యమువలన గద్యములను సులభముగా ధారణచేయలేము. కనుక అన్నిభాష లందును ప్రాచీనకాలమున పద్యరచన కొసగిన ప్రాధాన్యము గద్యముల కొసగ బడలేదు. సంస్కృతప్రాకృతములందు శాస్త్రరచనలు చాలవఱకు ఛందోబద్ధములే తమిళమునందుగూడ వైద్య, వ్యాకరణ, సంగీతశాస్త్రములు, నిఘంటువులు ఛందో బద్ధములై వెలసినవి. సంస్కృత ప్రభావమతివేలముగాగల కన్నడాంధ్ర మల యాళములందు వ్యాకరణాలంకార గ్రంథములు ఛందస్సును ప్రధానవాహికగా రూపొందించుకొనినవి.

ఛందస్సునకుగల మరికొన్ని ప్రయోజనములలో లయాత్మకత, సంక్షిప్తత. స్మరణీయత, కంఠస్థానుకూలము. ప్రభావోత్పాదకత్వము, అభివ్యంజన తీవ్రత, అలౌకికానుభూతి మొదలగునవి ప్రధానములుగా కనిపించును. లయవలన శ్రుతి రమ్యత చేకూరును. సంక్షిప్తతవలన ధారణాశక్తికి వీలగును. కవిప్రతిభ సంగ్రహ వ్యక్తీకరణమునందే రాణించును. గహనవిషయములు ఛందోబద్ధమగుటవలన పునః స్మరణమునకు వీలుకలిగించును పై పరిశీలనమువలన ఛందస్సునకు సౌందర్యదృష్టి, ప్రయోజనదృష్టి రెండును కలవని చెప్పవచ్చును.

పై తులనాత్మక పరిశీలనమువలన తేలిన అంశములు. ఛందశ్శబ్దము తమిళ కన్నడాంధ్రమలయాళభాషలందు కలదనుటకాని తమిళమున 'యాప్పు' అనుమాటకు ప్రచారమెక్కువ. సంస్కృత ప్రభావమువలన యాప్పరుంగలం, వీరచోళియము లందుమాత్రము 'చంద'ము వాడబడి యుండవచ్చును. తమిళకన్నడాంధ్రమలయాళ విమర్శకులెల్లరు ఛందోనియమములకంటె లయాత్మకరచనలకే ప్రాధాన్యమొసగు చున్నారు. ఛందస్సువలన కవిత్వశోభ రాణించుటలో అభిప్రాయ భేదములేదు. తమిళ కన్నడాంధ్రమలయాళ భాషలలో ప్రాచీన వాఙ్మయ స్థిరత్వమునకు ఛందస్సు దోహదము చేసెననుటలో వాదప్రతివాదములులేవు.

## సంఖ్యా సూచి


1. నిరుక్తం. 3-16
2. భగవద్గీత 15-1
3. రఘువంశము 1-.1
4. ఛాందోగ్యోపనిషత్తు 1-4-2
5. శతపథ బ్రాహ్మణము 8-3-1-37, 2-2-1-14, 6-1-13-18
6. సామవేద కాండ్య బ్రాహ్మణము 6-9-26
7. కౌషితకీ బ్రాహ్మణము 7-9-11
8. వాయుపురాణము 52-45
9. విష్ణుపురాణము 2-7-8
10 మత్స్యపురాణము 125-47
11. ఋక్ ప్రాతిశాఖ్య 15-16-17-18
12. **Tolkappiyan in English with critical studies - P 499**
13. **History of Tamil Prose Literature P 14**
14. డి. ఎస్. శర్మ P 43
15. } ఛందోంబుధి 'మున్నుడి'.
16.
17.
18.
19. **Vedic Index Vol 1-267**
20. తెలుగులో ఛందోరీతులు పుట 2
21. వ్యాససంగ్రహము - 'మాత్రాచ్ఛందస్సులు
22. **Journal of Royal Asiatic Society vol XVI - Part 1 - 173 on the origin and the authenticity of the aryan familay of languages, the Zanda and Avesta - P 55**
23. శబ్దకల్పద్రుమము 2-476
24. సర్వానుక్రమణి
25. అముద్రిత సిద్ధాంత గ్రంథము - ఆంధ్రవిశ్వవిద్యాలయము 1966

26. తెలుగుభాషలో ఛందోరీతులు - పుట 2
27. నాట్య శాస్త్రమ్ 31-371
28. నాట్యశాస్త్రమ్ 31-370
29. **Historical manual of English prosody.**
30. **Anatomy of criticism**
31. **Omond op. cit pp 2-3**
32. ఇలక్కియ తిరణ్ పుట - 36
33. ఛందస్సున ఔచిత్య పుట 50
34. కన్నడ ఛందోవికాస పుట 8
35. గౌతమవ్యాసములు పుట 112
36. ఆధునికాంధ్రకవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు - పుట 92
37. **Rhythmic adjustments in Tamil and Malayalam Metres - Seminar Metre - D. L. A. 74**
38. ఇలక్కియ తిఱన్ - పుట 36
39. ప్రాకృతపైంగళం 1-11
40. **An introduction to the study of Literature P 65**
41. ఇలక్కియ తిరాణ్ పుట 36.
42. నేను - నా సాహిత్యరచనలు - మహతి పు 20
42A. సాహిత్యశిల్పసమీక్ష - పుట 58-561
43. విశ్వసాహితి - పుట 148
44. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు ప్రయోగములు పుట 98
45. కవిత్వము - ఛందము - భారతి ఫిబ్రవరి - 1964
46. కవిత్వము ఛందము - ఒకపరిశీలన - భారతి - మార్చి 1964
47. ముత్యాలసరము - ఉదయిని సం 1 సం 2 - 1935
48. ఆంధ్రసాహిత్యములో దేశి కవితోద్యమము పుట 35
49. **Marxism and poetry - P 1**
50. ఋక్ ప్రాతిశాఖ్య 18-32
51. **Rhetori and prosody - P 99**
52. **Manual History of English Prosody P 15**

# 3. దాక్షిణాత్య భాషలలో ఛందో వాఙ్మయ సమీక్ష

దక్షిణ భారత దేశములో వ్యవహరింపబడు భాషలలో ద్రావిడ భాషలు ప్రధాన మయినవి. ఈ ద్రావిడ భాషా కుటుంబములో 21 భాషలున్నట్లు భాషాశాస్త్రవేత్తలు నిర్ధారించిరి వీనిలో సాహిత్యవంతమయిన భాషల గురించి డా॥ సునీత్ కుమార్ ఛటర్జీగారు

"The number of languages in the Dravidian family big and small, comes up to about a Score, and of these only four have got world wide recognition as languages of advanced culture and literature namely Tamil, Khnnada Telugu and Malayalam.1

అని స్పష్టం చేసిరి పై అభిప్రాయ మాధారముగా ఛందశ్శాస్త్ర పరిశీలనము నందుకూడ మొదట ప్రాచీనమయిన తమిళ భాషయందలి ఛందో వాఙ్మయమును పరిశీలించుట సమంజసము.

## 3. 1. తమిళములో ఛందో గ్రంథములు :

తమిళములో ఛందశ్శాస్త్రమును 'యాప్పిలక్కణం' అని అందురు. తమిళము చాల ప్రాచీనమయినను, అందు స్వతంత్ర ఛందోగ్రంథము క్రీ. శ. 10వ శతాబ్దము దాక వెలువడలేదు. 10 శతాబ్దము దాక ఛందస్సుకు సంబంధించిన అంశములు వ్యాకరణాలంకార గ్రంథములలో నొక భాగమై కనిపించును.

### తొల్కాప్పియం :

ఈ లక్షణ గ్రంథకర్త పేరు తెలియదు. ఈ వ్యాకరణ గ్రంథము వెలువడిన శతాబ్దము కూడ వివాదగ్రస్తమై యున్నది. తమిళ పండితులలో పెక్కురు ఈ గ్రంథము క్రీ. పూ. 5వ శతాబ్దమునాటిదని విశ్వసించుచున్నారు. ఈ వ్యాకరణ ములో ఎళుత్తు - చొల్ - పొరుళ్ అను మూడు భాగములున్నవి. ప్రతి విభాగము మరల తొమ్మిది ఉపవిభాగములుగా వర్గీకరింపబడినది. పొరుళ్ విభాగములోని ఎనిమిదవ ఉపవిభాగము 'చెయ్యుళియళ్'. ఇదియే పద్యలక్షణ ప్రకరణమగును. ఈ ప్రకరణమునందు 235 సూత్రములున్నవని తొల్కాప్పియ వ్యాఖ్యాత ఇళంపూరణర్

(క్రీ. శ. 12, 13) పేర్కొనగా మఱియొక వ్యాఖ్యాత నచ్చినార్ కినియార్ (క్రీ శ. 12,13) 243 సూత్రములు కలవని పేర్కొనెను. తొల్కాప్పియనార్ ఈ ప్రక రణమందును ఎన్బ (అందురు) అను మాటను పెక్కుసార్లు ప్రయోగించి యుండుట వలన, అంతకు పూర్వమే ఛందో గ్రంథము లుండెనేమో యని అనుమానింపవలసి యున్నది. ఈ ప్రకరణమునందు తమిళమునకు సంబంధించిన వివిధ ఛందోరీతులు పేర్కొనబడినవి. ఇవి యన్నియు సంస్కృత నిరపేక్షములు. తొల్కాప్పియ ఛందస్సునకు తరువాతి కాలమునాటి ఛందఃప్రక్రియకు చాల భేదమున్నది తొల్కా ప్పియనార్ 34 ఛందోంగములను పేర్కొనగా తరువాతి లాక్షణికులు 6 ఛందోంగ ములను మాత్రము గ్రహించిరి. శీర్ విభాగమునందు తొల్కాప్పియ కర్త నేర్ – నిరై – నేర్పు – నిరైపు అని నాలుగు విధములను తెలుపగా తరువాతి లాక్షణికులు మొదటి రెండింటినే గ్రహించిరి. పద్యరీతులందును తొల్కాప్పియనార్ 'పా' భేద ములను చెప్పెను గాని 'పావినం' భేదములను సూచింపలేదు. చెయ్యుళియల్ అను అధ్యాయమనుసరించి ప్రాచీన కాలమునందే తమిళమున విస్తార కావ్య వాఙ్మయ ముండెననియు, వాని ఆధారముతో తొల్కాప్పియనార్ వివిధ తమిళ ఛందోరీతులను విశదీకరింపగలిగెనని చెప్పవచ్చును.

## యాప్పరుంగలం :

ఇదియొక స్వతంత్ర ఛందోగ్రంథము. ఈ గ్రంథమును క్రీ శ 10వ శతాబ్దికి చెందిన అమృతసాగరుడు రచించెను. తొల్కాప్పియనార్ కాలమునాటికి తమిళముపై సంస్కృత ప్రభావమంతగా కానరాదు కాని క్రమముగా సంస్కృత మర్యాదలు తమిళమున ప్రవేశించినవి. ఛందశ్శాస్త్రమునందును ఈ ప్రభావము స్పష్టముగా కనిపించుచున్నదనుటకు 'యాప్పరుంగలం' ప్రబల సాక్ష్యము. ఈ ఛందోగ్రంథము 'నూర్పా' ఛందమున వ్రాయబడినది. ఇందు మూడు విభాగము లున్నవి. ఉరుప్పు ఇయల్ ఒత్తు – సెయ్యుళియల్ ఒత్తు – ఒళిపియల్ ఒత్తు. మొదటి ప్రకరణమునందు తమిళ ఛందోంగములు సవిస్తరముగా చెప్పబడినవి. రెండవ ప్రకరణమునందు ప్రసిద్ధములగు నాలుగు ఛందోరీతులు (అగవర్పా, వెణ్బా, కలిప్పా, వంజిప్పా) వాని ఉపభేదములు విశదీకరింపబడినవి చివరి ప్రకరణము ప్రకీర్ణక మగును. ఇందు చిత్రకవితావిశేషములు, కవిభేదములు సంస్కృత సంప్రదాయ మనుసరించి విపులీకరింపబడినవి.

యాప్పరుంగల కారికై :

యాప్పరుంగలమును వ్రాసిన అమృతసాగరుడే యాప్పరుంగల కారికై రచించెను. సూత్రరూపమైన గ్రంథమునకు శ్లోకరూపమైన వివరణము గావించుట కారికై. కారికై అనగా సుందరి, సౌందర్యము, కట్టలెకలిత్తుఱై ఛందస్సు అను అర్థములున్నవి. ఈ పేరుతో అమృతసాగరునికి పూర్వము నితరులెవ్వరు ఛందో గ్రంథము వ్రాయని కారణమువలన 'కారికై' అనగా 'యాప్పరుంగల కారికై' అని రూఢమయినది. 'కారికై' సంగ్రహముగా సులభముగా నుండుటవలన 'యాప్పరుం గలమను' బృహద్గ్రంథమునకు అంగముగా తలంపబడుచున్నది. మూలగ్రంథము నందువలె 'కారికై' యందును మూడువిభాగములున్నవి. ఉరుప్పియల్ చెయ్యుళియల్, ఒళిపియల్ అను మూడు ప్రకరణములందుగల 47 సూత్రములలో తమిళఛంద స్సంప్రదాయమెల్ల కనిపించును. కంఠస్థము చేయుట కనువుగా నొక్కొక్క విభాగ మునకు చెందిన సూత్రముల తొలిభాగములనెల్ల నొక సూత్రముగా కూర్చుట 'కారికై' వైశిష్ట్యమనక తప్పదు. స్త్రీనుద్దేశించి లక్షణము చెప్పుట రెండవ ప్రత్యేకత యగును. ఈ సంప్రదాయము 'కన్నడ ఛందోంబుధి' యందును కనిపించుచున్నది. ఈ యంశము మున్ముందు విశదీకరింపబడును.

వీరచోళియం :

బుద్ధమిత్రుడను బౌద్ధుడు (1063–1070) తన కాశ్రయమొసగిన వీరచోళుని పేర ఈ వ్యాకరణమును రచించినట్లు తమిళపరిశోధకులు భావించుచున్నారు. ఇది ప్రధానముగా వ్యాకరణ గ్రంథమైనను ఎళుత్తు – చొల్ – పొరుళ్ – యాప్పు – అణి అను ఐదు అంశములను విస్తరించి చెప్పుటవలన "ఐన్దిలక్కణ"మను వర్గమున చేరు చున్నది. ఈ వ్యాకరణగ్రంథము "కట్టళై కలిత్తుఱై" ఛందస్సులో వ్రాయబడినది. ఈ వ్యాకరణములోని 181 కారికైలలో 36 ఛందోరీతులు చెప్పబడినవి. సంస్కృత సంప్రదాయములను తమిళమునకు సమన్వయించి చెప్పుట బుద్ధమిత్రుని ప్రత్యేకత యగును. అక్షరముల సంఖ్య ననుసరించి ఛందోరీతులను పేర్కొనుట గమనార్హము. బౌద్ధుడు వ్రాసిన ఏకైక వ్యాకరణమగుటవలనను, ఐన్దిలక్కణ సంప్రదాయమును పాటించుటవలనను, సంస్కృత ఛందస్సంప్రదాయముల ప్రవేశపెట్టుటవలనను తమిళవ్యాకరణములందు 'వీరచోళియం' ప్రత్యేకస్థానము వహించియున్నది.

యాప్పరుంగలవిరుత్తి :-

'యాప్పరుంగలకారికై ఉరై' వ్రాసిన గుణసాగరుడు "యాప్పరుంగలవిరుత్తి" వ్రాసెనని ఐతిహ్యము కాని గ్రంథమందలి అంతస్సాక్ష్యములనుసరించి గుణసాగరుడు 'విరుత్తి' వ్రాయలేదనియు, ఈ గ్రంథకర్త పేరు తెలియ వీలులేకున్నదని కొందరు తమిళ పరిశోధకులు భావించుచున్నారు. యాప్పరుంగలమునకు 'నూర్పా' ఛందస్సున వ్రాయబడిన వ్యాఖ్యానమే యాప్పరుంగలవిరుత్తి. ఈ గ్రంథకర్త తొల్కాప్పియనార్ కాలమునుండి తనకాలమునాటివఱకు వెలసిన కవులను, రాజులను, పండితులను, లక్షణగ్రంథములను, కావ్యప్రభేదములను విస్తరించి పేర్కొనెను. 'విరుత్తి' యందుగల చిత్రకవితావిశేషములు, కవివిభేదములు, ఆనంద భేదములు, సూత్రరచనాపద్ధతుల ననుసరించి యీగ్రంథకర్తకు సంస్కృతమునం దెనలేని పాండిత్యమున్నట్లు తెలియుచున్నది. ఈ గ్రంథ మనుసరించి నష్టప్రాయములైన ఎన్నో ఛందోగ్రంథములపేర్లు తెలియుచున్నవి. ఆంధ్ర ఛందోగ్రంథమగు అప్పకవీయమునకు యాప్పరుంగల విరుత్తికిని పెక్కుపోలికలు కానవచ్చుచున్నవి. ఈ యంశము మున్ముందు చర్చింపబడును.

యాప్పదికారం

20వ శతాబ్దములో బహుళ ప్రచారమొందిన ఛందోగ్రంథములలో 'యాప్పదికారం' ప్రముఖమైనది. ఈ గ్రంథకర్త పులవర్ కుళందై. తొల్కాప్పియము నుండి 20వ శతాబ్దము వఱకు విస్తరిల్లిన తమిళ ఛందోరీతులను సునిశితముగా పరిశీలించి సమన్వయదృష్టితో శ్రీ పులవర్ కుళందై యాప్పదికారమును రచించిరి. ఈ గ్రంథములో ఉరుప్పియల్ - చెయ్యుళియల్ - పుదియ సెయ్యుట్కళ్-కవియరంగం అను నాలుగు ప్రకరణములున్నవి. మొదటి ప్రకరణములో ఛందోంగములు, రెండవ ప్రకరణమున ఛందోరీతులు, మూడవ ప్రకరణములో నూత్నఛందోరీతులు, నాల్గవప్రకరణమున కవితాగోష్ఠికి సంబంధించిన విశేషాంశములు కలవు. ఈ గ్రంథకర్త 'తొడైయదికార'మను మరియొక ఛందోగ్రంథమును గూడ రచించెను. అక్షరమైత్రికి సంబంధించిన విశేషములు 'తొడైయదికారము'లో సోదాహరణముగా వివరింపబడినవి.

ఇవేగాక తమిళములో నింకనెన్నియో ప్రాచీన ఛందోగ్రంథములు వెలువడి నట్లు తెలియుచున్నది. కాని అవి అలభ్యములు వానిలో సంగకాలమునకు చెందిన అగత్తియం, నక్కీరర్, అడినూల్, అణియియల్, సంగయాప్పు — సిరుకాక్కై పాడినియం, పెరుకాక్కై పాడినియం, సెయిత్రియం, నత్తత్తం, నాలడి నార్పదు, అవినయప్పురనత్తై, పల్కాయం, పన్నిరుపటలం, పాట్టియల్, పాట్టియల్ మరబు, మయేచ్చువరర్ యాప్పు, మాపింగళం, మాపురాణం, వాయ్పియం మొదలగునవి పేర్కొనదగినవి. పైపరిశీలనవలన తమిళములో ఛందశ్శాస్త్రమునకు ప్రత్యేక గౌరవమున్నదని తెలియుచున్నది.

## 3. 2. కన్నడ ఛందో వాఙ్మయ సమీక్ష :

### కవిరాజ మార్గ :—

లభ్యమైన కన్నడ లాక్షణిక గ్రంథములలో కవిరాజ మార్గమే మొదటిది. నృపతుంగుడు లేదా శ్రీ విజయ కృతమగు కవిరాజ మార్గము క్రీ. శ 850 నాటిదని పరిశోధకుల నిర్ణయము. ఇది అలంకార గ్రంథము. కాని ఇందు ఛందోవ్యాకరణాంశములును గలవు. ఛందస్సునకు సంబంధించిన వానిలో యతి (1-71-72) ఛందో భంగము (1-92-94) గురు లఘుదోషములు (1-129-130) ప్రాసవిర (2-30-45, 2-232-236) మొదలగునవి ప్రధానాంశములు. ఇవియగాక నృపతుంగుడు బెదండె, చత్తాణ కావ్య ప్రక్రియలను పేర్కొని ఆ భాగము నందే అక్కరికె, చవుపది, గీతికె మున్నగు దేశిచ్ఛందో రీతులను మాత్రము పేర్కొని యున్నాడు. పై ఆధారముల బట్టి నృపతుంగునికి పూర్వమే కన్నడమున కావ్య ప్రక్రియలు పెక్కు ఛందోరీతులున్నట్లు స్పష్టము.

### గుణగాంకియం :

తమిళ ఛందో గ్రంథమగు యాప్పరుంగల కారికై యందు 'గుణగాంకియ మెన్నుం కరునాడక చ్చందమే పోల్' (గుణగాంకియమను కర్ణాటక ఛందమువలె) అను ప్రశంసబట్టి కన్నడములో గుణగాంకియమను ఛందోగ్రంథ మున్నట్లు తెలియు చున్నది. కాని ఈ గ్రంథమలభ్యము. గుణగ, గుణగాంగ, గుణనకెల్ల అను విశేషణ

ములుగల పూర్వ చాళుక్య వంశజుడైన మూడవ విజయాదిత్యుని పేర 'గుణగాంకియం' రచింపబడి యుండునని కన్నడ పరిశోధకులు భావించుచున్నారు.

ఛందోంబుధి :

ఉపలబ్ధ కన్నడ ఛందో గ్రంథములలో ప్రసిద్ధము, ప్రామాణికము, ప్రాచీనతమము నైనది నాగవర్మ రచించిన ఛందోంబుధి. ఈ గ్రంథ రచనా కాలము క్రీ. శ. 990. నాగవర్మ తన సతీమణి నుద్దేశించి ఈ ఛందోంబుధి రచించినట్లు తెలియుచున్నది. ఇందు 6 అధికారములున్నవి ప్రథమాధికారమున వర్ణ గణములు- గురులఘువులు - ప్రస్తారక్రమము - యతిప్రాసలు - సజాతులు - ఉక్తినుండి ఉత్కృతి వఱకు గల 26 ఛందములు - మదనవతి మున్నగు అచ్చగన్నడ వృత్త నామములు కలవు. సమవృత్త వివరణమను ద్వితీయాధికారములో ఉక్తినుండి ఉత్కృతివఱకుగల 26 ఛందములందు ప్రసిద్ధఛందోరీతులు కలవు. మాలావృత్తార్ధసమ విషయాది వృత్తప్రకరణమను తృతీయాధికారములో మాలావృత్తములు, అర్ధసమ వృత్తములు, విషయవృత్తములు, వైతాళీయములు, రగళె, దండక ప్రభేదములు కలవు, చతుర్థాధికారములో కంద, ఆర్యాగీతికె సంకీర్ణకదువయి లక్షణములు కలవు. కర్ణాటక విషయ జాతివృత్త ప్రకరణమను పంచమాధికారములో కన్నడమునకు మాత్రము సంబంధించిన బ్రహ్మ, విష్ణు రుద్రగణములు, ఐదు అక్కరలు, త్రిపదీ భేదములు, ఏళె చౌపది ఛందోవతంస అక్కరికె మదనవతి గీతికె ఉత్సాహషట్పదీ లక్షణములు కలవు. చివరి ప్రకరణమున షట్ప్రత్యయస్వరూప వివరణ కలదు. పై ఛందోంబుధి ప్రణాళికను బట్టి నాగవర్మ సంస్కృత ప్రాకృతములందలి ఛందోరీతులు కూడ కన్నడభాష కవసరములని స్పష్టము చేసినట్లున్నది. నాగవర్మకు పిదప ఛందోగ్రంథములను వ్రాసినవారెల్లరు 'ఛందోంబుధి'ని ప్రబలాధారముగా గ్రహించిరి జయకీర్తి (క్రీ.శ. 11వ శతాబ్దము) ఛందోనుశాసనమునకు, రేచన (1100**A.D.**) కవిజనాశ్రయమునకు, ఈశ్వరకవి (15వశతాబ్ది) కవిజిహ్వాబంధనమునకు నాగవర్మ ఛందోంబుధి ఆధారమయినది. నాగవర్మ ఛందోంబుధికిని రేచన కవిజనాశ్రయము నకు రచనా ప్రణాళికయందు పెక్కు సామ్యములు కనిపించుచున్నవి. ఈ యంశము మున్ముందు పరిశీలింతము

ఛందోవిచితి :

రెండవ నాగవర్మ (క్రీ. శ. 1042) 'కావ్యావలోకనమను' అలంకార గ్రంథము రచించెను. ఈ గ్రంథ ఉపసంహారభాగమున ఈ క్రింది పద్యమున్నది.

'ఛందోవిచితి యలంకృతి
సందభిధా వస్తు కోశ మెంబివు వాక్ శ్రీ
సుందరిగె రత్న మండన
దంద దొళి గ్దపువు నాగవర్మన కృతిగళ్' ప 965

ఈ పద్యమనుసరించి రెండవనాగవర్మ 'ఛందోవిచితి' రచించినట్లు స్పష్టమగుచున్నది. ఈ గ్రంథమలభ్యము. ఇది ఛందస్సునకు సంబంధించిన గ్రంథమో లేదా అన్యవస్తు విషయకమో తెలియరాదు.

ఛందోనుశాసన :

జయకీర్తి (క్రీ. శ. 1050) ఛందోనుశాసనమును రచించెను. ఇది సంస్కృత ఛందోగ్రంథమైనను అచ్చటచ్చట కన్నడఛందోరీతులు చెప్పబడినవి. ఈ గ్రంథమున 8 అధికారములున్నవి. ఇందలి యేడవ అధికారమును జయకీర్తి 'కర్ణాట విషయ భాషాజాత్యధికారము' అని వ్యవహరించెను. దిగంబర పథమునకు చెందిన జైన సన్యాసియగుట, దక్షిణదేశీయుడగుట, విశేషతః కన్నడిగుడగుటవలన కన్నడ ఛందోరీతులను జయకీర్తి ఛందోనుశాసనమున జేర్చి యుండవచ్చునని యూహింపవలసి యున్నది. అంతియగాక జయకీర్తి ఈ ప్రకరణమునందే కర్ణాటకుమారసంభవము కర్ణాట మాలతీ మాధవములను గ్రంథములను స్మరించి యున్నాడు. జయకీర్తి సప్తమాధికారమున అల్పాక్షర, అంతరాక్షర, మధ్యమాక్షర, సమానాక్షర, మహాక్షరములను ఐదు అక్కర భేదములను, త్రిపదీ భేదములను, ఏలా చతుష్పదికా ఛందోవతంస షట్పదికా, అక్షరికా మదనవతీ గీతికాది ఛందః ప్రభేదములను ప్రాసయుక్తముగా పేర్కొనెను.

మానసోల్లాస :

కళ్యాణి చాళుక్య వంశజుడగు మూడవ సోమేశ్వరుడు (క్రీ. శ. 1129) అభిలషితార్థచింతామణి లేదా మానసోల్లాసమను గ్రంథమును రచించెను. ఇది యొక

సంగ్రహవిజ్ఞానకోశము. ఇందు 16 వ అధ్యాయములో కొన్ని ఛందోవిషయములు కలవు వానిలో అంశగణములు (4-16-276, 277, 286) త్రిపదీ విశేషములు (4-16-278, 286) షట్పదీ వివరణము (4-16-287-289) కందపద్యము (4-16-290-292) త్రిపదీషట్పదుల విశేషనియమములు (4-16-7-32-4-16-549-554) ముఖ్యములయినవి.

## సంగీత రత్నాకర :

సంస్కృతమునగల సంగీతశాస్త్ర గ్రంథములలో శార్ఙ్గదేవుని (క్రీ.శ. 1210-1247) సంగీతరత్నాకరము ప్రామాణికగ్రంథము. ఇందు 7 అధ్యాయములున్నవి. నాల్గవదియగు ప్రబంధాధ్యాయములో కన్నడ ఛందోరీతులగు ఏళె, త్రిపది, షట్పదీ పద్యబంధములు కలవు. వీనిని శార్ఙ్గదేవుడు ప్రబంధములుగా వ్యవహరించెను. మానసోల్లాసము ననుసరించి ఏళె, త్రిపదులకు శార్ఙ్గదేవుడు లక్షణము చెప్పినట్లున్నది. వీనిని పాడవలసిన విధానమునుగూర్చి చెప్పుట సంగీతరత్నాకరము యొక్క ప్రత్యేకత.

## కవిజిహ్వాబంధన :

ఈశ్వరకవి (క్రీ శ 1500) కవిజిహ్వాబంధనము ఛందోలంకారముల విశదీకరించు నాల్గు ఆశ్వాసములుగల గ్రంథము. ప్రథమాశ్వాసమున గణస్వరూపము, వాని మిశ్రశత్రుత్వములు, శుభాశుభఫలములు, ప్రయోగ నియమములు కలవు. ద్వితీయాశ్వాసమున హరి, కరి ప్రాసభేదములు. వళి విభేదములు కలవు. తృతీయాశ్వాసమున అక్షరవిశేషములు వాని శుభాశుభ ఫలితములు కలవు. చతుర్థాశ్వాసములో ఛందోవిషయము లేవియులేవు కాని యీ గ్రంథములో ఆంధ్ర ఛందోవిషయములు కన్నడమున కన్వయించి చెప్పుట సంభవించినది కన్నడ ఛందోరీతులకు సంబంధించిన చర్చ ఈ గ్రంథములో చాలతక్కువ.

## ఛందస్సార :

గుణచంద్రుడను (క్రీ. శ. 1650) జైనకవి రచించిన ఛందస్సారము 5 అధికారములతో వ్రాయబడిన సంగ్రహ కన్నడ ఛందోగ్రంథము. ప్రథమాధ్యాయము సంజ్ఞా ప్రకరణము. ద్వితీయాధ్యాయము మాత్రాఛందః ప్రకరణము. ఇందు ఆర్యా,

గీతి, కందలక్షణములు, ఆరువిధములగు షట్పదీ భేదములుకలవు. తృతీయాధ్యాయము సమవృత్త ప్రకరణము. చతుర్థాధ్యాయము దండకాది సంకీర్ణ ప్రకరణము. పంచమాధ్యాయము తాళాదిప్రకరణము. ఇందు ధ్రువ, రూపకాది తాళభేదములు, మాత్రావిశేషగణములు, ప్రాసనిర్ణయము, ద్విపది, త్రిపది, రగళె, సీస, లావణి లక్షణములు కలవు. గుణచంద్రుడు సంస్కృత ఛందోరీతుల కొసగిన ప్రాధాన్యము కన్నడఛందోరీతులకు నొసగలేదని చెప్పవచ్చును

షట్ప్రత్యయ :

శాల్య కృష్ణరాజ (క్రీ. శ. 1748) విరచితమైన గ్రంథములలో షట్ప్రత్యయ మొకటి. ఈ గ్రంథములో షట్ప్రత్యయముల సంగ్రహ వివరణము కలదు. ఇది అముద్రితము.

నంది ఛందస్సు :

లేదా వీరభద్రుని నంది ఛందోర్ణవ. ఈ గ్రంథ కర్తృత్వమునుగూర్చి పరిశోధకులమధ్య అభిప్రాయ భేదములున్నవి. ఈ గ్రంథమును పరిష్కరించిన శ్రీ ఎం ఏ రామానుజయ్యంగారు గ్రంథనామమనుసరించి 'నంది'యనువాడు రచించెనని యతడు వీరశైవుడని పేర్కొనిరి. కాని కొందరు నందిఛందస్సును ఈశ్వర కవి రచించెననియు, ఈ గ్రంథము కవిజిహ్వాబంధనములోని యొక భాగమని మరి కొందరు కొల్లివాకమునకు చెందిన వీరభద్రకవి 'నందిఛందస్సును' రచించెనని భావించుచున్నారు. ఇదియొక అసమగ్రమగు ఛందోగ్రంథము. ఇందు మూడు అధ్యాయములున్నవి. ప్రథమాధ్యాయమునందు అంశగణప్రస్తారము, అష్టగణ విశేషాంశములు, వళివిభేదములు, ప్రాసవిశేషములున్నవి. ద్వితీయాధ్యాయమున 26 ఛందములందు ప్రఖ్యాతమైన వృత్తములు, ప్రస్తారప్రభేదములు సంగ్రహముగా చర్చింపబడినవి. తృతీయాధ్యాయమున బీజాక్షర చక్రము, గ్రహమైత్రి మొదలగు అలౌకికాంశములతోబాటు ఆటవెలది, తేటగీతి, సీసము – ద్విపద – కందము-షట్పదీ భేదములను వీరభద్రుడు విశదీకరించెను. వళివిభేదములు, ఉపజాతుల వివరణము లనుసరించి వీరభద్రుడు తెలుగువాడని, ఆంధ్ర ఛందోరీతులను కన్నడమున ప్రచార మొనర్ప సిద్ధపడినట్లు తెలియుచున్నది.

పై తెలిపిన ఛందోగ్రంథములుగాక కర్ణాటక ఛందోలంకార సాహిత్యలక్షణ (1885) ఛందస్సార (1890) ఛందోమాలికె (1895) ఛందోదర్పణ (1918) శ్రీనరసింహరాజ కర్ణాటకఛందోరాజం (1926) కర్ణాటక ఛందోమంజరి (1929) కన్నడకైపిడి (1927) కన్నడఛందస్సు (1970) మొదలగునవి ప్రఖ్యాతములు.

## 3. 3. తెలుగు ఛందో వాఙ్మయ సమీక్ష :

తెలుగు వాఙ్మయములో మొదటి ఛందోగ్రంథమేది యనుటలో అభిప్రాయ భేదములున్నవి. శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో 'నన్నయకుఁ బూర్వపు ఛందస్సు' అను వ్యాసములో 'వాంచియార్ సెయిద వడుగచ్ఛందమ్మ్' అను యాప్పరుంగల కారికై వాక్యము నుదాహరించి వాంచియ చేసిన ఛందమే రేచక కవిజనాశ్రయమై యుండునని భావించిరి.

కాని ప్రస్తుతము లభ్యమగుచున్న యాప్పరుంగల కారికై ముద్రిత ప్రతులలో
"పాశిత్తియం ఎణ్ణుం పాగద ఇలక్కణముం,
పింగళం ఎణ్ణుం చందోపిశితముం పోల కారికై
యాప్పిట్టాం గుణకాంగియం ఎణ్ణుం కరునాడ
చ్ఛందమే పోల మగడూఉ మున్నిలైత్తాయ్
అవై యదక్కముం ఉడై యదాయ్ మయేచ్చువరర్
యాప్పే పోల ఉదారణం ఎడుత్తోడి" అని మాత్రమే ఉన్నది.

పై పాదములలో సంస్కృత ప్రాకృత కన్నడ చ్ఛందోగ్రంథములపేర్లు కలవు. గాని 'వాంచియార్ సెయ్ద వడుగుచ్ఛందమ్' వాక్యము కనుపించదు. కన్నడ విమర్శకులు పలువురు పై వాక్యములనే యథాతథముగా గ్రహించి కన్నడ ఛందో గ్రంథమును గూర్చి ప్రస్తావించిరి. కనుక శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అముద్రితమయిన ఏ యాప్పరుంగల కారికై ప్రతిని చూచి ఉటంకించిరో పరిశోధింప దగ్గ అంశము.

### ఆంధ్రశబ్ద చింతామణి :

ఇది సంస్కృతభాషలో శ్లోకరూపమున వ్రాయబడిన ఆంధ్రవ్యాకరణము. నన్నయభట్టారకుడు ఆంధ్రశబ్దచింతామణిని రచించెనని బాలసరస్వతి, అప్ప

కవ్యాదులు పేర్కొనిరి. కాని గ్రంథ సాక్ష్యములననుసరించియు, అప్పకవ్యాదుల కథనమందుగల అనూహ్యాంశముల ననుసరించియు చింతామణి నన్నయకృతము కాదని నేటి ఆంధ్రవిమర్శకులు భావించుచున్నారు. ఇది కేవలము వ్యాకరణగ్రంథ మైనను సంజ్ఞా ప్రకరణాంతములో తెలుగు ఛందస్సునకు సంబంధించిన లక్షణములు 6 శ్లోకములలో సంగ్రహముగా విశదీకరింపబడినవి.

లక్షణ సారము :

కస్తూరిరంగకవి నన్నయకృతిగా లక్షణసారమును పేర్కొనెను. లక్షణ సారములో పేర్కొనిన 27 యతిభేదముల పద్యము నుదాహరించుచు వానినుండి కొన్ని లక్షణములను రంగ కవి సంగ్రహించెను. కాని యాపద్యములను పరికింప లక్షణసారము నన్నయకృతము కాదని తెలియుచున్నది.

కవిజనాశ్రయము :

(క్రీ. శ. 1080–1150) దీనికి భీమనఛందమని ప్రసిద్ధికలదు. లాక్షణికు లలో చిత్రకవిపెద్దన, అప్పకవి మొదలగువారు భీమనను లాక్షణికునిగా పేర్కొని యున్నారు. ఈగ్రంథ కర్తృత్వమును గూర్చి విమర్శకులలో అభిప్రాయభేదము లున్నవి. కాని కవిజనాశ్రయము రేచనకృతమని పెక్కురు భావించుచున్నారు. లభ్యమైన ఛందోగ్రంథములలో నిదియే మొదటిది. ఇందు సంజ్ఞ, వృత్త, జాతి, షట్ప్రత్యయ, దోషాధికారములున్నవి. రచనా ప్రణాళికయందు కవిజనాశ్రయము నకు నాగవర్మ ఛందోంబుధికిని పెక్కు సామ్యములు కనిపించుచున్నవి. ఈ యంశము మున్ముందు పరిశీలింపబడును.

గోకర్ణచ్ఛందస్సు :

క్రి. శ. 1127లో వెలసిన వర్ధమానపురాధీశ్వరుడగు గోకర్ణదేవుడు ఈ ఛందోగ్రంథమునకు కృతికర్తయో కృతిపతియో కాదగును. ఈ గ్రంథము సమగ్ర ముగా లభింపలేదు. గౌరన లక్షణదీపిక, అప్పకవీయము, రంగరాట్ఛందములందు గోకర్ణచ్ఛందము ఉదాహరింపబడియున్నది కనుక క్రీ. శ. 14 వ శతాబ్దికి పూర్వమునాటిదని నిక్కముగా చెప్పవచ్చును. లభ్యమైన భాగమనుసరించి యిందు గణకూటము, గణముల శుభాశుభఫలములు, 16 యతిభేదము లున్నట్లు చెప్పవచ్చును.

**కవివాగ్బంధనము :**

తిక్కనసోమయాజి కృతముగా తలంపబడు ఛందో గ్రంథము. దీని ప్రతి తంజావూరి పుస్తక భాండాగారమున (సంఖ్య 703) కలదు. ఇందు ఛందోమహిమ, అష్టగణములు. వాని కధిదైవతములు, వర్ణగణముల కులములు, వర్ణాధిదైవతములు కావ్యారంభ ప్రశస్తవారములు చర్చింపబడినవి.

**అథర్వణచ్ఛందస్సు**

అథర్వణకృతము. గౌరవ లక్షణదీపికలో నుదాహరించుటవలన క్రీ శ 1400 పూర్వ గ్రంథము కావచ్చును. ఇదియు సమగ్రముగా లభింపలేదు. లభ్యమైన పద్యముల ననుసరించి అథర్వణుడు గణచర్చ – 29 యతులు – కొన్ని ప్రాసలను గూర్చి విశదీకరించినట్లు తెలియుచున్నది.

**శ్రీధర చ్ఛందస్సు :**

శ్రీధరకృతము. గౌరన, అప్పకవి, కస్తూరి రంగకవి మొదలగు లాక్షణికులు శ్రీధరచ్ఛందము నుదాహరించియున్నారు ఆయా లాక్షణికులుదాహరించిన పద్యముల ననుసరించి శ్రీధరకవి గణవిషయములు – మాత్రాకారాధనక్రమము – 30 యతులు – కొన్ని ప్రాసలు చెప్పినట్లు తెలియుచున్నది. ఈ గ్రంథమలభ్యము.

**కవి రాక్షస చ్ఛందస్సు :**

కవిరాక్షసకృతము. అప్పకవి ఈ ఛందమును పేర్కొనుటవలనను, కస్తూరి రంగకవి యిందలి పద్యములను గ్రహించుటవలనను ఈ ఛందోగ్రంథవ్యాప్తి తెలియుచున్నది. ఇతడు 21 యతిభేదములను పేర్కొనినట్లు రంగకవి స్పష్టముచేసియున్నాడు

**కావ్యాలంకార చూడామణి :**

కర్త విన్నకోట పెద్దన (క్రీ. శ. 1402-1407) కావ్యాలంకార చూడామణి యందు తొమ్మిది ఉల్లాసములు కలవు. 7, 8 ఉల్లాసములందు ఛందోవిషయములు కలవు. కవిజనాశ్రయమునకు పిదప ప్రశస్తిపొందిన ఛందోగ్రంథములలో కావ్యాలంకార చూడామణి గణింపదగినది. విన్నకోటపెద్దన ఛందః ప్రకరణమున గురు

లఘునిర్ణయము - వళిప్రాసలు - 26 ఛందములందు ముఖ్యములగు వృత్తములు, సీసపద్యవిభేదములు - గీతివిభేదములు - అక్కరవిభేదములు - షట్ప్రత్యయములు మున్నగువానిని విశదీకరించెను.

లక్షణదీపిక :

గౌరన (1385-1445) రచించిన ఛందోగ్రంథము. ఇది సంస్కృతమున వ్రాయబడిన తెలుగు ఛందోగ్రంథము. దీని ప్రతి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున కలదు. (సంఖ్య R 1054 B 457) ఇందు ఐదు పరిచ్ఛేదములున్నవి. ప్రథమపరిచ్ఛేదములో గాయకలక్షణము, కవిత్వలక్షణము, కవిలక్షణములు కలవు. ద్వితీయ పరిచ్ఛేదములో గణములకు సంబంధించిన వర్ణములు, గోత్రవివేకము, స్వరవివేకము, గుణావగుణములు విస్తరించి చెప్పబడినవి. తృతీయపరిచ్ఛేదములో గణసంయోజనమునకు సంబంధించిన శుభాశుభఫలితములు తర్కింపబడినవి. చతుర్థ పరిచ్ఛేదములో గణములకు సంబంధించిన నక్షత్రములు, గ్రహమైత్రి, అక్షరములకు సంబంధించిన జాతివివేకము, శుభాశుభ ఫలములు విశదీకరింపబడినవి. పంచమ పరిచ్ఛేదమున మాతృకార్చన విధానము విస్తరింపబడినది.

ఛందో దర్పణము :

కర్త అనంతామాత్యుడు (1435) ఛందోదర్పణమునకు అనంతుని ఛందమను వ్యవహారమున్నది. ఇందు నాలుగు ఆశ్వాసములున్నవి. వరుసగా నిందు గణయతి ప్రాసములు, వృత్తములు, జాతులు, దశదోషసంధి సమాసాదులు వివరింపబడినవి. అప్పకవి అనంతుని ఛందోదర్పణమును ఆధారముగా గ్రహించినట్లు చెప్పవచ్చును.

కవిగజాంకుశము .

కర్త భైరవకవి (క్రి. శ. 1440). ఇదియొక చిన్నదగు ఛందోగ్రంథము. ఇందు గణవర్ణశుభాశుభఫలములు మాత్రముకలవు. తక్కిన ఛందోవిషయము లెవ్వియు కానరావు.

కవిసర్పగారుడము :

ఈ ఛందోగ్రంథమును కాచన బసవన (క్రీ. శ. 1470) రచించెను. చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహములో బసవనను ప్రస్తుతించియున్నాడు. కవి సర్ప గారుడములో అష్టగణలక్షణములు, కావ్యారంభప్రశస్తగణములు, గణాధిదైవతములు, బీజాక్షరఫలములు, 24 యతిభేదములు కలవు. శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో ఈ గ్రంథప్రతికలదు. (డి. నెం. 704)

ప్రయోగ సారము

ఈ ఛందోగ్రంథమునుగూడ కాచిరాజు బసవన రచించెను. ప్రాచీనకవుల ప్రయోగములను స్వీకరించుట 'ప్రయోగసారము' యొక్క ప్రత్యేకత యగును ఇందు అష్టగణలక్షణములు, యతిపర్యాయ పదములు, కృత్యాదినియమము, మంజరీ లక్షణము, చక్రకంకణ భేదనులు, 30 యతిభేదములు కలవు. ఈ గ్రంథమముద్రి తము. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తక భాండాగారమున ఈ గ్రంథప్రతియున్నది. (సంఖ్య 1326)

కవిచింతామణి :

కర్త వెల్లంకి తాతంభట్టు. (క్రీ. శ. 1480 ప్రాంతము) ఇందు భాషాలక్షణ వర్ణనిర్ణయ, వళిప్రాస, దోషాధికారములను నాలుగు అధికారములున్నవి. ఇందు భాషాలక్షణ, వర్ణనిర్ణయ, వళిప్రాస, దోషాధికారములను నాలుగు అధికారములున్నవి. మొదటి రెండింటియందు వ్యాకరణాంశములును, మూడవదియగు వళిప్రాసాధికార మున 14 యతులు 10 ప్రాసలు కలవు. దీనికి కావ్యానుశాసనము, కావ్యచింతామణి యను నామాంతరములున్నవి.

ఛందో దర్పణము :

అప్పకవి 'అనంతామాత్యచ్ఛందంబును, ఛందోదర్పణంబును' అని ప్రత్యేక ముగా చెప్పుటవలన రెండవది వెల్లంకి తాతంభట్టు రచించిన ఛందోదర్పణము కావచ్చు నని యూహింపవలసి యున్నది. ఈ ఛందోగ్రంథమువలదు అక్షరమాత్రాచ్ఛంద

స్సులు, గురులఘు స్వరూపము, గణవిషయములు - యతిప్రాసల నియమములు, ఆర్య, చపల, కందము, సీసము, ఉత్సాహము, గీతిభేదములు, అక్కర భేదములు, రగడ విభేదములు, ద్విపద త్రిపది, షట్పది కర్ణాటక, చౌపదులు స్పష్టముగా నిరూపితము. ఈ ఛందోగ్రంథప్రతి తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమున కలదు (సంఖ్య 713).

## లక్షణసారసంగ్రహము :

చిత్రకవిపెద్దన (1550) హనుమదంకితముగా వ్రాసిన ఛందోగ్రంథము. ఇందు 3 ఆశ్వాసములున్నవి. మొదటి రెండు ఆశ్వాసములలో ఛందోలక్షణములు మూడవ ఆశ్వాసమున శేషఅకారనిర్ణయము, నాటకలక్షణము, చిత్రకావ్యలక్షణములు కలవు

## సులక్షణ సారము :

రచయిత లింగమగుంట తిమ్మన. ఆంధ్రఛ్ఛందో గ్రంథములలో సులక్షణ సారమనకున్న వ్యాప్తి మరియేఛందో గ్రంథమునకు లేదు. ఇందు ప్రసిద్ధములగు వృత్తములు, దేశిచ్ఛందోరీతులు, షట్ప్రత్యయములు, 31 యతిభేదములు, ప్రాసవిభేదములు, గణసంయోజనమునకు సంబంధించిన విశేషములు కలవు.

## కవి సంజీవని :

ముద్దరాజురామన (1550) దీనిని రచించెను. ఈ గ్రంథము సమగ్రముగా లభించుటలేదు. ఇందు నాల్గుతరంగములున్నవి. ప్రథమతరంగములో యతిప్రాస లక్షణములు భారతాది గ్రంథలక్ష్యములు కలవు. అప్పకవి ఈ ఛందోగ్రంథమునుండి 60 పద్యముల నుదాహరించుటవలన 'కవిసంజీవని' ప్రత్యేకత విశదమగుచున్నది.

## లక్షణవిలాసము :

పెనుమర్తి వేంకటాచార్యుడు కర్త. (1600) రచయిత ప్రాచీన లక్షణగ్రంథములనెల్ల సంశోధించి 'లక్షణవిలాసము'ను రచించినట్లున్నది. ఇందు పద్యలక్షణములు, 26 యతులు, 20 ప్రాసలు కలవు.

ఉత్తమగండచ్ఛందస్సు :

కస్తూరి రంగకవి ఈ ఛందో గ్రంథమును పేర్కొనెను. ఇది ఉత్తమగండ బిరుదముగల సాళువకంపరాజున కంకితముగా రచింపబడినట్లు తోచుచున్నది. ఈ గ్రంథము లభ్యముకాలేదు. ఈ గ్రంథము క్రీ. శ. 1432 కాదగునని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు కవిజనాశ్రయము పీఠికలో పేర్కొనిరి. లాక్షణికోదాహరణముల ననుసరించి రచయిత గణసంయోగవిశేషములు, యతిప్రభేదములు, ప్రాస విశేషములనుగూడ తర్కించినట్లున్నది.

నీలకంఠచ్ఛందస్సు :

ఈ గ్రంథమును గూర్చి గాని గ్రంథకర్తను గూర్చిన వివరములు గని తెలియవు. ఈ అప్పకవి నీలకంఠచ్ఛందస్సులోని పద్యముల నుదాహరించుట వలన క్రీ. శ. 1656 నకు పూర్వము వెలసిన కవిగా భావింపవలసి యున్నది.

అప్పకవీయము :

అప్పకవి (క్రీ. శ. 1656) రచించిన ఛందోగ్రంథము. ఇది ఆంధ్రశబ్ద చింతామణికి అనువాద గ్రంథమైనను ఛందో గ్రంథముగా ప్రసిద్ధి పొందియున్నది. అప్పకవి దీనివి 8 ఆశ్వాసములుగా వ్రాయ నెంచినట్లున్నది గాని ఐదు ఆశ్వాసములే లభించుచున్నవి సుమారు 75 ప్రాచీన లక్ష్య లక్షణ గ్రంథములనుండి మున్నూటికి పైగా పద్యము లుదాహరింపబడినవి. శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు "తెలుగు భాషలో ఛందోరీతులు" అను గ్రంథములో (పుట 397) అప్పకవి నిట్లు కీర్తించియున్నారు.

"అప్పకవివలె పరిశోధనా దక్షత, లక్షణ నిర్వచన సమర్థత మరే ప్రాచీనాంధ్ర లాక్షణికులందును గానవచ్చుట యత్యుక్తి కాదు"

అప్పకవీయమందలి 3–4 ఆశ్వాసములు తెలుగు ఛందశ్శాస్త్రమును సమగ్రముగా సవిస్తరముగ బహు లక్ష్య లక్షణములతో విశదీకరించు భాగములగును.

**ఆంధ్రప్రయోగ రత్నాకరము :**

రచయిత గణపవరపు వేంకటకవి, (1676) ఈ ప్రశస్త గ్రంథములో నేడు మనకు లభ్యములు కాని అపూర్వ గ్రంథము లుదాహృతములైనవి. ముద్రిత శివ తత్త్వ సారమునలేని పద్యములు కూడ నిందు కలవు. ఇది అముద్రితము. తంజావూరి సరస్వతీమహలు గ్రంథాలయములో దీని ప్రతి యున్నది. (సంఖ్య 695)

**సర్వలక్షణ శిరోమణి :**

కర్త గణపవరపు వేంకటకవి. ఇందు పది ఉల్లాసములున్నవి. ఈ గ్రంథమందు ఛందో వ్యాకరణారణాలంకార విశేషములు కలవు. కాని యిందు కొన్ని యుల్లాసములే లభించుచున్నవి. ప్రథమోల్లాసములో గణవిషయములు, ద్విపద దండక ఉదాహరణములు, చతుర్థోల్లాసములో 26 ఛందములందు ప్రసిద్ధ వృత్తములు. కంద విభేదములు, చౌపదాది పద్యగతులు, షట్ప్రత్యయములు కలవు.

**లక్షణ మంజరి :**

కర్తనైషధము తిమ్మకవి. (17 వ శ.) ఇందు కొలదిగ వ్యాకరణ లక్షణములు చెప్పబడినను దీనికి ఛందోగ్రంథమనియే పేరు. ఈ గ్రంథములో మాతృకార్చన విధానము, చిత్రకవితా విశేషములు, 26 ఛందములందు ప్రసిద్ధ వృత్తములు, 50 యతిభేదములు 19 ప్రాస విభేదములు చెప్పబడినవి. దీనికి గరళపురీ ఛందమనియు పేరు కలదు. ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమున లక్షణమంజరి ప్రతి కలదు. (సంఖ్య 4506)

**యతిప్రాస విలాసము :**

ఈ గ్రంథకర్త పేరు తెలియదు ఇందు వర్ణోత్పత్తిక్రమము, 45 యతులు, 24 ప్రాసలు, యతులకు ప్రత్యాహార సంబంధ బాంధవ్యములు విశదీకరింపబడినవి. కవి స్వీయలక్షణములొసగి భారతాదిగ్రంథములనుండి లక్ష్యముల నొసగెను. కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము నుండి కూడ పద్యము లుదాహరించుటవలన ఈ ఛందోగ్రంథకర్త 18 వ శతాబ్ది చివరివాడు కావచ్చును. పరిషత్కార్యాలయములో, యతి ప్రాస విలాసప్రతి యున్నది. (సంఖ్య 4059)

## దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు – తులనాత్మక పరిశీలన

లక్షణసారము :

కర్త అకిదము బాలభాస్కరకవి (1690-1750) ఇందు అష్టగణలక్షణములు, గణాధిదైవతములు, గణఫలములు - గ్రహమైత్రి అక్షరకులవివేకము, అక్షరముల గతులు మాత్రము విశదీకరింపబడినవి తంజావూరు గ్రంథాలయములో ఈ గ్రంథ ప్రతి యున్నది. (సంఖ్య 717)

సర్వలక్షణసార సంగ్రహము :

కర్త కవిసార్వభౌమ కూచిమంచి తిమ్మకవి. (క్రీ. శ. 1700) ఇందు మూడు ఆశ్వాసము లున్నవి రెండవ ఆశ్వాసమున ఛందోలక్షణములు చెప్పబడినవి. శ్రీనాథ మహాకవి రచనలనుండి రచయిత 160 ప్రయోగములను స్వీకరించియున్నాడు. ఎఱ్ఱన రామాయణము, శృంగారషష్ఠము మొదలగు అపూర్వగ్రంథములిందు నుదాహరింపబడుటవలన అధునాతన లక్షణగ్రంథములలో ప్రశస్తమని చెప్పవచ్చును.

లక్షణ చూడామణి :

కర్త కస్తూరి రంగకవి (1740-1750) ఇందు నాలుగు ఆశ్వాసములున్నవి. ప్రథమాశ్వాసములో గణవిషయములు, ద్వితీయాశ్వాసములో గ్రహమైత్రి విధానములు తృతీయాశ్వాసములో యతి ప్రాస విశేషములు, చతుర్థాశ్వాసములో ప్రసిద్ధ వృత్తములు కలవు. అప్పకవీయమునకు పిదప లక్ష్యలక్షణవిశుద్ధత, సమన్వయదృష్టి, ప్రయోగ పాటవముగల ఏకైక ఛందోగ్రంథము లక్షణ చూడామణి యనుటలో సందేహము లేదు.

లక్షణ శిరోమణి

కర్త పొత్తపి వేంకటరమణ కవి. రచనా కాలము 17 వ శతాబ్ది. ఇందు పద్య గద్య కావ్యరచనా విధానము సమగ్రముగా చర్చింపబడినది ఇందు నాలుగు ఆశ్వాసము లున్నవి. వర్ణ, గణ, వృత్త, విశ్రమాధికారములను నాలుగింటిలో చతుర్థాశ్వాసములో కొంత భాగము వఱకు మాత్రము లభించుచున్నది

దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు — తులనాత్మక పరిశీలన

సుకవి మనోరంజని :

కర్త ఆంధ్రలాక్షణిక చక్రవర్తి కూచిమంచి వేంకటరాయకవి. ఇది అప్పకవీయమును ఖండించుచు వ్రాసిన విపుల విమర్శనా సహితమగు లక్షణ గ్రంథము

ఆంధ్ర గీర్వాణచ్ఛందము :

కర్త సి. పి. బ్రౌన్. దీనిని **'The Prosody of the Telugu and Sanskrit languages explained'** అను పేరుతో క్రీ శ 1827 వ సంవత్సరమున సి. పి. బ్రౌన్ ముద్రించెను ఇందు ఆరు భాగము లున్నవి. మొదటిది **Analysis ; On Feet** — గణస్వరూపము రెండవది **On the Fixed Metres** — ఈ భాగములో ఉత్పలమాల — చంపకమాల — శార్దూలము — మత్తేభము — మత్తకోకిల — స్రగ్ధర మహాస్రగ్ధర మాలిని — మాలిని — పంచచామరము — భుజంగప్రయాతము — తోటకము రోదకము మొదలగు ప్రసిద్ధ వృత్తములు విశదీకరింపబడినవి. రచయిత తానే పద్యమున లక్షణము కూర్చుట గమనింపదగినది. మూడవది **On the Changing Metres** ఉపజాతి వృత్తాలు ఈ భాగములో గీతివృత్తములు, సీసము, తరువోజ, ఉత్సాహము అక్కరలు, రగడలు పేర్కొనబడినవి. నాల్గవది **The Canda Metre** ఐదవది **On Metres Peculiar to Sanscrit Poetry**. ఆరవది **On Rhyme**. ఈ భాగమున యతివిభేదములు, కొన్ని ప్రాసలు సోదాహరణముగా వివరింపబడినవి ఈ గ్రంథమును శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు 1977 లో పునర్ముద్రించిరి.

పైన పేర్కొనబడినవిగాక ఫక్కి వేంకటనరసయ్య (క్రీ. శ. 1836) కవిదర్పణచ్ఛందము, చంద్రకవి (1799—1868) శ్రీకృష్ణభూపాలీయము, త్యాగరాజ మొదలి (1830-1880) ఛందోరత్నాకరము, పాపినేని వేంకట సామినాయడు (1860) ఛందశ్శాస్త్రలక్షణ సారసంగ్రహము, శృంగారకవి సర్వారాయడు (1814—1939 ఛందోలక్షణ గ్రంథములు గడచిన శతాబ్దములో ప్రసిద్ధిపొందిన ఛందో గ్రంథములగును.

20 వ శతాబ్దములో ఛందోగ్రంథములకంటె ఛందస్సునకు సంబంధించిన విమర్శనా గ్రంథములు, వ్యాసములు పెక్కు వెలువడినవని చెప్పవచ్చును. ఈ రంగ

ములో సాటిలేని పరిశ్రమ చేసిన వారిలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, శ్రీ చిలుకూరి నారాయణరావుగారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రముఖులు డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు "తెలుగులో ఛందోరీతులు' శ్రీ రావూరి దొరసామిశర్మగారు 'తెలుగు భాషలో ఛందోరీతులు,' శ్రీ కోవెల సంపత్కుమారాచార్యగారు 'తెలుగు ఛందో వికాసము"ల ప్రకటించిరి. ఇతర ద్రావిడ భాషలలోని ఛందోరీతులను తులనాత్మకముగా పరిశీలించిన వారిలో శ్రీ పేకుమళ్ళ రాజగోపాలరావుగారు అగ్రగణ్యులనవచ్చును. వారి 'Comp rative Prosody of the Dravidian languages' 1918 లో ప్రకటితులు.

పై పరిశీలనము వలన ఆంధ్ర భాషలో ఛందోగ్రంథముల, వ్యాప్తి విస్తారమని తెలియుచున్నది.

## 3. 4. మలయాళ ఛందోవాఙ్మయ సమీక్ష

### లీలాతిలకం :

ప్రాచీన మలయాళ భాషాస్వరూపమును విస్తరించి చెప్పు అలంకార లక్షణ గ్రంథము లీలాతిలకము. ఈ గ్రంథమును తిరుమల్లమాంబూళ్ళభట్టదిం' అను పండితుడు రచించెనని మలయాళపరిశోధకులు భావించుచున్నారు లీలాతిలకకర్త కోతమార్తాండన్, రవివర్మచక్రవర్తి, విక్రమపాండ్యుడు మొదలగు కొల్లం రాజులను గూర్చి ప్రశంసించుటవలన కొల్లం గణపతిదేవాలయములో వసించిన బ్రాహ్మణుడొకడు రచియించెననియు కొందరు తలంచుచున్నారు వేదాంతదేశికుల వైరాగ్యపంచకమునుండి యొక శ్లోకము నుదాహరించుటవలన లీలాతిలక కర్త క్రీ. శ. 1385 - 1400 ప్రాంతమువాడని నిర్ణయింపబడియున్నది.

లీలాతిలకములో 8 శిల్పములున్నవి. మొదటి శిల్పములో మణిప్రవాళలక్షణము, కేరళీయుల భాషకు ద్రావిడ భాషా కుటుంబమునకుగల సంబంధము, తమిళ మలయాళభాషారూపములు. పాట్టులక్షణములు చర్చింపబడినవి. లీలాతిలకకారుడు పాట్టు లక్షణమును

'ద్రవిడ సంఘాతాక్షర నిబద్ధం యదుక
మోనవృత్తవిశేషయుక్తం పాట్టు' అని పేర్కొనెను.

"ద్రావిడభాషావర్ణములతో, ద్వితీయాక్షరప్రాసలతో, యతిమైత్రీ విశేషములతో కూడినది పాట్టు" అని నిర్వచించుటవలన లీలాతిలకకారుని కాలమునకు ముందే మలయాళ పద్యబంధములు వ్యాప్తిలో నుండెనని తలంపవలసియున్నది. లీలాతిలకము నాలుగవశిల్పమున యతిభంగం – వృత్తభంగం – దుర్వృత్తం– వికారానుప్రాసములు చర్చింపబడినవి. ఆరవశిల్పమున అనుప్రాసం – ముఖానుప్రాసం – పాదానుప్రాసం వర్ణానుప్రాసముల వివరణ కలదు లీలాతిలకకారుడు మలయాళ పద్యరీతులను చెప్పకున్నను తమిళ పద్యబంధములు మలయాళమున కలవని సూచించుటవలన తమిళ ఛందోగ్రంథములే మలయాళకవులకు శిరోధార్యములై యుండెనని యూహింపవలసి యున్నది.

## వృత్త రత్నాకరటీక :

సంస్కృతములో విపుల ప్రచారమొందిన వృత్త రత్నాకరమునకు కేరళ పండితుడు కరుణాకరదాసుడు వ్యాఖ్యానము వెలువరించి యున్నాడు. ఇతని కాలమును గూర్చి యిదమిత్థముగా నిర్ణయించుటకు నాధారములు లేవు. 1 నుండి 26 అక్షరముల కంటె మించిన ఛందస్సును అపవృత్తమని పేర్కొనెను. మణికాంచి మలయాళదేశిచ్ఛందస్సు. పై ఆధారమనుసరించి కరుణాకరదాసుని కాలమునాటికి సంస్కృతములో వ్రాయబడిన మలయాళ ఛందోగ్రంథమేదైన నుండెనేమో అని అనుమానింపవలసి యున్నది. ఈ వృత్తరత్నాకరటీక అముద్రితము.

## కేరళ కౌముది :

కోవుణ్ణి నెడుంగాది (క్రీ. శ. 1875) రచించిన వ్యాకరణగ్రంథము. ఇందు వృత్తాలోకప్రకరణమను ఛందః ప్రకరణమున్నది. ఇందలి 37 సూత్రములలో 16 సంస్కృత వృత్తములను, 21 మలయాళ ఛందోరీతుల లక్షణములున్నవి. నెడుంగాది మొదట మాత్రావృత్తములు, వర్ణవృత్తములు అని విభాగము గావించెను. మాత్రావృత్తములలో ఆర్యలను గూర్చి మాత్రము పేర్కొనెను. ద్రావిడ వృత్తములలో వెణ్–కలి–వంజి–ఆశిరియములను నాల్గు విభేదములను చర్చించెను ఛందోంగములలో ఎళుత్తు, అశై, శీర్, తళై, అడి, తొడై అనువానిని మాత్రము స్వీకరించెను.

పై పరిశీలనమువలన నెడుంగాది మలయాళదేశిచ్ఛందములను స్వీకరింపలేదని తెలియుచున్నది.

వృత్తమంజరి

మలయాళ ఛందో గ్రంథములలో ప్రసిద్ధి పొందిన ఛందోగ్రంథము వృత్తమంజరి. ఈ గ్రంథకర్త రాజరాజవర్మ (1904). ఇందు తొమ్మిది ప్రకరణము లున్నవి. రచయిత ఏడు ప్రకరణములందు సంస్కృత మాత్రావర్ణవృత్తములను, ఎనిమిదవ ప్రకరణమున భాషావృత్తములను విశదీకరించెను. మలయాళములో వ్యవహృతమగు సంస్కృత ఛందోరీతులను చెప్పినంతగా శుద్ధ మలయాళ రీతులకు ప్రాధాన్య మొసగలేదు. ఈ గ్రంథములో కాకళి, కేక, అన్ననడల లక్షణము లున్నవి.

కాంత వృత్తం :

కొడుంగల్లూర్ కొచ్చుణ్ణి తంబురాన్ (క్రీ. శ. 1904) వ్రాసిన ఛందో గ్రంథమిది. ఇందు హ్రస్వ దీర్ఘాక్షర విభాగము, అక్షరముల క్రమమనుసరించి యేర్పడు ఛందోరీతులు విపులీకరింపబడినవి.

వృత్తసహాయి :

దీని రచయిత తగళి ఇ అర్ పిళ్లై ఈ ఛందోగ్రంథము భాషాపోషిణి చిత్ర మాసికాపత్రికలో ప్రకటింపబడినది. శ్రీ పిళ్లైగారు రాజరాజవర్మ వృత్తమంజరి ననుసరించి వృత్తసహాయి వ్రాసినట్లున్నది. కాని మాత్రావిషమ సమవృత్తములతో పాటు భాషావృత్తములకుగూడ పేర్కొనుటవలన స్పష్టతలోపించుచున్నది.

'సద్వృత్తమాల' అను ఛందోగ్రంథమును కడత్తనాట్టుదయవర్మరాజా రచించెను. కానియిందు సంస్కృత ఛందస్సు మాత్రము విశదీకరింపబడినది. ఇట్లే రామవర్మఅప్పన్ తంబురాన్ వ్రాసిన 'ద్రావిడవృత్తంగళుం అవైయుడ పరిణామముం' అను గ్రంథము ద్రావిడవృత్తములు మలయాళములో పొందిన పరిణామము లను మాత్రము విశదీకరించును. ఇవియగాక మలయాళములో శ్రీ కుంటికృష్ణమేనన్

(1972) భాషావృత్తదీపిక, శ్రీకుట్టికృష్ణమారర్ (1952) వృత్తశిల్పం, శ్రీ కె. కె. వాద్యార్ (1961) వృత్తవివేకం (వృత్తవిచారం) అను ఛందోగ్రంథములు ప్రసిద్ధములున్నవి. వీనిలో మలయాళ దేశిచ్ఛందములు విపులముగా విమర్శింపబడినవి. ఇవిగాక మలయాళవాఙ్మయములో ఛందఃపరిశోధనకు సంబంధించిన సిద్ధాంత వ్యాసములును వెలువడియున్నవి. వానిలో డా॥ ఎం వి కృష్ణవారియార్ గారి Malayalam Metres, డా॥ ఒ. ఎం. అనుజన్‌గారి Malayalam Metres - A study డా॥ టి. వి. మోధ్యూ వృత్తశాస్త్రమ్, వృత్తకల్పద్రుమం మొదలగునవి పేర్కొనదగినవి.

## 3. 5. ఛందోగ్రంథ సామ్య వైషమ్యములు :

తమిళ కన్నడాంధ్ర మలయాళ భాషలలోని ఛందో వాఙ్మయమును పరిశీలింపగా వాని మధ్య పెక్కు సామ్యములు కనిపించుచున్నవి. వానిని క్రమముగా పరిశీలింతము.

### ఇతర లక్షణ గ్రంథాలు ఛందస్సు :

ఒక శాస్త్రము స్వతంత్రమై నిలదొక్కు కొనుటకు పూర్వము తదితర శాస్త్రములలో నది అంతర్భాగమై యుండుట నైజము. ఈ సత్యము ఛందశ్శాస్త్ర వికాసములో కూడ స్పష్టము.

సంస్కృత వాఙ్మయములోని బ్రాహ్మణములు, ప్రాతిశాఖ్యలు, పురాణములు జ్యోతిశ్శాస్త్రాదులందు ఛందో విషయములు ప్రస్తావింపబడుట అట్టిదే. అట్లే తమిళమునందు వ్యాకరణ గ్రంథములలో ఛందో విషయములు చెప్పబడినవి. క్రమముగా తమిళములో 'ఐన్దిలక్కణ' సంప్రదాయ మేర్పడినది. ఎళుత్తు, సొల్, పొరుళ్ యాప్పుఅణి అను ఐదంశములను వివరించుటయే ఆ సంప్రదాయము. ఈ సంప్రదాయమును నిలబెట్టిన తమిళ వ్యాకరణములలో వీరచోళియం, ముత్తువీరియం ప్రసిద్ధములు.

కన్నడ వాఙ్మయములో మొదటి అలంకార గ్రంథమయిన కవిరాజమార్గలో ఛందోవిషయములు ప్రసక్తము. 13వ శతాబ్దినాటిదగు కేశిరాజు శబ్దమణి దర్పణము వ్యాకరణ గ్రంథములో కూడ ఛందశ్శాస్త్ర విషయములు కలవు

ఆంధ్రవాఙ్మయమునందు గూడ ఛందోంశములు వివిధ గ్రంథములలో చెప్పుట కనిపించును. ఆంధ్రశబ్ద చింతామణియందు సంజ్ఞాపరిచ్ఛేదాంతములో వళి ప్రాస స్వరూపములు, పద్యగతులు సంగ్రహముగా సూచింపబడినవి. ఒక ద్వితీయా చార్యుడుగా వినుతిపొందిన అథర్వణాచార్యుల కారికావళియందును వళిప్రాసచర్చ, కావ్యాది నిలుపదగిన అక్షరనియమములు కలవు. ఇవియగాక ఛందోవ్యాకరణముల రెండింటిని పరిశీలించినవానిలో వెల్లంకి తాతంభట్టు క్రీ. శ. (1480-1520) కవి చింతామణి, వార్తాకవి రఘునాథయ్య క్రీ. శ. (1600) లక్షణదీపిక, అప్పకవీయము క్రీ. శ. (1656) గణపవరపు వేంకటకవి క్రీ. శ. (1676) సర్వలక్షణ శిరోమణి మొదలగునవి పేర్కొనదగినవి. ఆధునిక వ్యాకరణమగు బాలవ్యాకరణమునందుకూడ ఛందస్సునకు సంబంధించిన సూత్రములు కలవు.[2]

లక్షణగ్రంథములలో ప్రత్యేకతవహించిన కావ్యాలంకార చూడామణియందు ఛందోవ్యాకరణాలంకారములన్నియు కలవు. ఇట్లే ఛందస్సునకు ప్రాధాన్యమొసగిన అనంతుని ఛందోదర్పణమునందు వ్యాకరణాంశములు కలవు. అలంకార గ్రంథము లైన కావ్యాలంకారసంగ్రహము మొదలగు వానియందు ప్రాసవిశేషములు చిత్రకవితా రీతులు కలవు.

శాస్త్రగ్రంథములందే గాక ప్రబంధాదులందును ఛందో విషయములు చెప్పబడె ననుటకు కొఱవిగోపరాజు 'సింహాసన ద్వాత్రింశిక' చక్కని యుదాహరణము. విక్రమార్కుని పురోహితపుత్త్రుడు దేశాంతరమునకేగి విద్యలనేర్చి తిరిగివచ్చి 'సంస్కృతమునలేక తెలుగున మాత్రమున్న యతిప్రాసల రామణీయకమును' ఈ విధముగా ప్రశంసించెను.

పుణ్యస్త్రీకి గుణంబు మంగళగుణంబున్ సొమ్ములై యొప్పఁగాఁ
బణ్యస్త్రీకి సువర్ణమౌక్తిక సురూప వ్యక్తిభూషాకృతుల్
గణ్యంబౌగతి సంస్కృతంబునకు వాగ్భావంబు శబ్దంబులా
వణ్యాకారములొఁ దెనుంగునకుఁ బ్రాల్వఁక్కుం గడున్వన్నియల్ (VI - 190)
తప్పక వళ్ళను ప్రాలును
ముప్పిరిగొనఁదగిన శబ్దములు మెఱుఁగెక్కం
జెప్పిన కవితాచాతురి
యొప్పము వెట్టిన పసిండి యొఱపున మెఱయున్ (VI - 192)

మలయాళ వ్యాకరణాలంకార గ్రంథమగు లీలాతిలకమున యతిప్రాసలు, వృత్తభంగము, యతిభంగములను ఛందోంశములున్నవి. 19వ శతాబ్దినాటి వ్యాకరణ గ్రంథమగు కేరళకౌముది యందుగల 'వృత్తాలోకప్రకరణము' ఛందోరీతులను విపులీకరించు ప్రకరణమగును.

వ్యాకరణాలంకారములతోపాటు ఛందోవిషయములను గూడ చెప్పు సంప్రదాయము తమిళ కన్నడాంధ్ర మలయాళ వాఙ్మయమున గలదని ఫలితార్థము.

## ఛందోగ్రంథముల పేర్లు :

సంస్కృత ప్రాకృత తమిళ కన్నడాంధ్ర మలయాళ భాషల లోని ఛందోగ్రంథముల పేర్లను పరిశీలింప వానియందొక యైక్య ధర్మమును స్థాపించుటకు వీలున్నది. ఛందోగ్రంథ నామములను వ్యక్తినామ ప్రసిద్ధములని, అలంకార యుక్తములని రెండు వర్గములుగా విభజింపవచ్చును.

## వ్యక్తినామ ప్రసిద్ధములు :

వ్యక్తి నామములతో ప్రసిద్ధమైన ఛందోగ్రంథములు సంస్కృత సాహిత్యములో తక్కువ. పింగళచ్ఛందము, జనాశ్రయీ, జయదేవచ్ఛందము, స్వయంభూచ్ఛందములు మొదలుగునవి కొన్ని మాత్రము కనిపించును.

తమిళ వాఙ్మయములో వ్యక్తినామ ప్రసిద్ధములగు ఛందోగ్రంథము లెక్కువ. అగత్తియం, అగత్తియర్ పాట్టియల్, అవినయం, ఇన్మణియారం, కాక్కైపాడినియం, సిఱుకాక్కైపాడినియం, తక్కాణియం, దత్తాత్రేయ ప్పాట్టియల్, నక్కీరర్ అడినూల్, నత్తతం, పరిప్పెరుమాళ్ ఇలక్కణనూల్, పరిమాణనార్ యాప్పిలక్కణం పల్కాప్పియం, పేరాశిరియర్ ఇలక్కణనూల్ మొదలగునవి వీని కుదాహరణములగును.[3]

కన్నడ వాఙ్మయములో 'గుణగాంకియం, నంది ఛందోర్ణవములు' వ్యక్తినామ ప్రసిద్ధములు.

ఆంధ్ర ఛందోగ్రంథములు చాలవఱకు వ్యక్తినామ ప్రసిద్ధములని చెప్పవచ్చును. పెద్దిరాజు అలంకారము, అనంతుని ఛందస్సు, అప్పకవీయము, వీరభూపాలీయము.

వీరన ఛందస్సు ఆనందరంగరాట్ఛందస్సు మొదలగునవి ప్రసిద్ధములు. అలభ్య ఛందోగ్రంథములలో అథర్వణచ్ఛందము, శ్రీధరచ్ఛందము, కవిరాక్షసచ్ఛందము, ఉత్తమ గండచ్ఛందము, జయదేవచ్ఛందము, నీలకంఠచ్ఛందములు వ్యక్తినామ ప్రసిద్ధ ఛందోగ్రంథములు మలయాళ వాఙ్మయమునందిట్టివి కానరావు.

## అలంకార నామములు :

భూషణములు సౌందర్య పోషకములయినట్లు ఉపమాద్యలంకారములు కావ్యమున కెనలేని రామణీయకమును కలిగించును. ఇది కేవలము కావ్యవస్తు విషయమున గాక గ్రంథ నామకరణమునందు నన్వయించును.

సంస్కృతములోగల కర్ణతోషము, కర్ణానందము, కవిదర్పణము, కావ్య ప్రకాశము, ఛందఃకల్పతరు, ఛందఃకందలీ, ఛందః కల్పలతా, ఛందః కౌముదీ, ఛందః కౌస్తుభము, ఛందః పయోనిధి, ఛందశ్చంద్రిక, ఛందశ్చూడామణి, ఛందశ్చటా మండనము, ఛందస్సిద్ధాంతభాస్కరము, ఛందస్సుధాకరము, ఛందస్సుధావల్లహరీ, ఛందోదర్పణము, ఛందోదీపికా, ఛందోంబుధి, ఛందోమంజరీ, ఛందోమందాకినీ, ఛందోమాతంగము, ఛందోమార్తాండము, ఛందోరత్నము, వృత్తకల్పద్రుమము, వృత్తకౌముది, వృత్తకౌస్తుభము, వృత్తదీపిక, వృత్తద్యుమణి, వృత్తదర్పణము, వృత్త ముక్తావళీ, కవిచింతామణి మొదలగునవి అలంకారయుక్త ఛందోగ్రంథ నామములు.[4]

తమిళఛందో గ్రంథములలో యాప్పరుంగలమ్, యాప్పరుంగల కారికై, యాప్పరుంగలవిరుత్తి, యాప్పొళి అనునవి సాలంకార నామములు. యాప్పు అనగా ఛందస్సు. ఛందస్సు సముద్రమునుపోలినది. అట్టి సముద్రమును దాటుటకు కలమ్ (తెప్ప లేదా ఓడ) అవసరము. ఈ దృష్టితో అమృతసాగరుడు 'యాప్పరుంగలమ్' అను పేరు పెట్టినట్లు తోచుచున్నది. యాప్పొళి అనగా ఛందః ప్రకాశము.

కన్నడ ఛందో గ్రంథములలో ఛందోంబుధి, ఛందస్సారము లనునవి అలంకారయుక్త నామములు. నాగవర్మ "క్షీరసాగరమునందు కౌస్తుభము జనించినట్లు ఛందోంబుధిలో గణములు జనించె"నని పేర్కొనియున్నాడు. ఇచట అంబుధి సామ్యము గమనింపదగినది. ఇట్లే గుణచంద్రుని ఛందస్సారము సంగ్రహ ఛందో గ్రంథమగుటవలన నామసార్థక్యము నొందినది.

## దాక్షిణాత్య దేశి చ్ఛందోకృతులు – తులనాత్మక పరిశీలన

ఆంధ్ర ఛందోగ్రంథములలో కావ్యాలంకారచూడామణి, ఛందోదర్పణము, శారదాతిలకము, కవిచింతామణి, కవిజన సంజీవని, సుకవికర్ణామృతము, లక్షణదీపిక, లక్షణమంజరి, ఛందోరత్నాకరములు సాలంకృతనామములు.

మలయాళములో వృత్తమంజరి వృత్తశిల్పము, భాషావృత్తదీపిక మొదలగునవి అలంకృతనామములు.

ఇవిగాక ఛందోనియమములకు కవిబద్ధుడను దృష్టితో ఛందోగ్రంథ నామకరణము చేయుటయు కనిపించును. కన్నడములో కవిజిహ్వాబంధనము, ఆంధ్రమున కవిగజాంకుశము, కవిసర్పగారుడము, కవికంఠపాశము, కవిమూషిక మార్జాలము ఈ కోవలో చేరును.

పై చర్చవలన గ్రంథనామకరణమున ద్రావిడ భాషలకు సామ్యము కలదని తెలియుచున్నది.

### ఛందోగ్రంథములు – అంకిత విషయము :

సంస్కృతమున పెక్కు శాస్త్రగ్రంథములు గురుశిష్య సంవాదాత్మకములు. ప్రియురాలి నుద్దేశించి గ్రంథరచన చేపట్టుట సంస్కృతమున అరుదని చెప్పవచ్చును. ప్రాకృతపైంగలము, శ్రుతబోధ, వృత్తజాతి సముచ్చయములందు మాత్రము ఈ పద్ధతి కనిపించుచున్నది.

తమిళ వాఙ్మయములో స్త్రీ నుద్దేశించి వ్రాయబడిన ఛందో గ్రంథములలో 'యాప్పరుంగలకారికై' మొదటిది. ఈ కారికైయందు గల 47 సూత్రములలో 34 స్త్రీ సంబోధనాత్మకములు. ఈ పద్ధతి వీరచోళియ వ్యాకరణమునందును కలదు. ఇందలి 181 కారికలలో 58 స్త్రీ నుద్దేశించి చెప్పినవియే యగును.

కన్నడ వాఙ్మయములో వెలసిన మొదటి ఛందోగ్రంథము ఛందోంబుధి. ఇది స్త్రీ సంబోధనాత్మకము. ఈ గ్రంథమున పద్య పాదాంతములందు విలోల లోచనే – లలితగాత్రే – చకిత హరిణనేత్రే, వ్యాలోల నీలాలకే – కనక కుండల మండిత గండేవంటి సంబోధనలున్నవి.

ఆంధ్ర ఛందోగ్రంథములందు స్త్రీ సంబోధనాత్మకములు కానరావు. కాని యొక్క చర్ల నారాయణశాస్త్రి విరచితమయిన నారాయణీ యాంధ్ర వ్యాకరణము

నందు ఈ సంప్రదాయము పాటింపబడినది. ఇది పద్యాత్మక వ్యాకరణము. ఇందు పతిదేవతా – సకియా – లోయలితలమానికమా వంటి సంబోధనలున్నవి.

## ఛందోగ్రంథములు – విభాగనామము :

గ్రంథకర్త తానుద్దేశించిన విషయములను క్రమబద్ధమున ప్రదర్శించుటకై కొన్ని విభాగములను గావించుకొనును. ఇట్టి విభాగములు కావ్యవాఙ్మయమునందు కంటె శాస్త్రవాఙ్మయములో అత్యధిక ప్రాధాన్యము వహించును. అట్టి విభాగములకు సంస్కృతములో అధ్యాయము, అధికరణము, అధికారము, ప్రకరణము, ఉద్ద్యోతములను పేర్లుపెట్టుట సంప్రదాయము.

## అధ్యాయము :

సంస్కృతవాఙ్మయములో 'అధ్యాయ' శబ్దమునకు వ్యాప్తి ఎక్కువ. న్యాయ వైశేషిక మీమాంస వేదాంతదర్శనములు, మనుయాజ్ఞవల్క్యస్మృతులు, ఛాందోగ్యోపనిషత్తు, పాణినీయములందు 'అధ్యాయ' శబ్దమే వాడబడినది. ఇక ఛందోవాఙ్మయమును పరిశీలింప పింగళచ్ఛందము జనాశ్రయీ, ఛందోనుశాసనము, రత్నమంజూష వృత్తరత్నాకరములందు 'అధ్యాయ' విభాగము కలదు.

కన్నడ ఛందోగ్రంథములలో కేశిరాజ ఈశ్వరుని కవిజిహ్వాబంధనము, గుణచంద్రుని ఛందస్సారము, వీరభద్రుని నందిఛందోర్ణవములందు 'అధ్యాయ' విభాగమున్నది ఆంధ్రమలయాళ ఛందోగ్రంథములందు అధ్యాయశబ్దమునకు ప్రచారము లేదు

## అధికార : అధికరణము :

అధ్యాయ శబ్దమునకు పిదప సంస్కృత శాస్త్ర వాఙ్మయమున అధికార, అధికరణములకు వ్యాప్తియున్నట్లు చెప్పవచ్చును. విషయ, సంశయ, పూర్వపక్ష, సిద్ధాంత నిర్ణయములతో కూడినది అధికరణమని నిర్వచనము. భోజుని 'చారుచర్య'లో అధికారమే ప్రకరణవాచి.

తమిళములో తొలివ్యాకరణమనదగిన తొల్కాప్పియమున ఎళుత్తదికారం, చొల్లదికారం, పొరుళదికారములను విభాగములు కలవు. 'నన్నూల్' అను తమిళ వ్యాకరణవిభాగములకు కూడ అధికారమనియే పేరు

## దాక్షిణాత్య దేశిచ్ఛందోరీతులు – తులనాత్మక పరిశీలన

కన్నడ ఛందోగ్రంథమగు నాగవర్మ ఛందోంబుధియందు ప్రథమాధికరణము ద్వితీయ ప్రకరణము – తృతీయాధికారము – చతుర్థాధికారము – పంచమాధికారము లను విభాగములు కనిపించుచున్నవి

ఆంధ్రవాఙ్మయములో కవిజనాశ్రయము, పొత్తపి వేంకటరమణకవి లక్షణ శిరోమణి, తాతంభట్టు కవి చింతామణి, ఓరుగంటి రామయకవి కవితా లక్షణసారము లందు 'అధికారము' ప్రయుక్తము. ఒక్క మలయాళ ఛందో వాఙ్మయములో మాత్ర మున 'అధికార' విభాగము లేదు

### ప్రకరణము :

అధ్యాయ, అధికారము లను విడప 'ప్రకరణ' నామమునకు లక్షణగ్రంథము లలో ప్రచారమున్నట్లు చెప్పవచ్చును. తెలుగున సర్వలక్షణసారము, లక్షణ రాజీయము, సుకవి కర్ణామృతము, లక్షణ చంద్రిక, కవిసర్ప గారుడములలో 'ప్రకరణ'మను విభాగము కనిపించును.

మలయాళ ఛందో గ్రంథమగు వృత్తమంజరిలో భాషావృత్త ప్రకరణం, దండక ప్రకరణములను విభాగములున్నవి. ఒక్క తమిళ ఛందోగ్రంథములలో మాత్రము "ప్రకరణ" విభాగము లేదు.

### పరిచ్ఛేదము :

ఛందోగ్రంథములలో 'పరిచ్ఛేద'మను సంజ్ఞకు కూడ ప్రచారము కనిపించు చున్నది. సంస్కృతమున వృత్తజాతి సముచ్చయము, వాణీభూషణములను ఛందో గ్రంథములందు పరిచ్ఛేద శబ్దము ప్రయుక్తము.[5] ఆంధ్ర ఛందో గ్రంథములలో గౌరన లక్షణ దీపిక, ఉప్పలూరి వేంకటాద్రి సకలలక్షణసార సంగ్రహ చింతామణి మొదలగువానిలో 'పరిచ్ఛేద' సంజ్ఞ ప్రయుక్తము.

### ఆశ్వాసము :

'ఆశ్వాస'మను సంజ్ఞ కావ్య ప్రబంధాదులందే కనిపించును. కాని యాంధ్ర ఛందోగ్రంథములలో విభాగ పర్యాయవాచిగా 'ఆశ్వాస' సంజ్ఞ ప్రయుక్తము. ఛందో దర్పణము, లక్షణసార సంగ్రహము, అప్పకవీయము, ఛందోనిరంకుశము, లక్షణ శిరోమణి మున్నగునవి యుదాహరణములు.

## ఇతరములు :

సంస్కృతములో క్వాచిత్కముగా కనిపించు తరంగ, ఉల్లాస, ప్రకాశ విభాగములు తెలుగులో వరుసగా కవిజన సంజీవని, కావ్యాలంకార చూడామణి, లక్షణ దీపికలందు కనిపించును.

తమిళ ఛందోగ్రంథములందు "ఇయల్" విభాగ పర్యాయవాచి. తొల్కాప్పియమున 'అధికార'మను విభాగనామమున్నను 'చెయ్యుళియల్' అని పేరిడుట గమనింప దగినది. యాప్పరుంగలమను ప్రసిద్ధ ఛందోగ్రంథమున ఉరుప్పియల్ చెయ్యుళియల్, ఒళిపియల్ అను విభాగములున్నవి. వైద్యనాథదేశికర్ 'ఇళక్కణ విళక్కం'లో అగత్తిణైయియల్, పుఱత్తిణైయియల్, అణియియల్, చెయ్యుళియల్, పొట్టియల్ అను పేర్లు కానవచ్చును. ఆధునిక ప్రసిద్ధ ఛందోగ్రథ రచయిత శ్రీ పులవర్ కుళందై 'ఉరుప్పియల్, చెయ్యుళియల్' అని విభాగము గావించిరి.

పై పరిశీలన వలన 'అధికార'మను సంజ్ఞ తమిళ కన్నడాంధ్ర ఛందోగ్రంథములలో కానవచ్చుచున్నదని చెప్పవచ్చును. తమిళములో ఇయల్, తెలుగున ఆశ్వాసము, మలయాళములో ప్రకరణమను సంజ్ఞలకు ప్రచార మెక్కువ యని నిర్ధారింపవచ్చును

## ఛందోగ్రంథములు - సూత్రనిర్మాణవిధానము :

తమిళమునందుకంటె కన్నడాంధ్ర మలయాళములపై సంస్కృత ప్రభావ మెక్కువ. కనుక ఈ భాషలలోని ఛందో గ్రంథములపైకూడ సంస్కృత ప్రభావ ముండుట అనివార్యమైనది.

సంస్కృత ఛందోగ్రంథములను పరిశీలింప వానిలో నాలుగు పద్ధతులున్నట్లు తెలియుచున్నది

## 1. గద్యాత్మకసూత్రపద్ధతి :-

ఛందస్సునకు సంబంధించిన సూత్రములు గద్యరూపమున నుండుట ఈ పద్ధతియందు ప్రధానము. గురులఘువుల క్రమమునకు కొన్ని సంకేతములు కల్పింప

బడి గద్య రూపమున సూత్రరచన చేయుట యిందలి విశేషగుణము పింగళుని సూత్రము లీ కోవకు చెందినవి.

2. పద్యాత్మకసూత్రపద్ధతి :

ఛందస్సునకు సంబంధించిన సూత్రములు పద్యరూపములో నుండుట ఈ పద్ధతిలో ప్రధానమైనది. నిర్దిష్ట ఛందోలక్షణమును ఆ ఛందస్సునందే చెప్పుట యిందలి విశేషగుణము. యతిసంకేతము చేయవలసినచోట పెక్కు పర్యాయవాచక శబ్దములను వాడుట యొకపద్ధతి సంస్కృత ఛందోగ్రంథములలో అత్యంత ప్రచార మొందిన 'వృత్తరత్నాకరము' ఈ పద్ధతిలో వ్రాయబడినది.

3. లఘుగురునిర్దేశపద్ధతి :

ఒక ఛందస్సునందు నిర్దిష్టస్థానములందు లఘుగురువులు రావలయునని చెప్పుట, నాట్యశాస్త్రము, శ్రుతబోధములు ఈపద్ధతిలో వ్రాయబడిన ఛందోగ్రంథములు.

4. మాత్రాక్షరఛందములకేక పద్ధతి :

వర్ణచ్ఛందములకు, మాత్రాగణ ప్రధానములగు ఛందస్సులకు నొకేపద్ధతిని పాటించుట ప్రాకృతపైంగళము, వృత్తజాతి సముచ్చయము లీ వర్గమున చేరినవి

డా॥ జగదీశ్‌గుప్తాగారు 'ప్రాకృతపైంగలమ్' పీఠికలో సంస్కృతమందలి ఛందశ్శాస్త్రరచనా విధానములను సూత్రశైలి – శ్లోకశైలి – ఏకనిష్ఠశైలి– విచిత్రశైలి అని విభజించిరి.

తమిళ ఛందోగ్రంథములందు గద్యాత్మక, పద్యాత్మక సూత్రపద్ధతులు రెండును గలవు కాని సూత్రశైలికి తమిళమున విశేష ప్రాధాన్యమొసగబడినదని చెప్పవచ్చును. తొల్కాప్పియ సూత్రములనుగూర్చి డా॥ ఎ. సి. చెట్టియార్

"The rules of Tholkappiyar are in a peculiar form known as Nur cheyyul which is neither verse nor prose. we have got to rely sometimes on the commentators"[6]

తమిళలాక్షణికులు పద్యలక్షణముల చెప్పుటకు నూర్పా, కలిత్తురై ఛందస్సులను స్వీకరించిరి. యాప్పరుంగలమ్, పన్నిరుపాట్టియల్, ఇళక్కణవిళక్కం

మొదలగు లక్షణ గ్రంథములు 'నూర్పా' ఛందస్సులో వ్రాయబడినవి. తరువాతి కాలమున 'కలిత్తురై' ఛందస్సులోనే లక్షణము చెప్పుట కన్నడాంధ్ర ఛందోగ్రంథములందు నిట్టిపద్ధతి లేదు.

కన్నడాంధ్రములందు 'పద్యాత్మక సూత్రపద్ధతికి' ప్రచారమెక్కువ. కాని యొకటిరెండు అపవాదములు లేకపోలేదు. నండిఛందోర్ణవకారుడు సీసపద్యమున ఉత్పలాదుల లక్షణము లీరీతి చెప్పుట యిట్టిదే. (3–16)

కన్నడాంధ్రములందు లాక్షణికులు పద్యలక్షణములను 1. 2, 4 పాదములందు చెప్పియున్నారు.

గుణచంద్రుడు ఛందస్సారమున దోధకలక్షణమును
"దోధక వృత్తవు భం భ భ గం గం" అని ఏక పాదమున పేర్కొనెను.

దీనినే నంది ఛందోర్ణవకారుడు

ఇందు గణ త్రయ మీశ్వర యుగ్మం
బందిరె శాస్త్రుది భద్ర విరామం
ఇందు ముఖీ నల వెందరి నీ కే
ళిందద దోధక వెంబ సువృత్తమ్' 2, 3, 1

అని నాలుగు పాదములందు లక్షణము చెప్పెను. ఇట్లే ఆంధ్ర లాక్షణికుడగు చిత్రకవి పెద్దన ఏకపాదమునందు, అప్పకవి నాలుగు పాదములందును లక్షణములు చెప్పిరి. దేశిచ్ఛందస్సులను విశదీకరించునపుడు చాలవఱకు కన్నడాంధ్ర లాక్షణికులాయా ఛందములందే లక్షణములు చెప్పిరి.

కన్నడాంధ్ర మలయాళ ఛందోగ్రంథ నిర్మాణములో సంస్కృత ప్రభావమెక్కువగా కనిపించును. సంస్కృత వాఙ్మయములో పెక్కు ఛందోగ్రంథములున్నను పింగళచ్ఛందము, వృత్తరత్నాకరముల ప్రభావము దాక్షిణాత్య ఛందోగ్రంథములపై స్పష్టముగా గోచరించుచున్నది. పద్యలక్షణములను పేర్కొనునప్పుడు కన్నడాంధ్ర మలయాళ లాక్షణికులు పింగళుని పద్ధతిని అనుసరించుట గమనింపదగినది. తమిళ వ్యాకర్త బుద్ధమిత్రుడు 'వీరచోళీయమున' పింగళ పద్ధతి ననుసరించి పద్యలక్షణములను పేర్కొనెను.

ఛందోగ్రంథముల సామ్యము :-

కన్నడఛందోగ్రంథములలో బహుళ ప్రచారమొందినది నాగవర్మ ఛందోంబుధి తెలుగునగల ఛందోగ్రంథములలో ప్రాచీనముగా తలంపబడు ఛందోగ్రంథము కవిజనాశ్రయము. ఈ రెండింటికి నిర్మాణములో పోలికలు కనిపించుచున్నవి.

ఛందోంబుధి రచనాప్రణాళిక :-

ప్రథమాధికరణము – సంజ్ఞా ప్రకరణము
ద్వితీయాధికారము – సమవృత్త ప్రకరణము
తృతీయాధికారము – మాలా – అర్ధసమవిషమాది వృత్తప్రకరణము
చతుర్థాధికారము – కంద ఆర్యాది మాత్రాగణవృత్తప్రకరణము
పంచమాధిరము – – కర్ణాటవిషయజాతి ప్రకరణము
షష్ఠాధికారము – షట్ప్రత్యయాది వివరణ ప్రకరణము

కవిజనాశ్రయ రచనాప్రణాళిక :-

ప్రథమ – సంజ్ఞాధికారము
ద్వితీయ – వియతిచ్ఛందోధికారము (సమవృత్తములు)
తృతీయ – యతిచ్ఛందోధికారము (సమవృత్తములు)
చతుర్థ – ఉద్ధురమాలావృత్తాధికారము
పంచమ – అర్ధసమవృత్తాధికారము
షష్ఠ – విషమవృత్తాధికారము
సప్తమ – జాత్యాధికారము
అష్టమ – షట్ప్రత్యయాధికారము
నవమ – దోషాధికారము

పై విభాగమునందు ద్వితీయ తృతీయ చతుర్థ పంచమ షష్ఠపరిచ్ఛేదములు సంస్కృతఛందస్సులను పేర్కొనునవి. కనుక ప్రధానముగా నాలుగు విభాగములే ఛందోంబుధియందు లేనివి ఉపజాతులు, దోషాధికారములు. కన్నడమున అన్ని పద్యములకు ప్రాసనియత మగుటవలన ఉపజాతులు లేవు. దోషాధికారము ఛందోంబుధిలో లేదు. కవిజనాశ్రయమున నున్నది.

కన్నడములో ప్రసిద్ధమగు మఱియొక ఛందోగ్రంథము అభినవ కేశిరాజ ఈశ్వరకవి కవిజిహ్వా బంధనము. ఈ ఛందో గ్రంథమునకు కవిజనాశ్రయము నకు పెక్కు పోలికలు కనిపించుచున్నవి. కవిజనాశ్రయకర్త సంజ్ఞాధికారమున పేర్కొనిన స్వరవళ్లు, వర్గవళ్ళు సరసవళ్ళు, ఎక్కటివళ్ళు అనువానిని ఈశ్వరకవి కవిజిహ్వాబంధనమున కన్నడమున కన్వయించి చెప్పినాడు.

తెలుగు ఛందో గంథముల ననుసరించి వ్రాయబడిన మరియొక కన్నడఛందో గ్రంథము వీరభద్రుని నంది ఛందోర్ణవము. కన్నడమునందు అంశగణములను బ్రహ్మ, విష్ణు, రుద్ర గణములని ప్రాచీన లాక్షణికులు వర్గీకరించగా నంది ఛందోర్ణవ కారుడు సూర్య - ఇంద్ర, చంద్రగణములను ఆంధ్ర లాక్షణికుల విభాగమును స్వీకరించెను. కన్నడములో ప్రచురములోగాని ఆటవెలది, తేటగీతి - సీసములను తెలుగు లక్షణముల ననుసరించి విస్తరించుట ఛందోర్ణవము యొక్క ప్రత్యేకత యగును. ఈశ్వరకవివలె నితడును విశిభేదములను పేర్కొని యున్నాడు. ఆంధ్ర ఛందోగ్రంథములందలి పెక్కు పద్యము లించుక మార్పునొంది నంది ఛందోర్ణవ ములో కనిపించును. వానిలో కొన్నటిని మాత్రము పరిశీలింతము.

విశ్రాంతి, విరతి, విశ్రమ
విశ్రామ విరామ విరమ విరమణలనఁగా
విశ్రుతమగు యతికృతికధి
కశ్రావ్యంబై బెడంగు గానిడ వలయున్ - కవిజనాశ్రయము సంజ్ఞాధికారము.

విశ్రామ విరతి విశ్రమ
విశ్రాంతి విరామ విరమ విరమణ వడియుం
సశ్రీకర యతి నామగ
శ్రాంతది కేళ్వ దీగ లబ్జదలాక్షి - ఛందోర్ణవ 1-56

పరమోపకార ధరణీ
సురవరసుర భూజ సుగుణసుందర తరుణీ
స్మరనిభ సుకర ప్రాసం
బనుదుగఁ గృతులందు నొప్పు నభినుతచరితా - కవిజనాశ్రయ సంజ్ఞాధికారము.

దురితాపహార ధరణీ
శరణాళి సమేత దాత సంతత కరుణీ
సురుచిర సుకర ప్రాసమి
దరిదెనె సత్కృతిగళల్లి యభినవ చరితే - ఛందోర్ణవ 1-67

ఇనగణత్రయంబు నింద్రద్వయంబును
హంసపంచకంబు నాటవెలది
సూర్యుడొక్కరుండు సురరాజులిద్దఱు
దినకరద్వయంబు తేటగీతి - సులక్షణసారము - ప 23

సూర్య నొర్వ మెలె సురరాజ రిర్వరు
దినకరద్వయ మిరల్ తేటగీతి
ఇనగణ త్రయగళు యింద్రద్వయంగళు
హంస పంచ కంగ ళాట వెలది - ఛందోర్ణవము 3-17

పై పరిశీలనమువలన ఛందోగ్రంథ నిర్మాణమున తెలుగుపై కన్నడప్రభావము, కన్నడముపై తెలుగు ప్రభావమున్నట్లు నిర్ణయింపవచ్చును.

## స్వతంత్ర ఛందశ్శాఖలు :

సాంఘిక పరిస్థితులు, కవి ప్రతిభావ్యుత్పత్తుల ననుసరించి ప్రతిభాష యందును స్వతంత్ర శాఖ లేర్పడుచుండును. అట్టివానికి లక్షణములు కల్పించుట లాక్షణికుల విధి.

సంస్కృత వాఙ్మయములో వెలువడిన యమకరత్నాకరము, బంధకౌముది, సువృత్త తిలకములు ఛందశ్శాస్త్రమున వెలువడిన సంతంత్ర శాఖలు. వీనిలో బంధ కౌముది చిత్రకవితా విశేషములను పేర్కొనుచున్నది. సువృత్త తిలకము వృత్తౌ చిత్యమును ప్రధానముగా తర్కించుచున్నది.

తమిళ వాఙ్మయములో వెలువడిన వనప్పిలక్కియం, తొడైయధికారం, మండిల యాప్పు, పాట్టియల్ మొదలగునవి ఛందశ్శాస్త్రమున వెలువడిన స్వతంత్రశాఖలు.

వనప్పలక్కియం, మండిలయాప్పు అనునవి ఛందస్సుకు సంబంధించిన గ్రంథములనుటకంటె అలంకారములకు సంబంధించిన గ్రంథములనుట లెస్స. 'తొల్కాప్పియదికారం' అక్షరమైత్రికి సంబంధించినది. యతి ప్రాస విశేషములన్నియు ఈ విభాగమునందే చేరును. ఇక మిగిలిన 'పాట్టియల్' అనునది ప్రధానముగా పొందికలను గూర్చి చర్చించు ఛందశ్శాఖ.

తమిళ వాఙ్మయములోగల 'పాట్టియల్' గ్రంథములలో పన్నిరు పాట్టియల్ (11 వ శతాబ్దము) వెణ్బాపాట్టియల్ (12 వ శతాబ్దము) నవనీత పాట్టియల్ (14 వ శతాబ్దము) చిదంబర పాట్టియల్ (16 వ శతాబ్దము) మొదలగునవి ప్రసిద్ధములు వీనియందు సాధారణముగా వర్ణముల జాతులు, నక్షత్రములు, అధిదైవతములు, గణకూటమి గణగణదోష విచారము. కావ్యాది నిలుపదగిన శుభవర్ణములు, కృతికర్తకు కావ్యనామములకు సంబంధించిన పొందిక విశేషములు కలవు.

కన్నడ వాఙ్మయములో 'పాట్టియల్' పోలినది లేవు. కాని ఛందోగ్రంథములందు 'పాట్టియల్' అంశములు చర్చింపబడినవి. కవిజిహ్వాబంధన, నంది ఛందోర్ణవములందు గణముల శుభాశుభ ఫలితములు, గణాధిదైవతములు, వర్ణ్యాక్షరనియమములు చర్చింపబడినవి.

ఆంధ్రవాఙ్మయములో 'పాట్టియల్' పోలినవి కలవు. కవిజనాశ్రయమునందు గణాధిదేవతలు, గణఫలములు, గణవర్ణములు, గణగోత్రములు, అక్షరగుణదోషములకు సంబంధించిన పద్యములున్నవి. కాని విమర్శకులు ఈ పద్యములను ప్రక్షిప్తములుగా భావించుచున్నారు. చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహము, అప్పకవీయములందు నితర ఛందోవిషయములతో పాటు వీనికి సమాన స్థానమొసగబడినవి. కవిగజాంకుశము, కవిసర్పగారుడము, కవివాగ్బంధనము లీ విభాగములకే ప్రాధాన్యమొసగినవి. సంఘమువ నాటుకొనిన జ్యోతిశ్శాస్త్ర విశ్వాసమే యిందులకు ప్రధాన కారణము కావచ్చును

డా॥ ఎ సి. చెట్టియార్ తమిళములోని పాట్టియల్ సాహిత్యం గురించి

**Augury is apocryphal, having no bearing on actual facts in ancient Tamil Language and Literature** - అని తమ అభిప్రాయమును ప్రకటించిరి.[7]

పై పరిశీలనమువలన తమిళ కన్నడాంధ్రములందు 'పాట్టియల్' గ్రంథములు కలవని నిర్ణయింపవచ్చును. ఈ పాట్టియల్ శాఖ విస్తరిల్లుటకు సాంఘిక పరిస్థితులే కారణము.

ఈ ప్రకరణమునందు తమిళ కన్నడాంధ్ర మలయాళ ఛందోగ్రంథ వికాసములను పరిశీలించితిమి. వ్యాకరణాలంకార గ్రంథములందు ఛందోంశములను చెప్పుట ఈ భాషలన్నిటిలో సమానము. స్త్రీ నుద్దేశించి ఛందోగ్రంథ రచన గావించుట తమిళ కన్నడాంధ్ర మలయాళ భాషలలోగల సామాన్య లక్షణము. కన్నడాంధ్ర మలయాళ ఛందో గ్రంథ నిర్మాణములో సంస్కృత ప్రభావ మెక్కువగా కనిపించును. తమిళములో 'పాట్టియల్' శాఖ ఏర్పడుటకు సంస్కృత ప్రభావమే కారణము. యాప్పరుంగలమ్, వీరచోళియములందు సంస్కృత ఛందోంశములను భంగ్యంతరముగా చెప్పబడినవి. రచనా విధానమునందు నాగవర్మ ఛందోంబుధి రేచన కవిజనాశ్రయముల మధ్య సామ్యము లెక్కువ కనిపించుచున్నవి. అట్లే పెక్కు తెలుగు ఛందోగ్రంథములను పరిశీలించి కన్నడ లాక్షణికులయిన ఈశ్వర కవి కవిజహ్వాబంధనమును, వీరభద్రుడు నంది ఛందోర్ణవమును రచించినట్లు తెలియు చున్నది

## సంఖ్యాసూచి :

1. Forword to Malayalam Literature.
2. ప్రకీర్ణక పరిచ్ఛేదము 23-24 సూత్రములు
3. మఱైన్దు పోన తమిళ్ నూల్గళ్
4. వృత్తమౌక్తికమ్ - అష్టమపరిశిష్ట - పుట 522 - 534
5. వృత్తమౌక్తికమ్ - అష్టమపరిశిష్ట - పుట 12 - 19
6. Advanced prosody of Tamil Language - P 26
7. P 36

# 4. ఛందోంగములు

సంస్కృత వాఙ్మయములో ఛందోంగములను నిర్దిష్టముగా పేర్కొని విశదీకరించిన వారిలో భరతుడు ప్రథముడు. అతడు సంపత్తు, విరామము, పాదము, దేవత, స్థానము, అక్షరము, వర్ణము, స్వరము- విధి, వృత్తములను పదింటిని ఛందోంగములుగా నిరూపించెను.

సంపత్తు అనగా అక్షర సమృద్ధి. విరామమనగా అర్థసమాప్తి స్థానము. పాదమనగా పద్య చతుర్థ భాగము. దేవత యనగా ఆయా ఛందస్సులకు ఆధిపత్యము వహించు అగ్న్యాదులు. స్థానమనగా వృత్తౌచిత్యము. అక్షరము అనగా హ్రస్వ దీర్ఘ ప్లుతాదులు. వర్ణము అనగా శ్వేతాదులు. స్వరము అనగా తారమంద్ర మధ్య భేదములు. విధి అనగా ఛందములందలి అక్షరముల కూర్పు. నానార్థ సంయుక్తము, వివిధ వర్ణ భూషితము, నిబద్ధము, యతి విచ్ఛేదసమన్వితము, చతుష్పాద యుక్తమగు ఛందస్సు వృత్తమగును. పై ఛందోంగము లన్నియు రసాద్యర్థ నిర్వహణమునందు కవికి సహకరించునని భరతుని అభిప్రాయము.

తొలి తమిళ వ్యాకరణ మగు తొల్కాప్పియమ్‌లో 34 ఛందోంగములు చెప్పబడినవి.[2] వీనిలో మాత్తిరై ఎళుత్తు మొదలగునవి ఛందస్సునకు సంబంధించినవికాగా ఎచ్చం మొదలగునవి కావ్యాంగములకు సంబంధించినవి. అవి మాత్తిరై (Unit of Time) ఎళుత్తు (The nature of letter) అసై (The kind of syllable) శీర్ (Binding foot) అడి (Line) యాప్పు (Connection) మరబు (Technique) తూక్కు (Note) తొడై (Rhyme) నోక్కు (Grace పా (Tune) అళవు (Limit) తిణై (Genus) కైకోళ్ (Idealism) కూఱువర్ (Kind of Speech) కేట్పోర్ (Auditor) కళన్ (place) కాలం (Division of Time) పయన్ (Effect) మెయ్‌ప్పాడు (Expression) ఎచ్చం (What is left to be under stood) ముణ్ణమ్ (Intention) పొరుళ్ (Subject) తుఱై (Theme) మాట్టు (Interline) వణ్ణమ్ (Melody) అను ఛందోంగములు. కాని తరువాతి లాక్షణికులు పద్య లక్షణములను దృష్టిలో పెట్టుకొని ఎళుత్తు, అసై, శీర్, తళై, అడి, తొడై అను ఆరింటిని మాత్రం ఛందోంగములుగా గ్రహించిరి.

ఎళుత్తు అనగా అక్షరము. అసై అనగా ఛందోక్షరము శీర్ అనగా గణము. తళై అనగా గణ బంధము. అడి అనగా పాదము. తొడై అనగా అక్షరమైత్రి. ఈ ఆరును తమిళ ఛందోంగము లగును.

కన్నడ లాక్షణికులు ఛందోగ్రంథములందు ఛందోంగములని ప్రత్యేకముగా పేర్కొనలేదు. నాగవర్మ ఛందోంబుధి యందు గురులఘువులు, అక్షరగణములు, యతిస్వరూపము – బ్రహ్మ విష్ణు రుద్రగణములు – సంస్కృత వృత్తములు –కర్ణాట జాతులను పేర్కొనెను. కవి జిహ్వా బంధనకారుడు గురులఘువులు అక్షర గణములు, దేవతా నక్షత్ర వివేకము – వళిప్రాసభేదములను చర్చించెను. గుణచంద్రుడు ఛందస్సారములో గురులఘువులు, అక్షర గణములు గణదేవతలు – వృత్తములు – జాతులను గూర్చి విశదీకరించెను. పై పరిశీలనము వలన కన్నడ లాక్షణికులు అక్షరము – గణము – పాదము వృత్తము – జాతులు – యతిప్రాసలను ప్రధాన ఛందోంగములుగా గ్రహించినట్లు చెప్పవచ్చును.

ఆంధ్ర లాక్షణికులెవరును భరతునివలె ఛందోంగముల నిష్కర్ష చేసినట్లగపడదు. కవిజనాశ్రయములో గురులఘు వివేకము – గణస్వరూపము – వళ్ళు – ప్రాసళ్ళు – వృత్తములు – జాతులు పేర్కొనబడినవి. కావ్యాలంకార చూడామణి కారుడు. ఛందము యతి గమక సమక గణ వృత్తకృతానందముగా (7–6) భావించెను. ఛందోదర్పణములో గురులఘు నిర్ణయము, గణాష్టక లక్షణము, ఇంద్ర చంద్రాది గణ విభేదములు, గణాధి దైవతములు యతిప్రాసలు, వృత్తములు, జాతుల విశదీకరణ కలదు. ప్రసిద్ధ ఛందోగ్రంథమగు అప్పకవీయములో తొలుత వర్ణాధి దైవతములు మాతృకార్చనవిధానము, సారస్వతౌషధంబులు చర్చింపబడినవి. తృతీయాశ్వాసమున యతిప్రాసభేదములు, చతుర్థాశ్వాసములో నైసర్గిక గణములు, ఉపగణములు, స్వభావ గణములు, వృత్తములు జాతులు సవిస్తరముగ పేర్కొనబడినవి. పై పరిశీలనము వలన ఆంధ్రలాక్షణికులు గురులఘువులు, గణములు, యతిప్రాసలు, వృత్తములు, జాతులను విభాగములకు ప్రాధాన్యమిచ్చినట్లు చెప్పవచ్చును.

తమిళ ఛందస్సంప్రదాయములను యథాతథముగా గ్రహించిన మలయాళ లాక్షణికులు ఛందోంగములను పేర్కొనలేదు. కాని మలయాళ ఛందోగ్రంథముల

రచనాప్రణాళిక ననుసరించి మాత్రా - వర్ణమ్ - అసై - గణమ్ - అడి - తొడై వృత్తముల మలయాళ ఛందోంగములుగా గ్రహింపవచ్చును.

తమిళ కన్నడాంధ్రమలయాళ లక్షణగ్రంథముల ననుసరించి మాత్ర, లఘు గురువులు, గణము, పాదము, యతిప్రాసలను ద్రావిడ ఛందోంగములుగా నిర్ణయింప వచ్చును. వీని స్వరూపమును తులనాత్మకముగా పరిశీలింతము.

## 4. 1. మాత్రానియమము :

సంస్కృతాంధ్ర కన్నడ మలయాళములందు 'మాత్ర' అనియు తమిళములో 'మాత్తిరై' అనియు లాక్షణికులు పేర్కొనిరి. మాత్ర యనగా మానసాధనము. కాలమానసాధనమనుట. 'నిమేషోన్మేషాభ్యాం అన్యతరేణ తులితఃకాలఃమాత్రా' అను నియమము. యాజ్ఞవల్క్యశిక్షయందు హ్రస్వ, దీర్ఘ ప్లుతాక్షరముల నియమములు కలవు.

ఏక మాత్రో భవే ద్ధ్రస్వః
ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే
త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయః
వ్యంజనం త్వర్ధ మాత్రకమ్

—యాజ్ఞవల్క్య శిక్ష : 13

హ్రస్వమేక మాత్రికము, దీర్ఘము ద్విమాత్రికము. ప్లుతము త్రిమాత్రికము. వ్యంజన మర్ధమాత్రికము. అక్షర ఛందములందు వీనికేమియు ప్రయోజనము లేదు. ఇవి మాత్రాచ్ఛందములకు మాత్రము పరిమితము.

తమిళ ఛందో గ్రంథములందు ప్రతిపాదింపబడిన మొదటి ఛందోంగము 'మాత్తిరై' తొల్కాప్పియము ఎళుత్తదికారములో స్వరములు, వ్యంజనములు, హల్లులు ఆయ్దమ్ మొదలగు 247 అక్షర విభేదములు చెప్పబడినవి. తమిళ ఛందస్సూత్రముల ననుసరించి "అ ఇ ఉ ఎ ఒ" లు ఏకమాత్రికములు. ఐ ఔలు ద్విమాత్రికములు. కాని కొన్ని సందర్భములందు తమిళములో నివి హ్రస్వమొంది ఏక మాత్రికము లగుచున్నవి. ఇది సంస్కృత నియమములకు విరుద్ధము నందికేశ్వరుడు

రుద్రడమరూద్భవ సూత్రములు అను గ్రంథములో మహేశ్వర సూత్రములను గురించి వ్రాసిన యంశములను డా॥ కె జి. పాండేగారు ఇట్లు సంగ్రహించిరి.

అ ఇ ఉ - ఏక మాత్రాకములు
ఏ ఓ - ద్విమాత్రకములు
ఐ ఔ - త్రిమాత్రకములు

—In ian Aesthetics - p 528.

పై వివరణమనుసరించి చూడగా 'ఐఔ'లు ద్విమాత్రికములనుట పొసగదు. ఇట్లే అర్థమాత్రికములగు వ్యంజనములు తమిళములో ఏకమాత్రికములగుట ప్రస్తారమున కనిపించును. 'ఉయిరళపెడై' లకు మూడుమాత్రలు కాలము. పద్యమును పాడునపుడు కొన్ని అక్షరములను సాగదీసి పాడుచుందుము. అప్పుడందలి స్వరములు దీర్ఘములగుట సంభవించును. అట్టి అక్షరములందు దీర్ఘ స్వరము హ్రస్వస్వరములు రెండును వినిపించును. అట్టివానినే లాక్షణికులు ఉయిరళపెడై అని పేర్కొనిరి. ఇవిగాక ఆయ్దమ్ (ఎఃంగు) హ్రస్వఇకారము, హ్రస్వఉకారములు అర్ధమాత్రికములని మరికొన్నిటిని తమిళ లాక్షణికులు వింగడించిరి. ఇట్టివి కన్నడాంధ్రములలో కానరావు

కన్నడ ఛందోగ్రంథములలో 'మాత్ర'లను గూర్చి ప్రత్యేకముగా నెచటను వివరణ కాని నాగవర్మ ఛందోంబుధిలోని చతుర్థాధికారమును మాత్రాగణవృత్తప్రకరణ మని వ్యవహరించియున్నాడు. అయినను అందు మాత్రాస్వరూపమును విశదీకరింప లేదు. త్రిపదీలక్షణ నిర్వచనమున 'మాత్రాపిండం' (6-9) అని మాత్రము పేర్కొని యున్నాడు. గుణచంద్రుడు ద్వితీయాధ్యాయమును 'మాత్రాఛందః ప్రకరణ'మని పేర్కొనెనుగాని మాత్రాస్వరూపమును వివరింపలేదు. 'అను క్తమన్యతో గ్రాహ్యమ్' అను న్యాయమనుసరించి నాగవర్మ గుణచంద్రులు తమ ఛందోగ్రంథములలో మాత్రాస్వరూపమును వదలి యుండవచ్చును. లేదా వైదిక ఛందస్సునందలి స్వర ప్రాముఖ్యము కన్నడమున లేకపోవుటవలన ఈ లాక్షణికులు వానిని పరిత్యజించి యుండవచ్చును.

ఆంధ్ర ఛందోగ్రంథములలో మాత్రలనుగూర్చిన వివరణ తనుమాత్రము కనిపించుచున్నది.

కవిజనాశ్రయము :

కమనీయ వృత్తములు గణ
సమక నిబద్ధములు శేషజాతులు మాత్రా
సమక నిబద్ధమ్ములు నొ
క్క మాత్ర లఘువె ద్విమాత్రకము గురువయ్యెన్ 1-15

సులక్షణసారము :

మాత్రయన నొక్క లఘువగు
మాత్రలు రెండైన గురువు మఱియెన్నబడున్
ధాత్రిని నఱువది నాలుగు
మాత్రలుగా గంధమునకు మాత్రలు వెలసెన్ - (సంజ్ఞా ప్రకరణము)

మలయాళ ఛందోగ్రంథములందు మాత్రల గూర్చిన వివరణము సవిస్తరము సంస్కృత ఛందోగ్రంథములందు చెప్పబడిన మాత్రాలక్షణములు యథాతథముగ మలయాళమున స్వీకరింపబడినవి. కాని యొకటి రెండు అపవాదములు లేకపోలేదు. హ్రస్వమునకు నొక మాత్ర. దీర్ఘమునకు రెండు మాత్రలనుట సామాన్య నియమము. కాని దీర్ఘముండవలసిన చోట రెండు హ్రస్వములును, రెండు హ్రస్వములుండవలసిన చోట నొక దీర్ఘము నిలుపుటను మలయాళ లాక్షణికులు సమ్మతించిరి. పాదము లందు మాత్రల సంఖ్య తక్కువ యయినచో నందలి అక్షరములను సాగదీసి సమా నము చేయుట మలయాళ లాక్షణికులకు సమ్మతమే. గేయ ధర్మములకు ప్రాధాన్య మొసగుట వలన పై నియమము లేర్పడి యుండవచ్చునని యూహింపవలసియున్నది. సంస్కృత మాత్రాపద్ధతి, సంగీతశాస్త్రమున కనువగు మాత్రాపద్ధతియు మలయాళ మున గలవని సారాంశము.

## 4. 2. లఘుగురునియమము :

ఛందోంగములందు ప్రాధాన్యము వహించిన రెండవ అంశము లఘుగురు నియమములకు సంబంధించినది. కన్నడాంధ్ర మలయాళలాక్షణికులు సంస్కృత మునగల లఘుగురు సంజ్ఞలను యథాతథముగా తమ ఛందోగ్రంథములందు స్వీకరించిరి. కాని తమిళమునందు ఈ సంజ్ఞలు కానరావు.

పాణిని 'హ్రస్వంలఘు (1-4-10) సంయోగేగురు- (1-4-11) దీర్ఘంచ'- (1-4-12) అను సూత్రములలో హ్రస్వదీర్ఘాక్షరములను లఘుగురు సంజ్ఞలతో విశదీకరించెను. సంస్కృత ఛందోగ్రంథములందు గురులఘుచర్చ విస్తృతము సంస్కృత లాక్షణికులు నిబంధించిన గురుత్వ హేతువులను ఈ విధముగా వర్గీకరింపవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1. | సంయోగపరత్వము | 2. | విసర్జనీయాంతత్వము |
| 3. | ఉపధ్మానీయాంతత్వము | 4. | జిహ్వామూలీయాంతత్వము |
| 5. | అనుస్వారాంతత్వము | 6. | ఊష్మాంతత్వము |
| 7. | వ్యంజనాంతత్వము | 8. | పాదాంతస్థత్వము |
| | దీర్ఘత్వము | 10. | ప్లుతత్వము |

తమిళములో లఘుగురువులను సంజ్ఞలులేవు. వాని స్థానమున నేర్, నిరై వంటివి కలవు. కుఱిల్ అనగా హ్రస్వాక్షరము నెడిల్ అనగా దీర్ఘాక్షరము. వీని చేరికవలన 'అసై' (ఛందోక్షరము) ఏర్పడును. 'నేర్ అసై' స్వరూపము ఇట్లుండును.

ఒక హ్రస్వము క
ఒక దీర్ఘము కా
ఒక హ్రస్వము + వ్యంజనము కన్
ఒక దీర్ఘము + వ్యంజనము కాన్

పైవానిలో మొదటిది మాత్రము సంస్కృత పద్ధతి ననుసరించి లఘువు మిగిలినవి గురువులగును. 'నిరై అసై' స్వరూపము ఇట్లుండును.

హ్రస్వము + హ్రస్వము కక
హ్రస్వము + దీర్ఘము కకా
హ్రస్వము + దీర్ఘము + వ్యంజనము కకాన్
హ్రస్వము + హ్రస్వము + వ్యంజనము కకన్

పైవానిలో మొదటిది రెండు లఘువుల చేరిక కలది. మిగిలిన మూడింటిలో ప్రథమాక్షరములు మాత్రము లఘువులు. తమిళమునగల 95 హ్రస్వాక్షరములు, 133 దీర్ఘాక్షరములు 19 వ్యంజనములు - 247 అక్షరములు పై వర్గీకరణములో అంతర్భవించును.

కన్నడములోగల లఘు గురు నిర్ణయము స్వతంత్రము కాదు. సంస్కృత ఛందస్సంప్రదాయము ననుసరించినదే. నాగవర్మ ఛందోంబుధి యందు బిందువిసర్గలతో చేరిన వ్యంజనము, ఒత్తక్షరములకు పూర్వాక్షరములు, పద్యముల పూర్వార్ధ ఉత్తరార్ధముల అంత్యాక్షరములు గురువులని (1-11) విశదీకరించెను. గుణచంద్రుడు ఛందస్సారమున లఘు గురు నియమములను

'సానుస్వారం దీర్ఘం
న్నుణ సంయోగదాదియుం సవిసర్గం
సన్నుత లఘు పాదాంత్య దొ
శన్నిజ గురువర్ణమక్కు మితరం లఘువుం (1-3) అని వివరించెను.

పాదాంతమున గల అక్షరములు లఘువులైనను వానిని గురువులుగా తలంపవలయునని గుణచంద్రుని అభిప్రాయము. కన్నడిగులకు పరమ ప్రమాణమగు కన్నడ కైపిడి (కర్ణాటక ఛందస్సు 71 - 72) యందు లఘుగురు చర్చ కలదు.

హ్రస్వాక్షరములు లఘువులు,
దీర్ఘాక్షర, ప్లుతస్వర, అనుస్వార విసర్గలతో కూడినవి,
సంయుక్తాక్షరములకు పూర్వమందుగల అక్షరములు

వ్యాకరణములో చెప్పబడిన శిథిలవర్ణసంయోగము గలవానికి ముందుగల అక్షరములు గురువులు.

ఆంధ్ర ఛందోగ్రంథములందుగల గురులఘుచర్చాలవలకు సంస్కృతమును పోలినదే. ఆంధ్రశబ్దచింతామణిలో దేశ్యపదస్వరూప మనుసరించి గురులఘువిభాగము

'దీర్ఘస్సంయుక్తాద్యః
పూర్ణానుస్వార పూర్వవర్ణశ్చ
ఏతే గురవశ్శేషాః
సర్వేలఘ్వక్షరా ఇతి జ్ఞేయాః'
సూత్రములలో ప్రసక్తము. కవిజనాశ్రయకర్త సంజ్ఞాధికారమున
గురువులు నిడుపలు జడ్డ
క్కరములు బొట్టులు పిఱుందకడనూదిన య
క్కరములు పెఱయవి లఘువులు' అని నిర్దేశించెను.

సంస్కృత నియమములనుసరించి పాదాంత లఘువు గురువగును. కన్నడ లాక్షణికులు కూడ ఈ నియమమును ఆమోదించినవారే. కాని ఆంధ్రలాక్షణికు లెవరును పాదాంతలఘువును గురువుగా చెప్పలేదు. అట్టి ప్రయోగములును గానరావు. ఇది తెలుగుభాషలో నొక ప్రత్యేక లక్షణమగును. ఇట్లే లఘ్వంతమైన తెలుగు పదమునకు సంయుక్తాక్షర మాదిగా గల సంస్కృత పదము పరమయినప్పుడు గురుత్వము (తెలుగు పదమునగల చివరి లఘువునకు) సంభవింపదు. ఇదియు నాంధ్ర భాష యొక్క ప్రత్యేక లక్షణము.

శ్రీ టి. రాజగోపాలరావుగారు 'ప్రాచీనాంధ్ర కవిత్వ లక్షణమను' వ్యాసములో[3] గురులఘు సంకేతములు తెలుగు భాషకు సరిపోవనచు 'గో-ధనములను' నూత్న పరిభాషలను కల్పించిరి. 'గో-ధనముల' స్వరూపము ఈ క్రింది విధముగా నుండును.

| | | |
|---|---|---|
| గోవు | దీర్ఘము | ㅇ |
| | దీర్ఘము + అర్ధమాత్ర | ㅇ |
| | హ్రస్వము | । |
| | హ్రస్వము + అర్ధమాత్ర | ㅇ |
| ధనము | హ్రస్వము + హ్రస్వము | ।। |
| | హ్రస్వము + హ్రస్వము + అర్ధమాత్ర | ।ㅇ |
| | హ్రస్వము + దీర్ఘము | ।ㅇ |
| | హ్రస్వము + దీర్ఘము + అర్ధమాత్ర | ।ㅇ |

శ్రీ రాజగోపాలరావు పేర్కొనిన 'గోవు ధనములు' తమిళ లాక్షణికులు పేర్కొనిన 'నేర్ - నిరై'ల వంటివి.

మలయాళ ఛందోగ్రంథములందు చెప్పబడిన లఘుగురు నియమము సంస్కృత పద్ధతిని పోలినదే

పై పరిశీలనము వలన సంస్కృత ఛందస్సంప్రదాయము కన్న డాంధ్ర మలయాళము లందు పాటింపబడినదని చెప్పవచ్చును. తమిళమునందు మాత్రము సంస్కృత నిరపేక్షమగు విధానమున్నట్లు తెలియుచున్నది. సంస్కృత ఛందో రీతులను యథాతథముగా గ్రహించుటవలన కన్నడాంధ్ర మలయాళ లాక్షణికులు

ఆ భాషా నియమములను పాటింపవలసినవారైరి. తమిళ లాక్షణికులు సంస్కృత ఛందోరీతులను గ్రహింపకుండుట వలన దేశీయ విధానమునకు ప్రాముఖ్యమొసగిరని స్పష్టము.

## 4. 2. 1 లఘుగురు సంజ్ఞలు :

పింగళుడు గురులఘువులకు నిర్దిష్ట సంజ్ఞలను పేర్కొనలేదు. కాని ముద్రిత పింగళచ్ఛందమున గురువునకు ऽ లఘువునకు । సంజ్ఞలు చూపబడినవి. వృత్త రత్నాకరములో గురువు వక్రరేఖాకారమనియు, లఘువు ఋజురేఖాకారమనియు సూచితము. నిర్ణయ సాగర ముద్రణలో ౧ (గురువు) — (లఘువు) అను సంజ్ఞలు కలవు. వృత్తరత్నాకరమునకు వ్యాఖ్యవ్రాసిన శ్రీ కేదారనాథశర్మగారు ప్రస్తార పద్ధతి ననుసరించి ౧ గురు చిహ్నముగా - లఘుచిహ్నముగా గ్రహింపవలయునని పేర్కొనిరి.

తమిళములో గురులఘువులను సంజ్ఞలులేవు. కాని శ్రీఆర్. శ్రీనివాసరాఘవా చార్య శిరోమణిగారు మాత్రము నిరై అనుటకు ౧, నేర్ అనుటకు – గుర్తులు సరిపోవనని సూచించిరి.[4] కాని ఈ గుర్తులకు తమిళమున ప్రచారము కలుగలేదు.

కన్నడములో గురులఘుసంజ్ఞలను విశదీకరించినవారిలో నాగవర్మ ప్రథముడు. కన్నడ ఐదవసంఖ్యయందు లఘుగురు చిహ్నములున్నవని (1-9) నాగవర్మ పేర్కొనెను. అట్లయినచో । లఘువు (గురువు. కన్నడకైపిడియందు ౧ లఘు చిహ్నముగా. గురుచిహ్నములుగా గ్రహింపబడినవి[5] ఛందస్సారమను ఛందోగ్రంథ ములో గురులఘుచిహ్నములిట్లు ప్రసక్తము.

"అరుహన నామం గురువిగె
బరువుదు లఘు వెంబువల్లి యతిగళ నామం (3-2)

పై పద్యమనుసరించి గురు చిహ్నము ౧ లఘుచిహ్నము ।.

తెలుగు ఛందోగ్రంథములందు గురు లఘు చిహ్నములు విభిన్నరీతుల గానవచ్చుచున్నవి. పరిషత్ప్రచురణమగు కవిజనాశ్రయమున గురువునకు ౧ గుర్తు.

కవిజనాశ్రయము :

తరుణతర శిశిరకర సురు
చిర రేఖాకారమగుచుఁ జెలువలరిన వ్రాల్
గురువు; మఱి లఘువు నిశిత
స్మరశరనిభమైన వ్రాయి మల్లియరేచా"

—సంజ్ఞాధికారము

సులక్షణ సారము :

"గురువులకు సంజ్ఞ యొక్క-
ట్లరయం దలక్రిందు వ్రాయునటులం జెలఁగున్
ధరపై లఘువులు వెలయున్
గరిమన్ నిడుగీటు వ్రాయు కలణి ముకుందా !

—సంజ్ఞా ప్రకరణము - ప 10

లక్షణసార సంగ్రహ పరిష్కర్తలు శ్రీ సిడుదవోలు వేంకటరావుగారు ు గురు చిహ్నముగా । లఘు చిహ్నముగా సూచించిరి. అప్పకవి కూడ 'గురువు వరమేశ్వరా కృతిగా, లఘువు గిరికుమారికా కృతిగా (4-46) భావించినట్లున్నది. కాని నేడాంధ్రమునందు ు । గురువు లఘు చిహ్నములు.

మలయాళ ఛందోగ్రంథమగు వృత్తమంజరిలో - గురుచిహ్నము, ు లఘు చిహ్నములుగా కనిపించుచున్నవి. గురువునకు 'గ' లఘువునకు 'ల' అను సంక్షిప్త సంజ్ఞలు కన్నడాంధ్రమలయాళ లాక్షణికులెల్లరు విశదీకరించిరి.

## 4. 3 గణనియమము :

గణ్ ధాతువునకు లెక్కించుట అని అర్థము. పద్యపాదమందలి అక్షరములను గాని మాత్రలనుగాని లెక్కించుటకై ఏర్పడిన సాధనములు గణములు. సర్వగణము లకు అక్షరములే బీజములు. కాని యక్షరపిండములను గణములుగా పింగళశాస్త్ర యాదులు గ్రహించలేదు.

## దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు — తులనాత్మక పరిశీలన

సంస్కృతభాషలో మూడువిధములగు గణపద్ధతులున్నవి. మొదటిది పింగళ ముని త్రికపద్ధతి. రెండవది జనాశ్రయుని గణక్రమము. మూడవది రత్నమంజూషా కారుని గణవిన్యాసము.

పింగళుని గణపద్ధతిలో గణమునకు మూడక్షరములుండును. ఆ మూడక్షర ములు, గురువులుగాకాని, లఘువులుగాకాని లేక అవియు ఇవియు కలసికాని కావచ్చును. ఆవిధముగా చూచినచో ఎనిమిది గణము లేర్పడుచున్నవి. వానిని వేర్వేరక్షరము లతో పింగళుడు పేర్కొనెను.

జనాశ్రయుని గణపద్ధతిలో గణమునకు రెండక్షరములు మొదలు ఆరక్షరముల వరకు నుండును. జనాశ్రయుడు లఘుగురువులకు వరుసగా 'హ–భ'లను సంజ్ఞలను పేర్కొనెను. ఉకాలము లఘువు. ఊకాలము గురువు. ద్వికా, త్రిక, చతుష్క, పంచక, షట్కములుగా గల 18 గణములను జనాశ్రయుడు పేర్కొనెను.

రత్న మంజూషాకారుడు పింగళుని త్రికపద్ధతిని తిరస్కరించి 12 గణములను కూర్చెను. ఈ మూడు గ్రంథములలోని గణ విభజన స్వరూపము :

| జనాశ్రయి | రత్నమంజూష | పింగళచ్ఛంద శ్శాస్త్రము | |
|---|---|---|---|
| గంగాస్ (స్) | మాయా (య్) | గా | UU |
| నదీజ్ (జ్) | నరా (ర్) | లగా | IU |
| చంద్రప్ (ప్) | లాలి (ల్) | గ్లా | UI |
| ననుర్ (ర్) | వివ (వ్) | లా | I I |
| నచరతిద్ (ద్) | | | |
| కమలనీయ్ (య్) | | | |
| జయనరవరణ్ (ణ్) | | | |
| నూనంసాగ్ (ఊలేకగ్) | మాయాకా (కలేకఆ) | ధీశ్రీస్త్రీమ్ (మ్) | U U U |
| కృశాంగీజ్ (ఋలేకజ్) | నరాచే (చ్లేకఏ) | వరాసాయ్ (య్) | I U U |
| ధీవరాశ్ (ఈలేకశ్) | లాలితా (త్లేకఔ) | కాగుహార్ (ర్) | U I U |
| కురుతేల్ (ఉలేకల్) | వివపీ (ప్ లేక ఈ) | వసుధాస్ (స్) | I I U |
| తేశ్రీక్వబ్ (పలేకబ్) | శాశాశ్ (శ్ లేక అ) | సాతేక్వత్ (త్) | U U I |
| విభాతిక్ (ఇలేకక) | షిషేష (ష్ లేక ఉ) | కదాసజ్ (జ) | I U I |

| | | | |
|---|---|---|---|
| సాతవత్ (అలేకత) | స స్వస్స (స్లేకఋ) | కంవదభ్ (భ) | U I I I |
| తరశిమ్ (అలేకమ) | హహహి (హ లేక ఇ) | సహసన్ (న్) | I I |
| లోలమాలాష్ (జీలేకష్) | | | U I U U |
| ధైర్యమస్తుతేట్ (ఇలేకట్) | | | U I U I U |
| రౌతిమయూరోజ్ (జౌ లేక ఙ్) | | | U I I U U |

డా॥ వేలంకర్ – హేమచంద్రుని 'ఛందోనుశాసనము' పీఠిక ఇంతవరకు చెప్పబడినవన్నియు అక్షరగణములు. అక్షరగణములలో పింగళుని త్రికపద్ధతికే ప్రచారము. సాంఖ్యవైశేషిక వేదాంతాది శాస్త్రములలో త్రికసంఖ్యకు ప్రాధాన్యమున్నది. ప్రణవము త్ర్యక్షరసంయోగము. వర్ణములు హ్రస్వదీర్ఘప్లుత విభాగము వలన త్రివిధములు. అంతియగాక త్రిగుణములు, త్రిలోకములు, త్రిమూర్తులనుట ప్రసిద్ధము. ఈ దృష్టితో త్రికవిభాగమేర్పడి యుండవచ్చును. కన్నడాంధ్రమలయాళ భాషలలో పింగళుని త్రికపద్ధతికే ప్రచారము.

## మాత్రాగణములు :

మాత్రాగణములలో మాత్రాసంఖ్యయే ప్రధానము కాని గురులఘువర్ణక్రమము ముఖ్యముకాదు. సంస్కృతములోని మాత్రాగణములకు తెలుగులోని మాత్రాగణములకు భేదమున్నది. మాత్రాసంఖ్య నియతమును సంస్కృత మాత్రాచ్ఛందస్సులకు కాని తెలుగులోని మాత్రాగణములలో విభేదమున్నది. మాత్రాగణములు ఈ క్రిందివిధముగా నుండును.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మూడుమాత్రల గణములు | (3) | – | న | హ | వ | | |
| నాలుగుమాత్రల గణములు | (5) | – | నల | గగ | భ | జ | స |
| అయిదుమాత్రల గణములు | (8) | – | నలల | భల | సల | నగ | |
| | | – | త | ర | జల | య | |

ఈ మాత్రాగణములకు జాతులందుపయోగము. వీనిలో వ – జల – య గణములకు నుపయోగము లేదు. చతుర్మాత్రాగణములతో కందములు, 3–4–5 మాత్రల గణములతో రగడ భేదములు కవులు రచింతురు. సంస్కృతమునందును మాత్రా గణబద్ధములగు ఆర్యాగీతి జాతులు కలవు. కన్నడాంధ్ర మలయాళములపై సంస్కృత ప్రభావ మధికమగుట వలన మాత్రాగణములు కూడ గురులఘు

పరిణతములయినవి. మాత్రాగణ చ్ఛందస్సులలో గణములు వరుసగా సరిపోవలెను. పాదములలోని మొత్తము మాత్రలసంఖ్య కూడ సరిపోవలెను. కాని పాదములో మాత్రాగణములు వరుసగా సరిపోయినను మాత్రా సంఖ్య సరిపోనక్కరలేని కొన్ని ఛందో రీతులు ద్రావిడ భాషలలో కన్పట్టుచున్నవి. ఈ దృష్టితో డా॥ గిడుగు వెంకట సీతాపతిగారు 'మాత్రాగణ వర్గము'లను ఇట్లు ఏర్పఱచిరి.[6]

1. త్ర్యస్రములు — మూడు మాత్రలు గలవి
   న — హ — వ
2. చతురస్రములు — నాలుగు మాత్రలు గలవి
   నల భ స జ
3. ఖండగతి గణములు అయిదు మాత్రలు గలవి
   నలల భల సల జల తరయ
4. రూపక గణములు : నన నలల నవ సగ నహ భలల
   (ఆరు మాత్రలు గలవి) తల రల హవ మ జలల యల జగ
5. మిశ్రగతి గణములు : ఏడు మాత్రలు గలవి
   ననల సన సహ సవ నస నజ నభ నగగ
   భన తలల మల తగ భవ భహ రలల
   రగ జన యలల జవ యగ జహ
6. ఆదితాళ గతి గణములు : నలలల — భనల సనల తన నజల
   భభ సభ మలల ననగ భస సస తవ
   నయ భగగ సగగ మగ నభల రన
   నసల భజ నత రహ నర రవ జనల యన
   యహ యవ జస జజ జభ జగగ

శ్రీ ఆర్. రాజగోపాలనాయుడుగారు పాటలలోని గణములను నాలుగు విధములుగా వర్గీకరించిరి.[7]

త్రిమాత్రాగణములు — న గల వ
చతుర్మాత్రాగణములు — నల భ జ సగగ

పంచమాత్రాగణములు – సల-నగ-జ త య-నలల భల జల
షణ్మాత్రాగణములు – నన భలల జలల సలల నగల నలగ
భగ జగ సగ రల తల మ

వ్యవహారములోగల భాషలలో మాత్రాగణముల సంఖ్య పెరుగుట సహజము.

**దేశీయగణములు :**

తమిళమునందు సంస్కృత నిరపేక్షమగు గణవిధానమున్నది. వానిని దేశీయ గణములనవచ్చును. తమిళమునందు గణములకు 'శీర్' అనిపేరు. నేర్, నిరై సంయోగమువలన 'శీర్లు' ఏర్పడుచుండును. తమిళమునగల 'శీర్లు' నాలుగు విధములు 1) ఒరశైచ్చీర్ 2) ఈరశైచ్చీర్ 3) మూవశైచ్చీర్ 4) నాలశైచ్చీర్. శీర్ల ననుసరించి పద్యలక్షణము తమిళ లాక్షణికులు నిర్వచింతురు.

**ఓరశైచ్చీర్ :**

ఒక నేర్గాని నిరైగాని కలిగినగణము. వెణ్బా పద్యము అంతమందు ఓర శైచ్చీర్ సాధారణముగా వాడుదురు. శ్రీ ఆర్. శ్రీనివాసరాఘవాచార్యులవారు గ్రంథమున 'నేర్-నిరై'లకు – U గుర్తులు సరిపోవునని పేర్కొనిరి.[8] ఈ దృష్టితో చూడగా "గ-ల" అనునవి ఓరశైచ్చీర్లు అగును.

2. ఈరశైచ్చీర్లు :– 'ఈరశైచ్చీర్' స్వరూపమిట్లుండును. ఇవి 4 గణములు.

| | | | |
|---|---|---|---|
| నేర్ నేర్ | తేమా | } | మాచ్చీర్ |
| నిరై నేర్ | పుళిమా | } | |
| నిరై నిరై | – కరువిళం | } | విళచ్చీర్ |
| నేర్ నిరై | – కూవిళం | } | |

మూవశైచ్చీర్లు – ఇవి 8 గణములు

నేర్ నేర్ + నేర్ తేమా + కాయ్
నిరై నేర్ + నేర్ పుళిమా + కాయ్
నిరై నిరై + నేర్ కరువిళం + కాయ్
నేర్ నిరై + నేర్ కూవిళం + కాయ్

నేర్ నేర్ + నిరై తేమా + కణి
నిరై నేర్ + నిరై పుళిమా + కణి
నిరై నిరై + నిరై కరువిళం + కణి
నేర్ నిరై + నిరై కూవిళం + కణి

4 నాలశై చ్చీర్లు : ఇవి 16 గణములు

తేమాంగాయ్ + నేర్ తేమాందణ్బూ
పుళిమాంగాయ్ + నేర్ పుళిమాందణ్బూ
కరువిళంగాయ్ + నేర్ - కరువిళందణ్బూ
కూవిళంగాయ్ + నేర్ - కూవిళందణ్బూ
తేమాం కణి + నేర్ - తేమానఱుంబూ
పుళిమాంకణి + నేర్ - పుళిమానఱుంబూ
కరువిళంకణి + నేర్ - కరువిళం నఱుంబూ
కూవిళంకణి + నేర్ - కూవిళ నఱుంబూ
తేమాంగాయ్ + నిరై - తేమాం తణ్ణిళల్
పుళిమాంగాయ్ + నిరై - పుళిమాంతణ్ణిళల్
కరువిళంగాయ్ + నిరై - కరువిళం తణ్ణిళల్
కూవిళంగాయ్ + నిరై - కూవిళం తణ్ణిళల్
తేమాంకణి + నిరై - తేమానఱు నిళల్
పుళిమాంకణి + నిరై - పుళిమానఱు నిళల్
కరువిళంకణి + నిరై - కరువిళ నఱునిళల్
కూవిళంకని + నిరై - కూవిళనఱు నిళల్

పై పరిశీలనమువలన నేర్ - నిరై సంఖ్యలనుసరించిగాని వాని క్రమమును బట్టిగాని ఆయాశీర్లకు పేరు కలిగినట్లు చెప్పవచ్చును. శీర్ల నామకరణమును గూర్చి ఎల్. బెస్సి

"The Tamils do not like us to give each kind of foot an arbitrary appellation, but in order to have in one word but the designation and the example they apply to each kind of foot

the name of some tree in which quality is exhibited. For instances a foot consisting of two Ner Asai is termed 'Thema' which is name of a tree''9 అని వ్రాసిరి.

## కన్నడ దేశీయ గణములు :

నాగవర్మ ఛందోంబుధియందు కర్ణాట విషయ జాతులను పేర్కొనువాడనని తెలిపి దేశీయ గణములను విశదీకరించెను. నాగవర్మ లక్షణము మేరకు రెండు, మూడు, నాలుగు గురువులను ప్రస్తరించుట వలన బ్రహ్మ, విష్ణు, రుద్రగణము లేర్పడును. వాని క్రమము ఈ విధముగా నుండును.

| | | |
|---|---|---|
| బ్రహ్మ గణము (4) – | U U | గ గ |
| | I I U | స |
| | U I | గ ల |
| | I I I | న |
| విష్ణుగణములు (8) – | U U U | మ |
| | I I U U | స గ |
| | U I U | ర |
| | I I I U | న గ |
| | U U I | త |
| | I I U I | సల |
| | U I I | భ |
| | I I I I | నల |

| | | | | |
|---|---|---|---|---|
| రుద్రగణములు (16) | U U U U | మగ | U U U I | మల |
| | I I U U U | సగగ | I I U U I | సహ |
| | U I U U | రగ | U I U I | రల |
| | I I I U U | నగగ | I I I U I | నహ |
| | U U I U | తగ | U U I I | తల |
| | I I U I U | సవ | I I U I I | సలల |
| | U I I U | భగ | U I I I | భల |
| | I I I I U | నవ | I I I I I | నలల |

వీనినే వరుసగా స్మర - రతి - బాణ గణములని జయకీర్తి ఛందోను శాసనమున (7-1-2-3) వ్యవహరించెను.

శ్రీ టి. ఎన్. శ్రీకంఠయ్యగారు బ్రహ్మ, విష్ణు రుద్రగణములతోపాటు 'పద్మ గణము'లను పేర నూత్నగణమొకదానిని పేర్కొనిరి.10 కొన్ని పద్యములు లేదా పాటల చివరగల ఒకటిరెండక్షరములను, అంతకు ముందున్న గణవిన్యాసమనుస రించి మాత్రాసమక మేర్పడునట్లు చదువుటభ్యాసమనుసరించి, వానిని పద్మగణము లుగా పేర్కొనదగునని అభిప్రాయము. అనగాగేయ ధర్మమునకు ప్రాధాన్య మొసగుట అని భావము.

శ్రీ కె శివరామశాస్త్రిగారు గణాంతమునందొక అక్షరమో లేదా కొన్ని అక్షరములు మిగిలిపోవుటను "హంసిగణములు"గా నెన్నిరి 11 కాని వీనివలన ప్రయోజనము అంతంత మాత్రమే.

తెలుగు దేశీయగణములు :

సూర్య, ఇంద్ర, చంద్రగణములు తెలుగుదేశీయ గణములగును. వీనినిగూర్చి కవిజనాశ్రయకర్త విన్నకోట పెద్దనలిట్లు చెప్పిరి.

"వినుత ద్విత్రి చతుర్గురు
జనిత గణంబులు రవీంద్ర చంద్రాఖ్యములై
చను నక్కర జాతులకె
ల్లను నాదిమ (లఘువు) మొదల లఘువిడవలయున్"

— జాత్యాధికారము ప. 24

ఒలిరెండు మూడు నాలుగు గురువుల
నైన గణము లినసురాధిపేందు
గణము లక్షరోపకరణంబులవి యాది
లఘుగణంబు మొదల లఘువు నిలుప

(కావ్యాలంకార చూడామణి 8-5)

పై పరిశీలనమువలన రెండు, మూడు, నాలుగు గురువులను పెట్టి ప్రస్త రింపగా వరుసగా నాలుగుసూర్యగణములు, ఎనిమిది ఇంద్రగణములు, పదునారు

చంద్రగణములేర్పడునని తెలియుచున్నది. అనగా కన్నడమునగల బ్రహ్మ, విష్ణు, రుద్రగణములే పేర్ల మార్పుతో సూర్య, ఇంద్ర, చంద్రగణములయ్యెనని ఫలితార్థము. కాని అనంతుడు ప్రతివర్గమునందు మొదటి రెండేసి గణములను తొలగింపగా నేర్పడిన వర్గములకే సూర్య, ఇంద్ర, చంద్రగణములను పేర్లుపెట్టినట్లు ఈ క్రింది పద్యమువలన తెలియుచున్నది.

గలనగణములిను డింద్రుడు
నలనగ సలభరత లింక నగగ నహసలా
భల భ గురు మలఘు సవసహ
తల రల సవ నలల రగురు తగలిందుఁడజా

— ఛందోదర్పణము 1-19

శ్రీ వేకుమళ్ళ రాజగోపాలరావుగారు 'ప్రాచీనాంధ్ర కవిత్వ లక్షణ' మను వ్యాసమున ప్రాచీన తెలుగు గణములను పేర్కొనిరి.[12] అవి తమిళములోని 'శీర్లను' పోలినవి. శ్రీ రాజగోపాలరావుగారు లఘు గురువులకు పర్యాయములగు 'గో-ధనము' లను సంకేతముతో గణములను సృష్టించిరి. వానికి 'గణి' అని పేరిడిరి.

మగణి – 3 గోవులు
యగణి – 1 ధనము 2 గోవులు
రగణి – 1 గోవు 1 ధనము 1 గోవు
తగణి – 2 గోవులు 1 ధనము
సగణి – 2 ధనములు, 1 గోవు
జగణి – 1 ధనము 1 గోవు 1 ధనము
భగణి – 1 గోవు 2 ధనము
నగణి – 3 ధనములు

ఇట్లే గగ – లగ – గల – లల అనుటకు మారుగా గగి – లగి – గలి – లలి అని పేర్లు సూచితము.

మళయాళ దేశీయ గణములు :

మలయాళములో అక్షర గణములు, తాళగణము లున్నవి. తాళ గణములే దేశీయ గణము లగును. వృత్తమంజరియందు 2, 3, 4 లేదా 5 మాత్రలు కలవి

దేశీయ గణములు శ్రీవారియార్ లయకు లోబడునది తాళమను సిద్ధాంతముతో తాళగణముల కల్పించిరి.[13] మలయాళములోగల దేశీయ గణము లీవిధముగా నున్నవి.

గగ – గలల – లగల – లలగ – లలలల వీనిని క్రమముగా గగ-భగణము జగణము – సగణము – నల గణములుగా పేర్కొన వచ్చును.

## దాక్షిణాత్య భాషలలో గణసామ్యము :

తమిళ కర్ణాటక ఆంధ్రమలయాళ మాత్రాగణ ప్రస్తార సంప్రదాయములలో సామ్యములు కనిపించును. వీనిలో జాతిగణముల పరస్పర సంబంధమును పరిశీలింతము.

తమిళము – తేమాగణములు – గగ, గల

పుళిమాగణములు – య, జ, స, న

వీనిలో 'య-జ' గణములను తొలగించిన కన్నడ బ్రహ్మగణములు, వానితోపాటు గగ-స గణములను కూడ తొలగించిన తెలుగు సూర్యగణములు. మలయాళమున 'గగ'కు ప్రచారమెక్కువ.

తమిళములోని కరువిళమ్ – నల, నగ, జల, జగ

కూవిళమ్ – భ, ర

తేమాంగాయ్ – మ, త

పుళిమాంగాయ్ – సగ, సల, యగ, యల

అనువానిలో జల, జగ, యల, యగలను తొలగించినచో కన్నడములోని విష్ణుగణము లను, వానితోపాటు మ, సగ గణములను కూడ తొలగించినచో తెలుగు ఇంద్ర గణము లేర్పడును. మలయాళములో భ, స, నలలకు ప్రచారమెక్కువ.

తమిళములోని కరువిళంగాయ్- నవ, నలల, జలగ, జగగ, జగల నగగ, నల

కూవిళంగాయ్ – భగురు, భల, రగ, రల

తేమాంగణి – తగ, తల

పుళిమాంగణి – సలగ, సలల, యలగ, యలల

తేమాతణ్బు – మగ, మలఘు

పుళిమాతణ్బు – యగగ, యగల, సగగ, సగల

అనువానిలో నవ, నలల, నగగ, నగల, భగురు, భల, రగ, రల, తగ, తల, సలగ, సలల, మగ, మలఘు, సగగ, సగల-ములను 16 మాత్రము కర్ణాటక రుద్రగణములు. వీనిలో నుండి మగ, సగగలను తొలగించినచో తెలుగు చంద్రగణము లేర్పడును. మలయాళములో శ్రీ అప్పన్ తంబురాన్‌గారు త్ర్యస్ర, చతురస్ర, ఖండ, రూపక, మిశ్రగతి గణములను తాళగణములుగా భావించిరి. కనుక మలయాళమునకూడ 3, 4, 5, 6, 7 మాత్రలుగల గణములు కలవని చెప్పవచ్చును.

తెలుగు కన్నడములలోని దేశీయగణములు సయితము సంస్కృత ఛందోగణములతో వ్యవహరింపబడుటకు సంస్కృతభాషా ప్రభావమే ప్రధానకారణము. తమిళములో సంస్కృతభాషాప్రవేశము నిరాఘాటముగా సాగనందున అందలిగణపద్ధతి విలక్షణమయినది. దేశీయగణములందు మాత్రాసంఖ్య నియతముకాదు. తమిళములో మాచ్చీరులలో మూడునుండి అయిదువరకు మాత్రలున్నవి. విళచ్చీరులలో నాలుగు నుండి ఆరువరకు మాత్రలు గలవు. కణిచ్చీరులలో ఆరునుండి తొమ్మిది వరకు మాత్రలుకలవు. పాదుచ్చీరులలో ఏడునుండి పన్నెండువరకు మాత్రలుకలవు.

కన్నడములోని బ్రహ్మగణములలో మూడు నుండి నాలుగువరకు, విష్ణు గణములలో నాలుగు నుండి ఆరు వరకును, రుద్రగణములలో అయిదు నుండి ఎనిమిది వరకు మాత్రలున్నవి.

తెలుగులోని సూర్యగణములకు మూడు మాత్రలు మాత్రమే. ఇంద్రగణములకు నాలుగు నుండి అయిదు వరకు, చంద్ర గణములకు అయిదు నుండి ఏడు వరకు మాత్రలు గలవు.

మలయాళములో చతుర్మాత్రా గణములకు ప్రచార మెక్కువ. కనుక వారు 'గగ – భ – జ – నల' లను మాత్రము స్వీకరించిరి.

పై పరిశీలన వలన తమిళ గణములలో నుండి కన్నడ లాక్షణికులు కొన్నిటిని కన్నడ గణములలో నుండి తెలుగు లాక్షణికులు కొన్ని గణములను తొలగించినట్లు చెప్పవచ్చును. ఇట్లు కొన్ని గణములను తొలగించుటకు గల కారణములను డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు

"కన్నడులకున్న, తెలుగువారికిన్ని యగణ జగణములు గాని, వాటితో గురు లఘువులుగాని, ఇతర గణములు గాని చేరిన గణములుగాని యిష్టము లేదు. అట్టి వానిని తమిళ గణముల నుంచి తొలగిస్తే కర్ణాటక బ్రహ్మ, విష్ణు, రుద్రగణము లేర్పడినవి. సూర్యగణములలో మూడు మాత్రలకు మించినవిన్ని, ఇంద్రగణములలో అయిదు మాత్రలకు మించినవిన్ని గణము లుండగూడదని తెనుగువారు నియమము చేసుకొన్నారు. అందుచేత ఆయా జాతుల కర్ణాటక గణముల నుంచి ఆ సంఖ్యా నియమము నతిక్రమించిన వాటిని తొలగించిరి.[14] అని ఊహించిరి.

## 4. 4. పద్యపాద నియమము :

పద్యతే గమ్యతే అనేన ఇతి పాదః, పాదమనగా గమన సాధనము. కాని వేదములో పాదమనగా అవాంతర వాక్యము. లౌకికచ్ఛందములలో పద్యము యొక్క నాలుగవభాగము పాదము.

పింగళుడు 'పాదః చతుర్భాగః (4-10) అని యథవృత్త సమాప్తి ర్వా (4-11) అని పేర్కొనెను.

జయకీర్తి 'పాదోఽక్షర మాత్రా నియమోదిత పిండః (1-25) అని స్పష్టము చేసెను. మాత్రా చ్ఛందములందు నియత మాత్రా సంఖ్యచేతను, అక్షర చ్ఛందము లందు నియతాక్షర సంఖ్య చేతను నిష్పన్నమైన పిండము పాదము కాగలదు.

సంస్కృత వేదవాఙ్మయములో రెండు పాదములుగల ద్విపదావిరాట్, ద్విపదా జగతీ మొదలగు ఛందస్సులును, మూడుపాదములుగల గాయత్రీచ్ఛందమును కనిపించును. కాని లౌకిక సంస్కృతవాఙ్మయములో అన్నిపద్యములకును నాల్గు పాదములుండుట నియతమయిన లక్షణము. కాని దేశీయచ్ఛందస్సులకు మాత్రము నాల్గుపాదములుండుట నియతము కాదు.

తమిళములో 'అడి' అనగా పద్యపాదము. పాదములో ఒకటిగాని అనేకములు గాని 'తళై'లు వచ్చును. 'తళై' అనగా నేర్ నిరైలకూడిక. తమిళమునందు 'అడి' లేక పద్యపాదము అయిదు విధములుగా నుండును. అవి వరుసగా

1) కుఱలడి
2) సిందడి
3) అళవడి
4) నెడిలడి
5) కళినెడిలడి

'కుఱలడి'లో రెండుశీర్లు ఉండును. అన్నిపాదములకంటె కుఱుచగా నుండుట వలన 'కుఱలడి' అనుపేరు స్థిరమైనది. ఇందు 4 నుండి 6 వఱకు అక్షరము (ఛందోక్షరములు) ఉండును.

నారాయణన్ తనైవణంగియ
నారదముని తనై నారణన్

— యాప్పొళి - అడియదికారం పుట 41

'సిందడి'లో మూడుశీర్లు ఉండును. ఇందు 7 నుండి 9 అక్షరములు (ఛందోక్షరములు) ఉండును.

దేవియర్ ఒళియాయ్ నిర్క
ద్దేవనుం అంగు వడిన్దాన్

యాప్పొళి - అడియదికారం పుట 41

'అళవడి' అనగా నాలుగుశీర్లుగల పాదమని అర్థము. ఇందు 10 నుండి 14 వరకు అక్షరము (ఛందోక్షరములు) ఉండును.

నాన్ముగన్ ఆణైయాల్ నారాణ మునివనుం

—యాప్పొళి (పుట 4)

'నెడిలడి' యనగా ఐదుశీర్లుగల పాదమని అర్థము. ఇందు 15 నుండి 17 వరకు అక్షరములు (ఛందోక్షరములు) ఉండును.

వైయం ఏళుడై మన్నవన్ అవ్వురై వళంగ

—యాప్పొళి పుట - 41

'కళినెడిలడి' అనగా ఆరుశీర్లు గల పాదమనుట. ఒక పాదములో ఏడుశీర్లు ఉన్నచో అది ఎళుశీర్ కళినెడిలడి యగును. ఇట్లే తమిళములో పాదమునకు 32 శీర్లు కల పద్యము లున్నవి.

అక్షర గణబద్ధములగు సంస్కృత వృత్తములు తమిళములో లేవు. ప్రాచీన తమిళ కవిత్వములో మూడేసి, నాలుగేసి దేశీయ చ్ఛందోగణములుగల మూడేసి నాలుగేసి పాదములతో కూడిన పద్యములే ఎక్కువగా నుండెడివి. తొల్కాప్పియర్ కాలములో 2 మొదలు 12 పాదముల వఱకుగాగల పద్యములున్నవి. గ్రంథములో పేర్కొనిరి. ప్రాచీన తమిళ లాక్షణికులు పాదములందుగల అక్షరముల సంఖ్యను పేర్కొనిరి. కాని తరువాతి లాక్షణికులు పాదములందు గల గణముల సంఖ్యకు ప్రాధాన్య మొసగిరి.

తమిళములో కుఱళ్ అను ఛందస్సు రెండుపాదములుగల చిన్నపద్యము. మలయాళమునందును 'ఈరడి' అను పద్యములో రెండుపాదములున్నవి.

తమిళములోగల 'కుఱళ్ వెణ్బా' రెండుపాదములు గల పద్యము. సిందియల్ వెణ్బా మూడు పాదములు కలది. అళవియల్ వెణ్బా నాలుగు పాదములు గలది. పట్రొడైవెణ్బా 5 నుండి 11 పాదములుగల పద్యము. కలివెణ్బా 12 పాదములును అంతకు మించినపాదములుగల పద్యవిశేషమగును.

కన్నడాంధ్రములందలి ద్విపద (2 పాదములు) త్రిపద (3 పాదములు) చౌపద (4 పాదములు) షట్పది (6 పాదములు) సప్తపది (7 పాదములు) అష్టపది (8 పాదములు) మొదలగు దేశీయ చ్ఛందస్సులు పాదసంఖ్యను బట్టియే యేర్పడినవి. ఈ ఛందస్సులకుగల పేర్లనుబట్టి దేశీయచ్ఛందస్సులకు పాదనియతిలేదని చెప్పవచ్చును.

దేశ్యజాతులు మాత్రాగణబద్ధములై మొదట పాదనియమములేక రచింపబడినవి. తమిళ లాక్షణికుడగు కాక్కైపాడినియార్ పద్యమునకు 3 పాదములు కనిష్ఠమని పేర్కొనెను. గరిష్ఠ పరిమితిని చెప్పలేదు. పేరాశిరియర్ పరిమాణనార్ లాక్షణికులు పద్యమునకు 1000 పాదములు గరిష్ఠ సంఖ్యగా నిర్ణయించిరి. దీనినిబట్టి పాదనియమము ప్రాచీన పద్యములకు లేదని చెప్పవలసియున్నది.[15] కాని కన్నడాంధ్రములందు సంస్కృత ప్రభావమువలన దేశీయరచనలకు పాదనియమ మేర్పడినది. నాల్గుపాద

ములకంటె అధికముగా నుండు పద్యమును 'మాలిక' అనుపదము చేర్చి పేర్కొనుట కలదు. సీసమాలిక ఉత్పలమాలిక మొదలగునవి ఇందులకుదాహరణములు. ద్విపద, రగడలందు అధిక పాదము లున్నను ద్విపదమాలిక, రగడ మాలిక అని పేర్కొనరు. వానిని కేవలము ద్విపద, రగడలనియే పేర్కొందురు. ద్విపద రగడలలో రెండు పాదములు మొదలుకొని యెన్ని పాదములయినను సరి సంఖ్యలో నుండును.

పై పరిశీలనము వలన అనియత పాదత్వము దాక్షిణాత్య చ్ఛందోరీతుల లక్షణమనియు, మార్గకవితా ప్రభావము వలన పాదనియమ మేర్పడెననియు చెప్పనచ్చును.

## 4. 5. యతి ప్రాసలు :

ద్రావిడ భాషలందలి ఛందోంగములలో మిక్కిలి ప్రాముఖ్యము కలది యతి. 'యమ్' ధాతువునకు తిప్రత్యయము చేర్చుట వలన యతిశబ్ద మేర్పడుచున్నది. సంస్కృతమున యతికి పర్యాయముగా విరతి, విరమము, విరామము, విశ్రాంతి మొదలగు పదములు వాడుకలో నున్నవి. ఇట్లే ద్రావిడభాష లన్నిట మాధుర్య హేతువుగా భావింపబడిన ఛందోంగములలో 'ప్రాస'యు పేర్కొనదగినది. సంస్కృత లాక్షణికులు 'ప్రాసను' ఛందోంగముగా పేర్కొనలేదు. ప్రకృష్టమగు వర్ణముల నాయా నియత స్థానముల నుంచుట ప్రాస యగును సంస్కృతములో గల యతి ప్రాసలకు దాక్షిణాత్య లాక్షణికులు పేర్కొనిన యతిప్రాస లక్షణములకు భేదములు కనిపించును. వీనిలో మొదట 'యతిని' గూర్చి పరిశీలింతము.

సంస్కృత లాక్షణికు లెల్లరు 'యతి'ని ప్రస్తావించిరి.

యతిర్విచ్ఛేదః – పింగళచ్ఛందస్సు 6–1
విరామో యతి రితి – జయదేవ చ్ఛందస్సు 1–9
వాగ్విరామో యతిః – జయకీర్తి ఛందోను శాసనము 1–10
యతిర్విచ్ఛేద సంజ్ఞికా – వృత్తరత్నాకరము 1–11
శ్రవ్యో విరామో యతిః – ఛందోనుశాసనము 1–15
యతిర్జిహ్వేష్ట విశ్రామ స్థానమ్ – ఛందోమంజరి 1. 12

పై లక్షణముల ననుసరించి విచ్ఛేదము యతి లక్షణముగా చెప్పవచ్చును. ఈ విచ్ఛేదము వైదిక ఛందస్సులలో కనిపించును. ఈ విరామమునే కవులు లౌకిక వర్ణవృత్తములందు పాటించిరి. అయినను సంస్కృత లాక్షణికులలో యతి నియమము పట్ల విభేదము లున్నట్లు తెలియుచున్నది.

వాంఛంతి యతిం పింగళ
వసిష్ఠ కౌండిన్య కపిల కంబల మునయః
నేచ్ఛంతి భరత కోహల
మాండవ్యాశ్వతర సైత వాద్యా మునయః

—ఛందోను శాసనము . సంజ్ఞా - 13

యతి విరామములు పర్యాయ పదములయినను అర్థభేదమున్నది. యతి ఛందో వశము. నియత స్థానికము. విరామము అర్థ వశము. అనియత స్థానికము. యతికి విచ్ఛేదార్థము ప్రధానార్థము. అక్షరమైత్రి ద్వితీయార్థము సంస్కృతములో నక్షర మైత్రికి సంబంధించిన యతిమైత్రి అరుదుగా కనిపించును.

ఉదాహరణమునకు :

తవ కథా మృతం తప్త జీవనం
కవిభి రీడితం కల్మషాపహమ్
శ్రవణ మంగళం శ్రీమదాతతం
భువి గృణంతి యే భూరిదా జనాః"

కాని యిచట అక్షరమైత్రి యాదృచ్ఛికము. పద్యపాదమును చదువుచున్నప్పుడు మధ్యలో కొంత ఆగి విశ్రాంతి తీసుకొనవలసి వచ్చును. ఈ విశ్రాంతి స్థానమును సంస్కృతములో యతిస్థాన మందురు. ఛందోబద్ధ పాదమునందు స్వాభావికమైన విరామమే 'సంస్కృత యతి' అని ఫలితార్థము.

తమిళమునందు యతి కలదు. ఆ యతిని తమిళలాక్షణికులు "మోనై త్తొడై" అని వ్యవహరించిరి. తమిళములోగల 'మోనై', విచ్ఛేదక రూపమగు యతి కాదు. అక్షర మైత్రికి సంబంధించినది. ఈ మైత్రి లాక్షణిక నియమముల ననుసరించిగాక కవి ఇచ్ఛననుసరించి పద్యములలో పాటింపబడును. అనగా తమిళ లాక్షణికులు పద్యములకు యతిస్థానము చెప్పలేదని అభిప్రాయము.

కన్నడమునందును యతికలదు. కన్నడలాక్షణికులెల్లరు యతిని గూర్చి చర్చించిరి. నృపతుంగుడు కవి రాజమార్గమున యతిలక్షణము - యతిభంగము - యతివిలంఘనము, యతివిలంఘన సౌందర్యములను (1-71-72) గూర్చి విపులముగా చర్చించెను. కాని యివియన్నియు సంస్కృత వృత్తముల దృష్టితో చెప్పినట్లగపడును. నాగవర్మ ఛందోంబుధిలో కర్ణాటవిషయజాతులను విశదీకరించునపుడు యతి ప్రస్తావన చేయలేదు. కాని జయకీర్తి మాత్రము పిరియక్కరకు లక్షణము చెప్పునపుడు

"పాదే పాదేఽత్ర ప్రతి గణ మపి

యతిర్లక్ష్యతే (7-8) అని చెప్పుటవలన కన్నడిగులకు యతి సామాన్య విషయమై కనిపించును. అభినవ కేశిరాజ ఈశ్వరకవి ప్రాసలను (2-3-29) తొలుత పేర్కొని ఆపై వడులను (2-30-41) వర్గీకరించెను. పై సాక్ష్యములబట్టి కన్నడలాక్షణికులకు ప్రాసనియమము పట్లగల అనురక్తి సుస్పష్టము.

సరూపాక్షర యతిని కన్నడమున నియతముకాదు. కాని ప్రాచీన కన్నడ గ్రంథములందును,[16] జానపద సాహిత్యమునందు సరూపాక్షర యతి కనిపించును. ఈ కారణమువలననే శ్రీ శివరామ ఐతాళ్‌గారు కన్నడములో ప్రాసకంటె సరూపాక్షర యతికి ప్రాధాన్యమని భావించిరి.[17]

తెలుగులోని 'యతి' సంస్కృతము నందువలె విచ్ఛేదమాత్రము కాదు. తమిళమునందువలె ఐచ్ఛికము కాదు. యతి పర్యాయ పదములను తొలుత దేచన కవిజనాశ్రయమున పేర్కొనియున్నాడు.

విశ్రాంతి విరతి విశ్రామ
విశ్రామ విరామ విరమ విరమణలనఁగా
విశ్రుతమగు యతి కృతి కధ
కశ్రావ్యంబై బెడంగు గానిడ వలయున్"

కవిజనాశ్రయము - సంజ్ఞాధికారము,

ఆంధ్రలాక్షణికులు విశ్రాంతి, విరతి పదములతో బాటు యతికి పర్యాయముగా వడి - వళి అనువానిని గూడ గ్రహించిరి.

చరణాద్యక్షరమే వడి – కవి జనాశ్రయము
పాదప్రథమాక్షరము
త్పాదితమగు వళియనంగ – కావ్యాలంకార చూడామణి 7-29
వాసన గల మొదలిప్రాయి వడియనఁ బరఁగున్-ఛందోదర్పణము 1-29
చరణ చరణమున కాద్యక్షరములు వళులయ్యె – అప్పకవీయము 3-5

పై లక్షణము ననుసరించి పాదాద్యక్షరము 'వడి' అని స్పష్టమగు చున్నది. కాని కాలక్రమములో వడి-వళులు యతికి పర్యాయపదములై పోయినవి. ఈ సందర్భమున విమర్శకు లభిప్రాయము లిట్లున్నవి.

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ :

విశ్రాంతి యనగా సవర్ణము. మైత్రి. ఇది దివ్యమగు విశ్రాంతి. ఒకడు ప్రయాణము చేయుచు చెట్టుక్రింద విశ్రాంతి తీసికొనుచున్నాడు. అట్లుగాక తనకు గమ్యస్థానమగు గ్రామమును చేరక ముందే నడుమనున్న గ్రామములో బంధువుల ఇంట పరిచితుల యింట విశ్రాంతి పొందుచున్నాడు. చెట్టుక్రింద విశ్రాంతి విశ్రాంతి కాదు. స్నేహితుల యింట విశ్రాంతి సౌఖ్యకరము. విశ్రాంతి లేనిచోటు విరోధి గృహము."
–'తెలుగు ఛందో వికాసము' పీఠిక

## శ్రీ వేదుల రామశాస్త్రి :

"వళి" సంస్కృతశబ్దము. దానికి మడతయని అర్థము. కాంత యుదరమున గల మడతల (త్రివళుల) వలె పద్యపాదమునకు అలంకారములైనవి వళులు"
– అప్పకవీయ భావవివరణము పుట 12

## శ్రీ గిడుగు వేంకట సీతాపతి :

"వడి-వడు శబ్దభవము. వడు అనగా మార్గము. యతివశమున ఖండితమైన పాదమునందలి మొదటి భాగపు మొదటి అక్షరము, రెండవభాగపు మొదటి అక్షరమునకు మార్గమును చూపుట వడి లక్షణము"

తెలుగులో ఛందోరీతులు పుట 215

**శ్రీ రావూరి దొరసామిశర్మ :**

"వడివిభజనే" అను ధాతుపాఠముననుసరించి విభజనార్థము కలది కనుక వడి శబ్దము యతికి పర్యాయమగును. వళి దేశ్యము. తమిళమున వళిఎదుగై అను ప్రాసభేదము కలదు. ఇందలి వళి యే వడి"

తెలుగుభాషలో ఛందోరీతులు పుట 218

**శ్రీ కోవెల సంపత్కుమారాచార్య :**

"వడి యనగా వేగమని అర్థము. పాదమందలి పూర్వోత్తరార్థములు విరామము ననుసరించి విడిపోయినప్పుడు వేగమువందు కొనుటకై తిరిగి ప్రథమార్థ ఆద్యక్షరము నుపయోగించుట సంభవించును. వడిని సాధింప తిరిగి యుపయోగింపబడు వేగమును సూచించుటవలన పాదప్రథమాక్షరము వడికాగలిగినది"

తెలుగు ఛందోవికాసము – పుట 118

**శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్ :**

"వడి – దేశ్యవిశేషము. దీనికి వేగము, పురి, బిగువు, దారము, శౌర్యము, కాలమను అర్థములున్నవి. వడివేయుట, వడిపెట్టుట, వడిత్రిప్పుట వంటివి రూఢ్యములు. త్రాడుల వడివేయుదుము. పద్యముల వడివేయుదుము. వడివేయుటచేత త్రాడులకు పురి, బిగువు కలుగును. ఇట్లే పద్యపాదమున ఆద్యక్షరములతో నియమితాక్షరమునకు వడివేయుటచేత నొక పురిబిగువు స్ఫూర్తి కలుగుచున్నవి. వడివేయుట అనగా సాదృశ్యసాజాత్యములుగల రెండు భిన్నపదార్థముల కేకత్వాభాస కల్గించుట, కావున ఆంధ్రలాక్షణికులు యతికంటె భిన్నమగు అర్థమున మెలివేయుట అను భావము తోపదేశ్యవిశేషమైన వడి శబ్దమును గ్రహించిరి. ఆ వడియే వళియైనది" 'వడి – శబ్దార్థవిచారము' భారతి జూన్ 1972.

**శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య :**

"తమిళమ:లో తెలుగు ఛందమును వడుగుఛందమని ప్రాచీనకాలమున వ్యవహరించెడివారు. అనగా వడులుగల ఛందమనుట. తమిళమున 'వడు' అనగా

మార్గమను అర్థమున్నది. తరువాత ప్రయుక్తము కావలసిన యతిమైత్రి అక్షర ప్రయోగమునకు వడునుచూపునది అనగా మార్గదర్శకమైనది పాదాద్యక్షరము. కావుననే అది వడి" అని తెలుగు భాషలో ఛందోరీతులు పీఠిక వ్రాసిరి.

## కన్నడ విద్వాంసులు హెచ్. శేషయ్యంగార్ గారు

వడివేష్టనే – వలవేష్టనే – లడయోరభేదః అను హేతువాదము ననుసరించి పాదమునకు. నాదియగు నక్షరము నిర్ణీత స్థానమున నావృత్తియగుట వడిగా 'కవిజిహ్వాబంధన పీఠికలో' పేర్కొనిరి.

మలయళములో యతి, మోనై అను రెండు పదములును లక్షణగ్రంథములందు వాడబడినవి. సంస్కృత ఛందోరీతుల సందర్భమున 'యతి' వాడబడినది. దేశిచ్ఛందో రీతుల విస్తరించి చెప్పునపుడు 'మోనై' ప్రయోగింపబడినది. తమిళములోగల మోనై లక్షణములే మలయాళమున యథాతథముగా గ్రహింపబడినవి. కాని మల యాళములో ప్రాసలకు ప్రాధాన్యమెక్కువ. ఒక్క 'కలకాంచి' అను చందోవిశేష మున మాత్రము మోనై నియతముగా పాటింపవలయునని అనుశాసనము. డా॥ ఓ ఎం. అనుజన్‌గారు మలయాళములోగల మోనై గురించి

"Mona is strictly observed only in one metre called Kala Kanchi where the first syllables of the two lines differ in length; there only the first syllables should agree and even if the second one agree it would not impress the reader since the whole foot is composed of short syllables"18 అని వ్రాసిరి.

పై పరిశీలనమువలన తమిళ కన్నడాంధ్ర మలయాళములందు యతికలదని తెలియుచున్నది తెలుగులో యతినియతము. తమిళములో యతి శబ్దాలంకార దృష్టితో కూర్చబడును. కన్నడమలయాళములందు ప్రాసలకు ప్రాధాన్యమని చెప్ప వచ్చును.

## యతిస్థానము :

దాక్షిణాత్య భాషలలోని దేశిచ్ఛందోరీతుల పరిశీలింపగా యతిస్థానము పట్లను సామ్యములు కనిపించును.

తమిళములో యతి మోనై విభేదములలో చేరును. మోనై 8 విధములగును.

అడిమోనై – పాదములో అన్ని శీర్ల (గణముల) ఆద్యక్షరములకు మైత్రి
ఇణై మోనై – పాదములో 1, 2 శీర్ల ఆద్యక్షరములకు మైత్రి
పొళిప్పు మోనై – పాదములో 1–3: 2–4 శీర్ల ఆద్యక్షరముల మైత్రి
ఒరూ ఉమోనై – పాదములో 1–4 శీర్ల ఆద్యక్షరముల మైత్రి
కూళై మోనై – పాదములో 2–3–4 శీర్ల ఆధ్యక్షరముల మైత్రి
మేత్ కదువాయ్ మోనై – పాదములో 1–3 4 శీర్ల ఆద్యక్షరములమైత్రి
కీళ్ కదువాయ్మోనై – పాదములో 1–2–4 శీర్ల ఆధ్యక్షరముల మైత్రి

ఇవి కాక తమిళములో మఱిమూడు మోనై విభేదము లున్నట్లు పులవర్ కుళందై పేర్కొనెను 19

కడైయిణై : పాదములో 3–4 శీర్ల ఆద్యక్షరముల మైత్రి.
కడైకూళై పాదములో 2–3–4 శీర్ల ఆధ్యక్షరముల మైత్రి
ఇడైణర్ – పాదములో 2–3 శీర్ల ఆద్యక్షరముల మైత్రి

కన్నడములో గల యతి సంస్కృత యతిని పోలినది. అనగా పదచ్ఛేదము మాత్రమే యనుట. కన్నడమున గల యతిని గూర్చి డా॥ కిర్కిగారు

"యతి అనగా విరామము. ప్రయత్న విశ్రాంతుల కూడలి యతి. విగళిత లయబంధ మెచటగలదో అక్కడ సహజయతి యున్నది. కన్నడయతి ఆంగ్లమందలి **Caesara - Point of natural pause in a metrical line** ను పోలినది."20 అని విశదీకరించిరి.

కన్నడ లాక్షణికు లెవరును కర్ణాట జాతులకు యతి స్థానములను పేర్కొన లేదు. ఈశ్వరకవి కవిజిహ్వాబంధనములో కందము – సీసము – ఆటవెలదులకు (2–42, 46, 47, 488, 49) వీరభద్రుడు నంది ఛందోర్ణవములో మాత్రము ద్విపద – సీస – ఉత్సాహ – గీతములకు కందపద్యమునకు (3–21) యతు స్థానముల నిర్వచించిరి.

పై పరిశీలనము వలన తెలుగు పద్యరీతులగు ద్విపద – సీస – ఉత్సాహ – గీతములను యతి సహితముగా కన్నడమున ప్రయోగింప వలయునని తెలియుచున్నది.

ఈ పద్యములందు మాత్రము నియత స్థానములందు 'అక్షరమైత్రిని' గూడ పాటింప వలయునని లాక్షణికుల అభిప్రాయము.

## యతి మోనై స్థానసామ్యములు :

తెలుగు పద్యములందుగల యతిస్థానములకు తమిళములో పేర్కొనబడిన మోనై విభేదములకు సామ్యములున్నవి.

1-3 గణాద్యక్షరములమైత్రి తమిళమున 'పొళిప్పుమోనై' యగును. ఈ విధమగుమైత్రి ద్విపద - మంజరి - మధురగతిరగడ- తరువోజ-ఎత్తుగీతి మొదలగు వానియందు కనిపించును.

మ ఱువిల్ కట్పిన్ వా ణుదల్ కణవన్

— మురుగాట్రుప్పడై - 6

### ద్విపద :

న డురాత్రి యరుదెంచె న రలోక నాథ - సులక్షణసారము 1-27

### మంజరి :

ప వనజుం డెపుడుచే ప ట్టుమం జరుల - లక్షణసారసంగ్రహము 2 127

### మధురగతిరగడ :

శ్రీవని తాధిపు చేరిభజింపుడు - అనంతుని ఛందోదర్పణము 3-68.

### తరువోజ :

ఏనేడ నింద్రాదు లేడవా రలకు

సప్పుడు మ్రొక్కుదు నేనునీ ధనము - అరణ్య 2-47

### ఎత్తుగీతి :

సురనాథుమీద సూటి

లిరువురు రెంట విరతి — అప్పకవీయము 4-358

1-4 గణాద్యక్షరముల మైత్రి తమిళమున 'ఒరూఉమోనై' అగును. ఈ విధమగుమైత్రి ఆటవెలది, తేటగీతి, పవడగీతి, మధ్యాక్కర - మధురాక్కరలందు కనిపించును.

ముడియుడై క్కడుంతలై పురట్టుం మున్నాళ్ - పట్టినప్పాలై - 230

ఆటవెలది – విశ్వ దాభి రామ వినుర వేమ

తేటగీతి – రాము డేరీతి లంకకు రాఁగ లండు

పవడగీతి – రవులు మువ్వ రుసుపు రంచరు లిద్దఱు

మధ్యాక్కర – సురరాజు సురరాజు (గూడి సూర్యుతో నొడబడి మఱియు
రేచన కవిజనాశ్రయము - జాత్యధికారము.

మధురాక్కర – రవిది విజరాజ గీర్వాణ రాజదే వాధిదేవ
రేచన కవిజనాశ్రయము - జాత్యధికారము

తమిళములో చెప్పబడిన మోనై విభేదములు పాదమునకు నాలుగు గణములు గల పద్యములకే పరిమితము. కాని తెలుగు లాక్షణికులు నాలుగు గణములకు మించిన పద్యము లందును యతి స్థానమును పేర్కొనిరి. మహాక్కర, మధ్యాక్కర, ఉత్సాహము, తురగవల్గనము కమలనగీతి, హరిగతి మొదలగు పద్యరీతులందు 5 వ గణాద్యక్షరముపై యతిని నిలుపవలయునని లాక్షణికులు పేర్కొని యున్నారు. ఇట్లే కొన్ని పద్యములకు గణములని చెప్పక మాత్రలపై లాక్షణికులు యతినిర్దేశించిరి. వానిలో హరిణగతికి 7 లఘువులపై, వృషభగతికి 14 లఘువులపై, చతుష్పద, వితాళ చతుష్పదలకు 8 మాత్రలపై యతి నిలుపవలయునని అనుశాసనము.

హరిణగతి – శ్రీని వాసుభ జింతు నేనని అనంతుని ఛందో దర్పణము 3-61

వృషభగతి – శ్రీమ నోహరు నంబు జోదరు చిత్తజాత గురుం దలంచెద
—ఛందో దర్పణము 3-60

చతుష్పద – చిన్నది యొక్కతె చెందొవ క్రోవిన్-సుదక్షిణా పరిణయము 3-89

వితాళ చతుష్పద – వీణాగానము వెన్నెల తేట
నాచన సోమన – వసంత విలాసము.

పై పరిశీలనము వలన తమిళ లాక్షణికుల కంటె ఆంధ్ర లాక్షణికులకు యత్యనురక్తి ఎక్కువ అని చెప్పక తప్పదు.

**4. 5. 2. యతిమైత్రి :**

సంస్కృతములో అక్షరమైత్రీ రూపమగు యతి లేదు. కనుక లాక్షణికులు యతి భేదములను పేర్కొనవలసిన అవసరము లేకపోయినది. కాని తమిళ లాక్షణికులు అక్షరమైత్రికి ప్రాధాన్య మొసగుట వలన యతి భేదములను చెప్పవలసినవారయిరి. తమిళమున ఏడు విధములగు యతులున్నవి.

1. అ ఆ ఐ ఔ
2. ఇ ఈ ఎ ఏ
3. ఉ ఊ ఒ ఓ
4. కగ చజ టడ తద పబ
5. చ త
6. ఞ న
7. మ - వ

కన్నడములో అభినవ కేశిరాజ ఈశ్వరకవి, గుణచంద్ర, వీరభద్రులు యతి మైత్రిని గూర్చి తర్కించినవారిలో ప్రముఖులు. అభినవ కేశిరాజ ఈశ్వరకవి కవి జిహ్వాబంధనములో స్వరవళి - సరసవడి - ఎక్కవడి - సంయుక్తాక్షరవడి - వర్గవడి - ప్రాసవడులను (2-34...41) పేర్కొనెను. గుణచంద్రుడు ఛందస్సారములో యతి స్వరూపమును (1-9, 10) చర్చించెను గాని విభేదములను పేర్కొనలేదు. వీరభద్రుడు నంది ఛందోర్ణవములో ప్రాణి విరామము - వర్గజయతి ఎక్కటివడి - ముకారవడి - మకారవడి - బిందువడి - వబవడి తద - టడలవళి, ర-ర, ఙ-ఞల మైత్రిని (1-56...65) విశదీకరించెను. కాని యివి యన్నియు తెలుగు లాక్షణికుల ననుసరించి చెప్పిన యతులగును.

తెలుగు లాక్షణికులెల్లరు యతిమైత్రిని గూర్చి చర్చించినవారే. మహాకవుల ప్రయోగ వైచిత్రి ననుసరించి యతి విభేదములు క్రమముగా పెరిగినవి. లాక్షణికులును ప్రయోగములననుసరించి యతులసంఖ్యను పెంచుచు లక్షణములను పేర్కొనిరి. రేచన 10 అనంతుడు 24 చిత్రకవి పెద్దన 27 (నన్నయభట్టు) లక్షణసారము 27, విన్నకోట పెద్దన 16, జయదేవచ్ఛందము 9, కవిలోకసంజీవని 12, సర్వలక్షణ సారసంగ్రహము (కూచిమంచి తిమ్మకవి) - 23, శ్రీధరచ్ఛందము - 30, అధ

ర్వాణచ్ఛందము - 29, ఛందస్సారసంగ్రహము - 27, కవిరాక్షసచ్ఛందము-21, నీలకంఠచ్ఛందము - 25, ఉత్తమగండచ్ఛందము - 21, కవితాలక్షణసారము 17, లక్షణవిలాసము - 26, గరళపురీ ఛందము - 50, అప్పకవీయము 41, యతిప్రాసవిలాసము 45, సులక్షణసారము 39, తాతంభట్టు 15 లక్షణశిరోమణి 39. రఘునాథయ్యలక్షణదీపిక 36 యతులను పేర్కొనుటచూడగా తెలుగుభాషలో యతిమైత్రికి సంబంధించిన ప్రాధాన్యము తెలియుచున్నది. పలువురు లాక్షణికులు పరిపరి విధముల యతిభేదములను చెప్పినను, సాధ్యమైనంతవఱకు సమగ్రముగా శాస్త్రీయదృక్పథముతో యతులను విగడించిన 'అప్పకవీయము'నకు తెలుగు ఛందో వాఙ్మయమున విశిష్టస్థానము లభించినది. అప్పకవి పేర్కొనిన యతులను శబ్ద తత్త్వశాస్త్రసిద్ధ సాజాత్యము, వ్యాకరణశాస్త్రసిద్ధ సాజాత్యము, తద్భవ సంబంధ సాజాత్యము - ఉచ్చారణస్వభావ సాజాత్యము ఆంధ్రమహాకవి సంప్రదాయ సాజాత్యము, స్పష్టప్రతిపాదనాభివేశ సిద్ధ సాజాత్యము, యుక్తిసిద్ధ సాజాత్యము, సంబంధ సంబంధ సిద్ధిసాజాత్యములని ఎనిమిది విధములు వర్గీకరింపవచ్చునని డా॥ ఎం. వి. సత్యనారాయణగారు ఛందశ్శాస్త్రము - అవతరణ వికాసములలో స్పష్టము చేసిరి.

తమిళ కన్నడాంధ్రములలో యతి సామ్యములు :

తమిళములో అఆఐఔ, ఇఈఎఏ, ఉఊఒఓ లకు మైత్రి చెల్లును. తమిళ వర్ణసమామ్నాయములో ఋౠలు లేవు కనుక పరిత్యజింపబడినవి. కన్నడములో, ఈశ్వరకవి, కవిజిహ్వాబంధనములో వీనిని 'స్వరవడి'గా (2-34, 35, 36) పేర్కొనెను. కన్నడ వర్ణసమామ్నాయములో 'ఋ ౠ' లుండుటవలన ఇఈఋ ౠ ఎ ఏ లకు పరస్పరముమైత్రిని ఈశ్వరకవి అంగీకరించెను. తెలుగులో అప్పకవి అఆఐఔలను అకారయతులుగా, ఇఈఋ ౠ ఎఏలను ఇత్వవళులుగా, ఉఊఒఓలను ఉద్విరామములుగా పేర్కొనెను. పై పరిశీలనమనుసరించి ఈ యతి తమిళ కన్నడాంధ్రములందు సమానమని నిర్ణయింపవచ్చును.

తమిళములో క గ చజ టడ తద పబ లకు మైత్రిచెల్లును. కన్నడాంధ్ర మలయాళ వర్ణసమామ్నాయములందు కవర్గ, చవర్గ, టవర్గ, తవర్గ పవర్గములకు ఐదు అక్షరములున్నవి. కాని తమిళములో ప్రతివర్గమునకు శ్వాసనాదభేదము వలన

రెండక్షరములు, అనునాసికాక్షరముతోచేరి మూడక్షరము లుండును. అనునాసికాక్షరములను వదలిపెట్టినయెడల కగ చజ టడ తద పబలకు మైత్రిచెప్పుట వర్గజయతి కాగలదు. నందిఛందోర్ణవకారుడు కఖగఘ, చఛజఝ - టఠ - తద - పఫబభలకు మైత్రి (1-58, 62) పేర్కొని యున్నాడు. తద - టడ అని రెండే అక్షరములు చెప్పినను తథదధ, టఠడఢ లను గూడ గ్రహింపవలసి యుండును. కవిజిహ్వా బంధన కారుడు వర్గవడికి లక్షణము ఇట్లు చెప్పియున్నాడు

చక్కనె వర్గగళైదై
దక్కర దొళ గొందు వడియ నను సంధిసుగుం
మిక్కవ నరి యీ యందది
బక్కం తాం వర్గవడిగె మధుకర కేశి (2-40)

ఈ పద్యమనుసరించి వర్గమందు గల ఐదు అక్షరములకు పరస్పర మైత్రి చెప్పుట 'వర్గవడి' కాగలదు. కాని యిట్టి లక్షణమును తమిళాంధ్ర లాక్షణికు లెవరును చెప్పలేదు.

అప్పకవి, ఏకస్థాన సంభవములగుట వలనను, శబ్దసూత్రముల ననుసరించియు అనునాసిక వర్ణముల విడిచిన నాల్గు అక్షరములకు పరస్పరము మైత్రి చెల్లుట వర్గజయతిగా (3-48-49) పేర్కొనెను. పై పరిశీలనము వలన వర్గజయతి ద్రావిడ భాషలకు సహజమని నిర్ణయింప వచ్చును.

తమిళములో 'వ-మ'ల మైత్రిని లాక్షణికులు అంగీకరించి యున్నారు. కన్నడ లాక్షణికులు వ-మల మైత్రిని చెప్పలేదు. యతుల సంఖ్యను పెంచిన అప్పకవియు వ-మల మైత్రిని పేర్కొనలేదు. కాని రఘునాథయ్య లక్షణ దీపికలో అదెన్న లక్షణ రాజీయములో ఈ యతి ప్రసక్తము.

సరి సంభావన వడియన
మరుదీమము లేమి కీర వాణియనంగన్
వచన సంభావన మనఁగఁగనుము

— లక్షణదీపిక

అను లాక్షణిక ప్రయోగములననుసరించియు,

"మూడి మది నుండి యేను బలవంతుఁడనై"

— హరివంశము 8-199

అను ఎఱ్ఱన ప్రయోగముననుసరించియు తెలుగులోగూడ 'మ-వ'లకు మైత్రి చెప్ప వచ్చునని నిర్ధారింపనగును. ముకారయతిచే పుపు బుభులు 'ము'తో అభేదవర్గయతిచే 'వు'తో మైత్రిచెల్లును గావున తత్సంబంధముచే 'ము-వు'లకు యతి చెల్లుబడియగునని సంభావించి రఘునాథయ్య 'సంభావన వడి' అని పేరుపెట్టి యుండవచ్చును. వ-మల మైత్రికి మరికొన్ని ప్రయోగములు కూడ కనిపించుచున్నవి.

వసుమతి గారవించుచు శ్రమంపడకుండినసేలకల్లు
(కావ్యాలంకారచూడామణి – 3–44)

వృశ్చికములకు బుధుడు స్త్రీ మిథునములకు
(రంగయఛందము 2-208)

ప్రవస్సియెంతయును శ్రమంపడి యుట్లు
(బసవపురాణము – 348)

పై పరిశీలనమువలన వ-మలమైత్రి తమిళకన్నడాంధ్రములకు సహజమగు యతి యని చెప్పవచ్చును.

తమిళలాక్షణికులు ఞ-నలకు మైత్రిని అంగీకరించియున్నారు. చవర్గ తవర్గ పంచమాక్షరములకు మైత్రిచెప్పుట ఈ యతివైశిష్ట్యము.

ఞా యిలుం సిఱందు నా ట్కొ డి నుడంగుం
–శిలప్పదికారం – 15

నీ ల చ్చునైయిల్ ఞ మిడార్ప
–మురుగాట్రుప్పడై – 6

కన్నడాంధ్రములందు ఞ-న ల మైత్రి లేదు. ఇట్లే చ-తల మైత్రియు కన్నడాంధ్రములందు కానరాదు. ఈ రెండును తమిళ భాషయొక్క ప్రత్యేకతను నిలుపు యతిభేదము లగును.

కన్నడమున నంది ఛందోర్ణవ కారుడు (1–57) క–కా–కై–కొ, కి కీ–కృ–కృా-కె కే —— కు కూ కా కో లకు మైత్రిని పేర్కొని యున్నాడు. ఇది తెలుగులోని 'ప్రాణి విరామము' పోలినదే.

ఈశ్వరకవి కవిజిహ్వా బంధనములో చ ఛ జ ఝ శ ష స లకు మైత్రిని సరసవడిగా (2–37) పేర్కొని యున్నాడు. తెలుగు లాక్షణికులు ఎల్లరు దీనిని

'సరసవళి'గా పేర్కొని యున్నారు. కాని చ ఛ జ ఝ శ ష స — అయహ –న ణ ల కు చెప్పుటనుగూడ తెలుగు లాక్షణికులు సరసవళిగా నెన్నిరి.

ఈశ్వరకవి కవిజిహ్వాబంధనములో సంయుక్తాక్షరవడికి ఈ విధముగా లక్షణము పేర్కొని యున్నాడు.

> పెణె యక్కర గళ్తి స
> ద్గుణయుతె కేళొత్తిగిక్కు గోకారముమం
> ఎణె యుంటె సతియరార్ కా
> ల్గణవింగం నిన్న పోల్తు దాత్రీ తళదోళ్ (2-39)

నిట్టి యతిని సంయుక్త యతిగా తెలుగు లాక్షణికులు పేర్కొనిరి. ఒకటికి మించిన హల్లుల కూడిక సంయుక్తము. సంయుక్తాక్షరము పాదాదియందుగాని యతి స్థానమందుగాని యుండవచ్చును. ఒక్క పాదమున పెక్కు యతులుగల స్రగ్ధర వంటి పద్యములలో ఆదిలో సంయుక్తమున్న తరువాత, నందే హల్లునకు యతి కూర్పబడునో ఆ హల్లునకే ఆ పాదములో తక్కిన యతిస్థానములలో మైత్రి పాటింపవలయును. అనగా క్ష్మా అను సంయుక్త మాదిలో నున్నచో నొకచోక రెండవచోట ష మూడవచోట 'మ' నిలుపరాదని భావము. పై పరిశీలనము వలన కన్నడ లక్షణము కంటె తెలుగు లక్షణము విస్తృతమని చెప్పవచ్చును.

కవి జిహ్వా బంధనకారుడు చెప్పిన ఎక్కవడికిని కవిజనాశ్రయకారుడు చెప్పిన ఎక్కటివడికిని పోలికలున్నవి. రేచన ఎక్కటివడికి ఇట్లు లక్షణము చెప్పియున్నాడు.

> ధర జ ఞ అను నీరెండ
> క్షరములు విన్నయడి లేదు కబ్బము మొదలన్
> మ ర వ ఱ ల లు నానేన
> క్కరములు తమతమకె వళ్ళు కమలాధీశా.
>
> కవిజనాశ్రయము – సంజ్ఞాధికారము.

పై లక్షణ మనుసరించి మ ర ఱ ల వ అను నైదక్షరములలోనే యక్షరమునకా యక్షరమే మైత్రిని గలిగి యుండునని చెప్పవలసి యున్నది కాని కవిజిహ్వాబంధనకారుడు మ ర ఱ ల వ లను అక్షరములను పేర్కొనక కకారాద్యక్షరముల కవే

అక్షరములు యతి స్థానమునం దుంచుటను ఎక్కువడిగా (2-38) నిరూపించెను. పై పరిశీలన ననుసరించి ఈశ్వరకవి లక్షణము విస్తృతమని చెప్పవలసి యుండును. నంది ఛందోర్ణవకారుడు మాత్రము ర-ర; ఱ-ఱ ల పరస్పర మైత్రిని మాత్రము (1-59) అంగీకరించి యున్నాడు.

వీరభద్రుడు నందిఛందోర్ణవమునందు 'ముకార వడి'ని పేర్కొని యున్నాడు. (1-69) పు-ఫు-బు-భులకు ముకారముతో మైత్రి చెప్పుట ముకారవడి కాగలదు. తెలుగు లాక్షణికులగు చిత్రకవి పెద్దన, లింగమగుంట తిమ్మన, కూచిమంచి తిమ్మన, రంగకవి ప్రభృతులు ముకారయతిని చక్కటియతిగా పేర్కొనిరి తాతంభట్టు కవిచింతామణిలో ఈ చక్కటియతి 'ఒక్కొక్కప్పుడు చెవులకు వినఁగక్కసమగు కవిమతంబుగాదు' (వళిప్రాసాధికారము) అని నిరసించియున్నాడు.

వీరభద్రుడు నందిఛందోర్ణవములో పేర్కొనిన మరియొక యతి అభేదయతి. ఇతడు నణలమైత్రిని అభేదయతిగా (1-60) పేర్కొనెను. అప్పకవి మతము ననుసరించి యిది సరసవళిలో నొకభాగమగును. ఇట్లే వీరభద్రుడు ర-ళ-ల మైత్రిని గూడ అభేదయతిగా పేర్కొనియున్నాడు కాని అప్పకవి మతముననుసరించి 'ర-ల'ల మైత్రి అంగీకరింపవీలులేదు అప్పకవి యిట్టిమైత్రిని అగ్రాహ్యాభేద వర్గ యతిలో చేర్చియున్నాడు. కాని రంగకవి యిట్టి యతిగ్రాహ్యమని యిట్లు పేర్కొని యున్నాడు.

"లకార ళకారములకును లకారడకారములకును ప్రాసములు యతులు చెల్లును ఱకారరేఫలకు లకారమును, దకారడకారములకును యతులు మాత్రము చెల్లును"

— ఆనందరంగరాట్ఛందము — పుట 106

పై పరిశీలనమువలన కన్నడాంధ్రములందు ర ళ ల మైత్రి లాక్షణిక సమ్మతమని చెప్పవచ్చును.

వీరభద్రుడు నంది ఛందోర్ణవమునందు పేర్కొనిన మరియొకయతి బిందు పూర్వకములగు యరలవలకు మకారముతో సాజాత్యము చెప్పుట. దీనిని వీరభద్రుడు సంభావనయతిగా (1-63) పేర్కొనెను. కాని అప్పకవి లక్షణముల ననుసరించి యిట్టి మైత్రి 'మవర్ణవిరామము' అగును. బిందుపూర్వకములగు అంతస్థములు, బిందుపూర్వకములగు ఊష్మములు మకారముతో మైత్రిపొందుటను అప్పకవి

మవర్ణవిరామముగా పేర్కొనెను. కనుక పై పరిశీలనమనుసరించి వీరభద్రుని లక్షణముకంటె అప్పకవి లక్షణము విస్తృతమని తెలిసది.

వీరభద్రుడు నందిఛందోర్ణవములో పేర్కొనిన మరియొక యతి హకారవడి (1.64). వీరభద్రుని లక్షణమనుసరించి ంప ంఫ ంబ ంభ ంహ లకు మకారముతో మైత్రి చెప్పుట హకారవడి కాగలదు. అప్పకవి లక్షణమనుసరించి ంప ంఫ ంబ ంభ లకు మకారముతో యతిచెప్పుట బిందుయతి కాగలదు. అప్పకవి బిందుయతి స్వరూపమిట్లుండును.

ంక ంఖ ంగ ంఘ ఙ — ంచ ంఛ ంజ ంఝ ఞ

ంట ంఠ ండ ంఢ ణ — ంత ంథ ంద ంధ — న

ంప ంఫ ంబ ంభ మ

కనుక పై పరిశీలనమనుసరించి వీరభద్రుని లక్షణముకంటె అప్పకవి లక్షణము విస్తృతమని చెప్పుకతప్పదు పూర్ణబిందుపూర్వకములగు హకారములకు మకారముతో మైత్రిచెప్పుట మవర్ణవిరామమునందే అంతర్భవించును.

వీరభద్రుడు నంది ఛందోర్ణవములో పేర్కొనిన చివరియతి వ—బ లకు సంబంధించినది. అప్పకవి మతమనుసరించి యిది అభేద విరతి యగును.

కన్నడలాక్షణికులు పెక్కుయతులను పేర్కొనినను వానికి నుదాహరణముల నొసగలేదు. ఈశ్వరకవి వీరభద్రులుగూడ తమ లక్షణగ్రంథములందు కొన్నిచోట్ల మాత్రమే యతిమైత్రిని పాటించిరి. వీరి ఛందోగ్రంథములందు కొన్ని యతివిశేషములు మాత్రము కనిపించుచున్నవి.

నంది ఛందోర్ణవము

| | |
|---|---|
| మరెయదె మనవొలిదు నోడు వారిజ గంధీ — మ — వ | 1—64 |
| భదదిం తరుణి హకార వడి యెంబుదు కేళ్ — భ — వ | 1—64 |
| ధర యొళ్ నీ నొలిదు కేళ్ తరుణీ మణియె — ధ — త | 1—57 |
| జలమధి దైవతా స్వరవు కేళ్ పంచమ — జ — స | 1—48 |
| శరణాళి సమేత దాత సంతత కరుణీ — శ — స | 1—67 |

కవిజిహ్వాబంధన

| | |
|---|---|
| స్వరగళనిం నమసి మేలె పేళ్వుదు కృతియం వ — ప | 3—39 |

పై పరిశీలనము వలన ఆంధ్ర లాక్షణికుల ననుసరించి ఈశ్వరకవి వీరభద్రులు యతి భేదములను చెప్పినట్లున్నది. కాని వారు ప్రధానముగా విచ్ఛేదరూప యతికే ప్రాధాన్య మొసగిరి. కనుక 'కన్నడక్కె యతి ఇల్ల కోణక్కె మతియిల్ల' అను నానుడి సార్థకమే. కన్నడమునకు యతిలేదు ఎనుపోతునకు మతిలేదని పై వాక్యమున కర్థము. ఇంతవఱకు తమిళాంధ్ర సామ్యయతులను, కన్నడాంధ్ర సామ్యయతులను పరిశీలించితిమి.

## తెలుగులో మాత్రము కల యతి భేదములు :

తెలుగుపై సంస్కృత భాషా ప్రభావ మెక్కువ. సంస్కృతమునగల వర్ణములన్నియు ఆంధ్రవర్ణ సమామ్నాయమున గలవు. సంస్కృత శబ్దములు కొన్ని మార్పుల నొంది తెలుగున వాడబడుచున్నవి. సంస్కృత వ్యాకరణ సంప్రదాయములు తెలుగున చాల వఱకు ప్రవేశించినవి. పై కారణమువలన తెలుగున యతిభేదములు పెరిగినవి. వానిలో ఋవళి — ఋత్వ సంబంధవళి —ఋత్వసామ్యవళి – వృద్ధివళి – తచ్ఛవవ్యాజ విశ్రమము, విశేషవళి, అను స్వార సంబంధయతి. అనునాసికాక్షర యతి, ముకార యతి, ఋజుయతి, భిన్నయతి, అంత్యోష్మసంధివడి, వికల్ప విరమణము, యుష్మదస్మచ్ఛబ్ద యతులు, ప్రాదియతులు, నిత్యసమాసయతులు ప్రధానములు. ఇక తెలుగు సంధుల ననుసరించి ప్రత్యేక యతి. దేశ్యనిత్య సమాస విశ్రాంతులు, నిత్యయతి, రామ సంధవళి, విభాగవళి, నామాఖండ విశ్రమములు, పంచమీ విభక్తి విరామము లేర్పడినవి. వీనిలో కొన్నింటిని మాత్రము పరిశీలింతము.

రి—రీ–రె—రే లకు ఋకారముతో మైత్రిచెప్పుట ఋవళి. ఇ–ఈ–ఋ—ౠ–ఎ—ఏలకు వట్రసుడితో మైత్రిచెప్పుట ఋత్వసంబంధవళి. హల్లులు భిన్నములయినను వట్రసుడి యున్నదను సామ్యముచే యతిచెప్పుట ఋత్వసామ్యవళి. సంస్కృత వర్ణమగు ఋకారమును గ్రహించుటవలనను ప్రయోగ వైవిధ్యమనుసరించియు ఈ యతులేర్పడి యుండునని చెప్పవచ్చును.

అచ్సంధిగల శబ్దములలో పరపదాద్యచ్చునకు యతి కూర్చుట స్వరప్రధానవళి. అకారము మీది విసర్గకు అకారము పరముకాగా వచ్చు ఓకారమునకు అకారముతో

యతి చెప్పుట స్వరప్రధానవళి. వృద్ధిసంధియందు ఉభయస్వరమైత్రి వృద్ధివళి. "వర్గహల్లులకు పరమైన హకారమునకు తత్తద్వర్గచతుర్థాక్షర మాదేశమగును — అట్టి చోట్ల లోపించి గూఢముగా నున్న హకారమునకేని వర్గహల్లున కేని యతి పాటించుట అంత్యోష్మసంధివడి. "కచటతపలకు అనునాసికము పరమగుచో తత్తద్వర్గాంతానునాసికములు వికల్పముగా వచ్చును. అట్టి చోట్ల రెండు రూపములకు మైత్రిచెప్పుట వికల్పవిరమణమగును. యుష్మత్ ఆజ్ఞ - యుష్మదాజ్ఞ - మున్నగు అచ్సంధిగలశబ్దములలో సంధ్యక్షరములలో కేవల స్వరమునకుగాని వ్యంజనమునకుగాని మైత్రిగూర్చుట యుష్మదస్మచ్ఛబ్దయతులగును. శకంధు, కర్కంధు, కుద్దాలాది పరరూపసంధిగత శబ్దములందు భయవళిచెప్పుట పరరూపయతి. ప్రాద్యుపసర్గ యోగముగల శబ్దములలో నుభయ యతి ప్రాదియతి పదద్వయస్వరసంధి చక్కగా తోపని సమాసపదములందుభయ యతి చెప్పుట నిత్యసమాసవిశ్రాంతి యగును. పైన పేర్కొన బడినయతులన్నియు సంస్కృత సంధిసూత్రముల ననుసరించి యేర్పడినవే.

జవరాలు, పూజ్యారాలు ఇత్యాది రుగాగమసంధిఘటిత శబ్దములలో నుభయ యతి చెప్పుట రాగమసంధివళి. విభాగార్థమున వచ్చు 'వెసి' చేరిన సంధిలో నుభయ యతి చెప్పుట విభాగవళి కన్న, కంటె ప్రత్యయముల కుభయ యతిని పేర్కొనుట పంచమీవిభక్తివిరామము. పైన పేర్కొనబడిన యతులన్నియుతెలుగు సంధి సూత్రములననుసరించి యేర్పడినవే.

తత్సమములలోని జ్ఞకారము తద్భవరూపములలో నకారముగా మారును ఈ తద్భవ సంబంధకారణమున జ్ఞ-నలకు మైత్రి చెప్పుట తద్భవవ్యాజప్రశమము. వంశము-వివేకము ఇత్యాదులలోని విభక్తి మువర్ణముతో పుపుబుభులకు మైత్రిచెప్పుట ముంభక్తి యతియగును. ఈ రెండు యతులును. సంస్కృతశబ్దములు తెలుగున చేరునపుడు పొందు మార్పులననుసరించి వర్గీకరింపబడిన యతులుగా పేర్కొనవచ్చును

పై తులనాత్మక పరిశీలనము వలన దాక్షిణాత్య భాషలకు సహజమయిన యతులను నిట్లు వర్గీకరింపవచ్చును.

1. అ ఆ ఐ ఔ
2. ఇ ఈ ఎ ఏ
3. ఉ ఊ ఒ ఓ

4. క వర్గము [అనునాసికాక్షరము తప్ప మిగిలిన నాలుగు అక్షరములు]
5. చ వర్గము
6. ట వర్గము
7. త వర్గము
8. ప వర్గము
9. వ – మ

### 4. 5. 3. ప్రాస :

దాక్షిణాత్య భాషలన్నిట మాధుర్య హేతువుగా భావింపబడిన ఛందోంగము లలో ప్రాస యొకటి. సంస్కృత ప్రాకృత ఛందోగ్రంథకర్త లెవ్వరును ప్రాసను ఛందోంగముగా చెప్పలేదు. సంపర్వ్విరామములను ఛందోంగములుగా నెన్నిన భరతుడు ప్రాసను గూర్చి యేమియు చెప్పలేదు. కాని సంస్కృతాలంకార గ్రంథ ములందు అనుప్రాస చర్చ కలదు.

వర్ణసామ్య మనుప్రాసః – కావ్యప్రకాశము9 104
అనుప్రాసః శబ్దసామ్యం, వైషమ్యేపి స్వరస్యయత్
రసాద్యను గతత్వేన ప్రకర్షేణ న్యాసః అనుప్రాసః
—విశ్వనాథుడు – సాహిత్య దర్పణము.

ఆవృత్తి ర్యాతు వర్ణానాం
నాతి దూరాంతర స్థితా
అలంకారః స విద్వద్భి
రను ప్రాసః ప్రదర్శ్యతే

—సరస్వతీ కంఠాభరణము 11–70

ప్రకృష్టమగు వర్ణములను ఆయా నియతస్థానముల నుంచుట ప్రాస ద్రావిడ భాషలలో ద్వితీయాక్షర తుల్యత్వమే ప్రాస యగును. దండి కావ్యాదర్శములో మాధుర్య గుణమును వివరించు సందర్భమున క్రింది శ్లోకమును పేర్కొనెను.

చంద్రే శరన్నిశోత్తం సే
కుంద స్తబక విభ్రమే

ఇంద్రనీల సమం లక్ష్మ
సందధాత్యే లిన శ్రియం
—కావ్యాదర్శము 1—56

పై శ్లోకమునందు ప్రతిపాద ద్వితీయ స్థానగత సదృశవ్యం జనావృత్తి రూపమగు అనుప్రాస భేదము కానవచ్చుచున్నది. ఇది దాక్షిణాత్య చ్ఛందోరీతుల ననుసరించి చూడగా ప్రాస విశేషమే యగును.

సంస్కృతచ్ఛంద శాస్త్రకర్తలలో జయకీర్తి మాత్రము ఛందోను శాసనములో ప్రాసను గురించి యిట్లు పేర్కొనెను.

పాదోక్షర మాత్రా నియ
మోదిత పిండోఒథ పాదవత్ పద్యం స్యాత్
పాద ద్వితీయ వర్ణః
పాదం పాదం య ఏతి సోఒమ ప్రాసః 1—125

ప్రతి పాదమునందును వచ్చు పాద ద్వితీయ వర్ణము అనుప్రాసమని జయకీర్తి లక్షణము.

**తమిళములో ప్రాసలు :**

తమిళములో 'ప్రాస' అనుపదములేదు. తమిళ ఛందోగ్రంథములందుగల 'ఎదుగై' ప్రాసను పోలినదే. తమిళమునగల 'ఎదుగై' 8 విధములు.

ఇణై ఎదుగై — 1, 2 శీర్ల ద్వితీయాక్షరమైత్రి
పొళిప్పు ఎదుగై — 1, 3 శీర్ల ద్వితీయాక్షరమైత్రి
ఒరూఉ ఎదుగై — 1, 4 శీర్ల ద్వితీయాక్షరమైత్రి
కూళై ఎదుగై — 1, 2, 3 శీర్ల ద్వితీయాక్షరమైత్రి
మేఱ్కదువాయ్ ఎదుగై — 1, 3, 4 శీర్ల ద్వితీయాక్షరమైత్రి
కీళ్క్కదువాయ్ ఎదుగై — 1, 2, 4 శీర్ల ద్వితీయాక్షరమైత్రి
ముఱ్ఱెదుగై — 1, 2, 3, 4 శీర్ల ద్వితీయాక్షరమైత్రి

పై పేర్కొనబడిన ఎదుగై భేదములతోబాటు పులవర్ కుళందైగారు మరి కొన్ని ఎదుగై భేదములను పేర్కొనిరి.

కిడైయిణై ఎదుగై — 3, 4 శీర్ల ద్వితీయాక్షరమైత్రి
కడైక్కూళై ఎదుగై — 2, 3, 4 శీర్ల ద్వితీయాక్షరమైత్రి
ఇడైప్పుణర్ ఎదుగై — 2, 3 శీర్ల ద్వితీయాక్షరమైత్రి
పిన్నెదుగై — 2, 4 శీర్ల ద్వితీయాక్షరమైత్రి

తొల్కాప్పియం (తోడై అధికారం) - పుట 32

## కన్నడములో ప్రాసలు :

కన్నడమున ప్రాస కత్యంత ప్రాధాన్యమున్నది ప్రాసలేనిపద్యము కన్నడమున లేదనవచ్చును. కన్నడ ఛందోగ్రంథకర్తలెల్లరు 'ప్రాస'లను విపులముగా చర్చించినవారే. ఈశ్వరకవి ప్రాసలక్షణమును ఇట్లు పేర్కొనియున్నాడు.

> మొదలక్కరదిం ముంతణ
> దదునోడల్ ప్రాస దక్కరం "తత్ప్రాసం
> విదితం నాల్కుం పాద
> క్కదయిసిగుం వర్ణవొందె పదపద్యక్కం"
>
> — కవిజిహ్వాబంధన 2-4

ఈశ్వరకవి పై పద్యమున "పద్యమునందు మొదటి అక్షరము తరువాత గలది ప్రాస" అని పేర్కొనెను. ప్రాసలేని పద్యము శ్వాసరహిత కళేబరమని యతని నిర్ణయము. సర్వజ్ఞకవి 'ప్రాసవిల్లద పదవపాడిదరేను (ప్రాసలేని పద్యములేదా పదము పాడుట వలనఫలమేమి) అని ప్రాసనిర్బంధమును సూచించెను. పై కారణములవలన కన్నడములో ప్రాస కత్యంత ప్రాధాన్యమున్నదని' నిర్ణయింపవచ్చును.

## తెలుగులో ప్రాసలు :

ఆంధ్రలాక్షణికులెల్లరు 'ప్రాస'లను గూర్చి ఛందోగ్రంథములందు చర్చించిరి

'ఆద్యోవర్ణః ద్వితీయః ప్రాసః'

అని వాగనుశాసనుని ప్రాసలక్షణము. రేచన 'కృతులంబరగు సుకర ప్రాసా'దులనే ప్రాసములుగా భావించెను. అనగా రేచన దృష్టిలో ప్రాసలు శబ్దాలంకారములే యనుట. అప్పకవి ప్రాసలక్షణములను

'ప్రథమపాద ద్వితీయాక్షరంబు ప్రాస
మయ్యెఁ బదపద్యముల నడుగడుగునందు
నదియు రెండవ వర్ణమై యమరు సీస
గీత దండక మంజరీ కృతులఁదక్క" 3-28

ప్రాసములకెల్లఁ దుల్యాక్షరంబులైనఁ
జాలు, స్వరభేదమైన దోషంబులేదు" 3-289

అని వివరించెను.

పై చర్చవలన ప్రథమపాద ద్వితీయాక్షరము ప్రాస యనియు ప్రాసకు వ్యంజన సామ్యమే ముఖ్యమనియు, స్వరసామ్యము లేకున్నను దోషములేదని తెలియుచున్నది.

మలయాళములో ప్రాస :

మలయాళములో యతి కంటె ప్రాస ముఖ్యము. లీలాతిలకమను ఛందో గ్రంథములో ఎదుక (ప్రాస) చెప్పబడినది. యతి ప్రాసలను పాటింపకున్నచో దోషమగును అనుప్రాస నియమములను వ్యతిరేకించినచో నట్టివి వికారానుప్రాస లగును. మలయాళ లాక్షణికులు ప్రాసలను ఛందోంగముగ, అలంకారముగా గూడ భావించిరి. అందలి ప్రాసలను గూర్చి డా॥ కే. ఎం. అనుజన్‌గారు

'Prasas have not been devided into atimovai, inamovai acedukai, talaiyakedu kai etc. as in Tamil Antadi was Prevalent in the early works bearing Tamil influence End rhyme is not common in the metres of both these languages though musical verse sometimes employ it 22' అని తెలిపిరి.

పై పరిశీలనము వలన దాక్షిణాత్య భాషలందు ప్రాస కత్యంత ప్రాధాన్య మున్నదని నిర్ణయింపవచ్చును. తమిళ కన్నడ మలయాళము లందు ప్రాసలేని పద్యములేదు. 20 వ శతాబ్దములో మలయాళ సాహిత్యములో ద్వితీయాక్షర ప్రాసకు సంబంధించి యొక సాహిత్య ఉద్యమమే వెలువడినది. తెలుగులో మాత్రము వృత్త జాతులందు ప్రాస ముఖ్యము. ఉపజాతులందు ప్రాస ముఖ్యము కాదు. వ్యంజన సామ్యము, ద్వితీయాక్షర తుల్యత్వములనునవి ప్రాస సామాన్య లక్షణములగును.

<u>ప్రాస మైత్రి :</u>

పద్యపాది ప్రథమాక్షరము యతి కాగా ద్వితీయాక్షరము ప్రాస. యతియందు అచ్చునకు హల్లునకు ప్రాధాన్యమున్నది. ప్రాసలందు హల్లునకు మాత్రము ప్రాధాన్యము. అచ్చులకు లేదు.

తమిళములో ప్రాసాక్షర మైత్రి

1. ఇన ఎదుగై : ఒక వర్గమునకు చెందిన హల్లులకే మైత్రి చెప్పుట.

ఇది మూడు విధములు :

వల్లినం : క చ ట త ప ఱ
మెల్లినం : ఙ ఞ ణ న మ
ఇడెయినం : య ర ల వ ఆ ళ

**ఉదా :** తక్కార్ తగవిలర్ ఎన్బ దవరవర్
ఎచ్చత్తా ట్కాన ప్పడుం

—కురళ్

మొదటి పాదమున ద్వితీయాక్షరము 'క్కా' రెండవ పాదమున ద్వితీయాక్షరము 'చ్చ'. "క చ"లు వల్లినం వర్గములో చేరును. కనుక ఈ రెండక్షరములకు మైత్రి.

2. ఆసెదుగె : ళ అక్షరము "ఆసు" అనగా హత్తుట. వెండి బంగారు భూషణములను తయారు చేయువారు. "పొడి" యుంచి సంధింతురు అట్లే పద్యము నందు ప్రథమాక్షరమునకు ప్రాసాక్షరమునకు సంబంధము కలుపుట వలన 'ఆసెదుగై' అని చెప్పబడినది.

ఈ ఆసెదుగైలో ప్రథమాక్షరము తరువాత గల య ర ళ అక్షరముల వదలివేయవచ్చును.

**ఉదా :** కా య్ చ్చ } ఇక్కడ 'య' వదలబడినది
ఈ చ్చం

| | |
|---|---|
| సా నిణాన్<br>సేర్న్నుత్తై | ఇచట మొదటి పాదమున 'ర్' వదలబడినది. |
| వాళ్ తవల్<br>తి ర్రసై | ఇచట రెండవ పాదమున 'ళ్' వదలబడినది. |
| ఆవే<br>పాల్వే | ఇచట మొదటి పాదమున 'ల్' వదలబడినది. |

3. నెడిల్ ఎదుగై — నెడిల్ అనగా దీర్ఘాక్షరము. హల్సంబంధము లేక కేవల స్వరసామ్యముతో ప్రాసమైత్రిని కూర్చుట.
   ఆవా కూకూ మామా ఏగీ
4. అనునాసికములయిదు పరస్పరము ప్రాసలో చెల్లుట.
5. లఘు అలఘు రేఫములకు ప్రాసలో మైత్రి చెప్పుట

## కన్నడములో ప్రాసమైత్రి :

కన్నడములో మొదట ప్రాసభేదములను చెప్పినవాడు నృపతుంగుడు. ఇతడు కవిరాజమార్గమున అపురమైత్రికి సంబంధించిన ప్రాసలను, అలంకార ప్రాసలను పేర్కొని యున్నాడు. అక్షరమైత్రికి సంబంధించిన ప్రాసలు వరుసగా ఏనుత, శాంత సమీప - వర్గప్రాసలే యగును. అలంకారప్రాసలు వరుసగా సింహ-గజ-వృషభ - శరభ - అజ - తురంగములగును (2-28 to 2-43) కన్నడములో ప్రాసలను విస్తరించి చెప్పినవారిలో ఈశ్వరకవి ముఖ్యుడు. ఇతడు కవిజిహ్వాబంధనములో అలంకార ప్రాసలను పలువిధములుగా వర్గీకరించి సోదాహరణముగా వివరించియున్నాడు. నృపతుంగుడు పేర్కొనిన షడ్విధ ప్రాసలతోపాటు తాండవ, భృంగ, అహి, కాక, హంస 'ప్రాసలను ఈశ్వరకవి అనుసంధానించెను. (2-17-21). మఱియు కొన్ని ప్రాసలని' అల్పప్రాణ మహాప్రాణ, మిత్రప్రాసలను, యుగ్మవర్ణప్రాస, త్రిప్రాస, అంత్యప్రాస, దుస్తరప్రాస, అనుప్రాస ఆద్యంతప్రాసలను (2 22-27) చేర్చియున్నాడు. మరియొక లాక్షణికుడగు గుణచంద్రుడు సుకరప్రాస - అనుప్రాస - దుష్కరప్రాస - అంత్యప్రాస- ద్విప్రాస-త్రిప్రాసలను మాత్రము పేర్కొనెను. వీరభద్రుడు నంది ఛందోర్ణవమునందు సుకర - ద్వంద్వ - మిత్ర - అంత్యప్రాసలను (1-11) మాత్రము విశదీకరించెను

పై పరిశీలనమనుసరించి కన్నడ లాక్షణికులు అలంకార ప్రాసలకే ప్రాధాన్యమిచ్చి నట్లు నిర్ధారింపవచ్చును.

## తెలుగులో ప్రాసలు :

కవిజనాశ్రయములో అలంకారప్రాసలే కలవు. ప్రాసమైత్రికి సంబంధించిన విశేషములందుకానరావు. కావ్యాలంకార చూడామణియందు అలంకారప్రాసలతోబాటు లళడ ఋక్రాంతప్రాసలను విభేదములును గలవు (7–73 టు 88). కాని తదనంతి లాక్షణికులు యతిభేదములతో, ప్రాసభేదములనుగూడ విపులముగా చర్చించిరి. అనంతుని ఛందోదర్పణము 12, చిత్రకవిపెద్దన లక్షణసారసంగ్రహము 12, లక్షణ విలాసము 20 యతిప్రాసవిలాసము 24, లక్షణదీపిక 15, లక్షణశిరోమణి 12, సర్వలక్షణసారసంగ్రహము – 7 – ఆనందరంగరాట్ఛందములందు 12 ప్రాసభేద ములు కలవు. ప్రాసస్థానమున తుల్యాక్షరము ఆవృతము కావలయునను నియమము సడలింపబడుటవలనను, శ్రుతిసాదృశ్యము, భాషాపరిణామము, సంధికార్యములు మున్నగు వానిని పురస్కరించుకొనియు ప్రాసభేదములు పెరిగెనని చెప్పవచ్చును.

## సామ్యప్రాసలు :

తమిళ కన్నడాంధ్రభాషలందు కనిపించు సామ్యప్రాసలలో మొదటిది సంయుక్తవిశేషప్రాస. ప్రథమ పాదమున ప్రాసస్థానములో నెన్నిహల్లులు సంయు క్తముగా నున్నవో యన్నిహల్లులు సమముగ తక్కిన పాదములందు ప్రాసస్థానములో నుండవలయునను నిర్బంధములేక కొన్నిహల్లుల సామ్యము మాత్రము నిలుపుట సంయుక్తవిశేషప్రాస కాగలదు. దీనినె తమిళమున ఆసెదుగై అని లాక్షణికులు పేర్కొనిరి. కన్నడిమునందట్టి ప్రాసలను లాక్షణికులు శాంతప్రాసలుగా వ్యవహ రించిరి.

తమిళము : ఆవే ఉరువిన వాయినుం ఆపయంద.
పాల్వేఱురు ఎన వల్లవామ్ – తొడై యదికారం - పుట 23

కన్నడము : అంత్యాక్షర గురువా దొడె
యంతదు సగణం విదెశగమనం కర్తగె

అంత్య దొళిరె లఘు తగణం
ఇం తి రలా కావ్య పతిగె జయ భయ పిల్లం
— కవిజిహ్వాబంధన 1-26

తెలుగు : మర్త్యలోకమునకు కర్తయున్నాడె
అక్షణంబున పంచ భక్ష్యముల్ గుడిపి

తమిళకన్నడాంధ్రభాషలందు కనిపించు సామ్యప్రాసలతో రెండవది వర్గ ప్రాస. ఆయా వర్గలలోని మొదటి నాల్గక్షరములలో పరస్పరము ఒకదాని కొకటి ప్రాసగా నుపయోగించుట వర్గప్రాస. అప్పకవి దీనిని స్వవర్గజప్రాసగా పేర్కొనెను.

కన్నడము : ఆద్య గురు భగణ శశి శుభ
మధ్యది లఘు రగణ మగ్ని హొల్లమదక్కుం
మధ్య గురు జగణ రవియుం
నింద్యం, కొనె లఘువు తగణ మభ్రం హేయం
గుణచంద్రుని ఛందస్సారము 1—7

పై పద్యమునందు దధ లకు ప్రాస కూర్పబడినది.

తెలుగు — కాదన కిట్టిపాటి యపకారముఁ దక్షకుఁడేక విప్రసం
బోధన చేసి చేసె... ... భారతము - ఆదిపర్వము 2-204

పై తెలుగు పద్యమునందును దధలకు ప్రాస కూర్పబడినది. తదితర వర్గాక్షరములకు కన్నడాంధ్రములందు ప్రాసమైత్రి కనిపించును.

తమిళ కన్నడాంధ్రములందు కనిపించు సామ్యప్రాసలలో మూడవది ప్రాస యతి. ప్రాసాక్షర మనుసరించి యతిని పాటించుట ప్రాసయతి. తమిళ పద్యములకు ప్రాసస్థానమని ప్రత్యేకముగా లేదు. ప్రతి గణము యొక్క రెండవ అక్షరము తమిళమున ప్రాసస్థానమే యగును. కన్నడమున యతికి ప్రాధాన్యములేదు. ప్రాసకు మాత్రమే ప్రాధాన్యము. కనుక కన్నడ లాక్షణికులు తెలుగునుండి గ్రహించిన ఆటవెలది, తేటగీతి, సీసము, ద్విపదలకు మాత్రము ప్రాసవడిని అంగీకరించిరి. ఈ పద్యములు తెలుగులో ఉపజాతి వర్గమున చేరును. ఉపజాతులకు ప్రాసయతి

నిలుపవచ్చునని ఆంధ్ర లాక్షణికులు పేర్కొనుటయే యిందులకు కారణము. ఈ ప్రాస యతి తెలుగున లయగ్రాహి, లయ విభాతి, లయహారులందును నియతము. ప్రాస యతికి నుదాహరణములు.

తమిళము — తిరుమగళ్ అరుళిలర్ తెళివిలర్ అఱివిలర్

—యాప్పెరు - పుట 47.

కన్నడము — తింగళ తలెగిట్టం కంగళ మురాంతం

—కవిజిహ్వాబంధన 2-48

తెలుగు — దేవకీ కుమార గోవర్ధనోద్ధార —అప్పకవీయము.

పరభుక్తి చిరముక్తి కరభక్తి రతుల

ఒకచాయ ననపాయ పికగేయ సముదాయ

—వసుచరిత 2

తమిళాంధ్ర ప్రాసలు :

తమిళ లాక్షణికులు పేర్కొనిన అనునాసిక ప్రాసకు, అప్పకవి పేర్కొనిన ఉభయప్రాసకు (3-329) సామ్యములున్నవి. తమిళములోగల అనునాసికాక్షరము లైదును పరస్పరము మిత్రత్వము నొందును. కాని తెలుగులో మాత్రము నణ లకు మాత్రము ప్రాసమైత్రి కూర్పవచ్చును. అప్పకవి ఆదేశ షకార ణకారములకు శబ్ద గత సిద్ధ సకార నకారములకు మైత్రి చెప్పుటను ఉభయ ప్రాసగా పేర్కొనెను. కనుక నణలకు ప్రాసమైత్రి కూర్పవచ్చునని రూఢియగుచున్నది.

ఉదా : దుర్నిమిత్తముల్ పుట్టిన సిగ్గయించి

—భారతము - అరణ్యపర్వము 1-49

ఇట్లే అప్పకవి ద్విత్వములైన నకార మకారములు క్రమముగా పూర్ణబిందు పూర్వక మకారములలో ప్రాస చెల్లుటను అనునాసిక ప్రాసగా (3— ) విశదీకరించెను. అనగా నమ లకు మైత్రి చెప్పుట అని తెలుచున్నది.

ఉదా॥ తమ్ములను ... ... భ

క్తిమ్మర సంహరు [భక్తిన్ + మర]

—అప్పకవీయము 3-342

ఇట్లే అప్పకవి ంబ - మ్మలకు ప్రాస గూర్చుటను ప్రాసమైత్రి ప్రాసగా (3-343) పేర్కొనెను. అనగా అనునాసికాక్షరములకు ప్రాస కూర్చుట అను ధర్మము స్పష్టమగు చున్నది. తమిళములో పూర్ణబిందు లేఖనము లేదు అనుస్వారమును అనునాసికముగా వ్రాయుట తమిళ సంప్రదాయము. ఉదా : అంగడి - రంపము చింతన - కుజవంజి - మొదలుగునవి.

పై పరిశీలనము వలన తెలుగు లక్షణము కంటె తమిళ లక్షణము విస్తృతమని చెప్పవచ్చును.

తమిళాంధ్రములందుగల సామ్యప్రాసలలో లఘ్వలఘురేఫప్రాస యొకటి తమిళములో ప్రథమపాదముయొక్క ప్రాసస్థానమునందు అలఘురేఫమున్నచో తక్కినపాదములందుగల లఘురేఫము అలఘురేఫముగా మారుచుండును. ఇట్లే అలఘురేఫము లఘురేఫముగా మారును. సూక్ష్మముగా ఆలోచింప ఈ ప్రాస ఉచ్చారణధర్మ మనుసరించినదని చెప్పవచ్చును. తెలుగులో రఱలకు మైత్రి అప్ప కవి సమ్మతముకాదు. కాని రఱల సాంకర్యము భాషలో సహజముగానున్నది. అంతియగాక గుఱుతు - గుర్తు నూఱువురు - నూర్వురు మొదలగు ఉదాహరణము లను పరిశీలింపగా అలఘురేఫము ఉప్తాచ్క మగునప్పుడు లఘురేఫమగుట సహజమై కనిపించుచున్నది. కనుక ఈ ప్రాసను దాక్షిణాత్యభాషల సహజప్రాసగా గ్రహింపవచ్చును.

## కన్నడాంధ్రప్రాసలు :

కన్నడాంధ్రభాషలలో కనిపించు సామ్యప్రాసలలో సమీపప్రాస యొకటి. కవిరాజమార్గములో సమీప పాసకొసగిన ఉదాహరణము -

> "శశి ధర బింబా ననెయం
> ఝష కేతన మాతెయం సరోజాలబకియం
> బిస విశద వర్ణెయం కం
> దొ సెదం బన దొళగె జనకతనుజెయ నణువం"

కవిరాజమార్గ 2-38

శ-ష-సలకు పరస్పరము ప్రాసగూర్చుట సమీపప్రాస. అప్పకవి ఉభయప్రాసలను వర్గీకరణమున స-ష లకు మైత్రిపేర్కొనెను. (3-329) కాని సశలకుమైత్రి

చెప్పలేదు. అప్పకవికి ఈ యతిమైత్రి యే మాత్రము సమ్మతము కాదని వర్ణపరిచ్ఛేదములోని క్రిందిపద్యమనుసరించి యూహింపవలసియున్నది.

"శసలెఱుఁగక చదువంగా
బొసఁగదదెట్లనిన శకలము సకృత్తనుచో
వసుధ సకలము శకృత్తన
రసికులునవ్వుదురుగాన రాక్షసవైరీ" — వర్ణపరిచ్ఛేదము

అప్పకవి యిట్టిప్రాసలను అంగీకరింపకున్నను అథర్వణచ్ఛందము, లక్షణదీపిక' లక్షణశిరోమణులందు నిట్టిప్రాసలు కలవని శ్రీరావూరి దొరసామి శర్మగారు అప్పకవీయభావ ప్రకాశికలో (పుట 288) అనేక కావ్యోదాహరణములతో ఉదాహరించి యున్నారు.

## అలంకార ప్రాసలు :

అలంకారప్రాసలలో మొదటిది సుకరప్రాసము. ఇందు ప్రాసాక్షరము సుకుమారవర్ణఘటితమై యుండును. ప్రయత్నపూర్వకముగాగాక అనాయాసముగ ప్రాసఘటించుటకు లభించు నక్షరములుగల ప్రాసము సుకరప్రాసము. త.ద న-మ-య-ర-ల-వ-స మున్నగు వర్ణములతోడి ప్రాసగూర్చుట సుకరము. దీనిని ఈశ్వరకవి కవిజిహ్వాబంధనములో సింహప్రాసగా (2-7) విశదీకరించెను.

అలంకార ప్రాసలలో రెండవది దుష్కర ప్రాస. సుకరము కానివి సులభముగా సిద్ధింపనివి బహుప్రయత్న సాధ్యములగు సంయుక్తాది వర్ణముల తోడి ప్రాస దుష్కరప్రాస. ష్క, జ్ఞ, ద్రు, క్ష, ఖ, ష ఇత్యాది వర్ణములు ప్రాసలో దుష్కరములు. ఈశ్వరకవి కవిజిహ్వాబంధనము నందు నిట్టి ప్రాసలను అజప్రాస (2-12) దుస్తర ప్రాస (2-26) లుగా పేర్కొని యున్నాడు.

అలంకార ప్రాసలలో మూడవది ద్వంద్వప్రాస. అన్ని పాదములయందు రెండవ మూడవ అక్షరములు సమముగా నుండు ప్రాస. ఇందు ప్రాసాక్షరమును దాని తర్వాతి యక్షరమును నాల్గు పాదముల సమముగా నుండవలెను. దీనికి ద్విప్రాస యనియు నామాంతరము. ఈశ్వరకవి కవిజిహ్వాబంధనము నందిట్టి ప్రాసను యుగ్మవర్ణ ప్రాసగా (2-23) పేర్కొనెను.

అలంకార ప్రాసలలో నాల్గవది త్ర్యక్షర ప్రాస. ప్రతి పాదమందును 2, 3, 4 అక్షరములు సమముగా నుండు ప్రాస. దీనికి త్రిప్రాసమని నామాంతరము. ఈశ్వరకవి దీనికి త్రితయాక్షర ప్రాసగా (2-24) పేర్కొనెను.

అలంకార ప్రాసలలో ఐదవది చతుఃప్రాస. నాల్గక్షరములు ప్రతి పాదమున సమముగా నుండు ప్రాస. 2, 3, 4, 5 అక్షరములు సమముగా నుండునని అభి ప్రాయము. కన్నడ లాక్షణికు లెవరును ఈ చతుఃప్రాస చెప్పలేదు. ఇది తెలుగు భాషకు ప్రత్యేకత్వ మాపాదించు ప్రాస.

అలంకార ప్రాసలలో ఆరవది అంత్య ప్రాస. ప్రతి పాదమున చివరి వర్ణములకు సామ్యముగల ప్రాస. ఈశ్వరకవి కవి జిహ్వాబంధనము నందును (2-26) వీరభద్రుడు నంది ఛందోర్ణవము నందును (1-67) ఇట్టి ప్రాసలను అంత్య ప్రాసలుగా పేర్కొనిరి.

అలంకారప్రాసలలో చివరిది అనుప్రాస. ఒక్క యక్షరము మొదటినుండి కడపటికు పెక్కుసారులు వెంబడి వెంబడి నావృత్తిసేయుట అనుప్రాసము. వీరభద్రుడు నంది ఛందోర్ణవములో ఈ అంత్యప్రాసను (1-70) పేర్కొనెను. ఈశ్వరకవి అంత్యప్రాసను ప్రత్యేకముగా పేర్కొనక "ఆద్యంతప్రాస"లను (2.28) భేదమును చెప్పెను.

ఈశ్వరకవి కవిజిహ్వాబంధనములో ముఖ్యప్రాసలను వర్గీకరణములో అల్ప ప్రాణ, మహాప్రాణ, మిత్రప్రాసలను భేదములను (2-14, 15, 16) విశదీకరించెను. ఈశ్వరకవి మిత్రప్రాసకు నొసగిన ఉదాహరణము –

"వి ధుముఖి మదనన పట్టద
మ ద గజనిభ యానె మధుర వీణావాణీ
వి దిత విలాసేక్షణె మృదు
ప ద యుగె సుగుణాతిరమ్యె మిత్ర ప్రాసం"

– కవిజిహ్వాబంధన 2-16

ఇందు ద-ధ లకు ప్రాసమైత్రి చెప్పబడినది. కనుక దీనిని స్వవర్గజప్రాసగా పేర్కొనవచ్చును. ఇట్లే వీరభద్రుడు నందిఛందోర్ణవములో సూచించిన బ-భల మైత్రి (1-69) కూడ స్వవర్గజప్రాసయే యగును.

ఈశ్వరకవి కవిజిహ్వాబంధనములో పేర్కొనిన మరికొన్ని ప్రాసభేదములను పరికింతము. ప్రాసాక్షరము దీర్ఘమైనయెడల గజప్రాస (2.8) ప్రాసాక్షరము బిందుయుక్తమైనయెడల వృషభప్రాస (2-9) సజాతీయములగు ఒత్తక్షరములున్నచో అశ్వప్రాస (2-10) విజాతీయ ఒత్తక్షరములున్నచో శరభప్రాస 2 11 యగును. ఈశ్వరకవి పద్యగమనమనుసరించియు కొన్ని ప్రాసలను విస్తరించియున్నాడు. వానిలో తాండవ, భృంగ, ఉరగ, కాక, హంస ప్రాసలు ప్రధానములయినవి. వానిలో కొన్నిటికి మాత్రము ఉదాహరణములను పరికింతము.

తాండవ ప్రాస : తక్కడ గిడఘిగ క్రితగడ
ధక్కడ ధిమితకిట తోంగత ధిగిణలైయం
తిక్కగిణగుగ జకిత
ధిక్కడ ధిం కిటత వెందు తాండవ ప్రాసం
కవిజిహ్వా బంధన 2-17

భృంగప్రాస : పురహర శంకర మన్మథ
హర మురహర సఖ కుమార జనక జగన్మయ
సురుతర పదపంకజ వను
సుర నరమనుదనుజరు వందిసిదరెనె భృంగం
—కవిజిహ్వాబంధన 2-18

పై పద్యములందు ప్రాసాక్షరముల కంటె పదసంయోజనమునకు ప్రాధాన్యమెక్కువ.

## తెలుగునకు పరిమితమైన ప్రాసలు :

తెలుగు భాష ప్రత్యేకతను నిలుపు చిహ్నములలో అరసున్న యొకటి. ఈ అరసున్నల కారణముగా తెలుగున అర్థబిందు సమప్రాస, పూర్ణబిందు సమప్రాస ఖండాఖండ ప్రాసలను విభేదము లేర్పడినవి.

తెలుగు భాషలో వివాదాస్పదమైన అంశములలో 'సాధురేఫ శకటరేఫ నిర్ణయ' మొకటి. కనుక అప్పకవి ర-ఱ లకు ప్రాస చెల్లదని తిరస్కరించెను. (3-344) కాని పెక్కు ప్రయోగముల ననుసరించి చూడగా ర ఱ ల మైత్రిని అంగీకరింప వచ్చునని శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు భావించుచున్నారు.[23]

సంధికార్యముల ననుసరించి యేర్పడిన ప్రాసలలో వికల్ప ప్రాస, లఘుయకార ప్రాస, సంధిగతప్రాసలు ముఖ్యములయినవి. అనునాసికసంధి ననుసరించి వర్గ తృతీయ పంచమాక్షరములకు మైత్రికూర్చుట వికల్పప్రాసయని (3-327) అప్పకవి వివరణ. సిద్ధయకార ఆగమయకారములకు మైత్రిచెప్పుట లఘుయకారప్రాస (3-361) సంధివలన కలిగిన ఆగమ ఆదేశవర్ణములకు ప్రాసగూర్చుట సంధిగత ప్రాసయని అప్పకవి పేర్కొనెను. (3-372)

సంస్కృత వర్ణములను స్వీకరించుటవలన నేర్పడిన ప్రాసవిభేదములలో ఋప్రాస పేర్కొనదగినది ఋరలకు ప్రాసచెప్పుట 'ఋప్రాస' అని (3-358) అప్పకవి వివరణము. ఇందు ఉచ్చారణ ధర్మసామ్యము కూడ లేకపోలేదు. ఉచ్చారణ ధర్మసామ్యముల ననుసరించి యేర్పడిన ప్రాసలలో రేఫయుత ప్రాస, అభేదప్రాసలును గణింపదగినవి. వటుసుడి ఉచ్చారణగల ప్రకారవడులుగల హల్లులను అన్ని పాదము లందును ప్రాసస్థానముల గూర్చుట రేఫయుతప్రాస యని (3-323) అప్పకవి వివరణ ళ, డలకు ప్రాసగూర్చుటగూడ ఉచ్చారణ ధర్మమనుసరించినదే. దీనిని అప్పకవి అభేదప్రాసగా (3-363) పేర్కొనెను.

పై తులనాత్మక పరిశీలనమువలన దాక్షిణాత్య భాషలకు సహజమయిన ప్రాస లన వచ్చును.

1. సంయుక్తవిశేషప్రాస
2. వర్గప్రాస
3. ప్రాసయతిప్రాస
4. అనునాసికప్రాస

లని నిర్ధారింపవచ్చును.

ఈ ప్రకరణమునందు తమిళ కన్నడాంధ్ర మలయాళ భాషలలోని ఛందోంగ ములను పరిశీలించితిమి. కన్నడాంధ్ర మలయాళములందు మాత్ర, లఘుగురువులు పాదము, గణము, యతిప్రాసలను పేర్లు సంస్కృత చ్ఛందోగ్రంథముల నుండి యథాతథముగా గ్రహింపబడినను లక్షణ నిర్వచనమున పెక్కు భేదములు కనిపించు చున్నవి. పై ఛందోంగములలో 'మాత్తిరై' అను పరిభాష తమిళమున యథాతథ ముగ గ్రహింపబడినది. ఐ, ఔ లు ఏక మాత్రికములనుట, ఉయిరళపెడై, ఆయ్ దమ్ మొదలగు వానికి మాత్రలను చెప్పుట తమిళ ఛందమునగల విశేషనియమములు.

అట్లే గురువునకు బదులు రెండు లఘువుల నుంచుట మలయాళ భాషలోని ప్రత్యేక నియమమగును. లఘుగురు సంజ్ఞయందును దాక్షిణాత్య భాషలో సంస్కృతేతర విధానము కనిపించును. తమిళములో దేశీయ గణములే యుండగా కన్నడాంధ్ర మలయాళములందు అక్షర గణములు, మాత్రాగణములు, దేశీయ గణములు అను మూడు విభాగము లున్నవి. అనియత పాదత్వము దాక్షిణాత్య భాషల (పద్యముల) సహజ లక్షణము అక్షరమైత్రీ రూపకమగు యతికి తమిళ ఆంధ్ర మలయాళము లందు ప్రాముఖ్య మెక్కువ. ప్రాస నియమమునకు విశేష ప్రాధాన్యము ఈ భాష లందన్నిట ఒసగబడినది. యతి స్థానము, యతిమైత్రి మొదలగు అంశములందు తమిళాంధ్రములకు సామ్యము లెక్కువ కనిపించును.

## సంఖ్యా సూచి :


నాట్యశాస్త్రమ్ XIV - 102

2. తుల్కాప్పియమ్ - పొరుళదికారం. సెయ్యుళియల్
3. భారతి - ఆషాఢమాసము - క్రోధన
4. యాప్పొళి - పుట 17, 18
5. కన్నడకైపిడి 1-2వ భాగము - పుట 72
6. తెలుగులో ఛందోరీతులు - పుట 243-248
7. పాటలలో ఛందస్సు - పుట 21-22
8. యాప్పొళి - 17-18
9. A Grammar of High Tamil - Tamil Poetry
10. సమాలోకన - పుట 210
11. హాసిగణ వృత్తాంత - కర్ణాట సాహిత్య పరిషత్పత్రిక - 492
12. భారతి - ఆషాఢమాసము - క్రోధన
13. A study of Malayalam Metres - P 11
14. వ్యాససంగ్రహము - మాత్రాచ్ఛందస్సులు
15. Advanced Studies in Tamil Prosody - P 33-34
16. కన్నడ ఛందః స్వరూప - పుట 70-71
17. కన్నడ ఛందస్సినచరిత్ర - పుట 223
18. Malayalam and Tamil Metres-A Comparative study - P 29
19. తొడై యదికారము పుట 27
20. కన్నడ ఛందోవికాస పుట 11
21. తెలుగు భాషలో ఛందోరీతులు - 341-342
22. Malayalam and Tamil Metres - D. L. A. Seminar 1971
23. తెలుగుభాషలో ఛందోరీతులు - పుట 341-342

# 5. దాక్షిణాత్య దేశి చ్ఛందో రీతులు

దాక్షిణాత్య భాషలలో తమిళము చాల ప్రాచీనమయిన భాష. ఈ భాషలో క్రీ. పూ. 500 నాటికే విశిష్ట వాఙ్మయము వెలసినది. అంతియు గాక తమిళలాక్షణికులు తమ కాలమునాటి గేయ సాహిత్యమును ఆదరించి తమ లక్షణ గ్రంథములలో నుదాహరించిరి.

తమిళము తరువాత కన్నడము ప్రాచీన సాహిత్యమును నిలబెట్టుకొన్న భాష. ఈ భాషలో సాహిత్యము క్రీ. శ 9 వ శతాబ్దినుండి కనిపించుచున్నది.

కన్నడము తరువాత తెలుగు దాక్షిణాత్య భారతీయ భాషలలో గణన కెక్కిన భాష. ఈ భాషలో లభ్యమయిన గ్రంథములలో భారతము మొదటిది. లభ్యమయిన గ్రంథముల కంటె అనాదృత వాఙ్మయము తెలుగులో ఎక్కువ.

తెలుగు తరువాత మలయాళము గణింపదగినది. ప్రాచీన మలయాళముపై తమిళ ప్రభావము కనిపించును.

ఈ నాలుగు భాషలను ఛందస్సు దృష్ట్యా పరిశీలించినపుడు తమిళ మలయాళములు సన్నిహితములు. కన్నడాంధ్రములు సన్నిహితములు. అయినను కన్నడాంధ్ర మలయాళములపై తమిళ ఛందః ప్రభావము లేకపోలేదు ఈ ప్రభావ మెట్టిదో పరిశీలింతము.

## 5. 1. తమిళ ఛందోరీతులు - ఇతర దాక్షిణాత్య చ్ఛందస్సులతో సామ్యము

తమిళ పద్యములకు అశై ప్రధానగుణము. తమిళ ఛందోవిధానములందుగల అశైను గురించి డా॥ కె. ఎన్. ఎళుత్తచ్చన్ ఈ అభిప్రాయమిది —

"In the eyes of one accustomed to Sanskrit tradition Tamil metres may seem to lack scientific precision adefect which is perhapes compensated by their musical elasticity. Tolkappiar says that sound scholarship is needed to divide asais and sirs according to the tune and the commentator perasiriyar demands a keen ear also. In effect this means that too much mechanical

and scientific precision is not aimed at in this branch of a discipline–a characteristic common to all Desi or purely Dravidian types of metres"1

తమిళపద్యములలోని 'అశై'లు ప్రధానముగా నాలుగు విధములు. కథాకథన మున కుపయోగించునది అగవల్‌పా ఇందలి లయను 'అగవలోశై' అని యందురు. సంభాషణాత్మవమున కెక్కువగా నుపయుక్తమగు 'వెణ్బా' పద్యములోని లయను 'సెప్పలోశై' అని అందురు కలిప్పాలోని లయను 'తుళ్ళలోశై' అనియు 'పంజిప్పా'తోని లయను తూంగలోశై అనియునందురు. ఇవిగాక తాళిశై, తుఱై, విరుత్తమనునవి సంగీతప్రధానములు. వీనిని లాక్షణికులు 'పావినం' అని వర్గీకరించిరి.

తమిళ సాహిత్యములో తొలుత 'పా' భేదములకు అగ్రస్థానము. సంగ సాహిత్యమును 'పా' భేదముల ప్రయోగమెక్కువ. ఆ తరువాతి కాలమున 'పావినం' వ్యాప్తికి వచ్చినవి. క్రమముగా వానికి వ్యాప్తి తగ్గి సంస్కృత ప్రభావమువలన 'విరుత్తం' ఛందస్సునకు గౌరవము ఏర్పడినది 19–20 శతాబ్దము లలో కవులు జానపద వరుసలను అభిమానించి కవితల్లిరి. అయినను తమిళ చ్ఛాయలు ఇతర భాషల ఛందోరీతులలో కనిపించును.

## 5. 1. 1. అగవల్పా (ఆశిరియప్పా) :

తమిళములోని ఛందో రీతులలో 'అగవల్' ప్రాచీనము. వెణ్బా పద్యములో గణముల విషయమునను, పద్యపాదముల విషయమునను కొన్ని ఆంక్షలు కలవు. కాని అగవల్ పద్యములో అట్టి నియమము లేవియు లేవు. అగవల్ అనగా 'Addressing or Calling' అను అర్థము.

అగవల్ ఛందస్సులో పాదనియమము లేదు. 2 మొదలు 1000 వరకు పాదములుండవచ్చును. దీనియందు గేయ ధర్మ మెక్కువ. గానానుకూలమనుటవలన లఘువు గురువగుట, గురువు లఘుత్వ మొందుట, గణాక్షరములు విస్తృతమొందుట, లేదా సంకుచితమగుట సహజము కనుక తమిళులు పద్యములను పాడల్ (పాడ బడునవి) అని చక్కగా నిర్వచించిరి. అగవల్పా లేక ఆశిరియప్పాలో సాధారణ ముగా రెండేసి అశైలు గల శీర్షుండును. కణిచ్చీర్ తప్ప తక్కిన గణములన్నియు రాదగును.

ఆశిరియప్పా ఛందస్సులో భేదములను తొల్కాప్పియర్ పేర్కొనలేదు. కాని తరువాతి లాక్షణికులగు కాక్కైపాడినియార్, సిఱు కాక్కైపాడినియార్, అవినయ నార్, అమృత సాగరాదులు ఆశిరియప్పాలో నాలుగు భేదములను పేర్కొనిరి. అవి వరుసగా 1. నేరిశై ఆశిరియప్పా 2. ఇణైక్కుఱళ్ ఆశిరియప్పా 3. నిలై మండిల వాశిరియప్పా 4. అడిమఱి మండిల వాశిరియప్పాలు. ఇవేగాక 'పావినం' ఆశిరి యత్తాళిశై, ఆశిరియత్తుఱై ఆశిరియ విరుత్తములను ఛందో రీతులున్నవి.

## నిలైమండిల వాశిరియప్పా - ద్విపద - ఛందోవతంసలు :

'నిలైమండిల ఆశిరియప్పా' పద్యములోని అన్నిపాదములలో నాలుగేసి శీర్లు ఉండును. దీనిని 'మండిలవాశిరియప్పా' అనియు తమిళ లాక్షణికులు పేర్కొనిరి. 'మండిలం' అనగా **'Running in a circle'** అని అర్థము. నిలైమండిల వాశిరి యప్పా తెలుగు ద్విపద, కన్నడ ఛందోవతంసములకు సామ్యములున్నవి.

ద్విపదకు రెండు పాదములు. ప్రతిపాదమునందు వరుసగా 3 ఇంద్రగణ ములు 1 సూర్యగణమును రావలయును. 1-3 గణాద్యక్షరములకు మైత్రి. ద్విపదకు ప్రాస కలదు. ప్రయోగముల ననుసరించి ప్రాసయతియు అంగీకరింప తగినదే. ఈ దృష్టితో తమిళపద్యమును పరికింతము.

> "మాళఱు పొన్నేవ లంపురి ముత్తె
> కాళఱు విదైయే కవుంబే తేనే
>
> — శిలప్పదికారంపాడల్

ఈ పద్యపాదములను కన్నడాంధ్రపద్ధతుల ననుసరించి గణప్రస్తారముచేయగా

> "భ త భ గగ
> భ య య గగ" గణములేర్పడును.

కన్నడ ఛందోవతంసకు 3 విష్ణుగణములు 1 బ్రహ్మగణమువచ్చుట లక్షణము. తమిళములోగల కొన్నిగణములు కన్నడమున వదలబడుటయు, కన్నడములోని కొన్ని గణములను ఆంధ్రులు స్వీకరింపకుండుటయు 'ఛందోంగములను' ప్రకరణ మున చర్చించితిమి. పై పద్యమునందుగల "యగణము" పుళిమాగణ వర్గమగును.

పుళిమా గణవర్గములో య – జ – స న గణములున్నవి. కన్నడ లాక్షణికులు "స–న" గణములను మాత్రము స్వీకరించిరి. 'యగణమును పరిత్యజించిరి. యగణమును విష్ణు (ఇంద్ర)గణముగా భావించినచో పై పద్యము 'ఛందోవతంసయే' యనుట తప్పుకాదు అట్లే రేచన మతమనుసరించి "గగ" ను సూర్యగణముగా గ్రహించిన ఈ పాదములు తెలుగు ద్విపద పాదములే.

## అడిమరి మండిల ఆశిరియప్పా - తెలుగు మంజరి కన్నడాంధ్ర మధురగతి రగడలు :

ఇది నిలైమండిల వాశిరియప్పాను పోలినదే. ఏ పాదమున కాపాదము విడిగా నుండుట అడిమరి మండిల ఆశిరియప్పా లక్షణము. పద్యమునందు గల పాదములు క్రమరహితముగా చదివినను అర్థభంగము తోపకుండుట ఈ పద్య విశేషము.

పై లక్షణములన్నిటిని పరిశీలింప అడిమరి మండిల ఆశిరియప్పాకు తెలుగు మంజరికి సామ్యములున్నట్లు చెప్పవచ్చును. ఏపాదమున కాపాదము విడిగాగల మంజరీ పాదములు తెలుగులో లేకపోలేదు. అడిమరిమండిల ఆశిరియప్పాలో ప్రాస నియమమున్నది మంజరిలో ప్రాస లేదు. యతి తమిళములో ఐచ్ఛికము. తెలుగులో నియతము.

ఉదా : ఙానియే తిరుత్తాళ్ నోవ్వుత్తీర్
నా నివణ్ మదత్తాల్ స్తాయ్వు ప్పేనే
కాణురు సిలైయెన్ మార్పే కాణీర్
నాణుల కదసిల్ తీయోణానేన్

—యాప్పోళి – పుట 65

అడిమరిమండిల ఆశిరియప్పాకును కన్నడాంధ్రములందు గల రగడలకును కొంతవరకు సామ్యము చెప్పవచ్చును తెలుగు రగడలలో 'మధురగతి' యొక విభేదము. దీనికి చతుర్మాత్రాగణములు నాలుగు ప్రతి పాదమున రావలయును. ఈ రగడలో గా–భ–స–నల గణములు వాడుదురు. రెండుగణములపై అనగా మూడవ గణాద్యక్షరముపై యతిని పాటించవలయును. ఆద్యంత ప్రాసలు రగడలకు నియతములు. ఈ దృష్టితో క్రింది తమిళపద్యమును పరిశీలింతము.

శూరల్ పంపియ సిఱుకాల్ యారే
శూరర్ మగళిర్ ఆరణం గినరే

— యాప్పరుంగలకాట్కై - చెయ్యుళియల్ పుట 90

పై తమిళపద్యమునందు క్రీగీత నుంచినచోట మాత్రము ఐదుమాత్రల గణమున్నది తక్కిన గణములన్నియు చతుర్మాత్రాకములే. ఆద్విప్రాసనియతము పాదాంతము లందు సమానాక్షరము ఆవృత్త కావలయునను నియమము కూడ సరిపోయినది.

## అరుశీర్ ఆశిరియవిరుత్తం కన్నడాంధ్రములలోని అక్కరలు :

ఆశిరియ విభేదములలో ఆశిరియవిరుత్తమొకటి. పాదమునకు నాలుగు గణము లుండుట ఆశిరియప్పా సామాన్య లక్షణము. అంతకంటె మించిన గణములున్నచో అట్టివానిని కళినెడిలడి అని అందురు పాదమునకు ఆరు గణములుండుటవలన అరుశీర్ ఆశిరియవిరుత్తము. ఈ విరుత్తమునందు 40 విధములగు గణవిన్యాస ములు కలవని శ్రీ పులవర్ కుళందై తొడైయదికారములో (పుట 159) పేర్కొనిరి. శిలప్పదిగారం, జీవక చింతామణి సంబందర్ తేవారం, తిరుప్పల్లాండు, కందపురాణం, సీకాళత్తిప్పురాణం వంటి తమిళ గ్రంథములందు అరుశీర్ ఆశిరియ విరుత్తము లెక్కువ.

తమిళములో గల అరుశీర్ అశిరియ విరుత్తమునకు కన్నడాంధ్రము లందు గల కిఱు అక్కరె. అల్పాక్కరలకు కొన్ని సామ్యములు కనిపించుచున్నవి.

కిఱుయిక్కరె లేదా అల్పాక్కరకు నాలుగు పాదము లుండును. ప్రతి పాదమున వరుసగా 2 విష్ణు గణములు (ఇంద్రగణములు) 1 రుద్రగణము (చంద్ర గణము) చేరును. ఈ పద్యమునకు ప్రాసనియతము. తెలుగు లక్షణ మనుసరించి 1–3 గణాద్యక్షరములకు మైత్రి పాటింపవలయును. ఈ దృష్టితో క్రింది తమిళ పద్యమును పరికింతము.

అప్పనీ యమ్మైని ఐయను నీ
అన్బుడై మామను మామిమునీ

అప్పర్ తేవారం – తొడైయదికారం పుట 152

పై పద్యములో రెండు దళములున్నవి. మొదటి దళమున మూడు గణములును, రెండవ దళమున మూడు గణములును కలవు. కన్నడాంధ్ర గణప్రస్తార మనుసరించి

ర మ భగ
ర భ భగ గణములున్నవి. కన్నడ లక్షణ మనుసరించి ఈ రెండు పాదములును కిఱు అక్కర పాదములే. ప్రాచీనాంధ్ర గణముల ననుసరించి మగణమును ఇంద్రగణముగా భావించిన యెడల పై పద్యపాదములు అల్పాక్కర పాదములు కాగలవు.

అరుశీర్ ఆశిరియ విరుత్తమునకు 4 దీర్ఘపాదము లుండును. కాని నిర్మాణ మనుసరించి 8 చిన్న పాదములే. కనుక రెండు కిఱు అక్కర లేదా అల్పాక్కరల సంయోజనమే అరుశీర్ ఆశిరియ విరుత్తమని నిర్ణయింప వీలున్నది.

అరుశీర్ ఆశిరియవిరుత్తమునకు కన్నడాంధ్రములందుగల దొరెయక్కరె మధ్యాక్కరలకు సామ్యము లున్నవి.

నాగవర్మ ఛందోంబుధియందు "దొరెయక్కరెకు (5. 5) నాలుగు పాదములనియు, పాదమునకు వరుసగా 2 విష్ణుగణములు 1 బ్రహ్మగణము మఱల 2 విష్ణుగణములు 1 బ్రహ్మగణము రాదగు"నని లక్షణము పేర్కొనియున్నాడు. తెలుగు లక్షణమనుసరించియు మధ్యాక్కర పాదమునకు వరుసగా 2 ఇంద్రగణములు 1 సూర్యగణము మఱల 2 ఇంద్రగణములు 1 సూర్యగణము చేరుచుండును. యతి 1–4 గణాద్యక్షరములపై నిలువుట లాక్షణికసమ్మతము. ఈ దృష్టితో క్రింది తమిళపద్యమును పరికింతము.

మందిర మావదు నీఱు వానవర్ మేలదు నీఱు
సుందర మావదు నీఱు తుదిక్కప్పడువదు నీఱు
తందిర మావదు నీఱు సమయత్తి లుళ్ళదు నీఱు
సెందువర్ వాయుమై పంగన్ తిరువాల వాయాన్‌తిరు నీఱే
—సంబందర్‌తేవారం - తొడైయదికారం - పుట 15

పై తమిళపద్యములో పాదమునకు ఆరుగణములున్నవి. కన్నడాంధ్ర లక్షణము లనుసరించి 2 విష్ణు (ఇంద్ర) 1 బ్రహ్మ (సూర్య) 2 విష్ణు (ఇంద్ర) 1 బ్రహ్మ (సూర్య) గణములున్నవి. పైపద్యములో ప్రాసనియమము పాటింపబడినది. యతి

1-4 గణాద్యక్షరములకు చెల్లినది రెండవపాదమున క్రీగీత యున్నచోట 'జ' గణము వచ్చినది కాని నన్నయ మధ్యాక్కర ప్రయోగమనుసరించి (అరణ్య 3-373) యిది సాధువేయగును.

పై పరిశీలనవలన అరుశీర్ ఆశిరియవిరుత్తమునకు మధ్యాక్కరకు సామ్యము లున్నవని చెప్పవచ్చును.

## ఎళుశీర్ ఆశిరియ విరుత్తం : పిరియక్కరై, మహాక్కరలు

తమిళములో గల ఎళుశీర్ ఆశిరియ విరుత్తమునకు కన్నడాంధ్రములందుగల పిరియక్కర మహాక్కరలకు కొన్ని సామ్యములు కనిపించు చున్నవి.

తమిళములో ఎళుశీర్ ఆశిరియ విరుత్తమునకు తగినంత ప్రచారమున్నది చింతామణి, సంబందర్ తేవారం, నాలాయిరం, కంబరామాయణం, విల్లి పుత్తూర్ భారతం, పెరియ పురాణం, నైడదం, కుచేలోపాఖ్యానం మొదలగు గ్రంథములలో ఎళుశీర్ ఆశిరియవిరుత్తములున్నవి. గణవిన్యాసము ననుసరించి యీ వృత్తములో 24 భేదముల నెన్నవచ్చునని పులవర్ కుళందై గారు తొడైయదికారములో (171 to 175) పేర్కొనిరి. ఎళుశీర్ ఆశిరియవిరుత్తములో నాలుగు పాదము లుండును ప్రతి పాదమునకు ఏడు శీర్లు (గణములు) ఉండును. మోనై (యతి) ఎదుగై (ప్రాస)లు కలవు.

కన్నడములో గల పిరియక్కరె నాలుగు పాదములు గల పద్య విశేషము. పిరియక్కర పాదమునకు వరుసగా 1 బ్రహ్మ, 5 విష్ణు 1 రుద్రగణము రాదగునని నియమము. ఇట్లే తెలుగులో గల మహాక్కరకు 1 సూర్య 5 ఇంద్ర 1 చంద్ర గణము రావలయునని నియమము కన్నడ పిరియక్కరకు ప్రాస నియమమున్నది. తెలుగు మహాక్కరకు యతి ప్రాసలు రెండును గలవు. యతి 1-5 గణాద్యక్షర ములకు చెల్లును. ఈ దృష్టితో క్రింది తమిళ పద్యమును పరిశీలింతము.

తండ రళమలై వెస్గయి లైమలై
చంగమ లైయెన నంగైయార్

—విల్లి భారతమ్ తొడైయదికారం పుట 178

పై పద్యములో 7 గణములున్నవి. మహాక్కార సిరియక్కారలకును 7 గణములే. కన్నడాంధ్ర ప్రస్తారపద్ధతి ననుసరించి గల–సగ-భ–ర భ–భ మగణములున్నవని చెప్పవలసియుండును ఇందలి చివరి గణము 'నంగై మార్' మగణమే. కాని 'ఐ' అక్షరమును అయిగా లయానుకూలముగా పఠించినను దోషముకాదు. అప్పుడు నంగయిమార్ భగ గణమగును. ఇది కన్నడాంధ్ర గణ ప్రస్తారమనుసరించి రుద్ర - చంద్రగణములే. కనుక పై తమిళపద్యములో 1 బ్రహ్మ (సూర్య) 6 విష్ణు (ఇంద్ర) 1 రుద్ర (చంద్ర) గణక్రమమేర్పడినది. పై పరిశీలనమనుసరించి ఎళుశీర్ ఆశిరియ విరుత్తమునకు పిరియక్కార మహాక్కారలకు పోలికలున్నట్లు నిర్ధారింపవచ్చును.

ఎళుశీర్ ఆశిరియవిరుత్తమునకు తెలుగులోగల సీసపద్యమునకు పోలికలున్నవి. సీసపాదమునకు వరుసగా 6 ఇంద్రగణములు 2 సూర్యగణములుండును. ఇట్టివి నాలుగు పాదములను కూర్పవలయును. 1–3; 5–7 గణాద్యక్షరములకు మైత్రి కూర్పవలయును. ఈ దృష్టితో క్రింది తమిళ పద్యమును పరికింతము.

తిన్పడై క్కోళరి యిణ్ణుయ వాత్తిఐ లోనక లంచెరు విల్మైనాళ్
– నాలాయిరం తొడైయడికారం 172)

పైపాదములో 6 ఇంద్రగణములు 2 సూర్యగణములను గణనియమము సరిపోయినది.

## ఎణ్ శీరడివిరుత్తం కన్నడాంధ్ర రగడవిభేదములు :

తమిళములోగల ఎణ్ శీరడి విరుత్తమునకు తెలుగులో కొన్ని రగడభేదములకు పోలికలు కనిపించును. ఎణ్ శీరడి విరుత్తపాదమునకు 8 గణములుండుట ప్రధాన నియమము. తెలుగులోగల తురగవల్గనము, హరిగతి రగడల పాదములకు 8 గణము లుండుట సామాన్య నియమము తురగవల్గనము హయప్రచారమునకు రెట్టింపు. 4 గణములపై యతి నిలుపవలయును తెలుగు లక్షణములననుసరించి నాలుగు సూర్య గణములు కలది హయప్రచారముకాగా తురగవల్గనమునకు 8 సూర్యగణములు. ఈ దృష్టితో క్రింది తమిళ పద్యమును పరికింతము.

ముప్పు కంద కాక్షి తణ్ణై మురుగ నెన్నుం వేల నెన్నుం
భారతిదాసన్ పాడల్ – తొడైయధికారం – పుట 208

పై పద్యములో 8 గణములున్నవి. పై పాదములో గల, గగ గణములున్నవి. రేచనాదుల లక్షణమనుసరించి 'గగ' సూర్యగణమే యగును. పై పరిశీలనము వలన ఎణ్ శీరడి విరుత్తమునకు లేదా ఎణ్ శీరడితాళ శైలకు కూడ తెలుగు రగడలతో సంబంధమును స్థాపింపవచ్చును.

## ఎణ్ శీరడివిరుత్తం - ఉత్సాహం :

ఎణ్ శీరడి విరుత్తమునకు కన్నడాంధ్రములందు గల ఉత్సాహవృత్తమునకు సామ్యములున్నవి.

నాగవర్మ ఛందోంబుధియందు కర్ణాటవిషయ జాత్యధికారములో 'ఉత్సాహ' మును (5.20) పేర్కొనియున్నాడు. జయకీర్తి ఛందోనుశాసనమున మిశ్రాధికారములో (8.30) ఉత్సవమును పేర్కొనియున్నాడు. జయకీర్తి ప్రాసయుక్తమగు శ్లోకములో 'ఉత్సవ లక్షణము' చెప్పుట చూడగా నతడు 'ఉత్సవ'మును కన్నడ ఛందముగా భావించినట్లున్నది. తెలుగులోగూడ నుత్సాహవృత్తమున్నది. ఉత్సాహమునకు లక్షణము

'సాహచర్య పద్మమిత్రసప్తకంబు ను
త్సాహ వృత్తమనకెచెల్లు జలజదళవిలోచనా'

సులక్షణసారకర్త 'పద్మమిత్రసప్తకము'ను ఉత్సాహలక్షణముగా పేర్కొనెను. తెలుగులక్షణములనుసరించి గల- నగణములు రెండును గ్రాహ్యములు. కన్నడములో గగ-స-గల-నగణములు బ్రహ్మగణములు. ఈ దృష్టితో క్రింది తమిళపద్యమును పరికింతము.

విణ్కు వుణ్కు పిత్తా విప్పోయ్ విట్టార్ నట్టార్ సుట్టూర్ పుక్కార్
– తనిప్పాడల్ తిరట్టు తొడై యధికారం – 191

పై పద్యమునందు 8 గగలు కలవు. 'గగ' బ్రహ్మగణము. 7 బ్రహ్మగణములు (సూర్య) చివర 1 గురువున్నచో ఉత్సాహము. కాని యీ పద్యములో అదనముగా మరియొక గురువు చేరినది. ఈ భేదమును విస్మరించినయెడల పై పద్యము ఉత్సాహచ్ఛాయలో నడచినదనుటలో సందేహములేదు. ఉత్సాహమునకు సరిపోయిన తమిళపద్యము కన్నడకైపిడియందు ఉదాహృతము.

అక్క రంగ శక్క రంగ శెన్ఱు మావ దెన్గా లో
ఇక్కుఱుంబై సీక్కి యెన్నై యూశ నాక్కవల్లై యేల్
చక్కరంగళ్ కైయనేచ డంగర్ వాయడంగిడ
ఉల్కొదంద వణ్ణమేపుఱంబో శిందుకాట్టిడే

— కన్నడకైపిడి - 1-2-పుట 190

పై తమిళపద్యములో త్రిశీతలుగలచోట "గగ" గణములుండుట పరిశీలనార్హము.

నాగవర్మ ఉత్సాహమును జాత్యధికారమున పేర్కొనుటవలనను, జయకీర్తి ప్రాససహిత లక్షణము చెప్పుటవలనను, తమిళసాహిత్యము నందుగూడ ఉత్సాహ చ్ఛాయలుగల పద్యములు కనిపించుటవలనను, అక్షరగణముకంటు నిందు తాళగణములకు ప్రాధాన్యముండుటవలన ఉత్సాహము ద్రావిడ ఛందోరీతులలో నొకటిగా పేర్కొనవచ్చును.

## ఎణ్ శీరడి విరుత్తం - లలితరగళె ద్విరదగతి :

ఎణ్ శీరడి విరుత్తమనగా పాదమునకు 8 ఆశిరియప్పా గణములు గల పద్యము. ఇట్టి గణములు నాలుగు పాదములందును రాదగును. ఈ విరుత్తమునకు తెలుగులోని ద్విరదగతి లలితరగళెలకు పోలికలున్నవి.

లలితరగళె, ద్విరదగతులలో ఐదుమాత్రల గణములు ప్రయోగింపవలయును. ఆద్యంత ప్రాసలు నియతము. 1-3 గణముల తొలి అక్షరమునకు మైత్రి పాటింపవలయునని నియమము.

నిలై యిదు దానమా మెన్ఱగ త్తున్నిణాన్
నిలై పెఱ లివణెన్న క్కుచితమ న్ఱి న్నిణాన్

యాప్పోశ పుట 71

పై పద్యపాదములో పంచమాత్రగణములున్నవి. ఆద్యంత ప్రాసలున్నవి. కనుక ఇది లలితరగళె (ద్విరదగతులతో) సామ్యమొందును. నాలుగు పాదములుండవలయునను నియమము వదలినచో ఈ రెండురగడలు ఎణ్ శీరడి తాళిశైలతో కూడ సామ్యమొందును.

## 5. 1. 2. వెణ్బా :

తమిళ పద్యములందు ఆశిరియప్పా పిదప వెణ్బా ప్రసిద్ధమైన ఛందఃప్రభేద మగును. వెణ్బాలోని నాల్గు పాదములలోను మావిళ, కాయ్చ్చీర్లు వాడవలెను. మొదటి మూడు పాదములలో నాలుగేసి శీర్లు, చివరి పాదమున మూడు శీర్లు వచ్చును నాల్గు పాదములలోను ఒకే ఎదుగై రావచ్చును. లేదా మొదటి రెండు పాదములకు ఒక ఎదుగై, తక్కిన రెండింటికి ఒక ఎదుగై రావచ్చును.

తొల్కాప్పియనార్ వెణ్బాపద్యమునకు 2 మొదలు 12 వఱకు పాదములుండ దగునని పేర్కొనెను. అన్నిపాదములందును నాలుగుశీర్లు, చివరిపాదములో మూడుశీర్లువచ్చుట వెణ్బా సామాన్య లక్షణము. వెణ్బా అయిదు విధములు. అవి వరుసగా కుఱళ్ వెణ్బా, సిన్దియల్ వెణ్బా, పఃట్రొడై వెణ్బా, అళవియల్ వెణ్బా, కలి వెణ్బాలు. వెణ్బాజాతులలో వెణ్ణాళిశై, వెణ్డురై, వెళివిరుత్తం, కుఱట్టాళిశై, కుఱళ్ వెణ్ సెన్దుఱై వంటివియు కలవు.

కుఱల్ వెణ్బాట్టు లేక కుఱల్ వెణ్బాలో రెండుపాదములు, సిందియల్ వెణ్బాలో మూడుపాదములు, నేరిశై వెణ్బాలో నాల్గుపాదములు, ఇన్నిశై వెణ్బాలోకూడ నాలుగు పాదములును, పట్రొడై వెణ్బాలో అయిదునుండి పంద్రెండు పాదములవరకును, కలివెణ్బాలో పంద్రెండు కంటె ఎక్కువ పాదములు కలిగియుండును. తమిళ సాహిత్యమునగల గ్రంథనామములు ఛందోనుబంధములుగా గూడ నున్నవి. వెణ్బా మాలై, నళవెణ్బా, నీదివెణ్బా, శివశివవెణ్బా, రంగేశవెణ్బా, కుమరేశవెణ్బా, భారత వెణ్బా, రామాయణవెణ్బా, తిరుమణవెణ్బా నెల్లైచ్చేడై వెణ్బా మొదలగునవి వెణ్బా ఛందస్సులో వ్రాయబడిన కావ్యములగును.

## కుఱళ్ వెణ్బా - ద్విపద :

వెణ్బా పద్యభేదములలో కుఱళ్ వెణ్బా యొకటి. ఇది చాల చిన్నదగు పద్యము దీనికి రెండు పాదములు. ప్రథమ పాదములో నాలుగు శీర్లు, రెండవపాదములో మూడు శీర్లురావలయునని నియమము. 1-3 శీర్ల ఆద్యక్షరములకు మైత్రి కూర్చ వలయునని అనుశాసనము.

వెణ్బాపద్యమునకు ద్విపదకు కొన్ని సామ్యము లున్నవి. ద్విపద రెండు పాదములుగల చిన్న పద్యము. రెండుపాదములందు వరుసగా మూడు ఇంద్రగణములు 1 సూర్యగణము కూర్పవలయును. 1-3 గణాద్యక్షరములకు మైత్రిపాటింపబడును. ప్రాస కలదు.

కుఱళ్ వెణ్బా రెండవ పాదమున మూడుశీర్లు రావలయునని తమిళలక్షణము. వెణ్బా పభేదములందు రెండవ పాదమున నాలుగుశీర్లు రాదగును. నాల్గవగణము 'తనిచ్చొల్'గా గానిలేక సామాన్యపదముగాగాని చేర్చిచెప్పవచ్చునని విశేషనియమము. కనుక కుఱళ్ వెణ్బాలో కూడ రెండవపాదమున నాలుగు శీర్లు వచ్చుట దోషముకాదు. తనిచ్చొల్ (ఊతపదము లేదా ఎత్తుపదము) అనుట గేయధర్మము. తమిళ ఛందస్సును గూర్చి పరిశీలన గావించిన డా॥ ఎ. సి చెట్టియార్‌గారు వెణ్బా రెండవపాదము నందలి శీర్ల నియమమును గూర్చి యిట్లు వ్రాసిరి.

"Tolkappiyar who prescribes three feet line as the thing that must occur as the last line of venpa, would have certainly said that a tanicol or tanictr should cccur in the end of the second line of a venpa if such a thing were the practice of his days ...... if we look at the "works of 18 kanakku collection we find venpas occurring with and without taniccol in the second line"[2]

వెణ్బా రెండవపాదమున నాలుగు గణములుండుటను అంగీకరించినచో కుఱళ్ వెణ్బా ద్విపదలకు సామ్యములున్నవని నిర్ధారింపవచ్చును. వెణ్బావిభేదమగు 'కుఱళ్ వెణ్ణుఱై' కూడ రెండుపాదములు గల పద్యబంధము. పాదమునకు నాలుగు శీర్లు వచ్చుట కుఱళ్ వెణ్ణుఱై' లక్షణము. ఉదాహరణము

తిరుమాల్ ఉఱైయుం తిరుమలై క్కాట్చి
అరునాళ్ ఉఱుపవన్ ఉయ్దల్ అరిదు

— యాప్పొళి - పుట 89

పై పద్యమునందు ద్విపదచ్ఛాయలు స్పష్టము.

పై పరిశీలనమువలన తెలుగులోని ద్విపదకు తమిళమునందుగల కుఱళ్ వెణ్బా-కుఱళ్ వెణ్ణుఱై పద్యములకు చాల పోలికలున్నట్లు నిర్ణయింపవచ్చును.

**కుఱళ్ - ఏళె :**

కన్నడమునగల పద్యములలో 'ఏళె' చాల చిన్న పద్యము. ఛందోంబుధి కర్తయగు నాగవర్మ కర్ణాట జాతులలో 'ఏళె' (5-12)ను పేర్కొనియున్నాడు. ఏళెకు రెండుపాదములు. ప్రథమ పాదములో 4 గణములు రెండవపాదమున 3 గణములు 'ఏళె' పద్యములకుండును. ఏడుగణముల పద్యము కనుక 'ఏళె' అని పేరు. ఏళె పద్యమునకు కుఱళ్ పద్యమునకు లక్షణమనుసరించి సామ్యములున్నట్లే.

**ఉదా ॥**

కుదరేన తందేని జీన బిగిసిదేని
బరబేక తంగీ మదువెగె

నాడపదగళు - సువ్వియ హేడు — పుట 90

**ఇన్నిశై వెణ్బా - ఆటవెలది, తేటగీతి :**

ఇన్నిశై వెణ్బా పద్యమునకు నాలుగు పాదములుండును. మొదటి మూడు పాదములలో నాలుగుశీర్లు, నాలుగవపాదములో మూడుశీర్లు రావలయును. నాలుగు పాదముల కొకప్రాసయు లేదా మొదటి రెండుపాదముల కొకప్రాస తరువాతి రెండు పాదములకు మరియొక ప్రాసయు లేదా నాలుగు పాదములందును భిన్నప్రాసలును రావచ్చును. ప్రతిపాదమునందును 'తనిచ్చొల్' రావచ్చును. లేదా రెండుమూడు పాదములందు తనిచ్చొల్ రావచ్చును.

ఇన్నిశై వెణ్బా పద్యమునకు తెలుగునగల తేటగీతి పద్యమునకు సామ్యము లున్నవి.

తేటగీతికి నాలుగు పాదములుండును. ప్రతిపాదములో వరుసగా 1 సూర్య గణము 2 ఇంద్రగణములు 2 సూర్యగణము లుండవలయును. తేటగీతికి ప్రాస నియతముకాదు. యతి 1-4 గణాద్యక్షరములకు చెల్లును.

ఇన్నిశైవెణ్బాలో ఈరశైచ్చీర్, కాయ్చ్చీర్లు రావచ్చును. అనగా తేమా, పుళిమా, కరువిళం, కూవిళం, తేమాంగాయ్, పుళిమాంగాయ్, కరువిళంగాయ్,

కూవిళంగాయ్ చీర్లు రాదగునని అభిప్రాయము. కన్నడాంధ్రగణముల ననుసరించి చెప్పవలయునన్నచో గగ గల, య, జ, స, న, నల, నగ, జల, జగ, భ, ర, మ, త, సగ, సల, యగ, యల, నవ, నలల, జలగ, జలల, జగగ, జగల, నగగ, నగల, భగురు, భల, రగ, రల గణములు తేటగీతిలో రావచ్చునని చెప్పవలసియుండును. కాని తమిళగణములలోనుండి కన్నడ లాక్షణికులు కొన్నిటిని, కన్నడగణములలో నుండి తెలుగు లాక్షణికులు కొన్నిటిని తొలగించుట నిట స్మరింపదగినది. ఈ దృష్టితో క్రింది తమిళ పద్యపాదములను పరికింతము.

ఇణ్ణా మై వేణ్డిన్ ఇరవెళుగ ఇన్ని లత్తు
— నాన్మణిక్కడిగై (తొడైయదికారం 79)

కళ్ళ మెన్బార్కు త్తుయిలిల్లై కాద లిమాట్
— యాప్పదికారం - పుట 51

సూర్యగణములలో గగ, సగణములను గ్రహించినయెడల కొన్ని తమిళ పద్యము లచ్చముగా తేటగీతులై కనిపించును. అట్లే ఇంద్రగణములలో మగణమును గూడ గ్రహించిన ఇన్నిశై వెణ్బా — తేటగీతుల సామ్యమును స్థాపింపవచ్చును. ఈ గణము లన్నియు ప్రాచీన తెలుగు లాక్షణికులగు రేచన, విన్నకోట పెద్దనలు గ్రహించిరి.

## ఇన్నిశై వెణ్బా - ఆటవెలది :

ఆటవెలదికి నాలుగుపాదములుండును. 1–3 పాదములందు 3 సూర్యగణములు 2 ఇంద్రగణములును, 2–4 పాదములందు 5 సూర్యగణములు క్రమముగా వచ్చును. యతి 1–4 గణాద్యక్షరములకు చెల్లును. ఈరశైచీర్లలో గగ, గల, య, జ, స, న, నల, నగ, జల, జగ, భ, రగణములున్నవి. అనగా సూర్యగణములు కొన్ని ఇంద్రగణములు కొన్నియున్నవనుట. వీనిలో గగ, గల, స, నలను మాత్రము గ్రహించిన ఆటవెలదులందు రాదగు సూర్యగణనియమము సరిపోవును. అట్లే నల, నగ, భ, ర, మ, త, సగ, సల గణములనెన్ని కూర్చినచో ఇంద్రగణ నియమముకూడ సరిపోవును. పై గణములతో నించుమించు సరిపోవు ఇన్నిశైవెణ్బా పద్యమును పరికింతము.

మళ్లై యిన్ఱి మాని లత్తారిక్కై మళ్లైయం
తవమి లారిల్ వళ్లియు మిల్లై తవముం

– యాప్పిలక్కణం – పుట 20

సిందియల్ వెణ్బా - త్రిపదలు :

'సిందియల్‌వెణ్బా' పద్యమునకు మూడు పాదములుండును. రెండుపాదము లందు నాలుగుశీర్లు మూడవపాదమునందు 3 శీర్లు వచ్చును. రెండవపాదము చివరి గణము 'తనిచ్చొల్'గా గావి సామాన్యపదముగాగాని యుండవచ్చును. సిందియల్ వెణ్బా పద్యమునకు త్రిపదులకు సామ్యములున్నవి.

త్రిపదులకు కూడ మూడు పాదములే. రెండవ పాదము చివరిగణము 'తనిచ్చొల్'గా నుండును. మొదటి పాదములో నాలుగువిష్ణగణములు రెండవ పాదములో వి–బ్ర-వి–వి గణములుండును. మూడవపాదములో వి-బ్ర–వి గణము లుండును. ప్రాసనియతము. ఈ దృష్టితో నొక తమిళ పద్యమును పరిశీలింతము

పొట్టుమిన్ పొట్టుమిన్ పొట్టుమిన్ పొట్టుమిన్
కూట్టంకు మైక్క వరుమున్న మరంగాళ్
ఏట్టు కన్దాన్ పొట్టాళిజై

– యాప్పిలక్కణం – చెయ్యుళియల్ పుట 21

క్రీగీతలిడినచోట్ల 'బ్రహ్మగణము'లు కూడ సరిపోయినవి. పై పరిశీలనమువలన సిందియల్‌వెణ్బా పద్యములకు త్రిపదులకు సామ్యములున్నట్లు నిర్ధారింపవచ్చును.

5. 1. 3 కలిపా :

కలిప్పాలో పాదమునకు నాలుగుశీర్లుండును. ఇవిసాధారణముగా కాయ్‌చ్చీర్లు. కలిప్పాలో ఒత్తాళిశైకలిప్పా. కొచ్చగక్కలిప్పా, ఉఱళ్‌కలిప్పా, వెణ్‌కలిప్పా అను నాలుగువిభేదములున్నవి. ఒత్తిళిశైక్కలిప్పా నేరిశై, అంబోదరంగ వణ్ణగములని మూడువిధములు. కొచ్చగక్కలిప్పాతరవు, తరవిణై, చిట్టాళిశై, పట్టాళిశై, మయంగిశై అని ఐదు విధములు. ఇవిగాక కలిప్పాయందు తాళిశై, తుఱైవిరుత్తము

లను మూడు ఉపవిభేదములును గలవు. కలిత్తొగై యను గ్రంథము కలిప్పాఛందమున వ్రాయబడినది.

కలిప్పా స్వతంత్రపద్యము గావలయునన్నచో అద్దానితో ఆశిరియప్పాలేదా వెణ్బా పద్యమును చేర్పవలయును. దీనినే లాక్షణికులు 'చరితకమ్' అని పేర్కొనిరి. తెలుగులోగలసీసము చరితకము పోలినదే. సీసమునకు ఆటవెలది లేదా తేటగీతి చేర్చుట సంప్రదాయము. కనుక తెలుగులో కలిప్పా లక్షణములుగల పద్యములున్నవని అభిప్రాయము.

కట్టళై కలిత్తుఱై పద్యమునకును కన్నడాంధ్రములందుగల నడువణక్కరె మధురాక్కరలకు సామ్యములున్నవి.

కట్టళైక్కలిత్తుఱైలో అయిదేసిశీర్లుగల నాలుగు పాదములుండును. మొదటి నాల్గుశీర్లు అగవల్చ్చీర్లు, ఐదవది విళంగాయ్చ్చీర్లుగా నుండవలయును. పాదాదిని నేరశై వచ్చినచో ప్రతిపాదమునందును 16 అక్షరములు రావలెను. పాదాదిని నిఱై అశై వచ్చినచో 17 అక్షరములుండును తుది అక్షరము 'ఏ' అయి యుండవలెను. అక్షరములను గూడ లెక్కబెట్టి చెప్పుటవలన 'కట్టళై' అనుపేరు వచ్చెను.

నడువణక్కరె లేదా మధురాక్కరలకు నాలుగు పాదములుండును. పాదమునకు వరుసగా 1 బ్రహ్మ (సూర్య) 3 విష్ణు (ఇంద్ర) 1 రుద్ర (చంద్ర) గణములు రావలయును ప్రాస నియతము. యతి 1-4 గణాద్యక్షరములకు చెల్లును. అక్షర సంఖ్యనుగూర్చి కన్నడాంధ్ర లాక్షణికులు పేర్కొనలేదు. ఈ దృష్టితో క్రింది తమిళపద్యమును పరిశీలింతము

నాణ్మ । లర్ తోయ్న్ద । నఱుపుదన్ । తింగని । నానశిప్పేన్
కాణుఱైఆసిరై ప్పాలోడు పాయసం కొండశిప్పేన్
వాన్దోదుమామలై నాయకన్ తాళిణై వాళ్త్తిడువేన్
నానివణ్ సీర్న్దనన్ నాయకి యాళ్ళిణై క్కాణవెన్దే

— యాప్పొళి - పేజి 119

మొదటిపాదములో వరుసగా కన్నడాంధ్రగణ ప్రస్తారమనుసరించి గల-త-నగ-భ-భగ గణములున్నవి. 1 బ్రహ్మ 3 విష్ణు 1 రుద్రగణ క్రమమనుసరించి కట్టళైక్కలిత్తుఱై మధురాక్కరలకు సంబంధము కలదని నిర్ధారింపవచ్చును.

5. 1. 4. వంజిప్పా - అక్కరలు

వంజిప్పా పాదములకు రెండుగాని మూడుగాని శీర్లుండవచ్చును. ఇది కుఱశది వంజిప్పా, సిందడి వంజిప్పా అని రెండు విధములు. మరియు వంజిత్తుశై, వంజిత్తుఱై, వంజివిరుత్తములను ఉపభేదములును గలవు. వంజిత్తుఱైలో రెండేసి శీర్లుగల నాలుగు పాదములుండును. వంజివిరుత్తంలో మూడేసి శీర్లుగల నాలుగు పాదములుండును. 1-3 గణాద్యక్షరములకు మైత్రి చెప్పుట వంజివిరుత్తం లక్షణములలో ప్రధానమైనది.

వంజిప్పా పద్యమునకును కన్నడాంధ్రములందుగల కిరియక్కరె, అల్పాక్కరలకు సామ్యము లున్నవి.

కిరియక్కరె, అల్పాక్కర పద్యములకు నాలుగు పాదములుండును. పాదమునకు వరుసగా 2 విష్ణు (ఇంద్ర) 1 రుద్ర (చంద్ర) గణము వచ్చును. 1-3 గణాద్యక్షరములకు మైత్రి పాటింపబడును. ఈ దృష్టితో క్రింది తమిళ పద్యమును పరిశీలింతము.

నీఱణి మేనియన్ నీళ్మదియో
డాఱణి జడయిన నణియిళైయోర్
కూఱణి న్నినితుఱై కుళిర్ నగరం
చేఱణి వళవయ ప్రటసిరపురమే

—సంబదర్ తేవారం

(తొడైయదికారం పుట 67)

పై పద్యము మొదటి పాదమునందు భ-ర-భగ గణములున్నవి. అనగా 2 విష్ణు (ఇంద్ర) 1 రుద్ర గణము (చంద్ర) లున్నవనుట. యతి ప్రాసలు రెండును తమిళ పద్యములో సరిపోయినవి. కనుక వంజిప్పా కిరియక్కరెలకు పోలికలున్నట్లు చెప్పవచ్చును.

5. 1. 5 పరిపాడల్ :

పరిపాడల్ ప్రత్యేకమగు ఛందస్సంప్రదాయ మనుసరించిన పద్యముకాదు. ఇందు అశిరియప్పా, వెణ్బా, కలిప్పా వంజిప్పా అను నాలుగు ఛందోరీతులనుగలసి

వచ్చును. కలిప్పా అంగములగు తరవు, తాళిచ్చొల్, చురితకం, అరాగం, అందబో రంగం మొదలగునవి 'పరిపాడల్' అందు అంగములై భాసించును. ఇట్టివి కన్నడాంధ్రములందు కానరావు.

5. 1. 6 మరుట్పా .

మరుట్పా పద్యములకు నాలుగు పాదములుండును. మొదటి రెండు పాదములు వెణ్బాపాదములు. మూడు నాలుగు పాదములు ఆశిరియప్పా పాదములు. ఇట్టి లక్షణములుగల మరుట్పాలు సమనిలై మరుట్పాలనబడును.

మొదట రెండువెణ్బా పాదములనుంచి పిదప ఎన్నోని ఆశిరియప్పాపాదములుంచినచో నట్టి 'వియనిలై మరుట్పా' లనబడును.

తెలుగులోగల తేటవెలది, ఆటగీతి మొదలగు పద్యములను మరుట్పాలుగా పేర్కొనవచ్చును. ఒక పద్యమున తేటగీతి రెండుపాదములును ఆటవెలది రెండు పాదములును కూర్చినచో తేటవెలది. అట్లే ఆటవెలది రెండు పాదములును తేటగీతి రెండు పాదములను చేర్చివ్రాసిన ఆటగీతి యనబడును. వీనిని గూర్చి కన్నడాంధ్ర దేశిచ్ఛందస్సులను ప్రకరణ న విపులీకరింపబడును.

5. 2. మలయాళ ఛందములు :

మలయాళభాషయందలి ఛందోరీతులు కన్నడాంధ్ర ఛందోరీతుల కంటె భిన్నమైనవి. మలయాళసాహిత్యముపై క్రీ. శ. 12. 13 శతాబ్దములందు తమిళ ప్రభావమెక్కువ యగుటవలన తమిళ ఛందోరీతులు మలయాళకావ్యములందు చోటు చేసికొనినవి రామచరిత కావ్యమునందు 16 విధములగు తమిళవృత్తములు ప్రయోగింపబడినట్లు డా॥ ఎన్. వి. కృష్ణవారియర్‌గారు "A study of Malayalam Metres' అను సిద్ధాంతవ్యాసములో (పుట 65–74) నిరూపించి యున్నారు. ఆపై మలయాళములో మణిప్రవాళశైలి ప్రచారముచ్చుటతో సంస్కృత వృత్తములు కావ్యములందు విరివిగా ప్రవేశించినవి. క్రీ. శ 14 వ శతాబ్దమున నిరణంకవులు తమిళప్రభావములేని మలయాళమునకు వ్యాప్తి తెచ్చుటతో దేశీయచ్ఛందములకు కావ్యములందు ప్రవేశము కలిగినది. పై పరిశీలనమువలన మలయాళములోగల పద్యములను మూడు విధములుగా వర్గీకరింపవచ్చును.

# దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు – తులనాత్మక పరిశీలన

1. తమిళ మాతృక గలవి.
2. సంస్కృత మాతృకగలవి.
3. దేశీయ మాతృక గలవి.

రామచరితమునందు ఎదుకై (ప్రాస) మోనై (యతి) అన్తాది నియమములు పాటింపబడినవి. కాని కణ్ణశ రామాయణమునందు మోనై, అన్తాది నియమములంతగా కానరావు కాని ఎదుగై మాత్రము నియతముగా పాటింపబడినది. వృత్తనియమములు చాలవఱకు తమిళ ఛందోగ్రంథములందు చెప్పబడినట్లే పాటింపబడినవి.

క్రీ శ. 15వ శతాబ్దమునకు చెందిన చెరుశ్శేరి తన రచనలలో మలయాళ దేశీయతకు ప్రాధాన్యమొసగెను. క్రీ. శ. 16వ శతాబ్దమున ఎళుత్తచ్చన్ జానపద చ్ఛందములకు కావ్యగౌరవము కల్పించెను. కుంజన్ నంబియార్ (18వ శతాబ్దము) సంస్కృతమునగల ఛందోరీతులను తన సాహిత్యమున కనుగుణముగా మార్చుకొని వివిధ మాత్రాచ్ఛందస్సులను ప్రయోగించెను. చంగంబుళ (20శ) ఛందస్సులో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చెను. 20వ శతాబ్దములో మలయాళ జానపద గేయములలోని ఛందోరీతులకు కావ్యగౌరవము కలిగినది.

తమిళ మాతృకగల పద్యము లనుటలో తమిళ ఛందోరీతులు మలయాళములో ఆ పేర్లతో వ్యవహరింపబడుట యొక భాగము. తమిళ ఛందోరీతుల ఛాయలు గలిగి భిన్న నామములతో వ్యవహరింపబడుట రెండవభాగమగును.

తమిళములోని ఆశిరియవిరుత్తం, కలివిరుత్తం వంజివిరుత్తం మొదలగునవి చతుష్పాద పద్యములు. వృత్తమంజరి ననుసరించి సంస్కృత మాతృకగలవి చతుష్పాద పద్యములు.

తమిళమున కుఱళ్ వెణ్బై, కుఱట్టాళిశై, కుఱళ్‌వెణ్బా మొదలగునవి రెండు పాదములు గల పద్యములు. కుమ్మి, చిందు మొదలగు దేశీయ చ్ఛందములును రెండు పాదములు గలవియే యగును. మలయాళ భాషావృత్తములు పాదనియమ రహితములైనను ఎక్కువగా రెండుపాదములు కలవిగా కనిపించును.

తమిళములో సింధియల్‌వెణ్బా, వెణ్డాళిశై, ఆశిరియత్తాళిశై మొదలగునవి మూడు పాదములు గల పద్యరీతులు.

మలయాళ ఛందోరీతులనుగూర్చి శ్రీమతి ఒ. టి. శారదాకృష్ణన్‌గారి అభిప్రాయము—

"In Malayalam as in Greek Poetry is Snng. In Malayam the word which corresponds to the Greek muse is pattu. ... ... Division of the line into feet is quite natural in Malayalam but quite arbitrary in Sanskrit[3]. (A. O. R. 1937 Madras)

ఈ దృష్టితో తమిళ మలయాళ ఛందోరీతులను పరిశీలింతము.

## 5. 2. 1. తమిళమాతృకగల మలయాళ ఛందోరీతులు :

తమిళఛందోరీతులగు అరుశీర్‌ఆశిరియవిరుత్తం, ఎళుశీర్ ఆశిరియవిరుత్తం, ఎణ్‌శీర్ ఆశిరియవిరుత్తం, పదిన్‌శీరడివిరుత్తం, అరుశీర్ తాళిశై, ఎళుశీర్ తాళిశై ఆశిరియత్తుఱై కలివిరుత్తం, కలిత్తాళిశై కలిత్తుఱై, వంజివిరుత్తం, వంజిత్తాళిశై, వంజిత్తుఱై మొదలగునవి ప్రాచీనమలయాళ గ్రంథములందు కలవు.

ఆశిరియవిరుత్తం :

తమిళపద్యములందు ఆశిరియం లేదా అగవల్ ప్రాచీన పద్యజాతికి చెందినది. ఆశిరియ విభేదములలో విరుత్తమొకటి విరుత్తమనునది వృత్తశబ్దభవమని కొందరు భావించుచున్నారు. పద్యములకు నాలుగు పాదములుండుట వృత్తలక్షణము పాద మునకుండు గణసంఖ్య ననుసరించి 'ఆశిరియం' పేరు మారుచుండును పద్యపాదము నందు అరుశీర్లు (గణములు) ఉన్నచో అరుశీర్ ఆశిరియవిరుత్తం ఏడుశీర్లు ఉన్నచో ఎళుశీర్ ఆశిరియవిరుత్తం. ఎనిమిదిశీర్లు ఉన్నచో ఎణ్‌శీర్ ఆశిరియవిరుత్తం. పది శీర్లు ఉన్నచో పదిన్ శీరడివిరుత్తం. పదునాలుగు శీర్లు ఉన్నచో పదినాన్గు శీరడి విరుత్తం. తమిళములో 32 శీర్లుగల పద్యపాదములుకూడ కలవని పులవర్ కుళందై తొల్కాప్పియదికారములో (పు 226) పేర్కొనిరి. వీనిలో కొన్నిటికి మాత్రము ఉదాహరణములు -

అరుశీర్ - మణ్ణనే విరింజన్ తన్దాన్ వరంగన్ నీ యిరన్దవల్లాల్

—రామచరితం 398

ఎటశీర్ – విచ్చయాయ్ ముడియు మిచ్చే యిఱైతొటిల్
పీఱు మిక్కవి పీరర్కాణ్
— రామచరితం 425

ఎణ్శీర్ – కొండలన్ సిరమేళు నూఱు కోడి
కుంబర సిరయేళు నూఱుకోడి
—వృత్తమంజరి 10-1

పైన పేర్కొనబడిన పద్యములే గాక తమిళ మాతృక గలవైయె భిన్న నామములతో వ్యవహరింపబడిన మలయాళ ఛందోరీతులను గనిపించుచున్నవి. వానిని క్రమముగా పరిశీలింతము.

## కేక – అరుశీర్ ఆశిరియవిరుత్తం లేదా అరుశీర్ తాళిశై

'కేక' రెండు పాదములుగల మలయాళ పద్యము. ఒక్కొక్క పాదములో 3,2-2,3-2,2 వరుసలో 14 అక్షరములుండును. అనగా పాదమునకు ఆరు గణములనుట. ఒక్కొక్క గణములో నొకగురువైన ఉండవలయును. లేదా అన్ని అక్షరములును గురువులు కావచ్చును. కాని కావ్యప్రయోగముల ననుసరించి చూడగా సాధారణముగ 6 గురువులు 8 లఘువులుండుట కనిపించును. ఇక మాత్రా నియమముల దృష్టితో చూడ పాదములో 20 మొదలు 28 మాత్రలుండుటకు వీలున్నది. వృత్తమంజరి రచించిన ఎ. ఆర్. రాజరాజవర్మ 22-24 మాత్రలు గల కేక పద్యములు ప్రసిద్ధములని పేర్కొనియున్నాడు. ఉదా॥

3 2 2 3 2 2
కైలాసా చలే సూర్య కోటిశో భితే విమ — 24 మాత్రలు

లాలయే రత్న పీఠే సంవిష్టం ధ్యాన నిష్ఠం — 26 మాత్రలు

పై 'కేక' పద్యమునందు ఆరుగణములుండుట వలనను, తమిళ గణవిభజన ననుసరించి లక్షణము సరిపోవుట వలనను, రెండుపాదము లుండుటవలనను దీనిని 'అరుశీర్ తాళిశై' గా కూడ పేర్కొనుటకు వీలున్నది. మలయాళ లాక్షణికులు అక్షర సంఖ్యకు కూడా ప్రాధాన్యమొసగిరి. తమిళ లాక్షణికులు గణక్రమమునకు మాత్రమే ప్రాధాన్యమొసగిరి. ఇంతియ భేదము.

## అన్ననడ - అరుశీర్ ఆశిరియవిరుత్తం లేదా అరుశీర్ తాళిశై :

మలయాళములో ప్రసిద్ధిపొందిన మరియొక పద్యము అన్ననడ ఈ పద్యమునకు రెండుపాదములు. పాదమునకు వరుసగా ఆరు 'లగ' గణములు రావలయును. 1-4 గణములు తప్పక 'లగ'లై యుండవలయుననియు తక్కినగణములలో లగ క్రమము నియతము కాదనియు వృత్తమంజరికారుడు చెప్పెను. (పుట 16) ఉదాహరణమునకు —

హరా హరా హరా శివా శివా శివా
పురా హరా మురహరా నతా పదా

— వృత్తమంజరి - 329

మలయాళ పద్యరీతులకు గేయత్వము ప్రధానగుణము. కనుక గురువు లఘువగుట, లఘువు గురువగుట సహజము. కనుక 'లగ' క్రమమే గాక 'గల' క్రమమును గూడ గ్రహించుట దోషముకాదు. ఈ దృష్టితో నొక తమిళపద్యమును పరిశీలింతము.

ఏశై యెన్ఱ పోది (నం) ఎన్న తున్బ మోది (నం)
కోశై యెన్ఱు వాళ్న్ది దోం) కొడియ యక్క త్తాళ్న్ద(దోం)

నాయక్కవిపాడల్ తొడై యడికారం - పుట 168

పై పద్యమునందును ఆరుగణములున్నవి. ఈ గణములన్నియు ఆశిరియగణములే. పైపద్యమునకు రెండుపాదములుండుట వలన దీనిని అరుశీర్ తాళిశై యనిచెప్పవచ్చును. హంసగమనమను అర్థముగలది అన్నడయగుట వలన 'లగ' క్రమమునకు ప్రాధాన్యమేర్పడి యుండవచ్చును. పై పరిశీలనమనుసరించి అన్ననడకు అరుశీర్ ఆశిరియ విరుత్తమునకు సంబంధమును స్థాపింపవీలున్నది.

## అజగరగమనం - అరుశీర్ ఆశిరియ విరుత్తం లేదా తాళిశై

భాషావృత్త దీపికాకారుడగు ఆచార్య కుంజి కృష్ణమేనన్‌గారు అజగర గమనమును 'ఋజుతరంగిణి'గా పేర్కొనిరి. ఈ పద్యము యొక్క గణవిన్యాసము ఈ విధముగా నుండును.

4 4 4 4 4 4 + 2
వర్ధిత తరథవ శహిమా చలస న్నిభతుం గశరీరన్

—కళ్యాణ సౌగంధికతుళ్లల్

ఇట్టి గణవిన్యాసముగల పద్యములు తమిళమునందును గలవు. మచ్చున కొక యుదాహరణము—

కండేన్ నెంజం కనివాయ్ కనివాయ్ విడనా నెడునాళ్
ఉండే నదణాల్ సీయెన్ ఉయిరై సుదలో దుండాయ్
పండే మెరిమున్ ఉన్నై ప్పావీ దేవీ యాగ
క్కొండే లల్పేన్ వేరోర్ కూటం తేటి క్కొండేన్

—కంబరామాయణము (తొడైయధికారం - 151)

## శంకర చరితం - అరుశీర్ ఆశిరియ విరుత్తం లేదా తాళిశై

శంకర చరితమను మలయాళ పద్యమునకు రెండు లేక నాలుగు పాదము లుండవచ్చును. పాదమునకు షణ్మాత్రా గణములు నాలుగు చేరుట శంకర చరిత లక్షణము. దీనినే ఆరు చతుర్మాత్రా గణములు గల పద్యముగా గూడ చెప్పవచ్చును.

ఉదా॥

హరిరక్షా వరసోదర హనుమానోకడు సహితమ్
హరిర క్షావర సోదర హనుమానో డు సహితమ్

—భాషావృత్త ప్రకరణం - వృత్తమంజరి (పుట 85)

ఇట్టి గణ విన్యాసముగల పద్యములు తమిళమునందును గలవు. ఉదాహరణమునకు—

వాణార్ తింగళ్ వాళ్మగ మాదర్ పాద వార్సడై

— సంబందర్ తేవారం తొడైయదికారం — పుట 152

పై పద్యమునందు నాలుగు షణ్మాత్రాగణములున్నవి.

## మల్లికా - అరుశీర్ ఆశిరియవిరుత్తం లేదా తాళిశై :

మల్లికా ఛందమునకు రెండు లేక నాలుగుపాదము లుండవచ్చును. పాదమునకు నాలుగు సప్తమాత్రాగణములు చేరుట మల్లికావృత్త లక్షణమగును. దీనిని

అరుశీర్ ఆశిరియవిరుత్తము లేదా తాళిశైగాగూడ చెప్పుటకు వీలున్నది ఉదా॥

ఎంత నిత్రపజన్న దానవ నెంతుసంగతి యెన్నునీ

– సుప్రభాతం తుళ్ళల్

తమిళ సాహిత్యమునందుగూడ మల్లికావృత్తములను పోలిన పద్యములు కనిపించు చున్నవి. ఉదాహరణమునకు –

అరుణ వెంకది రాయి రత్తవన్ అంబి ణాలుదవుం
కరుణ నుంచిల పగళి యోరిరు కణ్ణార్ మార్బిల్విడా

– విల్లిభారతం – తొడైయదికారం పుట 156

హంసప్లుతం – అరుశీర్ ఆశిరియవిరుత్తం లేదా తాళిశై :

హంసప్లుతమునకు రెండులేక నాలుగు పాదము లుండవచ్చును. పాదమునకు 6 త్రిమాత్రాగణములు చివర 1 గురువు రావలయుచు. త్రిమాత్రాగణములు ద్వ్యక్షరగణములై యుండవలయునని నియమము. అనగా గల గాని లగ గాని కావచ్చుననుట. చివరిగురువు గేయధర్మమనుసరించి చేరియుండవచ్చును. అరుశీర్ ఆశిరియవిరుత్తములో కూడ నిట్టి గణవిన్యాసముంచుటకు వీలున్నది.

ఎళుశీర్ ఆశిరియ విరుత్తం
లేదా
ఎళుశీర్ ఆశిరియతాళిశై

—కుసుమమంజరి.

తమిళములో ప్రసిద్ధి పొందిన పద్యములలో ఎళుశీర్ ఆశిరియ విరుత్త మొకటి. పాదమునకు ఏడుగణము లుండుట ఈ విరుత్త లక్షణములలో ప్రధానమైనది. ఏడు గణముల విన్యాసము రెండు పాదములందున్నచో అది ఎళుశీర్ ఆశిరియ తాళిశై యగును.

కణ్ణాళ మళగిల్ తిరిచ్చను పదంరతం పిరకిల్ నోక్కియుం

—వృత్తమంజరి పుట 39

ఇట్టివి తమిళ సాహిత్యమునందును గలవు. ఉదాహరణమునకు—

ఇలంకై ఎటించ కరుణాకరన్దన్ ఇగల్వోం శిలైయిన్ వలకేట్పిర్

—కళింగత్తుప్పరణి 2–64

ఎన్ శీర్ ఆశిరియ విరుత్తం
లేదా } –తరంగిణి
ఎన్ శీర్ ఆశిరియతాళిశై

మలయాళములో ప్రసిద్ధి పొందిన పద్యములలో 'తరంగిణి' పేర్కొనదగినది తరంగిణిలో పెక్కు విభేదములున్నవి. సామాన్య తరంగిణి పాదమునకు నాలుగు చతుర్మాత్రా గణములుండును. రెండు పాదములకు ఎనిమిది గణములగును.

ఎన్ శీర్ ఆశిరియ విరుత్తములో నాలుగు పాదములుండును. పాదమునకు వరుసగా 8 గణములుండును. ఎన్ శీర్ ఆశిరియతాళిశైకు రెండు పాదములే. కనుక తరంగిణిని 'తాళిశై'గా గాని వృత్తవిభేదముగాగాని చెప్పవచ్చును. ఈ దృష్టితో నొక తమిళ పద్యమును పరికింతము.

మనమే తరుపాల్ పెఱమా ఱశమా
మగణార్ మునియాం వణియోం అణియోం
కోయిల్పురాణం – తొడైయదికారం పుట 189

పై పద్యమునందు చతుర్మాత్రాగణవిన్యాసము సుస్పష్టము

**ఆశిరియతుఱై పల్లవిని :**

ఆశిరియ విభేదములలో 'తుఱై' యొకటి. దీనికి నాలుగు పాదములుండును. 2, 4 పాదములలో గణములు తగ్గుటయో లేదా 1–3 పాదములలో గణములు తగ్గుటయో లేదా చివరి పాదమునందు మాత్రము గణములు తగ్గుటయో లేదా మూడవ పాదమున మాత్రము గణములు తగ్గుటయో మున్నగురీతి పలువిధములుగా నుండును.

మలయాళములోగల పద్యములలో 'పల్లవిని' యొకటి. భాషావృత్తదీపికా కారుడగు ఆచార్య కుంజికృష్ణమేనన్‌గారు పల్లవిని 'పల్లవం'గా వ్యవహరించిరి. పల్లవం గణవిన్యాస మిట్లుండును. 6 4 4 6 4 4
6 4 6 2

– భాషావృత్తదీపిక – పుట 208

పై పల్లవిని పోలిన తమిళపద్యము నొకదానిని పరికింతము.

అంతము మాదియు మాగియ వణ్ణల్
ఆరళలంగై యమరీన్దిలంగ
— సంబందర్ తేవారం తొడ్డై యదికారం 248

ఇట్లే మలయాళములో ప్రసిద్ధమగు 'సమాసమ' వృత్తమునకు 'ఆశిరియత్తుఱై' పద్యమునకు పోలికలు కనిపించుచున్నవి.

## కలివిరుత్తం :

తమిళపద్యములలో ఆశిరియం పిదప మలయాళమునకు మిక్కిలి సన్నిహితమైన ఛందోబంధము కలిప్పా. కలిప్పావిభేదములలో కలివిరుత్తమొకటి. కలివిరుత్తమునకు నాలుగు పాదములు. కలిప్పాలో సాధారణముగా కాయ్చ్చీర్లు వచ్చును. కలివిరుత్తపాదమునకు నాలుగుశీర్లు ఉండును. మొదటిపాదమునందే గణక్రమముండునో అదే పద్ధతి తక్కినపాదములందును పాటింపబడవలయును. కలివిరుత్తమునకు నాలుగు పాదములుకాగా కలిత్తాళిశైకు రెండే పాదములుండును. తమిళమున కలివిరుత్తమునకు ప్రచారమెక్కువ.

మలయాళ ప్రసిద్ధగ్రంథమగు రామచరితమున కలివిరుత్తములు పెక్కు ప్రయోగింపబడి యున్నవి. కలివిరుత్తమందుగల గణ, పాద నియమములు మలయాళ పద్యములందును భిన్నరీతుల పాటింపబడినవి. కాకళి-ద్రుతకాకళి, శ్లథకాకళి మిశ్రకాకళి, ఊనకాకళి, కలకాంచి, మణికాంచి, పర్యస్తకాంచి, గీతాక్ర, మంజరి, సర్పిణి, స్రగ్విణి, స్వాగత, సుమంగల, ఉపసర్పిణి, కల్యాణి, భుజంగప్రయాత తోటకములకు కలివిరుత్తమునకు పోలికలున్నవి వీనిలో కొన్నిటిని మాత్రము పరిశీలింతము.

## కాకళి :

కాకళి రెండుపాదములుగల చిన్నపద్యము. మొదటి పాదమున నాలుగు గణములు, రెండవ పాదమునసూలుగు గణములును ఉండును. ఐదుమాత్రలగణ

ములనే కాకళిలో వాడవలయును. అవియు మూడక్షరముల గణములై యుండవలయును. సాధారణముగా కాకళిలో రగణతగణములే ప్రయోగింపబడుచుండును. లఘ్వక్షరములను దీర్ఘములుగా పఠించుట లాక్షణిక సమ్మతమే. ఈ దృష్టితో తమిళ మలయాళ పద్యములను పరిశీలింతము.

తమి : అగవనస ముగవనస మవైమల రవరిహార్
సగవనస మలర్కువియ వలంవరుచర్ నగరే
తక్కయాగప్పరణి తొడైయదికారం 129

మల : శాటిక ప్పైదలే చారుశీ లేవరీ
కారోమ లేకథా శేషవుం చొల్లునీ
—వృత్తమంజరి - సూ 322

తమిళ పద్యమునందు మొదటి పాదమున పంచమాత్రాత్మక గణ సంయోజనము స్పష్టముగా గోచరించుచున్నది. అక్షర నియమము తమిళమునందు లేదు. కాని మలయాళ పద్యమునందు అక్షర నియమము, గణనియమములు రెండును పాటింపబడినవి.

మణికాంచి :

మణికాంచి కాకళిని పోలినదే. కాని కాకళి రెండు పాదములందును మొదటి గణమును ఐదు లఘువులుగా నుంచుట ప్రత్యేక నియమము.

పరమపురు షన్మహా మాయతన్ వైభవం
పరికయుమ నారతం కేళ్కయుం చెయ్కిలో
వృత్తమంజరి సూ 324

మిశ్రకాకళీ :

మిశ్రకాకళి యందు ఐదు లఘువుల గణములు యథేచ్ఛగా వాడబడును. పైన పేర్కొనబడిన తమిళపద్యమునందు ఐదులఘువుల గణములుండుట గమనార్హము

జనిమృతిని వారణం జగదుదయ కారణం
చరణనత చారణం చరితమధు పూరణం

—వృత్తమంజరి సూ 325

## ద్రుత కాకళి :

ద్రుతకాకళి కాకళిని పోలినదే. కాకళి పాదములవలె నుండినను చివర నొక వర్ణము ద్రుతకాకళిలో తగ్గును. అనగా పాదమునకు 18 మాత్రలనుట.

కోడైగళ్ సొరివన కుళరిళ నణవం
పాడైగళ్ సొరివన పరుమణి కనకం

—వృత్తమంజరి సూ 327

## కళకాంచి :

కళకాంచియు కాకళి ని పోలినదే. మొదటిపాదమున 1-2 గణములను లేదా 1-2-3 గణములను ఐదులఘువులుగా నిలుపవలయును. రెండవ పాదము నాలుగు పంచమాత్రా గణములుండవలయును. అవియు మూడక్షర గణములే కావలయును.

1 2 3
సకలశుక కులవిమల తిలకిత కళేబరే
సారస్య పీయూష సారసర్వస్వమే

—అధ్యాత్మరామాయణం వృత్తమంజరి 328

కలివిరుత్తమునందు నాలుగు గణములు. పైన పేర్కొనబడిన మలయాళ పద్యము లందును చతుర్గణ విన్యాసము కనిపించును. ఆ పద్యములందును తమిళ గణ నియమము సరిపోవుట వలన కలివిరుత్తముతో సంబంధము చెప్పుట సమంజసమే యగును.

## 5. 2. 2. సంస్కృత మాతృకగల మలయాళపద్యములు :

మలయాళసాహిత్యమునందు సంస్కృతమాతృక గల మలయాళపద్యములు పెక్కు కలవు. కన్నడాంధ్రములందువలె సంస్కృతవృత్తములు మలయాళములో యథాతథముగా గ్రహింపబడినవి. ఉత్పల, చంపక, శార్దూల, మత్తేభ, స్రగ్ధర,

మహాస్రగ్ధరాదులు కన్నడాంధ్రములందు సుప్రసిద్ధములు. కాని మలయాళము నందు స్రగ్విణి, స్వాగత, భుజంగప్రయాత, వసంతతిలక, ఉపజాతివృత్తములకు ప్రచారమెక్కువ సంస్కృత శబ్దములను యథాతథముగా గ్రహించుటవలనను, మలయాళమున సంస్కృతవృత్తములకే ప్రాధాన్యము లభించినది. సంస్కృత వృత్తములలో తమభాషలకనువగు వృత్తములనే కన్నడాంధ్రకవులు స్వీకరించిరి.

మలయాళకవులలో కొందరు సంస్కృత వృత్తములను యథాతథముగా గ్రహించిరి. మరికొందరు ఆయా సంస్కృత వృత్తపాదములందుగల మాత్రలకు ప్రాధాన్యమొసగి యిచ్చవచ్చిన రీతి ప్రయోగముల గావించిరి. అట్టివి సంస్కృత మాతృకగల మలయాళ పద్యములగును. కొన్ని పద్యములు తమిళ సంస్కృత లక్షణముల కనుకూలమయినవిగా కూడ నున్నవి. వానిలో స్వాగతము, తోటకము, భుజంగప్రయాతము, స్రగ్విణి, మదనార, వసంతతిలకము మొదలగునవి పేర్కొనదగినవి. రాగతాళానుకూలమగుటవలన నివి ద్రావిడ ఛందోరీతులనియు, క్రమముగా సంస్కృతములో ఈ వృత్తములు ప్రవేశించెననియు శ్రీ ఉళ్ళూర్ పరమేశ్వరయ్యర్ గారి అభిప్రాయము. మలయాళములోగల సంస్కృత చ్ఛందోరీతులను గురించి డా॥ ఎస్. వి సుబ్రహ్మణ్యంగారు

"In Malayalam there are many native and Sanskritised metres that have four ganas per line ... ... Though they all have the same number of matra (mora) and the number of letters per line make them different metres" అని స్పష్టము చేసిరి.

పంచచామరము :

ఈ వృత్తమును గూర్చి డా॥ ఓ. ఎం. అనుజన్‌గారు

"This is composed of eight iambic feet in a line. The iambic order is often changed and the last syllable dropped in Malayalam.5 అని స్పష్టముచేసిరి.

నతోన్నత :

This is formed of eight disyllabic feet in the first line and six in the second plus a concluding long syllable This metre is not seen in Tamil poetry.6 అనియు తెలియజేసిరి.

ఎంతా యాలుమ్ చెందా మర క్కణ్ణ నెన్నె క్కాణుమ్ నేరుమ్
సంతో షిక్కుమ్ సల్కి రిచ్చ యక్క యుచె య్యుమ్
—కుచేల వృత్తం

శితాగ్ర

ఈ పద్యమునకు రెండు పాదములుండును. పాదమునకు నాలుగు గణము లుండవలయును. మొదటి గణము జగణమై యుండవలయును. తక్కినవి చతుర్మాత్రాక గణములై యుండవలయును. ఉదా॥

విదగ నాకియ నళనె చూతన్
విదర్భ నల్పుర మడుత్తు కండు
-వృత్తమంజరి సూత్రము 338

సరిణి

ఈ పద్యమునకు రెండు పాదములుండును. ప్రతి పాదములో నాలుగు గణము లుండును. మొదటి గణము ద్వ్యక్షరమై యుండవలయును. మిగిలిన మూడు గణములు త్ర్యక్షరములై యుండవలయును. అన్ని గణములు గురువులతో ప్రారంభము కావలయును. ద్వ్యక్షర గణములో రెండును గురువులు కాదగును. ఉదా॥

ఏళు సాగర మేఖల యాకునో్న
రూళి తన్నిల్ నిరయున్నలోకరే
—వృత్తమంజరి సూత్రము 340

ఊనతరంగిణి :

ఈ పద్యమునకు రెండు పాదము లుండును. మొదటి పాదమున నాలుగు చతుర్మాత్రాగణములును, రెండవ పాదమున మూడు చతుర్మాత్రా గణములును వచ్చును.

సురవధు మారుక నడువిలి దాసీం
నరవధు చేరుక యిల్లే
—నలచరిత్ర (వృత్తమంజరి 341)

## 5. 2. 3. దేశీయ మాత్రృక గలవి :

మలయాళ వాఙ్మయములోగల కేక, కాకళి, అన్ననడ, మంజరి మొదలగునవి దేశీయమాతృకగల పద్యములగును. పై పద్యరీతులకు తమిళ ఛందోరీతులకు పోలికలుండవచ్చును గాని తమిళముకంటె భిన్నమగు ప్రణాళిక యుండుటవలన వీనిని దేశీయచ్ఛందములుగా భావించట సమంజసము. వడక్కం పాట్టు మొదలగువాని యందు దేశీయత స్పష్టముగా గోచరించును. మలయాళమున గల దేశీయ ఛ్ఛందము లను గూర్చి శ్రీమతి ఓ టి శారదాకృష్ణన్‌గారు యిట్లు వ్రాసిరి

**"In the Original Dravidian Poetry, neither accent nor the quantity of the Syllables count much. What conributed Poetry was rhythm and the beat"**[6]

దేశీయ మాతృక గల కొన్ని మలయాళ ఛందోరీతులను పరిశీలింతము.

### మంజరి :

'మంజరి' పద్యమునకు రెండుపాదములు. మొదటి పాదములో 12 అక్షర ములు రెండవ పాదములో 10 అక్షరములుండును. శ్లధకాకళిలో రెండవ పాదమున కడపటి రెండక్షరములను తీసివేసిన మంజరి కాగలదు. కాకళిలో మగణము రారాదను నియమము కాగా మంజరిలో ఆ నియమము లేదు.

ఉదా॥ మేచక ముమ్బాయ మానిని మారుడె
మేనియె నిర్మిప్పాన్ మాత్రకాయాయ్

—కృష్ణగాథ.

### కేక :

'కేకి' పద్యమునకు రెండుపాదములు. పాదమునకు 14 అక్షరములు. ప్రతి పాదమునందును 3, 2, 2, 3, 2, 2 అక్షరములుగల 6 గణములుండును. ప్రతి గణమునందును ఒక్క గురువైన ఉండవలయును. మొదటిపాదము గురువుతో ప్రారంభమయిన రెండవ పాదముకూడ గుర్వాది కావలయును. ఉదా॥

సురవా హినీ పతి తనయన్ గణ పతి
సురవా హినీ పతి ప్రమథభూతపతి

– వృత్తమంజరి – సూత్రము 328

మతమంథర :

ఈ పద్యమునకు రెండుపాదములు పాదమునకు రెండు గణములు. మొదట 6 మాత్రలగణము, పిదప 8 మాత్రలగణము రావలయును. ఈ ఛందస్సులో లఘ్వక్షరము లెక్కువగానుండును.

| 6 | 7 + 1 |
|---|---|
| రతికణవను | కిణకళొడుంగి |
| అతివివశత | పూండుమయంగి |

— బాణయుద్ధం (వృత్తమంజరి - 336)

మలయాళకావ్యములందు జానపద చ్ఛందస్సు అనుసరించిన ఛందోరీతులును పెక్కు కలవు. వీనిలో కొన్నిటిని పరిశీలింతము. ఓనమ్. తిరువాదిర ఉత్సవము లందు పాడబడు పాటలననుసరించి మలయాళకవులు కొన్ని నూత్నప్రయోగములు గావించిరి. ఉదా॥

ఓమనత్తిఙ్ కళ్క్కిడావో - నల్ల
కోమళత్తామరప్పూవో (A lulluby)

ఊరుక్కు నల్లదు చొల్వేన్-ఎన
క్కుణ్మయ్ తెరిందదు చొల్వేన్ (మురసు)

మావేలి నాడువాణీడుమ్ కాలమ్
మానుషరెల్లారు మొన్నుపోలె (ఓణం జానపదగీతం)

తున్పమిలాద నిలైయే చక్తి (శక్తి)
తూక్కమిలాద నిలైయే చక్తి (శక్తి)

ఈ ప్రకరణమునందు పరిశీలించిన అంశములివి. నిలైమండిలవా శిరియప్పా ద్విపదలకు, అడిమరి మండిల ఆశిరియప్పా మంజరీ మధురగతి రగడలకు, అరుశీర్ ఆశిరియ విరుత్తము అల్పాక్కర మధ్యాక్కరలకు, ఎళుశీర్ ఆశిరియ విరుత్తము మహాక్కర సీసములకు, ఎణ్శీరడి ఆశిరియ విరుత్తము ద్విరదగతి విజయభద్రరగడ తురగ వల్గన హయప్రచారములకు సామ్యము లుండుట తులనాత్మకముగా పరిశీలిం

చితిమి. అట్లే కుఱళ్ వెణ్బరై ద్విపదలకు, ఇన్నిశై వెణ్బా ఆటవెలది, తేటగీతులకు, సిందియల్ వెణ్బా త్రిపదులకు, కలిప్పా సీసములకు, వంజిప్పా అల్పాక్కరలకు, కట్టళైక్కలిత్తుఱై మధురాక్కరలకు మరుట్పా తేటవెలది ఆటగీతులకు సామ్యము లుండుటను సోదాహరణముగా పరిశీలించితిమి.

ఈ ప్రకరణమునందే మలయాళ ఛందోరీతులగు కేక, అన్ననడ, అజగర గమనం, శంకరచరితం, మల్లికా, హంసప్లుతములకు, అరుశీర్ ఆశిరియ విరుత్తము లేదా అరుశీర్ ఆశిరియత్తాళిశైతో గల సంబంధమును చర్చించితిమి. ఎళుశీర్ ఆశిరియ విరుత్తము లేదా తాళిశై పద్యముతో కుసుమమంజరికి గల పోలికలను గుర్తించితిమి. మలయాళ సాహిత్యమున సంస్కృత మాతృకగలవి, తమిళమాతృకగలవి, దేశీయము లైనవి యగు ఛందోరీతులను విపులముగా పరిశీలించితిమి.

పై తులనాత్మక పరిశీలనమువలన తమిళ కన్నడాంధ్ర మలయాళ దేశీచ్ఛందో రీతులన్నియు మూలద్రావిడ ఛందోరీతులై యుండునని భావింపవలసియున్నది.

సంఖ్యా సూచి :


1. Ramacharitam and Metres - P 12
2. Advanced Studies in Tamil Prosody P 98 (Madras)
3. Malayalam Prosody - A. O. R. 1937
4. Prosody in Dravidian Languages - P 5
5. Malayalam and Tamil Metres - A Comparative Study - Seminar on Prosody - 1974.
6. " " "
7. The Metre of Vatakkan Paltukal A. O. R (Madras) 1937-38

# 6. కన్నడాంధ్ర దేశిచ్ఛందోరీతులు

దక్షిణదేశభాషలలో కన్నడాంధ్రములకు కేవలము శబ్దసంపద లిపిలోనే గాక ఛందస్సాహిత్య రీతులందును సన్నిహిత సారూప్య సంబంధము కలదు. కన్నడాంధ్రములు అత్యంత ప్రాచీన కాలమునుండియు సంస్కృత భాషాప్రభావమువలన అభివృద్ధి చెందినవి. తెలుగులో కంటె కన్నడములో ముందే కావ్యరచన సాగినది. కనుక కన్నడమునందు పెక్కు ఛందః ప్రయోగములకు వీలుకలిగినది అందువలన కన్నడభాషయందలి ఛందో విధానము తెలుగు కవులకు అనుసరణీయమయినది.

ఛందోబద్ధ రచనను పద్యమందురు. పద్యములు వృత్తములు, జాతులని రెండు విధములు. సంస్కృతముతో వీనిని అక్షరచ్ఛందస్సు, మాత్రాచ్ఛందస్సు అను పేర్లతో వ్యవహరింతురు. వృత్తములు అక్షర గణబద్ధములు. అవి సంస్కృతము నుండి కన్నడాంధ్ర భాషలలోనికి వచ్చినవి.

జాతులు దేశీయములగు పద్యములు. జాతులు సాంస్కృతికములని దేశ్యములని రెండు విధములు. సాంస్కృతికములైన జాతులు మాత్రా సంఖ్యా నియమము కలిగి నాల్గు పాదములతో కూడి యుండును. ఆర్యలు, గీతులు, వైతాళీయములు సంస్కృతజాతి పద్యములు. దేశ్యజాతులు మాత్రాగణబద్ధములై పాద నియమము లేక రచింపబడినవి. కాలక్రమమున సంస్కృత వృత్తముల ననుసరించి వీనికికూడ పాదసంఖ్యా నియమ మేర్పడినను మొదట నట్టి నియమమేదియు లేనట్లే తోచును.

## 6. 1. సామా

కన్నడ ఛందోంబుధి కర్తయగు నాగవర్మ 'అవటిపొఅగె పుట్టువ మాలావృత్త దండక, రఘటె, మాత్రార్య, త్రిపది, చతుష్పది, షట్పది, అష్టపది, గణనియమకంద శంఖా (సంఖ్యా) వృత్త, తాళవృత్త ఆదిజాతిగళ్ ఉంటు' అని పేర్కొని దేశీయ జాతులను ప్రత్యేకముగా నిట్లు చెప్పెను.

"మదనవతి యక్కరం చౌ
పది గీతికె యేళె త్రిపది యుత్సాహం ష

ట్ళిడి యక్కరికె కరంచె
ల్వోదవిద ఛందోవతంస మబ్జదళాక్షి

— నాగవర్మ ఛందోంబుధి 1-20

దేశీయజాతులనగా బ్రహ్మవిష్ణురుద్రరూప మాత్రాగణబద్ధములైన పద్యములని నాగవర్మ అభిప్రాయమై యుండును. లేనిచో మాత్రాఘటితములయిన రగడాది జాతులకును వీనికిని భేదమే లేకుండును. నాగవర్మ కన్నడములో పేర్కొనిన ఈ జాతివిభేదములు తెలుగులోకూడ కలవు

కన్నడాంధ్రములలోని ఛందోరచనలకు మొదటలక్షణ మేర్పరచినవారు సంస్కృత భాషాపండితులే వీరి మూలముగ మాత్రాగణబద్ధములైన దేశ్యజాతులు కొన్ని. మాత్రాసంఖ్యాబద్ధములగు సాంస్కృతిక జాతులుగ వ్యాప్తికి వచ్చినవి. ఇట్లు సంస్కృత లాక్షణికులచే మాత్రాచ్ఛందస్సులుగా గ్రహింపబడిన దేశీయ సంప్రదాయములగు జాతులు కందము, రగడ, ఉత్సాహము మొదలగునవి. వీనిని సామాన్యజాతులుగా వర్గీకరింపవచ్చును.

### 6. 1. 1 కందము

కన్నడాంధ్ర సాహిత్యములలో బహుళ ప్రచారమొందిన పద్యగతులలో కంద మొకటి. ఈ కంద శబ్ద నిష్పత్తికి సంబంధించి ప్రసిద్ధ విమర్శకుల మధ్య అభిప్రాయ భేదములు కనిపించును.

డా॥ కిట్టిగారు

"కంద పద్యము సంస్కృత మాత్రావృత్తములలోని ఆర్యను పోలినది. ఆర్యను పోలినదే ప్రాకృతములోని స్కంధము. దీని అపభ్రంశరూపము ఖందయ. ప్రాకృతమునుండి కన్నడాంధ్రములలో ప్రచారితమయిన పద్యగతి కందము"[1] అని తెలిపిరి.

శ్రీ తి. నం. శ్రీకంఠయ్యగారు

"సంస్కృతములో స్కందుడనగా షణ్ముఖుడు. స్కందశబ్దమే తమిళములో కంద. అందువలన కన్నడములోకూడ స్కంధశబ్దభవమయిన కందశబ్దము వ్యాప్తి

లో౯కి వచ్చియుండవచ్చు లేక కఱు > కన్దు > కంద మారియుండవచ్చునేమో"[2] అని భావించిరి.

డా॥ టి. వి. వెంకటాచలశాస్త్రిగారు

"స్కంధకము యొక్క ప్రాకృత రూపము ఖందఅ. ఇది హ్రస్వమైంది కన్నడములో 'కంద' అయియుండవచ్చు. జయకీర్తి దీనినే స్కంధః అని పేర్కొని యుండవచ్చు"[3] అని తెలియజేసిరి.

శ్రీసీతారామ జాగీరదార్‌గారు

"కందపద్యము ప్రాకృతములోని సమద్విపది విభాగములోనిది. స్కంధక స్కంధ > ఖంద > కంద"[4] అని శబ్ద నిష్పత్తి సూచించిరి.

డా॥ గిడుగు వెంకట సీతాపతిగారు

"కందము ననేక రీతుల నడిపించుటకు అవకాశమున్నది. ప్రాకృతచ్ఛందము లలో గాధా భేదములందు ఖంద అనేపేర నొకటి గలదు. అది పూర్తిగా మన కంద పద్య లక్షణము గలది. కనుక ఆ ఖంద నుండియే మనకు కందము వచ్చినదని చెప్పవచ్చును. ఈ ఖంధ అనే ప్రాకృతపదము సంస్కృత శబ్దమయిన స్కంధము నుండి వచ్చి యుండును. సంస్కృతఛందములలో ఆర్యాగీతి కందము వంటిది"[5] అని స్పష్టము చేసిరి.

ప్రాచీన సంస్కృతలాక్షణికు లెవరును 'స్కందక' అను శబ్దమును ప్రయోగించలేదు. క్రీ. శ. 12వ శతాబ్దివాడగు హేమచంద్రుడు.

"జేష్టమే స్కంధకమ్, గీతి స్కంధకే సంకీర్ణమ్ (4-13) అని ఆర్యాగీతిని స్కంధకముగా పేర్కొనెను. మరియు ప్రాకృత లాక్షణికులు 'ఖందఅ' అని ప్రయోగించిరిగాని 'స్కంధక' శబ్ద ప్రయోగము చేయలేదు.

కనుక పై అభిప్రాయములలో ఖందఅ > ఖంధ > కంద అను నిష్పత్తి సమంజసముగా కనిపించుచున్నది.

## సంస్కృత ప్రాకృత లక్షణ గ్రంథములలో స్కందకము :

భరతుడు తన నాట్య శాస్త్రములో సమద్విపది అయిన ఆర్యా, గాథలను పేర్కొనినను వాని భేదములయిన గీతికా ఆర్యాగీతి, స్కందకములను గురించి

ప్రస్తావించలేదు. పింగళుడు ఈ విభేదము లను ప్రస్తావించినను స్కందక సమాన మయిన పద్యగతిని ఆర్యాగీతిగా పేర్కొనెను.

ల స్వమ్ముద్రాః గణాః గౌ గంత మధ్యాదిః స్ల శ్చ
స్వరా అర్ధం చార్యార్ధం అత్రాయున్ నజ్
షష్ఠోజ్ స్లౌవా అర్ధే వసుగణ ఆర్యాగీతిః
(4-12, 13, 14, 15, 16, 17 8 31)

ప్రాకృత లాక్షణికుడయిన విరహాంకుడు "జహదఇఏ పువ్వద్ధే తహ పచద్ధేవి ఖంధ అస్సణ రిందో... ఖంద ఏణ ఖంద అస్స లక్ఖణం భణి అం ఎక్కోణ తిసం ఖంద అస్స ణామాఇం తహ అప్పి" అని ఖంధఅస్స, ఖందఏణ, ఖందఆ రూపముల నిచ్చెను. స్వయంభు ఖంధ అద్ధే (1-2) అని ప్రయోగించి ఉక్తాది ప్రకరణములో స్కంధకాదులను తొలుత తెలిసికొందమని స్పష్టము చేసెను. నందితాఢ్యుడు 'ఖంధక్ఖర' (ప 71) అని ప్రయోగించెను. అయినను వీరిలో సమగ్రముగా లక్షణము చెప్పుటకు ప్రయత్నించినవాడు ప్రాకృత పైంగళకారుడు. ఆతని స్కంధక లక్షణ మిట్లున్నది

చ ఉ మత్తా అఠ్ఠగణా
పువ్వద్ధే ఉత్తరాద్ధ హోఇ సమరూఆ
సో ఖందఆ విహాణ హు
పింగళ పభణేఇ ముద్ధి బహు సంభేఆ 1–73

పై లక్షణ మనుసరించి స్కందకమునకు ఎనిమిది గణములని ఆ గణములు చతుర్మాత్రకములని తేలినది.

## కన్నడాంధ్ర ఛందో గ్రంథములలో కందము :

కన్నడాంధ్ర లాక్షణికు లందరు తమ లక్షణ గ్రంథములలో ఆర్యాప్రభేదములను పేర్కొనిరి. కాని వానికి ప్రచారము లేదు. కన్నడ లాక్షణికులు ఆర్య లనుసరించి కందములను పేర్కొనగా ఆంధ్ర లాక్షణికులు కందపద్యము మూలముగా గాని ఆర్యాభేదములను విశదీకరించిరి. అయినను కన్నడాంధ్ర లాక్షణికులు కందమున కొసగిన ప్రాధాన్యము అతివేలము.

నాగవర్మ ఛందోంబుధి చతుర్థాధికారములో కంద, ఆర్యా, గీతికె సంకీర్ణ, దుపయిల లక్షణములను పేర్కొనెను. నాగవర్మ చెప్పిన కందపద్య నియమములను ఇట్లు వివరింపవచ్చును.

1. కందమునందు చతుర్మాత్రాగణములే రావలయును. అని గిరీశం – ధూర్జటి – శర్వం – పురారి ముఖరపు గణములు కాదగును. అనగా స-భ-గగ-జ-నల గణములనుట.

2. శశి – పుర – విషయ – అద్రి స్థానములందు (1–3–5–7 గణములు) జగణములు రారాదు.

3 1–3 పాదములందు 3 గణములు, 2–4 పాదములందు 5 గణములుండ వలయును. వాని మాత్రాప్రమాణము 12–20

4. కందము అర్థసమవృత్త జాతికి చెందినది

కన్నడిగుడగు జయకీర్తి ఛందోనుశాసనములో 'స్కంధ' లక్షణములను (5-13, 14, 15, 16) విపులీకరించి పేర్కొనెను. అతని అభిప్రాయమలననుసరించి 'స్కంధ' లక్షణమిట్లున్నది

1. స్కంధములో అన్నిగణములు చతుర్మాత్రాకములే

2. 1–3 పాదములందు 3 గణములు 2, 4 పాదములందు 5 గణములు. విషమ స్థానములందు జగణమురారాదు. 6వ గణము నలమో జగణమో కావలయును.

3. స్కంధమున ఆద్యంతము లఘువులుండుట సాధ్యపడదు. ఆద్యంతము గురువులుండుటకు వీలులేదు

5. స్కంధములో అక్షరసంఖ్యను గణింప కనిష్ఠము 30 గురువులు 4 లఘువులుండుటకు వీలున్నది. గరిష్ఠత్వము చెప్పవలయునన్నచో 60 లఘువులు, 2 గురువులు ఉండవచ్చును అయినను కందమునకు 64 మాత్రలే.

6. కందమునకు ప్రాస నియమమున్నది

ఆంధ్రలాక్షణికులెల్లరు కందపద్యలక్షణములను విశదీకరించినవారే. రేచన కందపద్యమునకు నిట్లు లక్షణము చెప్పియున్నాడు.

కందము త్రితశర గణంబుల
నందును; గాభజసనలము లైదునె గణముల్
పొందును నాఱిటనలజము
లొందుం దుదగురువు జగణమెప్పుదుబేసిన్

నెలవెఱఁగి సిడుదపాదం
బులనాలవగణము మొదలఁబొదలఁగసిడఁగా
వలయును వక్కాపాదం
బులతుద గురువమరఁగందమున కిడవలయున్

— జాత్యధికారము

రేచన లక్షణమందు సంస్కృత ప్రాకృత కన్నడ నియమములన్నియు గలిసి యుండుట గమనింపదగినది.

కన్నడ కందములకు అక్షరమైత్రీరూపమగు యతిలేదు. తెలుగు కందములకు 4-7 గణాద్యక్షరములకు మైత్రి పాటింపవలయును. కన్నడ కందములందు 2, 4 పాదాంతములు లఘువులుగానున్నను దోషముగాదు. తెలుగు కందములో 2, 4 పాదములు గుర్వంతములై యుండవలయును. ఈ రెండు భేదములుతప్ప తక్కిన నియమములు కన్నడాంధ్రములకు సమానములే.

కందము - విభేదములు :

పింగళముని ఆర్యలలో మూడు భేదములను మాత్రము పేర్కొనెను. అవి పథ్య, విపుల, చపలార్యలు. ఈ చపలార్యలో ముఖ, జఘన, మహాచపలలను మూడు భేదములు కలవు. డా॥ పాటిబండ మాధవశర్మగారు ఆర్యలలో 16 భేదములు కలవని నిరూపించిరి[6] కందములందును ఈ భేదముల నెన్నవచ్చును.

పింగళుడు జగణవిన్యాసమనుసరించి చపలార్య భేదములను పేర్కొనెను. కాని నల గణ విన్యాసమనుసరించి యేర్పడు భేదముల చెప్పలేదు. ఈ భేదములను ఆంధ్రలాక్షణికుడయిన చిత్రకవి పెద్దన పేర్కొనెను (2-91) ఇట్లే నలజగణములనే గాక తదితర కందపద్య గణములను గూడ నియమానుగుణముగ ఆవృత్తము చేయ నగును. అపుడు గగ కందము – భకందము సకందము, జకందములను భేదము

ఏర్పడును. ఇవే కుఱుచ కందము, నిడుద కందములుకూడ గాక కందమున నిలుప దగిన హ్రస్వాక్షరదీర్ఘాక్షరముల ననుసరించి నేర్పడును.

కందపద్యములతో నేర్పడు భేదములను గూర్చి విపులముగా తర్కించినవారు శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారు తెలుగులో ఛందోరీతులు అను గ్రంథమున శ్రీ సీతాపతిగారు కందపద్య విభేదములను గూర్చి యిట్లు వ్రాసిరి.

"ఖందములో నుండదగిన గురులఘువుల సంఖ్యనుబట్టి ఏర్పడగల ఖందలు 26 రకములకు పేర్లున్నవి. 30 గురువులును 4 లఘువులును గలవి నందయనే ఖంద. ఈ విధముగా 29 గు 6 ల, 28 గు 8 ల ... 4 గు 56 ల – గలవిగా ఏర్పడినవి.

| 1 | 2 | | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| 4 (విధములు) | 5– | 4– | 5– | 4– | 2– | 4– | 2– |
| నల | నల | నల | 2వలె | 3వలె | నల | 3వలె | స |
| భ | భ | భ | | | జ | | గగ |
| స | స | స | | | మా | | మాత్రమే |
| గగ | గగ | గగ | | | త్ర | | |
| | | | | | మే | | |

అనగా 4×5×4×5×4×2×4×2=25600 విధములు. కాని మొదటిపాదము నందు మొదట గురులఘువులలో ఏది యుండునో అదియే పాదాద్యక్షరము కావలెను. గనుక 15360 విధములేర్పడును ... ఇన్ని విధములుగా ఏర్పడుటకు అవకాశ మున్నది కనుకనే కందము రచించుటలో కవికి కావలసినంత స్వేచ్ఛగలదు.[7] "

## కందము – ఇతర పద్యగతులు :

కందపద్యముల ప్రాచీనతకు దేశీయతకు జానపద గేయములు ప్రబల సాక్ష్యములు. పెక్కు జానపద గేయములందు కందపద్యచ్ఛాయలున్నవి.

ఉదాహరణమునకు :

"కాకి కాకి గంతుల కాకి
కాకిని తీస్కెళ్ళి గంగలో ముంచితే

గంగా నాకూ పాలూ ఇచ్చే
పాలు తీస్కెళ్ళి అమ్మా కిస్తే"

ఈ జానపదగేయమునే కందపద్య విధానమున వ్రాసినచో ఈ విధముగా నుండును.

కాకీ కాకీ గంతుల
కాకీ కాకిని తీస్కెళ్ళి గంగలో ముంచితే
గంగా నాకూ పాలూ
ఇచ్చే పాలూ తీస్కెళ్ళి అమ్మా కిస్తే

పద్యగమనము, యతిస్థానములు మారి యుండుటవలన ఈ గేయములు కంద పద్యములుగా గుర్తించుటకు వీలులేకపోయినది. చతుర్మాత్రా గణసంయోజనము గల పాటలన్నియు కందపద్య చట్రమునందు ఇముడుటకు వీలున్నది. ఇట్లే మధురగతి రగడను కూడ కందముగా చెప్పవచ్చును. అనంతుడు మధురగతిరగడకు ఇట్లు లక్షణము పేర్కొనెను.

"శ్రీవని తాధిపు చేరిభ జింపుఁడు
భావజ జనకుని భక్తిఁ దలంపుఁడు
అని గగనల భసలను నాల్గిట ఁగృతి
జను గజలఘు విశ్రమము మధురగతి

ఛందోదర్పణము – 3–58

చతుర్మాత్రా గణవిన్యాసము, 64 మాత్రల సంఖ్య జగణము తప్ప తక్కిన గణముల గ్రహించుట మొదలగు కారణములవలన కందమునకు మధురగతి రగడకు పోలికలు చెప్పుటకు వీలున్నది. గేయములను వర్ణవృత్తములుగా, మాత్రాచ్ఛందములుగా మార్చుట వలన నడక భిన్నమైనదని యూహింపవలసి యున్నది.

## కన్నడాంధ్ర శాసనవాఙ్మయములో కందములు :

కన్నడాంధ్రశాసనములందు కందములకు తగు మాత్రము ప్రాతినిధ్యము కలదు. డా॥ ఎం. ఎం. కలబుర్గిగారు

'కన్నడమందలి చంపూ సాహిత్యములో కందము ముప్పాతిక భాగము ఆక్రమించినట్లు శాసనవాఙ్మయమునందును కందములెక్కువ'8 అని స్పష్టము చేసిరి.

కన్నడములో క్రి. శ. 8వ శతాబ్దమునాడే కందపద్యమున్నది. కాని అది తామ్ర శాసనములోనిది. కందమని వ్రాయబడలేదు.[9] శివమొగ్గజిల్లా శికారిపురతాలూకా బళ్ళిగావి శిలాశాసనములోని కందమును లేఖకుడు 'అరియె' అని ఉల్లేఖించి యున్నాడు.[10] అట్లే శ్రావణబెళ్గొళలో లభ్యమయిన మరియొక శాసనములో కందమను పేరుతో ఒక పద్యగతి యున్నది. కాని అది కందముకాదు అందు రథోద్ధతపద్య చ్ఛాయలున్నవి. పొరబాటున లేఖకుడు కందముగా వ్రాసియుండ వచ్చుననే[11] డా॥ ఎం. ఎం. కలబుర్గిగారి అభిప్రాయము.

ఆంధ్ర శాసన వాఙ్మయమునందును కందములు కలవు. క్రీ. శ. 980 నాటిదగు బాదప మహారాజు ఆరుంబాక శాసనములో సంస్కృతములో వ్రాయబడిన కందపద్యమున్నది.

ధవళగుణో ధవళయశో
ధవళిత దిఙ్మండలోవ దమితారాతిః
భవభక్తో భవకరుణో
ద్భవ భవ భోగాన్వితో విభాతి సుకీర్తిః

పై శ్లోకములో తెలుగు పద్యములకు సహజములగు యతిప్రాసలున్నవి.

## ప్రాచీన వాఙ్మయములో కందములు

కన్నడములో కందములకున్న ప్రాముఖ్యము నరయుటకు కవిరాజమార్గమొక సాక్ష్యము. అందు బెదండె చత్తణ కావ్యభేదముల లక్షణములు కలవు ఒక కంద పద్యము తరువాత నొక వృత్తము రచించి యచ్చటచ్చట జాతులను పొదిగినచో నది బెదండె. అట్లే కందముల కధిక స్థానమొసగి యక్కడక్కడ సుందరవృత్తములను అక్కరె, చౌపది, గీతిక, త్రిపదులను అందముగా కూర్చిన 'చత్తాణ'.

కన్నడ కావ్య సంప్రదాయములలో చంపూసంప్రదాయ మొకటి. ఈ సంప్రదాయములలో కందములే ఎక్కువకనిపించును. పంపభారతములోని 1600 పద్యములలో 738 కందపద్యములే. రన్నకవి అజిత తీర్థంకర పురాణము ప్రథమాశ్వాసములోని 96 పద్యములలో 60 కందములే. పొన్నకవి శాంతిపురాణములో నితర పద్యములన్నియు 467 కాగా కందములు 1169. పైగా కన్నడములోని లాక్షణిక గ్రంథములలో కందపద్యములే ఎక్కువ.

# దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు — తులనాత్మక పరిశీలన

తెలుగు సాహిత్యములో ప్రాచీన కందపద్యములున్న వనుటకు క్రీ. శ. 953 నాటిదగు సర్వదేవుని ఆదిపురాణ మొక సాక్ష్యము. కవిత్రయభారతములోని 21507 పద్యగద్యములలో 7034 కందపద్యములున్నవి కన్నడమునందువలె తెలుగు లాక్షణిక గ్రంథములలో కూడ కందపద్యము లెక్కువ.

## కందపద్యముల ప్రత్యేకత :

సంస్కృతమునందు అనుష్టుప్పు యొక్క యుపయోగములను గురించి క్షేమేంద్రుడు చెప్పిన యంశములన్నియు కన్నడాంధ్ర కందములకు చక్కగా వర్తించును.

"అనుష్టుప్ సతతాసక్తా సాభినందస్య నందినీ
విద్యాధరస్య వదనే గుళికేవ ప్రభావభూః

—సువృత్త తిలకము 3-29

తనయందు సతతాసక్తుడైన కవినోట కందమత్యంతము శక్తిమంతమై ప్రసరించుట నిక్కము. కనుక కన్నడాంధ్ర కవులు ఉపదేశమునకు కథనమునకు, వర్ణమునకు, రసపోషణమునకు, శీలచిత్రణమునకు, సంభాషణమునకు, ఉపన్యాసమునకు, అనంత విషయముల సమర్పణమునకు పరమ సాధనముగా నుపయోగించుకొనిరి. సంగ్రహముగా చెప్పవలయు నన్నచో బహుప్రచలితము, కవిజన ప్రియము, శాస్త్ర ప్రియం వదము. లలితసుందరము, శ్రవణ మనోహరము కందము. కందపద్యముల రామణీయకమును గూర్చి హరిహరుడు గిరిజా కల్యాణమునందును, తిరుమలార్య కవి అప్రతిమ వీరచరితము నందును ఇట్లు ప్రశంసించి యున్నారు.

కందంగళమృత లతికా
కందంగళనూన వాక్య ఫలవిలసన్మా
కందంగళ్ తనిరసదు
క్కందంగళ్ సొగయిసిర్పువీతన కృతియొళ్

హరిహర – గిరిజా కళ్యాణ–

కందం కవికోకిలమా
కందం కోమల వికాసి కృతికల్పలతా

కందం విస్మరర రసదు
క్కందం చికదేవరాయ చందనచందం
—అప్రతిమ వీరచరితం 2-15

సంస్కృత భాషలో ఆర్యలకు, గీతులకు అధికోపయోగము కానవచ్చుచుండగా తెలుగులో ఆర్యాగీతికే (కందమునకే) అపరిమిత ప్రయోజనము. తెలుగు ఛందస్సు ప్రత్యేకత కిది యొక నిదర్శనము. కందపద్య రహితమైన ఆంధ్ర పద్య గ్రంథము (ద్విపద కావ్యములు తప్ప) లేదు. కన్నడ కవులవలె తెలుగు కవులును కందపద్యములను బహుధ ప్రశంసించియున్నారు.

"ముందఱ జనుదినములలోఁ
గందమునకు సోమయాజి ఘనుడందురు నేఁ
డందఱును ఘనుఁడందురు
కందమునకుఁ గుందవరపు కవి చౌడప్పా"

అని కవి చౌడప్ప తాను కంద పద్య రచనలో నిష్ణాతుఁడనని పేర్కొనెను. కందము చెప్పిన వాడే కవి పందిని పొడిచినవాడే బంటు' అను నానుడి ప్రసిద్ధమే

"ఆంధ్రీకృతార్యాగీతియైన కందము చంపక శార్దూలాది వృత్తముల యొక్కయు, గీత సీసాద్యుపజాతుల యొక్కయు లక్షణములకు సంగమ స్థానము. ఉత్తర దక్షిణ భారత మధ్యస్థమైన ఆంధ్రజాతియొక్క ఉభయ సంస్కృతీ సమ్మేళనమునకు చిహ్నము కందము. అల్పాక్షరముల అనల్పార్థ రచనకు కందము పరమ సాధనము. నియమ బాహుళ్యముచే నియామకము, నియత స్వేచ్ఛకు యోగ్యమునైన ఛందః క్షేత్రము కందము" అని డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు కందపద్య ప్రాశస్త్యమును శ్లాఘించిరి.[12]

ఆధునిక కాలమునందు కందపద్య రచనలో పెక్కు ప్రయోగములు చేయబడినవి. వానిని గుఱించి 'ఆధునిక చ్ఛందస్సు' అను ప్రకరణమున తెలిసికొందము.

6. 1. 2. రగడలు :

కన్నడాంధ్రములందు బహుళ ప్రచారమొందిన ఛందోరీతులలో రగడలు పేర్కొనదగినవి.

కన్నడలాక్షణికుడగు నాగవర్మ ఛందోంబుధియందు 'మాలావృత్తార్ధసమ విషమాది వృత్తప్రకరణములో' రఘటాబంధం (3-21 అని ప్రయోగించియున్నాడు. కన్నడిగుడగు జయకీర్తి ఛందోనుశాసనమున రఘటో (1-24) అని పేర్కొనెను. కన్నడ వ్యాకర్త కేశిరాజు శబ్దమణిదర్పణము సంధిప్రకరణములో 'రఘటా' శబ్దము యొక్క తద్భవరూపము 'రగళె' (సూ. 32) అని నిరూపించెను. ఆంధ్రలాక్షణికు లెల్లరు 'రగడలు' అనియేవ్యవహరించిరి. సంస్కృత ఛందో గ్రంథములందు 'రఘటా' అను ప్రయోగము లేదని ఫలితార్థము

## రగడలు - విమర్శకాభిప్రాయములు :

రగళె శబ్దముయొక్క వ్యుత్పత్తినిగూర్చి విభిన్నాభిప్రాయములున్నవి.

శ్రీ ముళియ తిమ్మప్పయ్యగారు ఘటీయంత్ర = ఏత - అరఘట అరఘట్ట నుండి రఘట ఏర్పడియుండుననియు, ఏతము తోడునప్పుడు పాడబడుపాట కావచ్చు ననియు భావించిరి.[13]

శ్రీ డి. ఎల్. నరసింహాచారిగారు రగళె కడవక శబ్దరూపాంతరమై యుండ వచ్చునని యూహించిరి.[14]

శ్రీ టి. ఎన్ శ్రీకంఠయ్యగారు సంస్కృతమునుండి వృత్తములు, ప్రాకృతము నుండి కందములు కన్నడమున ప్రవేశించినట్లుగా, అపభ్రంశభాషల నుండి రగళె ప్రభేదములు వచ్చియుండవచ్చునని తలంచిరి.[15]

శ్రీకుక్కిల కృష్ణభట్టగారు

"రఘటా – ఘటా – గుంపు. గజఘటా, ఏనుగుల గుంపు, ఘనఘటా – మేఘములగుంపు అను అర్థముల ననుసరించి రగణసమూహముగల పద్య బంధము రగడలని భావించిరి."[16]

ఆంధ్ర లాక్షణికు లెవరును రగడల వ్యుత్పత్తిని పరిశీలించినట్లుగ పడదు. పై నిర్వచనములన్నిటిలో శ్రీకృష్ణభట్టగారి అభిప్రాయము సమంజసమై కనిపించును. రగళెలలో లలిత రగళెకు ప్రచారమెక్కువ. ఇది పంచమాత్రాత్మకము. రగణము కూడ పంచమాత్రాత్మకమే. మొదట పంచమాత్రాత్మక రగళెలకు ప్రచారమెక్కు వగా నుండి క్రమముగా మూడు, నాలుగు మాత్రల రగళెలకు వ్యాప్తి కలిగినదని యూహింపవీలున్నది.

## రగడలు - లాక్షణికాభిప్రాయములు :

సంస్కృత లక్షణ గ్రంథములందెచ్చట రగడలు ప్రస్తావింపబడలేదు. ప్రాకృతము, అపభ్రంశ భాషలలోని ఛందోవిశేషములను తెలియజేయు స్వయంభూ చ్ఛందము, గాథాలక్షణము, ఛందశ్శేకరము, ఛందోనుశాసనము, కవిదర్పణము, ఛందఃకోశము - ప్రాకృతపైంగలములందు పద్ధతి. పద్ధతికా అను చతుష్పదీ తాళ వృత్తములు కలవు.

స్వయంభూచ్ఛందము నందు 'పద్ధదిఅ ధ్రువఅం' (పద్ధతికాధ్రువకం) లక్షణము (6-129) విశదీకరింపబడినది. పాదమునకు నాలుగు చతుర్మాత్రాగణములు కలది. అంత్యప్రాసయుక్తమైనది పద్ధతికాధ్రువకమగును.

గాథాలక్షణమునందు పాదమునకు షోడశ మాత్రలు కలది పాదములకు యమకవిశుద్ధికలది 'పద్ధడిఆ' (ప 74) ఛందమగునని విశదీకరింపబడినది.

హేమచంద్రుని ఛందోనుశాసనమునందు చతుర్మాత్రాగణ చతుష్టయము కలది. అంత్యప్రాసయుక్తమైనది పద్ధతి (3-73) అని వివరింపబడినది. మరియు హేమ చంద్రుడు విషమస్థానములలో జగణము రారాదనియు, పాదాంతములో జగణము గాని, నాలుగు లఘువులుగాని రావచ్చునని విశేషనియమములను పేర్కొనియున్నాడు

| | |
|---|---|
| ఛత్రాయమాణ ధరణోరగేంద్ర | జగణము |
| పార్శ్వజినేంద్ర స్మరమృగ మృగేంద్ర | జగణము |
| దర్శయ దీర్ఘదురిత తిమిరనికర | - నల |
| సత్పద్ధతి మాన్యజిత రజనికర | - నల |

— ఛందోనుశాసనము 3-78

కవిదర్పణమునందుగల పద్ధడియా (2-22) లక్షణములు, ఛందః కోశమునగల పద్ధడి లక్షణములు హేమచంద్రుని 'పద్ధతి' లక్షణములను బోలినవే.

ప్రాకృతపైంగళమునందు 'పజ్ఝటికా' ఛందోబంధము (1-125) "నాలుగు సమపాదములుకలది, ప్రతిపాదమందును 4 చతుర్మాత్రాగణములు కలది, పాదాంత్యమున జగణముండునది మొత్తము 64 మాత్రలు కలది" అని - లక్షణము వివరింపబడినది.

పుష్పదంతుడను అపభ్రంశకవి (10 వశ) తన పజ్ఝటికాచందమునందు పెక్కు కడవకములను రచించెను. పాదాంతములో జగణమునకు బదులు 'నల' గణములను వాడుట పుష్పదంతుని ప్రత్యేకత యగును. పజ్ఝటికాఛందమునకు కన్నడమునగల మందానిలరగళెకు సామ్యములున్నవి. కనుక ప్రాకృతప్రభావము వలన కన్నడాంధ్రములందు రఘటా బంధములు విస్తరిల్లెనేమో అని యూహింపవలసి యున్నది లేదా ప్రాచీన ప్రాకృత కావ్యములందెచ్చటను 'పజ్ఝటికా' ప్రయోగము లేని కారణమువలన కన్నడాంధ్రములనుండి ప్రాకృతమున ఈ ఛందస్సు ప్రవేశించి యుండవచ్చునని తలంపవలసి యున్నది ఇక కన్నడాంధ్ర లాక్షణికులు రఘటా బంధములకు చెప్పిన లక్షణములను పరికింతము.

కన్నడములో నాగవర్మ గుణచంద్రులు మాత్రము రగళెలకు లక్షణములు చెప్పియున్నారు. నాగవర్మ ఛందోంబుధియందు రగళెల లక్షణము ఇట్లు పేర్కొనెను.

గణ నియమ విపర్యాస దొ
ళెణెవడె దొళ్కెసెయె మాత్రె సమనాగి గుణా
గ్రణియ మతదింద తాళద
గణనె గొడం బట్టెడ బలె రఘటా బంధం

— ఛందోంబుధి 3-22

పై పద్యమనుసరించి గణనియమవిపర్యాసము, సమానమాత్రాసంఖ్య, తాళబద్ధతలు రగడల సామాన్య లక్షణములగును.

రగళెల లక్షణములను విస్తరించి చెప్పినవారిలో జయకీర్తి ప్రముఖుడు. జయకీర్తి రఘటాలక్షణము —

"స్వచ్ఛందః సంజ్ఞా రఘటామాత్రాక్షర సమోదితాః
పాదద్వంద్వసమాకీర్ణా సుత్రావ్యా సైవపద్ధతిః"

— ఛందోనుశాసనము 1-24

పై శ్లోకము వలన రఘటలకు రెండు పాదములనియు, తాళ బద్ధమై యుండవలయు ననియు, మాత్రాక్షర సంయుక్తము కావలయుననియు నియమము లేర్పడుచున్నవి. పై లక్షణములతో నెన్ని పాదములనేని కూర్పవచ్చునని జయకీర్తి సూచించియున్నాడు

గుణచంద్రుడు రగళెల లక్షణములను పేర్కొనలేదు కాని రగళె ప్రభేదములను (5-14, 15, 16) మాత్రము విశదీకరించెను.

ఆంధ్ర లాక్షణికులలో ప్రథముడగు రేచన రగడలను గూర్చి చర్చింపలేదు. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో రగడలను చాటు ప్రబంధములుగా పేర్కొని యిట్లు లక్షణముల విశదీకరించెను.

సరియో పది తేకులచే
బరువడి నుత్సాహ పద యుగళముచే
సిరవుగ వడి ప్రాసంబుల
నరుదుగ రచియింప రగడ యగుఁ దగువృత్తిన్ 4-40

రగడల స్వరూపమును, వాని విభేదములను విస్తరించి చెప్పినవాడు అనంతుడు.

ఆద్యంత ప్రాసంబులు
హృద్యంబుగ రెంట రెంట నిడి పాదము లు
ద్యద్యతుల గూర్పఁదగు నన
పద్యంబగు రడడలందు వారిజనాభా

ఛందోదర్పణము – 3-521

అనంతుడు ఛందోదర్పణములో హయప్రచార, తురగవల్గన, విజయ మంగళము, ద్విరదగతి, జయభద్రరగడ, మధురగతి, హరిగతి, వృషభగమనము, హరిణగతి రగడలను పేర్కొనెను. పై రగడలన్నియు తాళాన్వితములగుటను గుర్తించి అప్పకవి వీనిని వైతాళీయ భేదములుగా (4-290) పేర్కొనెను.

కన్నడలాక్షణికులు త్రివిధరగడలను మాత్రము పేర్కొనిరి. కాని ఆంధ్ర లాక్షణికులు నవవిధరగడలను విశదీకరించిరి. కన్నడాంధ్రములందు సమానముగా కనిపించు రగడలను పరిశీలింతము.

మందానిలము – మధురగతి :

కన్నడలాక్షణికుడగు గుణచంద్రుడు ఛందస్సారమున 'మందానిల యుగలాష్ట కలె' అని మందానిలమునకు (5-14) లక్షణము పేర్కొనెను. 16 మాత్రలు కలది మందానిలరగళె అని అర్థము.

ఆంధ్రలాక్షణికుడగు అనంతుడు మధురగతికి ఇట్లు లక్షణము పేర్కొనెను.

"శ్రీవసి తాధిపుఁజేరి భజింపుఁడు
భావజ జనకుని భక్తిఁదలంపుఁడు
అని గ గ నల భ సలను నాల్గిటఁగృతి
జను గజలఘువిశ్రమము మధురగతి

— ఛందోదర్పణము 3–58

కన్నడలాక్షణికులు మాత్రల సంఖ్యనుమాత్రము చెప్పిరి. గణముల నిర్దేశింప లేదు. ఆంధ్రలాక్షణికులు మాత్రలసంఖ్యతోపాటు గణములనుగూడ నిర్దేశించిరి. తాళములకు ప్రాధాన్యమొసగుటవలన గణక్రమము చెప్పవలసినవారైరి. అనగా విషమగణములను పరిత్యజింపవలయుననుట, జగణ ప్రయోగమును గురించి లాక్షణికులు పేర్కొనలేదు. కాని లక్ష్యమనుసరించి జగణనిషేధము చెప్పవలసియున్నది.

మందానిలరగళెకు మందానిలవృత్తమునకు సామ్యములున్నవని శ్రీ సీతారామ జాగీర్దార్‌గారు భావించిరి.[17]

| | | |
|---|---|---|
| మందానిలవృత్త : | శీతక రోర్వీమారుతచేతో | 4 + 5 + 4 + 5 |
| | శీత కరోర్వీ మారు తచేతో | 3 + 5 + 3 + 5 |
| రుక్మవతీవృత్తము : | పాదత లేపద్మోదర గౌరీ | 4 + 4 + 4 + 4 |
| | పాద తలేప ద్మోద రగౌరీ | 3 + 5 + 3 + 5 |

పై వృత్తములందు మొదటి పాదములో 16 మాత్రలు కలవు. కాని సంస్కృత వృత్తములకు ఆద్యంత ప్రాసలు నియతములు కావు. అంతియగాక రగళెలలో పెక్కు పాదము లుండవచ్చును. వృత్తమన్నచో నాలుగు పాదములు మాత్రమే యుండుటకు వీలున్నది కనుక మందానిల వృత్తమునకు మందానిల రగళెకు గల సామ్యము యాదృచ్ఛికమే. మాత్రలకు మాత్రము ప్రాధాన్య మొసగిన యెడల స్వాగతము, తోటకము, అమృతగతి. పణవకములను గూడ మందానిల రగళెకు మూలములని చెప్పవలసియుండును కనుక ఈ వాదమునందతి వ్యాప్తి దోషమున్నది.

కన్నడ సాహిత్యములో గల మందానిల రగళెను మూడు వర్గములుగా వర్గీకరింపవచ్చును.

1. ఆద్యంత ప్రాసలు రెండును గలవి.
2. ఆదిప్రాస మాత్రము గలవి.
3. అంత్య ప్రాస మాత్రము గలవి.

గణసంయోజన మనుసరించియు ప్రాచీన మందానిల రగళలలో ఐదు ప్రభేదములు కానవచ్చుచున్నవి.

మాత్రల సంఖ్యాక్రమము

3 + 5 + 3 + 5
3 + 5 + 4 + 4
4 + 4 + 4 + 4
3 + 3 + 5 + 5
5 + 3 + 5 + 3

పంప మహాకవి పాదమునకు 16 మాత్రలుగల రగళను మందానిలరగళ, రగళ, మట్టరగళ అని వివిధ నామములతో వ్యవహరించి యున్నాడు. శాంతి పురాణమునందు 16 మాత్రలుగల రగళ త్వరితరగళగా ఉల్లేఖింపబడినది. పై పరిశీలనమనుసరించి 16 మాత్రలుగల రగళకు స్థిరనామ మేర్పడలేదని చెప్పవచ్చును. మత్యతాళమునకు సంబంధించినది కనుక మట్టరగళ నడకయందు త్వరితగతి కనిపించుట వలన త్వరితరగళ అను పేరు కలిగియుండవచ్చును.[18]

కన్నడ సాహిత్యమునందువలె ఆంధ్ర సాహిత్యమునందును మధురగతిరగడలలో గణవైలక్షణ్యము కనిపించుచున్నది. ఉదాహరణమునకు —

ఇంతి యెక్కడివి యింకోరకములు
చెంతనుండె నిచ్చెదఁ గోరకములు

— శశాంకవిజయము 2 ఆశ్వాసము

ఆరయ జీవమయమగు కౌస్తుభమును — న + భల
నెరయు వైజయంతీ సౌరభము — న + ర
అహంక్రియాత్మకమగు శంఖంబును — జగణ ప్రయోగము

— కళాపూర్ణోదయము 8-238

మధురగతికి రెట్టింపు హరిగతి. ఇందు నాలుగు మాత్రలగణములు ఎనిమిది పాదమునకు రావలయును. మధురగతియందువలె హరిగతియందును గణవైలక్షణ్యము గల పాదములు కనిపించుచున్నవి.

పగడపుఁదీగెలు గోమేధికములు పచ్చలుఁ గెంపులు పుష్యరాగనులు
– కవికర్ణరసాయనము 3-195

పై పాదమున క్రీగీత ఉన్నచోట సిద్ధజగణము ప్రయోగింపబడినది.

బిందుమాధవుండను నాకెంతయుఁ
ప్రేమకళాపాత్రము మణికర్ణిక
మందాకిన్యంభోవేణీ భర
మధ్యనాభిచక్రము మణికర్ణిక
– కాశీఖండము–మణికర్ణి కొరగడ

పై పాదములందు చతుర్మాత్రాగణ దృష్టిగాక, కవికి అష్టమాత్రా దృష్టి యున్నట్లు తెలియుచున్నది.

మందానిలమనగా మెల్లగా సాగిపోయెడి మారుతము. ఇందలి గణములు మందమగు ఛందోలయను సూచించును. ఇట్టి లయ మాధుర్యాభివ్యక్తికి అత్యంతానుకూలమగుట వలన మధురగతి అని పేరిడుట సమంజసము.

## లలితరగళె – ద్విరదగతిరగడ :

కన్నడ లాక్షణికుడగు గుణచంద్రుడు ఛందస్సారమున 'వింశతికలాఘటం తిళిగె లలితరఘటం' (5-15) అని లలితరగళె లక్షణమును పేర్కొనెను.

మానసోల్లాసములో 'పద్ధడీ' అను ఛందో విశేషము వర్ణింపబడినది. పద్ధడీ ఛందస్సునకును లలిత రగళెకును పోలికలున్నవి.

"స్వరైః పాత్యైః సబిరుదైస్తాలేనచ సమన్వితా
కయాపి భాషయా క్ప్తా యుగ్మప్రాసాతు పద్ధడీ–
మానసోల్లాసము 4-16-317

పద్ధడీ ఛందస్సున కొసగబడిన ఉదాహరణము—

జనితకమ లానంద ప్రణతసుర గోవింద
5 5 5 5

పై పద్యపాదమును విభజింప పంచమాత్రాత్మక గణసంయోజనము కని పించుట వలన దీనిని 'లలితరగళె' అని చెప్పవచ్చును. కన్నడ శాసనములలో లలితరగళె, 'తోమరరగళె' గా వ్యవహరింపబడినది. పురము మూడు సంఖ్యను సూచించునట్లు తోమరము 'ఐదు' సంఖ్యను సూచించును. కనుక పంచమాత్రా త్మకమగు రగడను తోమరరగళెగా పేర్కొనుట సమంజసమే. ఆంధ్ర లాక్షణికులు 'తోమరరగళె'ను ద్విరదగతి రగడగా పేర్కొనిరి. చిత్రకవిపెద్దన, అప్పకవి మొదలగు లాక్షణికులు ద్విరద గతిలో పంచమాత్రాత్మక గణములను వాడవలయు ననిరిగాని గణనిర్దేశము చేయలేదు. కాని అనంతుడు మాత్రము ఛందోదర్పణ ములో గణనిర్దేశముకూడ నిట్లు చేసెను.

... ... ... ... "అవతారలఘువిరతి
శరధి నగ నలల భల సల తరల ద్విరదగతి" 3-56

పై అనంతుని వివరణమువలన పంచమాత్రాత్మకములగు య-జల గణములను వాడరాదని చెప్పవలసి యుండును. కన్నడలాక్షణికులు మాత్రలకు ప్రాధాన్య మొసగగా ఆంధ్రలాక్షణికులు గణములకుగూడ ప్రాధాన్యమొసగిరని చెప్పవచ్చును.

ద్విరదగతికి రెట్టింపు విజయభద్రము. దీనికి రెండేసి గణములపై మూడు చోట్ల యతులు పాటింపవలయును.

ద్విరదగతి రెట్టింప విజయభద్రము చెల్లు
విదురపూజితపాద వేదసన్నుతనామ
— అప్పకవీయము 4-299

లలితరగళె (ద్విరదగతి) లకు సంస్కృతమునందు గల లలితపదవృత్తము, వసంతవృత్తము, సమనంతరదండకములతో సామ్యములు చెప్పవచ్చును.

లలితపదవృత్తమునకు 5 + 5 + 4 + 5 మాత్రాగణము లుండును. దీనికి లలితవృత్తమనియు పేరుకలదు. ఇట్టి లలితవృత్తపాదమునకు చివర ఒక మాత్ర కలిపినచో 'లలితరగళె' యగును.

కులిశధర పురదినప మారుత హరాంతం
5 5 4 5

వసంత వృత్తమునకు నన తత గగ గణములు ప్రతి పాదమునందు వరుసగా రావలయును. మాత్రల ననుసరించి చూడగా 3 3 5 5 2 2 మొత్తము 20 మాత్రలగును. లలిత రగళెకు కూడ పాదమున 20 మాత్ర లుండవలయునని నియమము.

సమనంతర దండకమునకు 8 పాదములుండును. 1-3, 5-7 పాదము లందు నన ర రర గణములును, 2-4 6-8 పాదములందు రర రర గణములును నియతములు. మాత్రాసంఖ్య ననుసరించి చూడగా బేసిపాదములందు 21 మాత్రలు సరిపాదములందు 20 మాత్రలు సరిపోవును. బేసిపాదముల ననుసరించి ఆద్యంత ప్రాసలను గూర్పగా నది లలితరగళె యగును.

కాని పైన పేర్కొనబడిన వృత్తములు సంస్కృతములో ప్రసిద్ధములు గావు. రగడలయందు నడక ప్రధానము, రగడలు తాళానుకూలముగా నుండవలయునని లాక్షణికుల అనుశాసనము. కనుక అప్రసిద్ధములగు వృత్తములతో ముడిపెట్టుట కంటె సహజము సరళము దేశిలక్షణములుగల లలితరగళెలను దేశిచ్ఛందముగా భావించుట తగును.

కన్నడ రగళెలలో ప్రాచీన కాలమునుండి యెట్టి మార్పులను పొందక అవిచ్ఛిన్నముగా ఆదరపాత్రమైనది లలితరగళె మాత్రమే. ఇతర రగళెలందు నైచ్ఛిక ప్రాసలను పాటించిన పంపమహాకవి లలితరగళెలందు ఆద్యంత ప్రాసలను నియతముగా పాటించియున్నాడు. కనుక పంపమహాకవి కాలమునాటికే లలిత రగళెలకు స్థిరరూపమేర్పడినదని భావింపవలసి యున్నది.

## ఉత్సాహరగళె - తురగవల్గనరగడ

కన్నడలాక్షణికుడగు గుణచంద్రుడు ఛందస్సారములో "ఉత్సాహరగళె జినపరిమితకళె వసునృపయతిగళె" (5-16) అని ఉత్సాహరగళెకు లక్షణము పేర్కొనెను. కన్నడ ఉత్సాహరగళె తెలుగున తురగవల్గనరగడయగును.

హయప్రచారమునకు రెట్టింపు తురగవల్గనము. తురగవల్గన పాదమునకు 8 సూర్యగణములుండును. 4 గణములపై యతి పాటింపబడును. తురగవల్గనమునకు రెట్టింపు విజయమంగళము, విజయమంగళరగడ పాదమునకు 16 సూర్యగణములు నాల్గేసిగణములపై మూడుచోట్ల యతులు పాటింపబడును. కన్నడములో గల ఉత్సాహరగళె తెలుగున మూడువిధములగు రగడలకు ఆకరమగుట గమనింపదగినది.

కన్నడమహాకవి పంపడు ఉత్సాహరగళెను ప్రయోగించియుండుటవలన ఆ కాలమునాటికే దీనికి వ్యాప్తియున్నట్లు చెప్పవచ్చును.

అదర పారవ లళవి శాల కనక కృతక గిరిగళిం
ఫల్ప ప కీర్ణ తరుగళిం
ననెయ కొనెయ తళిర ముగుళ వనల తాసి కుంజదిం
ప్రసూన రజద పుంజదిం

క్రీగీతలున్నచోట గణవైవిధ్యమున్నది. పంపమహాకవి ఆదిప్రాస నియమమును పాటింపలేదు. కాని తమవాతివాడగు రన్నకవి ఆద్యంతప్రాసలతో ఉత్సాహరగళెలను విరచించెను. ఉదాహరణమునకు –

అదఱ బళసి దుపవ నంగ
ఒడిత కోకి లస్వ నంగ

—రన్నకవి అజిత తీర్థంకర పురాణ ద్వితీయాశ్వాసము పుట 20

సంస్కృతమునగల ఉత్సాహ, మాణవక వృత్తములకు ఉత్సాహరగళెలతో సామ్యములు చెప్పవచ్చును.

ఉత్సాహవృత్త పాదమునకు వరుసగా 7 హగణములు మరియు 1 గురువు చెప్పుట లక్షణము అనగా 23 మాత్రలుగల పద్యపాదమని అభిప్రాయము. ఇట్టి పాదమునకు అదనముగా నొక మాత్ర చేర్చిన యెడల ఉత్సాహరగళె పాదమగును

శ్రీ సీతారామ జాగీర్దార్‌గారు ఉత్సాహరగళెకు మాణవక వృత్తమును మూలముగా నెంచిరి. మాణవకమునకు భ త లగ గణములు చేర్పవలయును. మాత్రా గణనము చేయగా 12 మాత్రలు. ఇట్టి పాదములు రెండింటిని చేర్ప ఉత్సాహరగళె యగునని శ్రీ జాగీర్దార్‌గారి అభిప్రాయము.[19]

ప్రాకృతపైంగళమున చెప్పబడిన మల్లికా ఛందమునకు ఉత్సాహరగడకు పోలికలున్నవి. మల్లికా ఛంద లక్షణము—

హార గంధ బంధు రేణ
డిట్ట అట్ట అక్ష రేణ
జార హోహి మత్త జాతి
మల్లి ఆసు ఛంద మాతి

ప్రాకృత పైంగళము — 53

ఇదియు సంస్కృతమున గ్లతిసమానిగా చెప్పబడినది.

పై సంస్కృతవృత్తములన్నియు ప్రసిద్ధఛందోరీతులుకావు. ఉత్సాహము ప్రసిద్ధ ఛందోబంధమైనను మాత్రావిన్యాసము, దాక్షిణాత్యభాషలందు ఈ వృత్తమునకుగల ప్రచారమనుసరించి దేశిచ్ఛందమని తలంపవలసియున్నది రగడలకు ఆద్యంతప్రాసలు నియతమగుటవలన వీనిని ప్రత్యేక ఛందోరీతులుగా భావించుట యుక్తము.

ఆంధ్రలాక్షణికులు నవవిధరగడలను పేర్కొనిరి. కానిహంసవింశతిలో 'మంజుగతిరగడ' అనుపేరుగల క్రొత్తరగడకలదు. ఇట్టి రఘటాభేదమును లాక్షణికులెవరును చెప్పలేదు.

శ్రీవైకుంఠ క్షేత్రంబునఁదగు, వాసుదేవునకు వందనమొనరిచి
యామోదస్థలి యందలిసంకర్షణునకుఁగర్ణాచ్ఛాదనములనిడి

హంసవింశతి 4–214

పైరగడ నాలుగు మాత్రల గణములతో రచితము. ముద్రిత పద్ధతి ననుసరించి పాదమునకు 8 గణములున్నవి అయిననిది హరిగతిరగడ కావలయును. కాని యిందు యతినియమము సరిపోదు. పూర్వార్ధమునను నుత్తరార్ధమునను రెండుగణములపై ప్రత్యేకయతులున్నవి. రెండు పాదములుగా గ్రహించిన మధురగతిరగడ యగును. కాని ద్వితీయాక్షర ప్రాసనియమము కానరాదు. పై రగడపాదములందు అంత్యప్రాస నియమము పాటింపబడలేదు. కనుక ఈ రగడ ప్రత్యేక లక్షణములు గల రగడయని నిర్ణయింపవలసియున్నది.

కన్నడలాక్షణికులు రగళెలకు మాత్రానియమమును మాత్రము చెప్పిరి. ఆంధ్రలాక్షణికులు మాత్రానియమములతో గణములను గూడ నిర్దేశించిరి. గణనిర్దేశమునకు విషమగతి నివారణము ప్రధానకారణముగావచ్చును. కన్నడాంధ్రములందు పంచమాత్రాత్మక రగడలకు (లలితరగళె – ద్విరదగతి) ప్రచార మెక్కువయని సారాంశము.

### 6. 1. 3. రగడలు - , ఛందోరీతులతో సామ్యము

తెలుగునగల మధురగతిరగడ కన్నడ మందానిల రగళెతో సామ్యమొందుచున్నది. మధురగతిరగడ పాదమునకు నాలుగు చతుర్మాత్రాగణము లుండుట సామాన్యనియమము. మధురగతిరగడకు చౌపదకు కొన్ని పోలికలున్నవి. కవిజనాశ్రయకర్త 'చౌపదకు' ఇట్లు లక్షణము పేర్కొనియున్నాడు.

నలగా భసలను నాల్గిటిలోనన్
వలసిన నాలుగు వడిగాఁబూనన్
వెలయఁగ ఙద్వయ విశ్రమమైనన్
అలవడు చౌపద కన్విత మైనన్

కవిజనాశ్రయము – జాత్యధికారము

చౌపదకు పేర్కొనబడిన గణములు నల–గగ–భ–సల గణములు పైగణములన్నియు చతుర్మాత్రాకములు. ఈగణములే మధురగతి యందును వాడబడును. మధురగతి పాదమునకు 16 మాత్రలే. ఆద్యంత ప్రాసనియమము, పాదద్వయమును పేర్కొనిన చౌపద మధురగతిరగడయే.

తెలుగునగల ద్విరదగతి కన్నడ లలితెరగళెయగును. లలితరగళెకు త్రిపదులకు కొన్నిసామ్యములున్నవి. త్రిపది ప్రథమపాదమున నాలుగు విష్ణుగణములుండవలయునని నియమము. ఈ అంశగణములను మాత్రాగణములుగా భావించిన లలితరళె పాదమగును. త్రిపదీ పాదమునకొక యుదాహరణము.

సాలవను కొంబాగ హాలోగ రుండంతె
5 5 5 5

ఇట్టి పాదములను రెండింటినికూర్చి ఆద్యంతప్రాసలు నిలిపిన 'లలితరగళె' యగును.
ఎత్తుగీతి కొలది మార్పులతో రగడ యగుచున్నది.

అసిధారఁ బొల్పెసఁగె జ - యకాంత కాంతరద
దవదాత ఖడ్గలత జ - యచైత్ర సంపదన్

ఇందలి రద-పద అను పదములను బట్టి చూచినచో ద్విపదయో, ద్విరదగతియో కావలసియున్నది. దీనిలో ద్విపద లక్షణములేదు. కనుక, ఇది ద్విరదగతి రగడ కాబోలనిపించుచున్నది. ఈ నన్నిచోడకవి రగడలో పద్యాదిప్రాసగాని పద్యాంత ప్రాసకానిలేదు. పై ద్విరదగతి రగడలో యతిస్థానము 11 లఘువునందేగాక 12 లఘువునందు చెల్లినను, మాత్రాపరిమితి 20 + 20 = 40 లో వ్యత్యాసములేదు. నాలుగు గణములు చక్కగా సరిపెట్టబడియున్నవి." అని శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు పేర్కొనిరి.[20]

ఎత్తుగీతికి నాలుగు పాదములు. పాదమునకు వరుసగా 1 ఇంద్రగణము + 2 సూర్యగణము లుండవలయును. రెండు గణములపై యతి పాటింపవలయును.

ఆదిప్రాసంబు హరియు నాదిత్య యుగము నగుచు
నీదెస యతుల నెత్తు గీదియ నెగడు గృష్ణ

—ఛందోదర్పణము 3-16.

పై పద్యములందు ఆదిప్రాస, 20 మాత్రల నియమములు మాత్రము సరిపోవు చున్నవి. కనుక ఎత్తుగీతికి ద్విరదగతి రగడకు పోలికలున్నవని చెప్పవచ్చును.

లయగ్రాహి, లయవిభాతి, లయహారులు మూడును మాత్రాసమకవృత్తములు. ఇవి మూడును సంస్కృతచ్ఛందములందు చెప్పలేదు. కాని ఆంధ్రలాక్షణికులు వీనిని పేర్కొనిరి. కన్నడములో లయగ్రాహి రఘటాభేదముగ కూడ పేర్కొన బడినది. లయగ్రాహి, లయవిభాతి, లయహారులను మూడింటికి అక్షరసంఖ్యలో భేదముకలదు. కాని మాత్రాసంఖ్యలో భేదములేదు. అన్నిటికి 39 మాత్రలే. కాబట్టి ఈ మూడింటికి నడక (లయ) సమానము మాత్రాగణబద్ధముగా తోచుటచేతను, మాత్రాసమక మగుటచేతను ఇవిదేశిచ్ఛందమునకు చెందినవను భ్రమను కల్గించుచున్నవి

రగళెలకు కన్నడషట్పదులకు సామ్యములున్నవి. లలితరగళె ప్రభావము వలన కుసుమషార్దక షట్పదులు, మందానిలరగళె ప్రభావమువలన శరపరివర్ధినీ షట్పదులు; ఉత్సాహరగళె ప్రభావమువలన భోగషట్పదియు నేర్పడియుండునని ఆచార్య కె జి. కుందణగార భావించిరి.[21]

"రగడలు, కళికలు, ఉత్కళికలు, త్రిపుట, జంపె, అచ్చెర మున్నగు తాళములు అన్నియు కలిసి రగడలు అనునొకే కుటుంబమునకు చెందినవనుట సమంజసము" అని శ్రీ వి. రాజగోపాలరావుగారు సిద్ధాంతించిరి.[22] ఉదాహరణకావ్యములందు రగడప్రభేదములగు కళికోత్కళికలకు ప్రాధాన్యము. కళిక రదడయైనచో ఉత్కళిక అర్ధరగడయగును. పాల్కుఱికి సోమన బసవోదాహరణములో కొన్ని కళితోత్కళికలు

| | |
|---|---|
| వెండియుఁ ద్రిభువ వినుతిసమేతుఁడు<br>మండిత సద్గుణ మహిమోపేతుఁడు | కళిక<br>మధురగతిరగడ |
| భువనోపకార<br>భవమోదవీర | ఉత్కళిక -<br>అర్ధరగడ |

పద్యములకంటె రగడలకు సంగీతముతో అధికసంబంధమున్నదని ఫలితార్థము.

రగడల వికాసము :

కన్నడ రగళెల వికాసములో మూడు దశలున్నవి. మొదటిది శాసనములందలి రగళెలు. రెండవది చంపూ కావ్యములందు గల రగళెలు. మూడవది స్వతంత్ర రగళెలు.

శాసనరగళెలు :[23]

ప్రాచీన కన్నడ శాసనమగు హల్మిడి శాసనము (క్రీ. శ. 450) గద్య శాసనము. కాని శ్రీ కె. శివరామ ఐతాళగారు ఆ శాసన వచనములోని సమతౌల్యము, 'ఇచ్చితమ'గు నిలువుదల బట్టి ఆ వచనములను రగళె ప్రభేదములుగా భావించిరి.

బళ్ళారి జిల్లా కోగళి శాసనము (క్రీ. శ. 1055) లో 42 పాదములు గల రగళెలున్నవి. మచ్చుకు...

శ్రీ మదరు హచ్చరణ సరసిరుహ భృంగనం
భూషి కీర్తిసె నెగళ్ద గుణ గణోత్తుంగనం

పై పాదములు 'తోమరరగళె'లకు చెందినవి.

బళ్ళారిజిల్లా కురుగోడశాసనము (క్రీ. శ. 1176) నందును రగళెలు కలవు. ఈ శాసనరగళెలందు కొన్ని పాదములు —

స్వ స్తిగవఱూళ పదపద్మషట్చరణరుం
వి స్తీర్ణవస్తుగుణ విసిహితాచరణరుం

ఈ రగళె ఆద్యంత[ప్రాసయు క్తము. ఇది 14 పాదములుగల లలితరగళె.

బళ్ళారిజిల్లా కురుగోడశాసనము (క్రీ. శ. 1177)న లభించిన మరియొకరగళె

శ్రీమదార్యానామ పురముఖ్యభూతరెని
పయ్యూర్వరిందొదవి దన్వయాయాతరుం

పై శాసనమున ప్రాసవియమమంతగా పాటింపబడలేదు.

పై పరిశీలనమువలన కన్నడ శాసనవాఙ్మయమున 'లలితరగళె'లకు ప్రాధాన్య మున్నట్లు తెలియుచున్నది.

ఆంధ్రదేశమునవెలసిన శాసనములందును రగడలకు విశిష్టస్థానమున్నది. క్రీ. శ. 1022 ప్రాంతమున వెలసిన కోరుమిల్లి శాసనమునందు 28 పంక్తులుగల రగడ కనిపించుచున్నది. కాని యిందలిభాష సంస్కృతము. ఈ రగడలో కొన్ని పాదములు —

తస్మై సమ స్త జనతా విశేష గుణాయ
రైసుతర్పిత మహీదేవ దేవగణాయ
విప్రాన్వయాబ్ధి శశిభృత్ప్రతిచ్ఛందాయ
విద్వజ్జనాధిక విశ్రుతానందాయ

... ... ... ...

ధారాగ్రహేణాగ్ర హరీకృతః కోరు
మిల్లి నామ గ్రామ మిందూప రాగేణ
దత్తోమయా చంద్రతారం షి తిష్ఠేత
తస్యావధి వ్యక్తి రేషోచ్యతే రాద్య

పై చివరి పాదములందు ఆదిప్రాస, అంత్యప్రాసలు రెండును పాటింపబడలేదు. విచ్ఛేద రూపయతియు కానరాదు. పై రగడగల శాసనమును రచించినవాడు బేతన బట్టు, వ్రాసినవాడు గండాచార్యుడు. నన్నయ రచించిన నందంపూడి శాసనమును వ్రాసినవాడు కూడ గండాచార్యుడే. ఈ కారణముచే బేతనబట్టు నన్నయగారు

ఏక రాజాశ్రితులు, పరిచితులు అనికూడ చెప్పవచ్చును. కావున నన్నయ రగడల నెరిగి యుండుననుట వాస్తవము.

తొమ్మిదవ శతాబ్దము నాటికే ఈ రగడ కావ్యమున ప్రవేశించినట్లు, ఆ శతాబ్దము వాడయిన సోమదేవసూరియొక్క యశస్తిలక చంపువునందున్న కొన్ని రగడల వలన తెలియు చున్నది.

'వికచ కర్ణోత్పల స్పర్ధితరశేషణాః
కేతాళక్వణ త్కనకమయ కంకణాః'

మొదలుగా నొక రగడయున్నది. ఇందు రగడ లక్షణములలో గణ నియమము మాత్రమున్నది. యతి ప్రాసలకు సంబంధించిన లక్షణములు లేవు. ఈ కారణము చేత తద్వ్యాఖ్యాత దీనిని 'వృత్తగంధి' పద్యముగా భావించెను. కాని అన్ని పాదముల యందలి గణముల మాత్రాసమాన లక్షణము దీనిని రగడ యనియే చెప్పు చున్నది. పై రెండు రగడలును ద్విరదగతి రగడలే (లలితరగళె)

సంస్కృత సాహిత్యమునందు రగడలు ఆ పేరుతో లేకపోవచ్చును. కాని కొన్ని స్తోత్రములందు రగడచ్ఛాయలున్నవి.

అచ్యుతం కేశవం రామనారాయణం
కృష్ణ దామోదరం వాసుదేవం హరిమ్
శ్రీధరం మాధవం గోపికా వల్లభం
జానకీ నాయకం రామచంద్రం భజే

పై శ్లోకములో పంచమాత్రాత్మక గణ సంయోజనమున్నది. తెలుగు లక్షణ మనుసరించి చెప్పవలయు నన్నచో నది ద్విరదగతి రగడ. ఇట్లే ఆదిశంకరుల నమశ్శివాయ స్తోత్రము ఉత్సాహరగళె లేదా తురగ వల్గన రగడ ఫక్కిలో సాగినదనవచ్చును.

## సాహిత్యములో రగళె రగడలు :

కన్నడకవులు తమ చంపూ కావ్యములందు ఛందోవైవిధ్యముకొఱకై రగళెలను ప్రయోగించిరి. పంపభారతము, పొన్నకవి శాంతిపురాణము, రన్నకవి అజిత తీర్థంకరపురాణతిలకము, నాగవర్మ కర్ణాటక కాదంబరి, శాంతినాథకవి సుకుమార చరిత, నయసేనకవి ధర్మామృత, రుద్రభట్టు జగన్నాథవిజయ, అగ్గళకవి చంద్ర

పభాపురాణ, ఆసణ్ణకవి వర్ధమానపురాణ, బంధువర్మ జీవసంబోధనములను చంపూ కావ్యములలో రగళెలు ప్రయోగింపబడినవి. చంపూకావ్యకర్తలు నగరవర్ణనము వివాహవర్ణనము, దేవతాస్తుతి, ఉద్యానవన వర్ణనము మొదలగు వర్ణనాప్రధానవిషయముల కనుగుణముగా రగళెలను ప్రయోగించినట్లు తెలియుచున్నది. తెలుగుకవులు ప్రబంధములందు శృంగారవన విహారవర్ణనలకు రగడలనెన్నుకొనిరి. తెలుగులో స్తుత్యాత్మకరగడలును లేకపోలేదు.

కన్నడసాహిత్యమున రగళెలకు ప్రత్యేక కావ్యగౌరవము కలిగించినవాడు హరిహరుడు. ఈ మహాకవి మందానిల లలిత ఉత్సాహరగళెయను త్రివిధరగళె భేదములందును కథాకావ్యములను విరచించెను బసవరాజదేవరరగళె, నంబియణ్ణ రగళె లలితరగళెలలో వ్రాయబడినవి. ఆదయ్యరగళె, భృంగీశ్వరరగళె మందానిల రగళెలలో వ్రాయబడినవి. తిరుకురుంపెతొండమహాత్మ్య రగళె, మళెయరాజశరణ మాహాత్మ్యరగళెలు ఉత్సాహరగెళెలలో వ్రాయబడిన ప్రత్యేక కృతులగును. ఆంధ్ర వాఙ్మయమునగూడ ప్రత్యేక రగడకృతులున్నవి. ద్విపదకు తరువాత సోమనాథు డెక్కువగా నభిమానించిన దేశిచ్ఛందము రగడ ఆచార్య జి. కోదండరామయ్యగారు పాల్కురికి సోమనాథుని రగడలను మూడు విధములుగా వర్గీకరించిరి.[24] 1. గద్యకృతులలోని రగడలు. 2. రగడలను పేరులో వ్యవహరింపబడు లఘు కృతులు, 3. ఉదాహరణ కృతులయందలి రగడలు.

పంచప్రకారగద్య, నమస్కార గద్య, అక్షరాంకగద్య, బసవలింగ నామావళి అష్టోత్తర శతనామ గద్యలనునవి గద్యములుగా భావింపబడు రగడలగును. ఛంద స్సంప్రదాయ మనుసరించి యవి రగడలు కాగా రచనా సంప్రదాయ మనుసరించి యోజోగుణ యుక్త సమాస బంధుర గద్యరచనలగుచున్నవి.

పంచప్రకార గద్యలో ప్రథమ గద్యతప్ప తక్కిన నాలుగు విధములయిన గద్యలును మాత్రాగణబద్ధములై రగడ భేదములై యున్నవి. ఉదాహరణమునకు—

"అపిచ మహామహా మోన్నత విభవా
భవ పాశోత్కర శాతలవిత్రా

విత్రాసిత ... ... రెండవగద్య. ఇందు 16 పాదములున్నవి. ముక్తపద

గ్రస్తము పాటింపబడినది. చతురస్రగతి స్పష్టముగా గోచరించుచున్నది. కనుక దీనిని మధురగతి రగడగా చెప్పవచ్చును.

నమస్కార గద్యలో పాదాంతమున 'నమః' అని యుండును. ఇందు నూట పదునెనిమిది చరణములు గలవు.

"అపిచ శ్రీ ప్రమథేంద్రాయ నమో
వ్యపగత హృద్గత తంద్రాయనమః'

ఇదియు మధురగతి రగడయే యగును.

మంగళ ప్రసంగ సంగన బసవ లింగాయతే నమస్తే నమస్తే నమస్తే నమః
మఘవత్ప్రణుత పదాబ్జాతాయ పూతాయ విఘనస్త్రితయ సుఖోద్ధరణాయ శరణాయ
కుసుమశర రిపుభక్త వృషభాయ వృషభాయ బసవాయతే నమస్తే నమస్తే నమః
పై పాదములు జయభద్రరగడపాదములగును.

అక్షరాంకగద్యపాదములు ద్విరదగతి రగడకు సరిపోచున్నవి.

అపి చ శివ శృంగార ఓం
ఆదిపద విస్తార ఓం

పాల్కురికి సోమనాథుని స్వతంత్రరగడ కృతులలో శరణుబసవరగడ, సద్గురురగడ, చెన్నబసవరగడలు గణింపదగినవి. 'శరణుబసవ' అనుమకుటముతో కూర్పబడిన రగడకృతి శరణుబసవరగడ. ఈ రగడపాదములు తురగవల్గన లక్షణములు గలిగియున్నవి. కాని తొలి డెబ్బది యెనిమిది పాదములవఱకు మాత్రమే ద్విపాదప్రాసనియమము, అంత్యప్రాసనియమమును పాటింపబడినవి. తరువాతి పాదములలో ద్విపదలోవలె కొన్నిచోట్ల ప్రాసయతిని కూడ నుపయోగించుచు పదునాలుగు పాదములవఱకు నేపాదమున కాపాదమునందే పాదమున కొక్క ప్రాసచొప్పున అంత్యప్రాసనియమము పాటించినట్లును, నటుతరువాతమఱి యెనిమిది పాదములలో నిట్టి నియమమునే మఱికొంత విలక్షణముగా ననుసరించినట్లు గోచరించుచున్నది. అసమగ్రమగు సద్గురురగడ కన్నడ లలితరగడ లక్షణమునకును, అసమగ్రమగు చెన్న బసవరగడ ఉత్సవరగడ లక్షణమునకును సరిపోవును. ఉదాహరణ కావ్యము లందలి కళికోత్కళికలుగూడ రగడప్రభేదములేయగును. ఆంధ్రవాఙ్మయములో గల

ప్రత్యేక రగడకృతులలో నయనరగడ, నమశ్శివాయరగడ, సుదర్శన రగడలును పేర్కొనదగినవే.

ఆంధ్రవాఙ్మయములో సుప్రసిద్ధమగు నృసింహ నామకీర్తనములందు రగడ లక్షణములున్నవి.

శ్రీకరంజ భూమహాఖ్యచెంగి వెలయు శ్రీనృసింహా
భీకరావతార ధీరపృథుల వక్ష శ్రీనృసింహా.

రెండేసి పాదములు ప్రాసతో ననుసంధానింపబడుట, ప్రతిపాదమున రెండేసి ఆవృత్తములపిదప యతిచెల్లుట, పాదమున ఎనిమిది సూర్యగణము లుండుటవలన తురగవల్గనరగడగా చెప్పవచ్చును. ఇట్లే 'రామనామకీర్తనము' నందలి పాదములు వృషభగతి రగడచ్ఛాయలో సాగినవి.

శ్రీమదఖిల రహస్య మంత్రవిశేషధామము రామనామము
సామవేద విధూతశాస్త్రవిచార నామము రామనామము

పై పరిశీలనమువలన తేలిన అంశములను ఇట్లు సంగ్రహింపవచ్చును.

కన్నడాంధ్ర శాసనములలో రగడలున్నవి. కన్నడమున త్రివిధరఘటా బంధములకు ప్రచారమెక్కువ. తెలుగున నవవిధరగడలను లాక్షణికులు పేర్కొనిరి. పంచమాత్రాత్మకమగు లలితరగళె - ద్విరదగతిరగడలకే కన్నడాంధ్రములందు ప్రచారమెక్కువ. రగళలు తాళప్రధానములు. కన్నడ రగళెలకు ఆద్యంతప్రాసములే నియతములుకాగా తెలుగురగడలకు ఆద్యంతప్రాసములు, యతినియమము గూడ ప్రధానములయినవి. రగడలకు నితర దేశిచ్ఛందోరీతులకు సామ్యములున్నవి. రగడల ప్రచారము కన్నడాంధ్రములందు సమానముగా నుండుట గమనార్హము.

ఆధునిక ఛందోప్రక్రియలకు రగడలకు చాల సామ్యములున్నవి. ఈ యంశము 'ఆధునికచ్ఛందస్సు' అను ప్రకరణమున పరిశీలింతము.

### 6. 1. 3. చౌపది :

ఆంధ్ర లాక్షణికులగు రేచన, విన్నకోట పెద్దనలు మధురగతి రగడకు సమానమగు చతుష్పది, చౌపద లేక చౌపదిఛందో విశేషమును పేర్కొనియున్నారు. చతుష్పద నాలుగు పాదములుగల పద్యము. దీనికి ప్రతిపాదమున 16 మాత్రలుండును.

చతుర్మాత్రాకములగు నల, గగ, భ, సలతో చౌపది కూర్పవలయునని రేచన కవి జనాశ్రయ జాత్యధికారమున పేర్కొని యున్నాడు. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి యందు పై లక్షణములతోపాటు అంత్యానుప్రాసను గూడ నిర్దేశించి యున్నాడు. కాని అప్పకవి అంత్యానుప్రాసను చెప్పలేదు. తెనాలి అన్నయకవి రచనలో చౌపద యున్నది.

చిన్నది యొక్కతె చెందొవ క్రోవిన్
దిన్నగఁ జిమ్మెను దేనియ తావిన్
మన్నన సేయుచు మారుని ఠీవిన్
బన్నిన ఖచరుని పవడపు మోవిన్

—సుదక్షిణా పరిణయము 3–89

అనంత చిత్రకవి పెద్దనలు 'చోపద' మను పేరుతో నొక ఛందో విశేషమును పేర్కొనియున్నారు. చౌపద పాదమునకు చతుర్మాత్రా గణములు మూడు. త్రిమాత్రాగణ మొకటి (సూర్యగణము) వరుసగా కూర్పవలయును. పై లక్షణ మనుసరించి చౌపద పాదమునకు 15 మాత్రలగును మధురగతి రగడకు 16 మాత్రలు. కనుక చౌపదకు ఒక మాత్ర చేర్చుటయో లేదా సగణముగాని గగనుగాని సూర్యగణముగా గ్రహించిన ఎడల చౌపద మధురగతి రగడకును భేదముండదు. కన్నడ లాక్షణికులు చౌపదిని పేర్కొనలేదు. కాని 'చౌపదిగె'ను పేర్కొనిరి. పాదమునకు 1 విష్ణు 1 రుద్రగణము వచ్చుట చౌపదిగె లక్షణము కనుక తెలుగు చౌపదికి కన్నడ 'చౌపదిగె'కు సామ్యము లేదని నిర్ధారింపవచ్చును.

### 6. 1. 4 వితాళచతుష్పద :

ఆంధ్రలాక్షణికులు వితాళచతుష్పదను పేర్కొనిరి గాని కన్నడలాక్షణికులు పేర్కొనలేదు.

అనంతుడు ఛందోదర్పణములో (3–51) వితాళ చతుష్పదపాదమునకు వరుసగా 2 సూర్యగణములు, 2 ఇంద్రగణములు చివర ఒక లఘువుండునని పేర్కొనెను. అనంతుని లక్షణమనుసరించి వితాళచతుష్పదకు అంత్యప్రాసను కూర్పవలయును.

అప్పకవి వితాళచతుష్పదకు 2 సూర్యగణములు, 9 మాత్రలుగల పాదము లుండవలయునని పేర్కొనెను. (4–471) 8 మాత్రలపై యతిపాటింపవలయునని

అప్పకవి అనుశాసనము. వారి ఉదాహరణముల ననుసరించిచూడగా పాదాంతమున లఘువుగాని గురువుగాని రావచ్చునని చెప్పబడియున్నది.

> భానుయుగము పై పయిన వలనిం (4-472)
> అర్కనామగణ మనుష్యాగ రెండు – (3 51)

అట్లే పై లక్షణములకు విరుద్ధముగా నాచనసోముని వితాళ చౌపదయున్నది.

> వీణాగానము వెన్నెల తేట
> రాణ మీఱగా రమణులపాట
> ప్రాణమైన పిన బ్రాహ్మణ వీట
> జాణలు మెత్తురు జాజుబపాట

పై పద్యపాదములు లఘ్వంతములు. మఱియు ఆదిలో సూర్యగణద్వయము లేదు. ప్రతిపాదములో 15 మాత్రలున్నవి

వితాళచతుష్పద పాదములలో మొదట రెండుసూర్యగణము లుండుట ప్రధానము. కాని చౌపదిలో చతుర్మాత్రాగణములే యుండవలయును. వితాళచతుష్పద లోని గణములు, పాదవిన్యాసము పరికింప నిది రగడవికృతిగా కనిపించును.

## 6. 1. 5. కర్ణాట చతుష్పద :

కిటెల్ సంపాదిత ఛందోంబుధి యందు 'చౌపది' అను పేరుగల ఛందో విశేష లక్షణము కలదు.

> ఎసెవ చౌపదిగె పదినెంటు మాత్రెగళు
> పసినె యతి యెంటఱొ ళ్మ పసరిసుత లిరలు
> హసనాగి నాల్కు పాద సమనాగి బరలు
> బిసజాక్షి ప్రాసు తిళి మొదలు కడె యిరలు
>
> ఛందోంబుధి 3-164

పై పద్య మనుసరించి చౌపదికి నాల్గుపాదములనియు, పాదమునకు 18 మాత్రలనియు ఆద్యంత ప్రాసలను గూర్చవలయుననియు తెలియుచున్నది.

చిత్రకవి పెద్దన (2-123) అప్పకవి (4-286) ప్రభృతులు పంచ లఘు గణములు మూడింటిపై నొర సూర్యగణమును చేర్ప కర్ణాట చతుష్పద పాదమగునని పేర్కొనిరి. యతి 1-3 గణాద్యక్షరములకు చెల్లును. సూక్ష్మముగా పరిశీలింప నది ద్విపదయే

5 5 5 4

ఎసెఫచౌ పదిగె పది నెంటుమా త్రెగళు 3-164
తగపంచ లఘుగణత్రిత యమరవి రాయ
మొగ్గెదుదల్ప్రాసముల్ మునుగల్గ జేయ
—లక్షణసార సంగ్రహము 2-123

ద్విపదకు రెండు పాదములు కాగా చౌపదికి నాలుగు పాదములు. ద్విపదకు అంత్యప్రాస గూర్పవలయునని నియమము లేదు. కాని చౌపదికి ఆద్యంత ప్రాసలు కూర్పవలయును. కర్ణాట చతుష్పద లక్షణములు పేర్కొనుటలో కన్నడాంధ్ర లాక్షణికుల అభిప్రాయము లేక రీతిగానున్నవి. నాగవర్మ 'చౌపది'ని రఘటా ప్రభేదముగా భావించెను. కన్నడమునందు 'చౌపదిగె' అను ఛందోవిశేషముకలదు. నాగవర్మ (5-15) జయకీర్తులు (7-15) 'చౌపదిగె'ను కర్ణాటజాతిగా భావించి లక్షణము తెలిపిరి.

మదనాద్యాః శరగణాంతాః
యది చరణ శ్చత్వారః
గదితాశ్చేత్ చతుష్పదికా
విదితాసౌ చూడామణీ
— ఛందోనుశాసన 7-15

పై లక్షణమనుసరించి 1 విష్ణు 1 రుద్రగణము కలది 'చౌపదిగె' అని తెలుచున్నది మదనతిలకమను కన్నడగ్రంథమున 'చౌపదిగె' ప్రయోగింపబడినది.

శిక్షిత నిందు యశం
లక్షణ యుత్తనివం
దక్షను వాయతను
వీక్షిసి రేచనృపం
— మదనతిలక 1-15

చౌపదిగె - ఎతుగీతి

'చౌపదిగె'కు 1 విష్ణు 1 రుద్రగణములు రాదగును. ఎత్తుగీతికి 1 ఇంద్ర 2 సూర్యగణములు పరిశీలింప ఒక్క రుద్రగణములో రెండు సూర్యగణములిముడును.

శిశిత నిందు యశం – మదనతిలక 1-15
ఈడెస యతుల నెత్తు
గీదియ నెగడు కృష్ణ.
– ఛందోదర్పణము 3-16

పై పరిశీలన ననుసరించి 'చౌపదిగె' జాత్యధికారములో చేర్పదగినదని చెప్పవచ్చును.

### 6. 1. 6. పంచపద :

అయిదు పాదములు కలది పంచపాది యగును. సమవృత్తములలో దేని నైనను నైదు పాదములు కలదిగా వ్రాసినచో నయ్యది పంచపాది యగునని ఆంధ్ర లాక్షణికులు పేర్కొనిరి. కన్నడ లాక్షణికులలో వీరభద్రుడు మాత్రము పంచ పాదిని (3-15) నంది ఛందోర్ణవములో పేర్కొనెను.

పంచపద లేదా పంచపాది వృత్తములందే గాక గీత సీసములందును ప్రయోగ ముల గానవచ్చెడు. కాని లాక్షణికులెవరును ఈ అంశమును పేర్కొనలేదు. ఏనుగు లక్ష్మణకవి సుభాషిత రత్నావళి, అనిరుద్ధ చరిత్ర, శృంగార శాకుంతలము, సమీర కుమార విజయము, మల్హణచరిత్ర, ప్రబంధరాజములందు వరుసగా చంపకము ఉత్పలము, మత్తేభము, శార్దూలము, సీసము, తేటగీతి పంచపాదులు గలవని శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు 'లక్షణదీపిక' అను గ్రంథమున పేర్కొని యున్నారు [25]

లక్షణ దీపికలో 'పంచపాదుల'ను గూర్చి యిట్లు వివరీకరింపబడినది.

స్తుతి యెడ శృంగార రస
స్థితి పట్టున దివిరి యొరుల దెగడెడు చోటన్
చతుర కవుల్ రచియింతురు
వితతంబుగ బంచపాద వృత్తము పేర్మిన్

గీత సీసవృత్తముల పంచపాదులుగా వ్రాయుట గాక మాలికలుగా ననియత సంఖ్యాక పాదములుగా కూర్చుటయు కలదు. చాటు పద్యములలో నిట్టిమాలికలు పెక్కులున్నవి. అల్లసాని పెద్దన ఉత్పలమాలిక 30 పాదములు కలది. భట్టుమూర్తి యుత్పలమాలిక 26 పాదములు కలది కవిత్వములో చేయితిరిగిన వారెల్ల రు మాలికలు రచించుట సాహిత్య పరిచయము గలవారికి తేటతెల్లమైన విషయమే.

### 6. 1. 7 సప్తపది

కన్నడాంధ్రలాక్షణికులెవరును 'సప్తపదుల'ను గూర్చి పేర్కొనలేదు. కాని ముద్దుపళని (క్రీ. శ. 18 వశ) ద్రావిడభాషలోని తిరుప్పావు అను పాశురములను తెలుగులో సప్తపదులుగా వ్రాసెను. ఆ పాశురములలో కొన్ని పాదములను పరిశీలింతము

శ్రీనివాసగురుని౯దలంచి చిత్తమునకు ముద్దుపళని
పూని చేయు ద్రవిడ పాటలోని భావమూ
తెలంగి తెలియ వాణి తనదు జిహ్వకొనను నిలిచియుటులం
బలికె దిరుప్పావు సప్తపది పదంబుగా

పై పాశురమనుసరించి పూర్వార్థములో త్రిమాత్రాత్మక గణములు ఎనిమిది, ఉత్తరార్థములో 6 గణములు పిదప నొక గురువుకలది. యొకపాదము రెండుదళములందును నాల్గింటిపై యతికలదు. రెండర్థములందు ప్రత్యేకయతులును, ఆదిలో వృత్తములకు వలె రెండు సగములందును ప్రాసమైత్రియుకలవు. ఈ పాశురము నడకతురగ వల్గనరగడను పోలినదని చెప్పవచ్చును.

### అష్టపది :

ఆంధ్రలాక్షణికులెవరును 'అష్టపదిని' పేర్కొనలేదు. కిటెల్ సంపాదిత కన్నడ ఛందోంబుధియందు మాత్రము అష్టపదికలదు. నాగవర్మ అష్టపదిని రగళె భేదముగా తలంచినట్లున్నది. (3–163–166) అష్టపదికి ఎనిమిదిపాదములు. పాదమునకు రెండు చతుర్మాత్రాగణములు. 8 వ పాదములో మాత్రము నాలుగు చతుర్మాత్రాగణములుండును. ఇందలి రెండుపాదములు మధురగతిరగడ పాదములగును

హయగళకరిఘ ట్టియగళ బలిదాం
టియగళ మేణ్క త్తెయగళ పన్నగ
చయగళ బిగిద శ్వయగళ సహిర
ణ్మయగళ సుకధా లయగళొళులివుత నడెయువరాగళ్

— ఛందోంబుధి 3-166

## 6. 1. 8. త్రివుడె పాళము : (త్రిపుట)

కిటెల్ సంపాదిత ఛందోంబుధిలో 'త్రిపుడె' రఘటా భేదముగా (3–21) పేర్కొనబడినది. గుణచంద్రుడు ఛందస్సారములో త్రిపుటె వృత్తమును (5-6) పేర్కొని యున్నాడు. అప్పకవి యక్షగాన లక్షణములను పేర్కొనుచు త్రిప్పుటకు లక్షణము (4-304) ప్రవచించెను.

కన్నడ లక్షణమనుసరించి త్రిపుట పాదమునకు 7 మాత్రలుండును. మొదటి మూడు మాత్రలపై యతి యుండును.

త్రిపుట వృత్తది
సప్త కళెగళు
ఒప్పు తిర్పుగె
త్రిపుర నగయతి

—ఛందస్సారము 5 6

అప్పకవి 'తుదనేడు లఘువులు తొలగించి చదివిన త్రిపుటకు వృషభగతి పదయుగము (4-304) అని త్రిపుటకు లక్షణము పేర్కొనెను. వృషభగతి పాదమునకు మొత్తము 28 లఘువులు. ఇది హరిణగతికి రెట్టింపు. వృషభగతి రగడ యందు 14 లఘువులపై యతి పాటింపబడును పై త్రిపుట వృత్తమెల్ల వృషభగతి పాదమగును. కన్నడములో హరిణగతి, వృషభగతి రగడలు లేవు. కనుక త్రిపుటకు తగిన ప్రాముఖ్యమున్నది. త్రిపుట ఏకతాళాదులన్నియు రగడ భేదములే. కొన్ని మాత్రల తొలగించి చదివిన ఆయారగడ లాయా తాళములకు సరిపోవును రగడ భేదములగు పాటలు, చంద్రికలు, అర్ధచంద్రికలు మున్నగునవి యక్షగాన ప్రబంధములలో తఱచు ప్రయోగింపబడునని అప్పకవి (4 304) పేర్కొనియున్నాడు

యక్షగానములలోని ఛందోరీతులను గూర్చి 'దాక్షిణాత్య జానపచ్ఛంద'మను ప్రకరణములో పరిశీలింపబడును.

### 6. 1. 9 ఉత్సాహము

కన్నడాంధ్రలాక్షణికులు 'ఉత్సాహము'ను జాతిపద్యముగానెన్నిరి.

నాగవర్మ ఛందోంబుధియందు 7 బ్రహ్మగణములు చివర నొక గురువు కలది ఉత్సాహపాదమని (5-20) పేర్కొనెను. ఇట్టి పాదములు నాలుగు చేర్ప ఉత్సాహవృత్తమగును. లయగ్రాహివలె ఉత్సాహము మధురవచన రచన యుక్తమై యుండునని నాగవర్మ పేర్కొనెను.

జయకీర్తి ఛందోనుశాసనములో ఉత్సాహ - ఉత్సవమునకు ఇట్లు లక్షణము పేర్కొనియున్నాడు.

> ఈహితో క్తితో గలాంశస ప్తకం నిరంతరం
> గోహినైధనే నకారస ప్తకం యదాథదా
> వ్యాహితం తదుభయ మిశ్రస ప్తకం తదాతథో
> త్సాహమాహురుత్సవం చ గోగ్రహాదికే బుధాః
>
> — ఛందోనుశాసన 6-30

నాగవర్మ ఉత్సాహలక్ష్యములో న-గల గణములు రెండును కలవు కాని జయకీర్తి లక్ష్యములో 'గల' గణములే ప్రయుక్తము. గల గణములతో కూడిన ఉత్సాహమును నాగవర్మ లక్షణ వియుక్త ఉత్సాహమని (5-21) పేర్కొనియున్నాడు.

ఆంధ్రలాక్షణికులలో రేచన, అనంతాదులు (3-84) 'ఉత్సాహ'మని పేర్కొనిరి గాని ఉత్సాహవృత్తమనలేదు. కాని విన్నకోట పెద్దన (8-33) అప్పకవులు (4-273) ఉత్సాహవృత్తమని వ్యవహరించిరి. ఉత్సాహములో 7 సూర్యగణములు చివర 1 గురువు చేర్పవలయునని ఆంధ్రలాక్షణికులెల్లరు ఒకేవిధముగా పేర్కొనిరి. ఉత్సాహములో 'గల'లే ప్రయోగించిన సుగంధివృత్తమగును. నగణములే ప్రయోగించిన తరళమగును. గుర్వంతమగుటవలనను, సంస్కృత వృత్తములతో సంబంధముండుట వలనను ఉత్సాహమును వృత్తముగా కొందరు భావించిరి. ఉత్సాహము చివరనున్న గురువునుగూడ కలుపుకొని గణములు పేర్కొన్నచో

రగణమో నగణమో యగును. అనగా 6 సూర్యగణములు ఒక రగణము లేక నగ గణము ఉత్సాహ పద్యపాదమగును. ఈ రగణ నగగణములు రెండును ఇంద్రగణము లగుటవలన 6 సూర్యగణములు 1 ఇంద్రగణము ఉత్సాహ పాదమందుండునని చెప్ప వచ్చును. ఉత్సాహములో హగణ నగణములు రెండును కలిసి యుండవలయును.

మాత్రాగణ నిబద్ధమగు ఉత్సాహమును మాత్రాసంఖ్యా బద్ధముగా కూడ చెప్ప వచ్చును. 7 సూర్యగణములపై 1 గురువనుటను త్రిమాత్రాత్మకములగు 7 గణము లపై నొక గురువుగా చెప్పవచ్చును. అనగా పాదమునకు 23 మాత్రలనుట. తురగవల్గన రగడకు 24 మాత్రలుంకుట నియతి. 8 సూర్యగణములు పాదమునకు నిలపవలయునని నియమము. ఉత్సాహ పాదమునకు చివరనొక లఘువు చేర్చినచో తురగవల్గన రగడ పాదమగును. లేదా తురగవల్గన రగడ తుది గణములో నొక మాత్రను తొలగించి ఆ గణము నొక గురువు కలదానిగా చేసినచో ఉత్సాహపాద మగుచున్నది.

ఉత్సాహమును అంశగణాన్వితము చేయగా నిధానగతి ప్రతీతమగును. మాత్రా గణాన్వితము చేయగా త్వరితగమనము వ్యక్తమగును. ఉత్సాహరగళెకు ఉత్సాహ మునకు సామ్యములున్నవి ఉత్సాహరగళె తెలుగున హయ ప్రచార రగడ యగును. కన్నడములో 8 త్రిమాత్రా గణములు గలిగిన రగళె కూడ ఉత్సాహ రగళెయే. ఉదాహరణమునకు :—

మగన కరెయ లందు శంకె యిల్ల దిర్ద రెడ్డ పోగి
మగనె మగనె బారె నుత్తె బందు కరెదు నోడి బీగి
(హరిహర – సిరియాళ నరగళె)

మొదటి రెండు పాదములందు చివరగల ఒకమాత్రను తొలగించిన ఉత్సాహవృత్త మగును. పై పరిశీలనము వలన ఉత్సాహమును రఘటా భేదముగ చెప్పుట సమం జసమే.

## 6. 1. 10 దండకములు

గద్యపద్యోభయమిశ్రమగు ఛందోవిశేషము దండకము. సంస్కృతమునందే గాక తమిళ కన్నడాంధ్రమలయాళ భాషలందును దండకములు గలవు. కాని

తమిళ కన్నడాంధ్ర భాషలందుగల దండకములు సంస్కృత దండకములకంటె భిన్నములై దేశీయతా లక్షణములు గలిగియున్నవి విశేషించి తెలుగున దండక వాఙ్మయము మిక్కిలి విస్తరించి యున్నది మొదట సంస్కృత దండకములనుగూర్చి పరిశీలింతము.

పాదమందలి అక్షరసంఖ్యననుసరించి ఛందస్సు చెప్పుట సంస్కృత పద్ధతి. సంస్కృత లాక్షణికులు 26 అక్షరములుగల పాదములవఱకు ఛందోనామములను పేర్కొని, అంతకంటె మించిన పద్యములను ఉద్ధురమాలావృత్తములనిరి. దండకము పై వర్గీకరణమున చేరును.

పింగళుడు దండకలక్షణమిట్లు నిర్వచించెను. దండకో నౌరః - ప్రథమశ్చండ వృష్టిప్రయాతః - శేషః ప్రచితఇతి (7-33 to 36) సంస్కృతములో దండకములందు ప్రతిపాదము మొదట నగణద్వయము నియతముగానుండును. తదుపరి రగణములెన్నైనను నుండదగును. నగణ యుగముమీద సప్తరగణములుగల 27 అక్షరములవృత్తము చండవృష్టి దండకము. సంస్కృతలాక్షణికులు దండకములను వృత్తములో చేర్చుటవలన నాలుగు పాదములుండుట ప్రధాన నియమమైనది. నగణద్వయముపై రగణ వృద్ధివలన పెక్కు దండకము లేర్పడును. నగణద్వయముపై రగణములేగాక యగణతగణములతోడను 27 అక్షరములు మొదలుకొని 999 అక్షరముల పర్యంతము ఎన్నిగణములైన కూర్చి దండకపాదము రచింపవచ్చును. ఇదియ సంస్కృతదండకముల స్థూలస్వరూపమగును.

కన్నడ లాక్షణికులలో నాగవర్మ, గుణచంద్ర, వీరభద్రులు దండకములు-వాని ప్రభేదములను గూర్చి విశదీకరించిరి. నాగవర్మ ఛందోంబుధియందు (3-22) మాలా అర్ధసమ విషమాది వృత్తప్రకరణములో ఆఱు దండకములను పేర్కొనెను. కాని యవి యన్నియు సంస్కృత లక్షణ గ్రంథములందలివే. నాగవర్మ జాత్యధికారములో 'ఉత్సాహమును' (5-20) పేర్కొనెను. కానియది ఉత్సాహ వృత్తమునే నిరూపించు చున్నది. గుణచంద్రుడు ఛందస్సారములో చండవృష్టి ప్రయాత, అర్ణవ వ్యాళ జీమూతాది దండకములనే (4-1, 2, 3) పేర్కొనెను. వీరభద్రుడు నంది ఛందోర్ణవమునందు దండక స్వరూపమును విశదీకరింపక చండవృష్టి ప్రయాత దండక

మును మాత్రము (3-38) విశదీకరించెను. పై పరిశీలనము వలన సంస్కృత లక్షణానుకూల దండకములు కన్నడమున కలవని సారాంశము.

జయకీర్తి ఛందోను శాసనములో దండకములను రెండు విధములుగా వర్గీకరించెను. పాదనియమము కలవి, పాదనియమము లేనివి.

దండకాశ్చండ వృష్టాద్యాః
పాదాంశ నియమోదితాః
అపాద నియమాశ్చోక్తాః
గణధా గద్యదండకాః

—ఛందోనుశాసనము 1-23

చండవృష్టి ప్రయాత దండకములు పాదాంశ నియమములతోడను, గద్య దండకములు పాద నియమ రహితమై పెక్కు గణవిన్యాసములతో కూర్పదగునని జయకీర్తి అభిప్రాయము. పెక్కు కన్నడ ఛందోరీతులను పేర్కొనిన జయకీర్తి అభిప్రాయము. పెక్కు కన్నడ ఛందో రీతులను పేర్కొనిన జయకీర్తి కన్నడ దండకములను గూర్చి విశదీకరింపకుండుట చిత్రము.

ఆంధ్రలాక్షణికులెల్లరు దండకలక్షణములను పేర్కొనియున్నారు.

రేచన కవిజనాశ్రయమునందు 'మొదట ననహ (సనహ ?) ములతో తగణము లెన్నైనను గాని లేదా మొదటినుండి తుదివరకు తగణములేగాని చేర్చి చివర గురువుతో నంతమొందించుట దండకలక్షణముగా పేర్కొనియున్నాడు. (ఉద్ధరమాలా వృత్తాధికారము)

దండకలక్షణమును సమగ్రముగా చెప్పినవారిలో విన్నకోటపెద్దన ముఖ్యుడు. అనియత పాదంబులై, వృత్త్యనుప్రాసధుర్యంబులై, ర్యైతలంకార ధుర్యంబులై దండకములుండునని విన్నకోటపెద్దన పేర్కొనెను. మొదట సగణము, నహము తరువాత తగణము లెన్నైనను గాని లేదా మొదటినుండి తుదివరకు తగణములే గాని చేర్చి చివర గురువు నిలుపవలయునని విన్నకోటపెద్దన (8-8) పేర్కొనెను.

చిత్రకవిపెద్దన దండకములను గూర్చి యిట్లు పేర్కొనెను.

'దండక విధములు పెక్కులు
దండిగఁ గలవవి చతుష్పద స్ఫురితములై
యుండెడి వనేక పదముల
నుండెడివిన్ వానివిను సమున్నత చరితా'

—లక్షణసార సంగ్రహము 2-61

పై లక్షణము జయకీర్తి లక్షణముతో సామ్యమొందుట గమనింపదగినది.

అప్పకవి మొదట హగణముగాని నగణముగాని చెప్పి తరువాత తగణము లెన్నైన చేర్చి చివర గురువును పొందుపరచిన దండకమగునని విశదీకరించెను. (4-256) తెలుగు లక్షణపరంపరల వలన తెలియదగు దండకలక్షణ సారమును ఈ విధముగా సంగ్రహింపవచ్చును.

1. తొలుత వరుసగా న న హ గణములు + ఎన్నేనితగణములు + గురువు
2. సనహ గణములు + ఎన్నేని తగణములు + తుదగురువు
3. నన + ఎన్నేని రగణములు
4. నన + ఎన్నేని యగణములు
5. నన + ఎన్నేని తగణములు
6. హగణము + ఎన్నేని తగణములు + తుదనుగురువు
7. నగణము + ఎన్నేనితగణములు + తుదనుగురువు
8. సగణము + ఎన్నేని తగణములు + తుదను గురువు
9. హగణములనే కూర్చుట
10. నగణములనే కూర్చుట
11. సగణములనే కూర్చుట
12. తగణములనే కూర్చుట

తెలుగువాఙ్మయములో నసరలతోడి దండకములు, సనహలతోడి దండకములు, తగణదండకములున్నవి. హగణ, నగణ, సగణ దండకములు కానరావు. దండకములను ఏకపాదముగా గాని, చతుష్పాదముగానేని వ్రాయవచ్చును. నగణద్వయముపై 381 రగణములను, నగణద్వయముపై 383 తగణములను గూర్చి దండకములను వ్రాయవచ్చును. సంస్కృతభాషలో రగణదండకములే కానవచ్చుచుండ తెనుగు

భాషలో తగణదండకములే యెక్కువగానున్నవి. అవియు 'శ్రీ'తో మొదలై నమః'తో ముగియును. సంస్కృతచ్ఛందమునుండి దండకము తెలుగునకు వచ్చినది గాని తెలుగు భాషలో దీనికున్న వ్యాప్తి సంస్కృతమున లేదని చెప్పవచ్చును. సాధారణముగా దండకములు దైవస్తుతిపరములుగా రచితములగును. పై పరిశీలనము వలన సంస్కృత దండకములకంటె తెలుగు దండకలక్షణము విస్తృతము అని చెప్పవచ్చును.

మలయాళ సాహిత్యమున గల దండకములను రెండు విధములుగా వర్గీకరింప వచ్చును. మొదటిది సంస్కృతనియమ మనుసరించినవి రెండవది దేశీయలక్షణ ములు కలవి.

ప్రసిద్ధ మలయాళ ఛందోగ్రంధమగు వృత్తమంజరి యందు చండవృష్టి ప్రయాతము, అర్ణము, అర్ణవము, వ్యాళము, జీమూతము, లీలాకరము, ప్రచితకము, అనంగశేఖరము, సింహవిక్రాంతములను దండకములు తొలుత చెప్పబడినవి. కాని యివి అన్నియు సంస్కృత దండకములే. లక్షణ ప్రవచనమునగాని, లక్ష్యప్రదర్శన మునగాని భేదముకానరాదు.

దేశీయలక్షణములు గల దండకములలో ఇక్షుదండిక, వంశయష్టిక, త్రిఖండికలు ప్రధానములు.

ఇక్షుదండిక నాలుగు పాదములు గల దండకము. కాని ప్రతిపాదమునందును మూడు ఖండములుండును. 1–3 పాదము ఒకవిధముగా 2–4 పాదము ఒక విధముగా నుండుట ఇక్షుదండిక ప్రత్యేకత.

1–3 పాదములలో ప్రథమఖండం – తభల తభల తభల గగ
ద్వితీయ ఖండం – భయ భయ
తృతీయ ఖండం – భనస భనన గగ
2–4 పాదములలో ప్రథమ ఖండం – సజలల సజలల సజలల
ద్వితీయ ఖండం – ననగ ననగ
తృతీయ ఖండం – నననల నననల నననల గగ

ద్వితీయాక్షర ప్రాస ఇక్షుఖండికలో పాటింపబడవలయును. ఇట్టి దండకములు నల చరిత్రమున కలవని రాజరాజవర్మగారు వృత్తమంజరిలో పేర్కొనిరి. పైగణ నిర్మాణ

మనుసరించి మలయాళమున పంచమాత్రాత్మక దండకము లెక్కువ యని చెప్పవలసి యున్నది. తభల - త - పంచమాత్రాత్మకము భల=పంచమాత్రాత్మకమే. తెలుగున గూడ తగణ దండకములే యెక్కువ.

వంశయష్టిక :

ఈ దండకము ఇక్షుదండకమును పోలినదే. వంశయష్టికలో 1, 2 పాదము లొక లక్షణముతో 3, 4 పాదములొక లక్షణముతో నుండవచ్చును. అప్పుడు గణ క్రమము ఈ విధముగా నుండును.

1, 2 పాదములు - ప్రథమ ఖండం  తభల తభల తభల గగ
ద్వితీయ ఖండం  భయ భయ
తృతీయ ఖండం  భనన భనన గగ

3, 4 పాదములు - ప్రథమఖండం  సజలల సజలల సజలల
ద్వితీయ ఖండం  నసగ నసగ
తృతీయ ఖండం  ననలల ననలల ననలల గగ

ఇక్షుదండిక పాదములలో ప్రథమ ఖండమును మాత్రము మార్పుచేయక అటులనేయుంచి ద్వితీయ తృతీయ ఖండములను మార్పుచేయుట వంశయష్టిక దండక విభేదములలో నొకటి అప్పుడు గణక్రమము ఈ విధముగా నుండును.

1, 2 పాదములు - తభల తభల తభల గగ
నసగ నసగ
ననలల ననలల ననలల గగ

పై పేర్కొనిన గణములతో మూడు పాదములు వ్రాసి నాల్గవ పాదమును మాత్రము మార్చి వ్రాసినను వంశయష్టిక యగును. ఇట్టివి "ఇందుమతీ స్వయం వరము" కావ్యములో కలవని శ్రీ రాజరాజవర్మ వృత్త మంజరిలో తెలిపిరి.

దండకములకు నాల్గు పాదములు నియతము కాగా త్రిఖండికా దండకమునకు మూడు పాదములే యుండును.

మొదటి పాదమునగల — తభల తభల తభల గగ
నసగ నసగ
ననల ననల ననల గగ

గణక్రమమునే పాటించి మూడు పాదములు వ్రాయుట త్రిఖండిక.

పై పరిశీలనమువలన కన్నడాంధ్ర దండకముల కంటె మలయాళదండకములు ప్రత్యేకలక్షణములు కలిగినట్లు చెప్పవచ్చును. గణక్రమనిర్దేశమువలన మలయాళ దండకములలో అక్షర సంఖ్యను గూడ చెప్పవచ్చును. మలయాళదండకములలో ప్రయుక్తమగు గణములన్నియు పంచమాత్రాత్మకములు. ఈ యంశమున మాత్రము మలయాళ దండకములు తెలుగుదండకములతో సామ్యమొందుచున్నవని చెప్పవచ్చును.

## దాక్షిణాత్యభాషలలో దండకములవ్యాప్తి

సంస్కృతచ్ఛందోగ్రంథములందు దండకలక్షణములున్నను సాహిత్యములో వీనివ్యాప్తి చాలతక్కువ, మాలతీమాధవ నాటకమున రగణదండకమొకటి కనిపించు చున్నది. సంస్కృతకవులు దండకములను దైవస్తుతికనుగుణమగు ఛందోబంధముగా భావించి నట్లగపడుచున్నది. సంస్కృత దండకములలో శ్యామలాదండకము, గరుడ దండకము, హయగ్రీవదండకము, యతిరాజదండకములు ప్రసిద్ధములు.

తమిళభాషలో 'తాండకమ్' అను పద్యభేదము కలదు. తాండకభేదములు తమిళచ్ఛందోగ్రంథములో గలవు. సంస్కృతదండకమే తమిళతాండకమైయుండును. కాని తమిళగణపద్ధతి విలక్షణమైనది. తమిళ తాండకములు స్తుతిరూపకములు. 27 అక్షరములకు మించినవి 'తాండకమ్' అని యాప్పరుంగల విరుత్తయురై (సూత్రము 95) పేర్కొనుచున్నది. గురువులఘువు చేరివచ్చునవి అళవియల్ తాండకమ్. గురువులఘువులు పొందికలేక వచ్చిన అళవళితాండకమ్. తెరుమంగై ఆళ్వార్ తిరుక్కురున్‌తాండకం, తేవారంలోని ఆఱాంతిరుమలై తాండక కృతులగును.

తెలుగు వాఙ్మయములో దండక రచన అతిప్రచురముగా నున్నది. సాధారణ ముగా ప్రతి పద్యకావ్యమున దండకము గాంచనగును. నన్నయభారతము (1-324-

అరణ్యపర్వము) నృసింహపురాణము (5-111) మార్కండేయపురాణము (6-224) విక్రమార్కచరిత్ర (2-59) శృంగార నైషధము (4-138) కాశీఖండము (7-247-204) హరవిలాసము (6-57) భోజరాజీయము (7-25) వీరభద్ర విజయము (4-179) భాగవతము (3-203; 10-1233) సింహాసన ద్వాత్రింశిక (4-24) మాడయమైరావణచరిత్ర (3-132) మల్లన రాజశేఖరచరిత్ర (2-89) నంది తిమ్మన పారిజాతాపహరణము (3-38) కాళహస్తీశ్వర మహాత్మ్యము (1-146) ఉద్భటారాధ్యచరిత్ర (3-28) పాండురంగమహాత్మ్యము (4-77) ఘటికాచల మాహాత్మ్యము, (ద్వితీయాశ్వాసాంతము) సుదక్షిణాపరిణయము (2-78) కవికర్ణ రసాయనము (6-93) కళాపూర్ణోదయము (1-80) బైచరాజు పంచతంత్రము (1-645) కూచిమంచి తిమ్మకవి రుక్మిణీపరిణయము (4-33) రసికజనమనోభి రామము (4-179) రాజశేఖరవిలాసము (3-149) నీలాసుందరీపరిణయము (2-41) రఘునాథరాయల వాల్మీకి చరిత్రము మొదలగు గ్రంథములందు దండకములు స్తుతి పరములుగా విరచితములై విలసిల్లుచున్నవి.

ఆంధ్రవాఙ్మయములో ప్రత్యేకదండక కృతులు కూడ కలవు. వానిలో బమ్మెర పోతన భోగినీదండకము మొదటిదని చెప్పవచ్చును. పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్ర ననుసరించి మల్లికార్జున పండితారాధ్యుల మౌనిదండకమున్నట్లు తెలియు చున్నది. కాని యది సంస్కృతమో తెలుగుభాషలో రచింపబడిన కృతియో తెలియకున్నది

సంస్కృతములో దండకములు కేవలము స్తుతులకు మాత్రము పరిమితము కాగా ఆంధ్ర దండకములు నవరసానుగుణ్యముగా సాగెనని చెప్పవచ్చును. భోగినీ, విద్యావతీ, చంద్రాననా, దండకములు శృంగార నిబద్ధములు. తిరునాళ్ళ, భాషీయ దండకములు సాంఘికములు. సూకాలమ్మ, పోలేరమ్మ, దండకములు సాంక్రమిక వ్యాధినివారక దేవతా స్తోత్రరూపములు. కాఫి, నల్లి, పొగాకు దండకములు హాస్యా త్మకములు. ద్విపదలందువలె దండకములందును కావ్యములు కొన్ని వెలసినవి. వానిలో శ్రీ కలుగోడు అశ్వత్థనారాయణరావుగారి షట్కాండాత్మక దండక రామాయ ణము సుప్రసిద్ధము.

పై పరిశీలనము వలన తేలిన అంశములను ఈ క్రింది విధముగా సంగ్రహింప వచ్చును.

సంస్కృత దండకములు చతుష్పాద యుక్తములు. ఇట్టివి కన్నడాంధ్ర మలయాళములందు కలవు. కాని పాదనియమము లేని దండకములే ఆంధ్రవాఙ్మయమున ఎక్కువగా కనిపించు చున్నవి.

సంస్కృతములో రగణయుక్త దండకములకు ప్రచారముకాగా తెలుగున తగణ దండకములకు వ్యాప్తి ఎక్కువ.

సంస్కృతములోని దండకములు దేవతాస్తుతికి మాత్రము పరిమితములు. తెలుగునగల దండకములు సాంఘిక జీవన దర్పణములు.

తమిళ కన్నడాంధ్ర దండకములలో లేని ఖండ విభాగము, ప్రాసనియమము మొదలగునవి మలయాళ దండకములలో కలవు.

పై పరిశీలనము వలన మాత్రాగణ నియమ బద్ధములగు దేశీయ రచనలు కొన్ని యతి ప్రాచీన కాలముననే సంస్కృత ప్రాకృతములలోని కెక్కినవనియు, వానిలో కొన్నింటికి మాత్రము లాక్షణికులు మాత్రా సంఖ్యా నియమ పద్ధతిలో అక్షరగణ పద్ధతిలో లక్షణము లేర్పఱచిరని వానిలో దండక మొకటియని చెప్పవచ్చును.

## 6. 2. విశేషజాతులు

కందము, రగడ, ఉత్సాహము, దండకములు మొదలయినవి సామాన్యజాతులు కాగా షట్పదులు, ఏళె, అక్కరలు, ద్విపద ఛందోవతంసములు, త్రిపదులు, సాంగత్యము, సీసము, ఆటవెలది, తేటగీతి మొదలయినవి విశేషజాతులగును. ఇవి యన్నియు దేశిచ్ఛందోరీతులయినను సంస్కృత పద్ధతుల ననుసరించి నియమములు చెప్పుట సామన్యజాతుల లక్షణమై కనిపించును. బ్రహ్మ విష్ణురుద్రగణములు సూర్యేంద్ర చంద్రగణములతో నియమములు చెప్పుట విశేషజాతుల లక్షణము. పైగా సామాన్య జాతులకు ఆయాభాషలలోని ఇతర పద్యగతులతో సంబంధము తక్కువ. కాని విశేషజాతులకు ఆయా భాషలలోని ఇతరపద్యగతులతో సంబంధ మెక్కువ కనిపించును.

విశేషజాతులలో షట్పదులు, త్రిపదులు, సాంగత్యములకు తెలుగులో ప్రచార మంతంత మాత్రమే. అట్లే సీసము, ఆటవెలది తేటగీతులకు కన్నడమున ప్రచారము తక్కువ

6. 2. 1. షట్పదులు :

సంస్కృతములో షట్పదులుగాని షట్పదీ ప్రభేదములు గాని లేవు. ప్రాకృత పైంగళము, వృత్తమౌక్తికాదు లందు షట్పద భేదములు కలవు.

నాగవర్మ షట్పది (5–18) సుకుమార చరితెలో షట్పద (12-51) జయకీర్తి ఛందోను శాసనములో షట్పదికా (7–17) అను పేర్లతో షట్పదులు కనిపించును. తెలుగులో రేచన (జాత్యధికారము) అనంతుడు (3.46) అప్పకవి మొదలయినవారు షట్పదుల లక్షణములను జెప్పిరి. తెలుగులో వీని ప్రచారము చాల తక్కువ. కాని తెలుగుకవులు ఈ పద్యగతి వైశిష్ట్యమును గుర్తించిన వారనుటకు ఈ క్రింది వాక్యములు సాక్ష్యములు.

అలరు మందహాసముల నన్నిన షట్పద మంజుగీతి

– కుమారసంభవము 4-102

కన్నడ కవితా వితానంబునుం బోలె షట్పద వృత్తవిలాస భాసురంబై

– పాండురంగ మాహాత్మ్యము 4-16

వనితామణి యీ చోద్యము
గనుఁగొంటే షట్పదములు గల మంజరు లిం
దు నవీనాగమ దూతిని
ఘన పద్యాన్వితములగుచు గానంబడియెన్

– రామాభ్యుదయము 1-22

షట్పదీలక్షణములు

నాగవర్మ జాత్యాధికారములో షట్పదీ లక్షణముల (5–13) పేర్కొనెను.

మందర ధరగణం
బందిరాక్క యంత్యదోళ్
కుంపిదె నెలసుగె మదనహరం

ఇందు నిజానెనె
ముందణ తెజనుమీ
యందమాదందు షట్పదియెనికుం 5–13

పై లక్షణము మేరకు షట్పది పూర్వార్థములో 6 విష్ణు + 1 రుద్ర గణములు• ఉత్తరార్థములో అట్లే 6 విష్ణు + 1 రుద్ర గణములు రాదగును.

జయకీర్తి ఛందోనుశాసనములో 6స్మరగణములు 1 శరణగణముకలది షట్పదికా (7–17) అని పేర్కొనెను. ఇట్టి గణములతో ఉత్తరార్థమును గూడ చెప్పవలయును. షట్పదికా ఛందమునకు 6 పాదములని సుస్పష్టము చేసినవాడు జయకీర్తి యొక్కడే.

మానసోల్లాస కర్తయగు సోమేశ్వరుడు 3 మన్మథ గణములు 1 బాణగణము కలది షట్పది (4–16–287) అని విశదీకరించెను. ఇదేవిధమున ఉత్తరార్థమును గూడ చెప్పవలయును. ప్రాసయుక్తము, తాళరహితము, అనుప్రాసాత్మకము, కర్ణాటభాషలో ప్రచురమయినవి షట్పదులని సోమేశ్వరుడు చెప్పటచూడగా నానాటికీ షట్పదీ కథా కావ్యము లుండెనేమో అని తలంపవలసియున్నది.

సంగీతరత్నాకరమును విరచించిన శార్ఙ్గదేవుడు 1, 2, 4, 5 పాదములందు 2 మన్మథగణములును, 3, 6 పాదములందు 3 మన్మథ 1 కరగణములుండుట షట్పదీ లక్షణముగా పేర్కొనెను. శార్ఙ్గదేవుడు తాళవర్జితము, కర్ణాటభాషకు ప్రత్యేకమగు ఛందోవిధానముగా షట్పదులను భావించియున్నాడు. (4–272)

పై పరిశీలనమువలన కన్నడ లాక్షణికులు షట్పదులు అంశగణములతో కూర్పవలయునని తలంచినట్లున్నది. కాని తరువాతివారగు ఈశ్వరకవి, గుణచంద్ర, వీరభద్రులు మాత్రల కనువగు షట్పదులను పేర్కొనిరి. నాగవర్మ కేవలమొక షట్పదిని (మూల షట్పదిని) పేర్కొనగా తదితరులు శర – కుసుమ – భామిని – పరివర్ధినీ – వార్ధకషట్పదులను గూడ నిర్వచించిరి.

ఆంధ్రభాషలో షట్పదులులేవు. కాని లాక్షణికులు షట్పదిలక్షణములను విశదీకరించియున్నారు. రేచన కవిజనాశ్రయమున షట్పదీలక్షణము నిట్లు పేర్కొనెను.

త్రిదశేంద్ర గణములు వెలయ నిర్ మూడిడి
నియ నంత్యంబునఁ జంద్రుఁగూర్చి

తుద యిట్లుగా మఱిఁ జెప్పినదియ ష
ట్పదమగు మల్లియ రేచనాఖ్య

—జాత్యధికారము

రేచన షట్పది గణములను పేర్కొనెను గావి పాద సంఖ్యను చెప్పలేదు. కాని అనంతుడు ఛందో దర్పణములో షట్పదికి ఆరుపాదములని యిట్లు స్పష్టపఱచి యున్నాడు.

మెఱయంగ సిద్ధజీ
ద్ధఱు సురేంద్రులు మూఁడు
తెఱఁగులన్ శశిగూడ నర్థంబులన్
నెఱి గ్రాలగా వళ్ళు
దొఱుగ షట్పద రీతి
వఱలుఁ జక్రిపదాబ్జ వర్ణనంబు.

—ఛందోదర్పణము 3-46

అప్పకవి షట్పదికి నాలుగు పాదములనుట (4-289) సరికాదు.

**పై పరిశీలనము వలన తేలిన అంశములు :**

కన్నడాంధ్రములలో షట్పదు లున్నను గన్నడ భాషలో దానికి ప్రచార మెక్కువ. అంశగణాన్విత షట్పదులే ప్రాచీనకాలము నందుండెననుటకు కన్నడాంధ్ర లాక్షణికుల వ్రాతలు ఆధారములు. కన్నడములో షట్పదీ ప్రభేదములున్నవి. తెలుగు లాక్షణికు లెవరును షట్పదీ ప్రభేదములను పేర్కొనలేదు. అంశగణాన్విత షట్పది మాత్రా షట్పదిగా మారెనని తలంపవలసి యున్నది.

ఇక షట్పదీ ప్రభేదముల నరయుదము.

## షట్పదీ ప్రభేదములు :

నాగవర్మ ఛందోంబుధిలో ఒక షట్పదికి మాత్రము లక్షణము గావించెను. కాని కొన్ని ప్రతులలో ఇతర షట్పదుల లక్షణములు కూడ కనిపించును. అవి యన్నియు ప్రక్షిప్తములని కన్నడ పండితులు అభిప్రాయము. కాని తరువాతి లాక్షణికులగు అభినవ కేశిరాజు, గుణచంద్రుడు, నంది ప్రభృతులు ఆరు షట్పదులను

పేర్కొనిరి. శ్రీ పత్తేదగారు కన్నడములో తల, జల, శర, విషమ, కుసుమ, భోగ, భామిని, పరివర్ధిని, ప్రౌఢ, వార్ధక షట్పదులను పది భేదములను తెలిపిరి. శ్రీ కె. జి. కుందణగారు మాత్రల పరిమితి ననుసరించి కన్నడములో ఏడు షట్పదులు కలవని నిరూపించిరి. శ్రీ గోవిందపైగారు సంస్కృతములోగల సమ విషమ వృత్తభేదముల ననుసరించి పెక్కు షట్పదులను సృష్టింపవచ్చునని పేర్కొనిరి. అయినను కన్నడములో శర - కుసుమ - భోగ - భామిని - పరివర్ధిని - వార్ధక షట్పదులే ప్రసిద్ధములగును.

## శరషట్పది

నాగవర్మ ఛందోంబుధిలో పేర్కొన్నది శరషట్పది.

| | |
|---|---|
| మందర ధరగణ | 4 + 4 |
| మొంబిదె కడె యొళ్ | 4 + 4 |
| కుందదె నెలసుగె మదనహరం | 4 + 4 + 4 + 2 |

(5-257)

పై షట్పదిని గణక్రమమున చెప్పవలయునన్న 6 విష్ణు గణములు 1 రుద్రగణము కలది శరషట్పది.

కన్నడ సాహిత్యములో సాంతశర షట్పదీకావ్యములు కానరావు. అన్నివిధ ములగు షట్పదులను ప్రయోగించిన కుముదేందు రామాయణములో శరషట్పదులును గలవు. దాసరసాహిత్యమునకు శరషట్పదులు కలవు.

| | |
|---|---|
| యాదవ నీబా | 4 4 |
| యదుకుల నందన | 4 4 |
| మాధవ మధుసూదన బా | 4 4 4 |

— పురందరదాసపదగళు 14

చిన్నపాదములగుట, ఆదిప్రాసనియతమగుట వలన భావపరిపూర్ణతకు అవకాశము తక్కువ. మధురగతిరగడ కూడ చతుర్మాత్రాగణములతో కూడినదే. కాని రగడ తాళయుక్తము. షట్పది తాళరహితము.

కుసుమషట్పది

కన్నడిగుడగు జయకీర్తి ఛందోనుశాసనములో షట్పదికా అను పేరుతో చెప్పిన శ్లోకము కుసుమషట్పదియే.

స్మరగణః పరితోऽత్ర 5 5
శరగణః పరిషష్ఠ 5 5
చరణాంత యో స్తదంతే విరామః 5 5 5 2
ఛందోనుశాసనము 7-17

ఈశ్వరకవి (4-28) గుణచంద్రులు (2-6) కుసుమషట్పదికి వరుసగా 5-5; 5-5; 5-5-5-2 మాత్రలను పేర్కొనిరి. కాని వీరభద్రుడు నంది ఛందోర్ణవము నందు (3-26) 5-5: 5-5: 5, 5, 5 మాత్రలు గలది కుసుమషట్పదిగా పేర్కొనెను. మూడవ (ఆరవ) పాదమునందు 17 మాత్రలుండవలయును.

శరషట్పదికింబలె కుసుమ షట్పదికిని కన్నడ సాహిత్యమున ప్రచారము తక్కువ. సొంత కుసుమ షట్పదులతో వ్రాయబడిన కావ్యము గురుబసవ మనో విజయము. కుముదేందు రామాయణములో నితరషట్పదులతోబాటు కుసుమషట్పదులు గూడ వ్రాయబడినవి. అట్లే దాసర సాహిత్యమున కుసుమ షట్పదులు గలవు.

కుసుమ షట్పదికిని ద్విరదగతి రగడకు సామ్యమున్నది. రెంటను పంచ మాత్రాత్మక గణసంయోజనమున్నది. రగడ తాళయుక్తము. షట్పది తాళరహితము. కుసుమ షట్పదీ సీసములకు సామ్యము చెప్పవచ్చును. కుసుమ షట్పదిలో రెండు సీస పాదములున్నవి. కన్నడములోని ప్రసిద్ధ షట్పది.

ఎంటెసళ కమలదా
నవబ్రహ్మ పురదొళగె
ఎంటుబీది యొళెంటు కరిగళుంటు

1 2 3 4 5
ఎండాసళ కమలదా నవబ్రహ్మ పురదొళగె ఎంటుబీ
6 7 8
దియొళెంటు కరిగ ళుంటు

పై పద్యపాదములో మొదటి గణము తప్ప తక్కిన గణము లన్నియు సీసపద్య గణములే. పంచమాత్రాత్మకమగు నగ, సల, ర, త గణములు షట్పదిలో నుంచిన సీసమగును.

## భోగషట్పది

ఈశ్వరకవి కవిజిహ్వాబంధనమున భోగషట్పదికి (4-29) కట్లు గణక్రమము పేర్కొనియున్నాడు.

ప్రథమ పాదము 3 3 3 3 (12 మాత్రలు)
ద్వితీయ పాదము 3 3 3 3 (12 మాత్రలు)
తృతీయ పాదము 3 3 3 3 3 3 + 1 గురువు = 20

గుణచంద్రుడు ఛందస్సారములో (2-7) భోగషట్పదికి మాత్రల సంఖ్య పేర్కొని ఐదు మాత్రల గణములు రారాదనియు, త్రిమాత్రాగణములు శ్రేష్ఠమనియు పేర్కొనెను. వీరభద్రుడు నంది ఛందోర్ణవమునందు భోగషట్పదికి (3-27) వరుసగా 12-12-18 మాత్రలను పేర్కొనెను. కాని లక్ష్యమునందు మూడవ పాదమున 20 మాత్రలు గలవు. ఇదియ సరియైనది. త్రిమాత్రాగణములు సమాన లయను భాసింపజేయును. కనుక భోగషట్పదికి వ్యాప్తి తక్కువ. 'వృషభగీత' మొదలగు కథాకావ్యములందు భోగషట్పదులు కనిపించుచున్నవి. శరణసాహిత్యములో భోగషట్పదులు గలవు.

3 3 3 3
ముట్టి దల్లి ముట్టి దల్లి
3 3 3 3
తొట్టు బిట్టె హణ్ణి నంతె
3 3 3 3 3 3 2
బట్ట బయల తుట్ట తుదియ మెట్టి నింతను (నూ)

— చెన్నబసవసాహిత్య 1165

మరొక ఉదాహరణ — శమద మాడి గుణవి శిష్ట
విమల చిత్తె పుష్ట నష్ట
మమతె హీన దుఃఖ సుఖ స మాన వాగి యే
— వృషభగీతె

## భామినీషట్పది :

షట్పదులలో శరషట్పది చాల చిన్నది. వార్ధక షట్పది దీర్ఘపాదములు కలది. కాని భామినీషట్పది మధ్యవర్గమునకు చెందినది. భావవ్యక్తీకరణకు, లయసాధనకు భామినీషట్పదులు సమర్థములు. కనుక కన్నడకావ్యములందు నిద్దానికి ప్రచార మెక్కువ. నారాయణప్ప రచించిన కుమారవ్యాసభారతము, కుమారవాల్మీకి రచించిన తొరవె రామాయణము, చాటువిట్ఠలుని భాగవతము భామినీషట్పదులలో వ్రాయబడినవే.

ఈశ్వరకవి కవిజిహ్వాబంధనము (4-30) గుణచంద్రుడు ఛందస్సారము (2-8) వీరభద్రుడు నంది ఛందోర్ణవములలో భామినీషట్పదులకు లక్షణములు తెలిపిరి భామినీషట్పది గణక్రమమిట్లుండును.

ప్రథమపాదము — 7-7 (3-4-3-4)
ద్వితీయపాదము 7-7 (=3.4-3-4)
తృతీయాపాదము 7-7-7- గురువు)
(= 3-4-3-4-3-4 + గు × 2)

ఇందు ఐదుమాత్రల గణము రారాదని గుణచంద్రుడు పేర్కొనెను.

## పరివర్ధినీ షట్పది :

ఈశ్వరకవి కవిజిహ్వా బంధనము (4-31) గుణచంద్రుడు ఛందస్సారము (2-9) వీరభద్రుడు నంది ఛందోర్ణవము (3—29)లందు పరివర్ధినీషట్పది లక్షములను పేర్కొనిరి. పరివర్ధిని షట్పది గణక్రమ మిట్లుండును.

16 = (4-4-4-4)
16 = (4-4-4-4)
26 = (4-4-4-4-4-4 గురు × 2

ఈ షట్పదీ ప్రభేదమునందు ఐదు మాత్రల గణము రారాదనియు, నియతముగా నాలుగు మాత్రల గణములు రావలయునని గుణచంద్రుడు పేర్కొనెను. శరషట్పదికి పరివర్ధినీ షట్పది రెట్టింపు కాగలదు. జయనృప కావ్యము సొంత పరివర్ధినీ షట్పదీ కావ్యమగును. చతుర్మాత్రాగణ సంయోజనమున తీవ్రగతి వ్యక్తమగుటవలన ఈ ప్రభేదమునకు ప్రచారము తక్కువ.

## వార్ధక షట్పది :

లాక్షణికులు పేర్కొన్న షట్పదులలో చివరిది వార్ధక షట్పది. ఈ షట్పది పాదములు దీర్ఘము లగుటవలన వార్ధకనామము సార్థకము. అంతియగాక సంగీత గ్రంథములందు పంచమాత్రాలయ తాళమునకు వర్ధన, వర్ధమానమను పేర్లు గానవచ్చుచున్నవి.

ఈశ్వరకవి కవిజిహ్వా బంధనము (4-32) గుణచంద్రుడు ఛందస్సారము (2-10) వీరభద్రుడు నంది ఛందోర్ణవము (3-30) లందు వార్ధకషట్పది లక్షణములను పేర్కొనిరి. వార్ధక షట్పది గణ క్రమ మిట్లుండును.

| | | | | |
|---|---|---|---|---|
| 20 | 5 | 5 | 5 | 5 |
| 20 | 5 | 5 | 5 | 5 |
| 22 | 5 | 5 | 5 | 5 + 1 గురువు × 2 |

జైమినీ భారతము, హరిశ్చంద్రకావ్యము, చెన్నబసవ పురాణములు వార్ధక షట్పదిలో విరచితములగు ప్రసిద్ధ గ్రంథములు. ప్రాచీనకావ్యములందు కనిపించు షట్పదీ ప్రభేదములలో 'ఉద్దండ షట్పది' యొకటి. లాక్షణికులెవరును 'ఉద్దండ షట్పది'ని పేర్కొనలేదు. మంగరస కవి సమ్యక్త్వకౌముదిలో, తిరుమలభట్టకవి శివగీతెలో, సాళ్వకవి భారతములో, చిక్కనంజేశకవి రాఘవాంకచరితెలో తాము ఉద్దండషట్పదులలో రచన సాగించునట్లు ప్రకటించుకొనిరి. కాని యా షట్పదులన్నియు వార్ధకషట్పదులే. కనుక వార్ధకషట్పదులే కనుక వార్ధక షట్పదులకే ఉద్దండ షట్పదులను పేరుండెనేమో యని యూహింపవలసియున్నది. కాని రాఘవాంకుని వీరేశచరితలోని షట్పదులు వార్ధకషట్పది లక్షణముల కిముడవు. ఉద్దండ షట్పదులను గూర్చి బహుముఖ పరిశ్రమ గావించిన శ్రీ సీతారామ జాగీర్దార్‌గారు ఉద్దండషట్పదు

లలో షణ్మాత్రాలయను గమనింపవలయునని పేర్కొనిరి. 26 అనగా 20 మాత్రలు గల వార్ధక షట్పదిలో 5+5+5+5 మాత్రాగణములుగాక 6+6+6+2 మాత్రాగణ విభజనము గావింపవలయునని శ్రీ జాగీర్దార్‌గారి అభిప్రాయము. రచన పూర్ణమగు నడక ననుసరించి యుద్దండమగుటవలన ఉద్దండ షట్పది నామము సార్థక మని శ్రీ జాగీర్దార్‌గారు అభిప్రాయపడిరి.

ఉదాహరణమునకు—

ఖళదక్షన హెడగుడియను దిగధీశర ముం
దలెయను మునిగళగ డ్డంగళనమ రరహెడ
తలె యనుయజ్ఞన కుడుగెయ్యను సతియరసెఱ
యనుహిడిదలి నడెసుత్త                2-49 (వీరేశచరితె)

శాసన షట్పదులు

కన్నడ శాసన వాఙ్మయములో షట్పదులు కూడ కలవు. డా॥ కలబుర్గిగారు త్రిపది, పిరియక్కరెల తరువాత చాల ఎక్కువగా కనిపించు పద్యజాతులలో షట్పదులు కూడ నొకటి యని శాసనవ్యాసంగలో (పుట 86) తెలియజేసిరి. క్రీ.శ. 1067-1141 వఱకు మధ్యగల కన్నడ శాసనములలో 7 షట్పదులున్నవి.

సంస్కృతములో షట్పదీగతులు

సంస్కృతములో షట్పదులు లేవు. షట్పదీ ప్రభేదములును కానరావు. కాని స్తోత్ర వాఙ్మయములో మాత్రము షట్పదీగతులు గల పెక్కు శ్లోకములు కనిపించును. ఉదాహరణమునకు ఆదిశంకరుల భజగోవింద స్తోత్రము.

| | |
|---|---|
| భజగోవిందం | 4 4 |
| భజగోవిందం | 4 4 |
| భజగోవిందం మూఢమతే | 4 4 3, 3 |

కన్నడ లక్షణ మనుసరించి పై శ్లోక పాదములు శరషట్పదీ పాదములగును. జయదేవుని అష్టపదులందును శరకుసుమాదీ షట్పదులున్నవి.

| | | | |
|---|---|---|---|
| పశ్యతి దిశిదిః | 4 | 4 | |
| రహసి భ వంతః | 4 | 4 | |
| తదధర మధురమ ధూనిపి బం తం | 4 | 4 | 4 |

రావణకృత శివతాండవ స్తోత్రమునందును షట్పదీ గతులు ప్రతిభాసించుచున్నవి. ఉదాహరణమునకు—

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| జటా కచా హసం భ్రమ | 3 | 3 | 3 | 3 | | |
| భ్రమ న్నిలింప నిర్ఝరీ | 3 | 3 | 3 | 3 | | |
| విలో లవీచి వల్లరీ విరాజమాన (మూర్ధని) | 3 | 3 | 3 | 3 | 3 | 3 |

పై శ్లోకమున భోగషట్పదీ గతులున్నవి. ఇట్లే సుప్రసిద్ధమైన అన్నపూర్ణాస్తోత్రము భామినీ షట్పదిని పోలినది.

అన్నపూర్ణే సదా పూర్ణే 7+7
శంకర ప్రాణ వల్లభే
జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం దేహిచ పార్వతే

ప్రసిద్ధ మంత్రమగు

"సర్వతీర్థాత్మికే సర్వ మంత్రాత్మికే
సర్వతంత్రాత్మికే సర్వయంత్రాత్మికే
సర్వ పీఠాత్మికే సర్వ తత్వాత్మికే" అనునది వార్ధక షట్పది.

పై పరిశీలనము వలన కన్నడములో మాత్రమే షట్పదులకు ప్రచారమెక్కువ యనియు, అంశ గణాన్విత షట్పదులు క్రమముగా మాత్రాగణాన్వితము లయ్యె ననియు, భామినీ వార్ధక షట్పదులకే అత్యంత ప్రచారమనియు చెప్పవచ్చును.

### 6. 2. 2. ఏళె ఏలలు

ద్రావిడ భాషలలో ప్రసిద్ధమై సంస్కృతఛందో గ్రంథములకెక్కిన పద్య జాతులలో 'ఏళె' ఒకటి.

'ఏళె' అను పేరు వచ్చుటకు పండితులనేక కారణముల నూహించుచున్నారు. డా॥ కర్కిగారు

ఏళె అను పద్యగతికి ఏడుగణములు. కన్నడములలో 'ఏళు' అనగా ఏడు అర్థము. గణసంఖ్య బట్టి ఏళె అను పేరు స్థిరపడి యుండవచ్చునని భావించిరి.[27]

౨౦. వి. సీతారామయ్యగారు

"తమిళములో యాళ్ అనే వాద్యవిశేషముంది. ఆ 'యాళ్' శబ్ద పూర్వరూపం 'ఏళ్'. ఈ వాద్యము తమిళకన్నడ ప్రాంతములో నుండి యుండవచ్చు. ఆ 'ఏళ్' వాద్యధ్వని కనుగుణముగా పాడు పద్యగతి 'ఏళె'. ఈ ఏళె ఏళు అయియుండ వచ్చు"నని తలచిరి.[28]

సంస్కృతములో ఏలాప్రబంధములున్నవి. ఈ ఏలా శబ్దభవమే ఏళె కావచ్చు మరియు తుళుభాషలో ఏడు పదములతో కూడిన ఛందోవిభేదమున్నది. ఈ ఛందః ప్రభేదము చివర ఏలే, ఏలేలే వంటివి చేరుట కలదు. పైగా కన్నడాంధ్ర పద సాహిత్యములో యాల పదములున్నవి. ఏళె ఛందములో చివరిపదము సుబోధ నాత్మకముగా నుండవలయునని నియమము. తెలుగు ఏలపదములలో 'ఓసింగి – ఓగురు' వంటివి విరివిగా కనిపించును. కన్నడ జానపద సాహిత్యములో ఏలేలేలే, ఎల్లలాం, లీలాం, లోలీ, లాలీ మొదలగునవి కనిపించుచున్నవి. లాలి, లోలి, జాలం లోల, ఓలి మొదలగు వానియందు లకారమున్నది. ఏకారము పునరావృతమయిన ప్పుడు లకారము చేరుట సహజము. పైగా తమిళములో కూడ 'ఏలప్పాట్టు' కలదు.

పై వివరణవలన 'ఏళె' అను పేరు స్థిరపడుటకు గణనియమమో, పాదాంత సంబోధనమో కారణము కావచ్చును.

## ఇతరగ్రంథములలో ఏలలు

సోమేశ్వరుడు మానసోల్లాసనమునందు హంసవతీ, నాదవతీ, భద్రావతీ, రతి లేఖా, కామలేఖా, బాణలేఖా, చంద్రలేఖా. శశిలేఖా ప్రభావతీ ఏలా. భోగవతీ, కుసుమావతీ మొదలగు మాత్రాగణ ఏలలను పేర్కొనెను. కాని వానికి కన్నడ ఏళెలలకు సంబంధము కనిపింపదని శ్రీ డి.ఎల్. నరసింహాచార్యులవారు భావించిరి.[29]

శార్ఙ్గదేవుడు సంగీతరత్నాకరములో ౩౫౬ ఏలా భేదములను పేర్కొనెను.[30] మతంగుడు ఏలాభేదములు భాషాభేదము ననుసరించి యేర్పడునని స్పష్టము చేసెను.[31]

## లక్షణగ్రంథములలో ఏలలు

నాగవర్మ త్రిపదులకు లక్షణము చెప్పిన పిదప ఏళెలకు నియమముల తెలిపెను.

భుజపక్ష పుర.గణ వ్రజదోళా జతొళక్కు
మజగణ మేళె గిభగతీ — ఛందోంబుధి 5-13

పై పద్యమనుసరించి ఆరవగణము బ్రహ్మగణమని తెలియుచున్నది. కనుక ఇతర గణములు విష్ణుగణములని యూహింపవలసియున్నది.

జయకీర్తి ఛందోనుశాసనములో ఏళలను ప్రస్తావించెను.

త్రిపదీ తృతీయాంఘ్రా వపముంచ త్యేలేతి
సుపఠితా గేయ విదజనైః
—ఛందోను శాసనము - 7-14

త్రిపదిలో మూడవ పాదమును పరిత్యజింప 'ఏళె' యగునని జయకీర్తి అభిప్రాయము. 'గేయవిద జనైః' అను మాట వలన ఏలలలో సంగీత ధర్మమెక్కువ యని అభిప్రాయము.

పై లక్షణములను క్రోడీకరింపగా 'ఏళెల' లక్షణము నిట్లు చెప్పవచ్చును.

1. ఏళె మూడు పాదముల ఛందస్సు. కాని వ్రాతలో రెండు పాదములుగా వ్రాయుట సంప్రదాయము.
2. మొదటి పాదములో 4 విష్ణుగణములు మూడవ విష్ణుగణాద్యక్షరమున యతి కలదు.
3. రెండవ పాదములో 6వ గణము బ్రహ్మగణము. 7వ గణము విష్ణుగణము.
4. విష్ణుగణములకు బదులు బ్రహ్మరుద్ర గణములో, బ్రహ్మగణములకు బదులు విష్ణురుద్ర గణముతో రాదగును.
5. గేయ ధర్మమువలన గణవిపర్యయము సహజము.

## ఏళె - దాని వ్యాప్తి

కన్నడాంధ్ర శాసనములలో ఏళెలు లేవు. జానపద సాహిత్యములో ఏళె లున్నవి. తెలుగు సాహిత్యములో 12వ శతాబ్దినాటికే ఏలలున్నట్లు పాల్కురికి సోమన

'ఏలలు పెట్టి పాడెడి 'వారను వాక్యము బట్టి తెలియుచున్నది. పైగా కందుకూరి రుద్ర కవి (14వ శ॥) సుగ్రీవ విజయ యక్షగానములో ఏలలున్నవి. కన్నడ యక్షగానము లందును ఏళెలు కలవు

శ్రీ గి రియసు క్షేత్ర కిందు
హోగి యాత్రె మాడి బందె
శ్రీ గి రియుళ రీర ధొళగుంటు – ఓ శ్రీ గురు సిద్ధ
యోగి జనర మర్గ బేరుంటు

—కైవల్య కల్పవల్లరి.

సూర్య చంద్ర వహ్ని నడుమ
శౌర్య మానే చిలుక గంటి
సూర్య దీప్తి కాయు చుండగా – ఓ పగంటి లింగ
చూడ చూడాశ్చర్యమా యెగా

—యాగంటి పదములు

పై లక్ష్యముల ననుసరించి ఏళెల లక్షణమిట్లు చెప్పవచ్చును.

1. నాలుగు త్రిమాత్రాగణములు కలిగిన రెండు పాదములు.
2. నాలుగు త్రిమాత్రాగణములు 1 గురుయు గల రెండు పాదములు.
3. మూడవ పాదమునకు నాల్గవ పాదమునకు మధ్య ఒక సంబోధన.

## ఏళె – ఇతర దేశిచ్ఛందస్సులు :

శ్రీ కుక్కుల కృష్ణభట్టరుగారు 'ఏలె' దేశీయ ఛందస్సులకు మూలముగా భావించిరి.[32]

## ఏళె – త్రిపది :

త్రిపది మూడవ పాదమును తొలగించిన ఏళె యగును. ఆయకీర్తి సూచన అనుసరించి ఏళెకు త్రిపదికి సామ్యము సరిపోవును.

## ఏళె - సాంగత్య :

రెండు ఏలా పదనులు కలిసిన సాంగత్యమగును.

ఏళెకు మూడు పాదములున్నచో మొదటి పాదమున 2 విష్ణు గణములు' రెండవ పాదమున 2 విష్ణుగణములు మూడవ పాదమున 2 విష్ణు 1 బ్రహ్మ గణము లుండుట లక్షణము.

వి వి వి వి
ముత్తిన చావడి యొళమణి పీఠది
వి వి బ్ర
చిత్తజ రూపుకు శ్వరలు
వి వి వి వి
చిత్తదా కానంద మొదవెకా ణికెగళ
వి వి బ్ర
నిత్తుకె గళనెత్తి ముగిదు

నాగకుమార చరితం - సంధి 11-పద్య 94

## ఏళె - షట్పది :

రెండు ఏళెల చేరిక షట్పది. నాగవర్మ షట్పదులను అంశగణాన్వితముగా చెప్పుట వలన క్రింది షట్పదిని ఏళెలుగా నిరూపింపవచ్చును.

పోగంప నుండుండః వి వి
రాగిప భ్రమరగళ్ వి వి
తేగువ సోగెసో క్కేరి వి వి బ్ర

—భైరవేశ్వరకావ్య 2-4

దేశియ గణవిన్యాసము, గేయధర్మ ముండుట వలనను, జానపద సాహిత్య ప్రచారము వలనను, ఏళె దేశిచ్ఛందమని నిరూపింపవచ్చును.

## 6-2-3 అక్కరలు

ప్రాచీన కన్నడాంధ్ర సారస్వతములందు బహుళ ప్రచార మొందినవై తరు

నాటి కాలమున ప్రాముఖ్యమును గోల్పోయిన ఛందోరీతులలో అక్కరలు పేర్కొన దగినవి.

అక్షరశబ్దమునకు కన్నడ వైకృతము అక్కరె. కనుక కన్నడ లాక్షణికులు దేశ్యపదములగు పిరి – దొరె – నడువణ – ఎడె – కిరి మొదలగు వానితో అక్కర శబ్దమును సమసింపజేసి పిరియక్కర దొరెయక్కర మొదలగు పేర్లతో వ్యవహరించిరి.

ఆంధ్రలాక్షణికులు అక్కర అక్కరము అని పేర్కొనిరి. తెలుగులో మహాక్కర, మధ్యాక్కరలనునవి మిశ్రసమాసములగును.

కన్నడాంధ్ర లాక్షణికులు ఐదువిధములగు అక్కరలను పేర్కొనియున్నారు. పేర్లు వేరైనను లక్షణ మించుమించు సమానమే.

| కన్నడము | ఆంధ్రము |
|---|---|
| పిరియక్కర | మహాక్కర |
| దొరెయక్కర | మధ్యాక్కర |
| నడువణక్కర | మధురాక్కర |
| ఎడెయక్కర | అంతరాక్కర |
| కిఱియక్కర | అల్పాక్కర |

## 1. పిరియక్కర – మహాక్కర

అక్కరలయందన్నిటను దీర్ఘమగుటవలన ఈ పేరు సమంజసము.

నాగవర్మ ఛందోంబుధి యందు 'పిరియక్కర'కు (5-4)లక్షణము పేర్కొని యున్నాడు. పిరియక్కరకు నాలుగు పాదములు. పాదమునకు వరుసగా బ్ర-వి-వి-వి-వి-వి-రుద్రగణములుండును. రెండు, నాల్గు గణ స్థానములలో విష్ణుగణము లకు బదులు బ్రహ్మగణములు రాదగును. ప్రాసనియతము.

జయకీర్తి ఛందోనుశాసనమునందు మహాక్షరమను పేరుతో 'పిరియక్కర' లక్షణము (7-8) పేర్కొనెను. అతని లక్షణ మనుసరించి పిరియక్కర పాదము లందు వరుసగా 6 విష్ణుగణములు 1 రుద్రగణము రాదగునని చెప్పవచ్చును. ప్రతి పాదము ప్రతిగణాంతమున యతి యుండవలయునని జయకీర్తి లక్షణము.

ప్రయోగ దృష్టితో పరిశీలింప నాగవర్మ జయకీర్తుల నియమములు పట్టని పిరియక్కరలు కన్నడములో పెక్కు కలవు. కన్నడమునగల పిరియక్కరల గణ విన్యాసమును తొమ్మిది విధములుగా వర్గీకరింప వచ్చును.33

1) 1 బ్రహ్మ 5 విష్ణు 1 రుద్రగణము
2) రెండవ గణము బ్రహ్మగణ మగుట
3) నాల్గవ గణము బ్రహ్మగణమగుట
4) రెండవ, మూడవ గణములు బ్రహ్మగణములగుట
5) మూడవ, నాల్గవ గణములు బ్రహ్మగణములగుట
6) రెండవ, నాల్గవ గణములు బ్రహ్మగణములగుట
7) ఐదవ గణము బ్రహ్మగణమగుట
8) ఆరవ గణము బ్రహ్మగణమగుట
9) మొదటి గణము విష్ణుగణమై వచ్చుట

ఆంధ్రఛందోగ్రంథముల ననుసరించి మహాక్కర పాదమునకు 1 సూర్య 5 ఇంద్ర 1 చంద్రగణములుండుట లక్షణముగా పేర్కొనవచ్చును కాని కావ్యాలంకార చూడామణియందు విన్నకోట పెద్దన

"ఆరయ రెండవ నాలవచోట్ల నర్క డయిననుం దనర్చుచుండు" (8-53) అని పేర్కొనుటవలన 2, 4 గణములు సూర్యగణములు గావచ్చునని చెప్పవచ్చును. పై అభిప్రాయమునే చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహమున "చేరునాలవచోట రెండవచోట చిత్రభానుగణంబు" (2-103) అని విశదపఱచి యున్నాడు. అనంతుడు మహాక్కర లక్షణమును ఇట్లు పేర్కొనియున్నాడు.

ఆదివారమాదిగ నను్రకమమున నన్ని వాసరముల నొక్కనుండు
నాదితేయాధి నాథులేగురు నలరారంగ నొక్కసుధాకరుండు
నాది హరి గొల్వ రెండును నాలుగునగు వాసరంబున నర్కుడైన
నాదరంబున నెడసొచ్చునని మహాక్కరం బలుకుదురార్యులెల్ల
— ఛందోదర్పణము 3-40

పై పద్యములో 'రెండును నాలుగునగు' అనుటకు రెండు నాలుగు పాదములు కావ

చ్చును. లేదా 2, 4 గణములు సూర్యగణములేని కావచ్చును.

పై పరిశీలనమువలన కన్నడమున గల 1-2-3-6-9 భేదములు ఆంధ్రము నందును గలవని నిర్ధారింప వచ్చును.

## మహాక్కర - ఇతర దేశిచ్ఛందస్సులతో గల సామ్యము

మహాక్కర పద్యమునకు త్రిపది, షట్పది, సీసపద్యములకు సామ్యములున్నవి. వానిని క్రమముగా పరిశీలింతము.

## పిరియక్కర - త్రిపది :

పిరియక్కర పాదమునకు 6 విష్ణుగణములు 1 రుద్రగణము చేర్చుట లక్షణము. ఈ దృష్టితో క్రింది త్రిపదీ పాదములను పరిశీలింతము.

వి వి వి వి
నంబిద మనుజగె కంబవె దేవరు
వి వి రు
నంబద నరగె దేవరె బందరు
కంబవె కాణె సరసియె

పై పరిశీలనము వలన రెండు త్రిపదీ పాదములొక పిరియక్కర పాదమగునని నిర్ణ యింప వచ్చును.

## పిరియక్కర - షట్పది :

షట్పదికి ఆరుపాదములు. షట్పది గణ విన్యాస మిట్లుండును.

వి వి
వి వి
వి వి రు × 2

పిరియక్కర పాదమునకు 6 విష్ణు 1 రుద్రగణము చేరుట లక్షణము కాగా రెండు పిరియక్కర పాదములు ఒక షట్పది యగునని నిర్ణయింపవచ్చును.

## పిరియక్కర - సీసము :

సీసపద్యమునకు 6 ఇంద్రగణములు, 2 సూర్యగణములుండుట లక్షణము. రెండు సూర్యగణము లొక చంద్రగణమున అంతర్భవించును. కనుక 6 ఇంద్ర (విష్ణు) 1 చంద్ర (రుద్ర) గణ నియమము సీసమునకు సరిపోవును. కన్నడ లాక్షణికులు పిరియక్కరలను పేర్కొనిరి గాని సీసములకు ప్రాధాన్య మొసగలేదు. కన్నడమున పిరియక్కరలకు, తెలుగున సీసపద్యములకు వ్యాప్తి ఎక్కువ.

## శాసనములలో అక్కరలు :

కన్నడ శాసనములలో త్రిపదుల పిదప విస్తారముగ కనిపించు పద్యము అక్కర. లాక్షణికులు ఐదు విధములగు అక్కరలను పేర్కొనినను కన్నడ శాసన వాఙ్మయములో 'పిరియక్కర మాత్రము కనిపించును. క్రీ. శ. 982-1179 మధ్య లభ్యములయిన ప్రాచీన శాసనములో 20 పిరియక్కరలున్నట్లు డా॥ కలబుర్గి గారు పేర్కొనిరి.34 వీనిలో 12 శ్రవణ బెళగోళలో లభ్యము. వీనియందన్నిట అక్కరం లేదా అక్కర అను పేర్లు కలవు.

ఆంధ్ర శాసన వాఙ్మయమునందును అక్కరలున్నవి. యుద్ధమల్లుని బెజవాడ శాసనములో (క్రీ. శ. 885...930) మధ్యాక్కరలున్నవి. ఇవిగాక వెంకయ చోడుని దొంగల సాని శిలా శాసనములందు మహాక్కర లున్నట్లు శ్రీ దేవర వెంకట కృష్ణారెడ్డిగారు పేర్కొనిరి 35

కన్నడ శాసన వాఙ్మయమునందువలె కావ్యములందును పిరి అక్కర లెక్కువ. ఆదిపురాణము, శాంతిపురాణము, హరివంశము, సుకుమారచరితె, పంచతంత్ర, రామ చంద్రచరితపురాణ, మల్లినాథపురాణ, జీవసంబోధనె, మదనతిలక, వర్ధమానపురాణము లందు పిరియక్కరలు విరివిగా కలవు. 12వ శతాబ్దము పిదప కన్నడమున పిరి యక్కరలు కనిపించుటలేదు. 20వ శతాబ్దమున శ్రీ అంబికాతనయ దత్తగారు 'సఖీగీత' అను ఖండకావ్యమును పిరియక్కరలలో వ్రాసిరి.

ఆంధ్రలాక్షణికులు ఛందోగ్రంథములందు మహాక్కరలను పేర్కొనినను ప్రాచీన కావ్యములందు నవి కనుపట్టవు. సీసమునకు, మహాక్కరలకు సామ్యము లుండుటవలన కన్నడకవులు విషయ విస్తరణమునకు పిరియక్కరల నెన్నుకొనిరి.

కనుక కన్నడ భాషలో సీసములకు వ్యాప్తిలేదు. అట్లే తెలుగు కవులు విస్తృత వర్ణనలకు సీసముల నెన్నుకొనుటవలన మహాక్కరలకు వ్యాప్తి లేకపోయినది. ఆధునికులలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీమద్రామాయణ కల్పవృక్షములో మహాక్కరలను విరివిగా వాడిరి. శ్రీ రావూరి దొరసామిశర్మగారు భోజచరిత్ర, ఘటికాచల మాహాత్మ్యము, ఆంధ్రరాఘవ పాండవీయములందు పెక్కు మహాక్కరలను ప్రయోగించిరి. శ్రీమతి బుర్రా కమలాదేవిగారు "ఛందోహంసి"లో మహాక్కరలను వాడిరి.

కన్నడ మహాక్కరలకు యతి నియమములేదు. ఆంధ్రమహాక్కరలకు 4వ గణము మొదటి అక్షరమున విశ్రాంతి పాటింపబడవలయును. ఇంతియ భేదము.

## దొరెయక్కర - మధ్యాక్కర

నాగవర్మ 'దొరె యక్కర' అనియు జయకీర్తి 'సమానాక్షర' అనియు రెండవ అక్కరను పేర్కొనిరి. ఆంధ్రలాక్షణికులెల్లరు మధ్యమాక్కరలనియే వ్యవహరించిరి. అప్పకవి మాత్రమొకచో 'మధ్యమాక్కర' (4-260) అని పేర్కొనియున్నాడు.

నాగవర్మ ఛందోంబుధియందు దొరెయక్కర లక్షణమును "సరిసిజోదర గణ మెరడ జనుమల్లి నెరెదిక్కె మత్తం సరసిజోదర గణ మెరడ జనుమక్కె గణము మాఱక్కుం" (5-5) అని పేర్కొనియున్నాడు. కనుక మధ్యాక్కర లేదా దొరెయక్కరకు 1 విష్ణు 1 విష్ణు 1 బ్రహ్మ 1 విష్ణు 1 విష్ణు 1 బ్రహ్మగణము లుండవలయునను లక్షణమేర్పడినది ప్రాసనియతము.

జయకీర్తియు ఛందోనుశాసనమునందు దొరెయక్కరకు ఇట్లు లక్షణము పేర్కొనియున్నాడు.

'రతిపతి గణయుగ్మాద్రతితః స్మరయుగ్మం రతిరపి చప్రసః
ప్రతిపాదం వర్తతే యస్మిన్ తత్సమా నాక్షరం నామ'

— ఛందోనుశాసనము 7-7

ప్రతిపాదమునందును వరుసగా కామ (విష్ణు) కామ (విష్ణు) రతి (బ్రహ్మ) కామ (విష్ణు) కామ (విష్ణు) రతి (బ్రహ్మ) గణములుండుట సమానాక్షర లక్షణమగును.

కన్నడ దొరెయక్కర తెలుగులో 'మధ్యాక్కర'. కవిజనాశ్రయకర్తయగు రేచన 'మధ్యాక్కర' లక్షణమిట్లు పేర్కొనెను.

సురరాజు సురరాజుఁ గూడి సూర్యుతో నొడఁబడి మఱియు
గరమొప్ప నిప్పాట నాలు గణముల మధ్యాక్కరంబు
విరచింపఁ బంపెఁ బ్రావళ్ల వెలయఁ గవిజనాశ్రయుండు
సురుచిరంబుగను సుశబ్ద శోభితంబగు నట్లు గాగ

—కవి జనాశ్రయము – జాత్యధికారము

పై లక్షణమనుసరించి 2 ఇంద్రగణములు 1 సూర్యగణము మఱల 2 ఇంద్రగణములు 1 సూర్యగణము కలది మధ్యాక్కరయగును. ఇట్టివి నాలుగు పాదములు. రేచన యతిని పేర్కొనలేదు. కాని లక్ష్యమనుసరించి యతి 4వ గణాద్యక్షరమని చెప్పవలసియున్నది. నన్నయ 5వ గణాద్యక్షరముపై యతినిలుప ఎఱ్ఱన 4వ గణాద్యక్షరముపై యతి నిలిపెను.

మధ్యాక్కర గణములకు మాత్రాసమన్వయము గావించి లక్షణము తెలుప ప్రయత్నించిన వారిలో డాక్టర్ గిడుగు వేంకట సీతాపతిగారు ప్రముఖులు వారు చూపిన మాత్రాగణక్రమము ఈ విధముగా నుండును. 2–636

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | మాత్రలు |
|---|---|---|---|---|---|---|
| IIIU | IIII | III | IIUI | IIUI | UU | 12 + 14 |
| IIIU | IIII | III | IIUI | IIIU | UU | 12 + 14 |
| IIII | UII | IIU | IIIU | IIIU | IIU | 12 + 14 |
| IIUI | UII | IIU | IIII | IIIU | IIU | 13 + 13 |
| | | | | గల | న | |

సూర్యగణములలో గగ, సగణములను పరిత్యజించిన UI, III గణములే మిగులును కనుక మధ్యాక్కర పాదమునకు 22 మొదలు 26 మాత్రల వఱకు నుండవచ్చునని చెప్పవచ్చును.

ఛందోగ్రంథములందు చెప్పబడిన మధ్యాక్కర లక్షణములు, మహాకవుల ప్రయోగములు రెండింటిని సమన్వయించినచో మధ్యాక్కరకు ఈ క్రింది విధముగా నియమములను చెప్పవచ్చును.

1) పద్యపాదమునకు వరుసగా 2 ఇ గ, 1 సూ, గ, 2 ఇంద్రగణములు 1 సూర్యగణము వచ్చుట.

2) ఇంద్రగణముల నెంపికలో నల, నగ, సల, భ, ర, తలేగాక మగణ సగణములను గూడ స్వీకరించుట
సూర్యగణములలో గల నగణములేగాక గగ-సగణములను గూడ స్వీకరించుట

3) యతి 1-4 గణాద్యక్షరములపై నిలుపుట

4) యతి 1-5 గణాద్యక్షరములపై నిలుపుట

## మధ్యాక్కరలు - మరికొన్ని విశేషములు

కన్నడశాసనములలో మధ్యాక్కరలు (దొరెఅక్కరలు) లేవు. కాని తెలుగు శాసనములో మధ్యాక్కరలున్నవి. యుద్ధమల్లుని బెజవాడ శాసనములోని మధ్యాక్కరలు కావ్యమధ్యాక్కరల కంటె భిన్నములు శాసనమధ్యాక్కరలలో లక్షణ వ్యతిరిక్తములగు గణములు కనిపించుచున్నవి.

విస్తర శ్రీయుద్ధ మల్లు ణ్డనవద్య విఖ్యాతకీర్తి — గగ

పరగంగ బెజవాడం గొమరస్వామికి భక్తుణ్ణె గుడియు — మగణము

క్రికీగీతలిడిన పదముల గణములు తరువాతికాలమున మధ్యాక్కరలలో పరిత్యజింప బడినవి. కాని నన్నయ మధ్యాక్కరలందును పైగణములున్నవి. ఉదాహరణమునకు-

మారంగ ననుదుని షధదే శంబున కరిగి యా హంస

అరణ్యపర్వము 2-22 — ఇచట సగణమున్నది

ఏనేడు లయ్యెను మనయ ధ్ధనుడేగి యింతకేతెంచు

అరణ్యపర్వము 4-8 ఇచటను సగణమే

ఇవియగాక మధ్యాక్కరలందు నల — నగ- సల- భ-ర-తలు గాని ఇంద్రగణములు గూడ కనిపించు చున్నవి.

అరుదుగా నగుబంగ టంగ లవేని యర్థి దెమ్మనిన

అరణ్య పర్వము 8-878 (ఆనంద ముద్రణము)

ఇచట 'జగణము' ప్రయోగింపబడినది. ఇది యింద్రగణము గాదు. తమిళ సంప్రదాయ మనుసరించి సాధువగును.

అరిగెనీ శానుది క్కనకు నీయనుజు ఁడసిలవే గమున

ఆరణ్యపర్వము 3-373 (వావిళ్ళ ప్రతి)

ఇచట 'భల' గణము వాడబడినది. ఇదియు నింద్రగణము గాదు. తమిళ సంప్రదాయ మనుసరించి యిది సాధువగును.

నన్నయ భారతములో 39 మధ్యాక్కరలున్నవి. కాని వానిలో కొన్నిట కొన్ని పాదములు రేచన లక్షణములకు లొంగుట లేదు. కన్నడ మధ్యాక్కర లక్షణములను నన్నయ యనువర్తించెనని తలంతమన్న ఆ లక్షణములకును గొన్ని పాదములు లొంగుటలేదు. కీ. శే చేకుమళ్ళ రాజగోపాలరావు, శ్రీవజ్ఝల చినసీతా రామస్వామి శాస్త్రిలవారు, శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, డాక్టర్ గిడుగు వెంకట సీతాపతిగారు శాసనములందును, నన్నయ రచనయందును గల మధ్యాక్కరలకు లక్షణ సమన్వయము చేయుటకు చాల శ్రమపడిరి 37 కాని వీరందఱు చేసిన ప్రయత్నములు పూర్తిగా ఫలింపలేదు. ఏవిధముగా చూచినను కొన్ని చరణములు లక్షణమును తిరస్కరించుచునే యున్నవి. కొన్నిటికి పాఠాంతరములు స్వీకరించినచో లక్షణము సరిపోవుచున్నది. ఈ మార్గము లన్నియు పరిశీలించి, నన్నయ భాషా ప్రయోగ వైఖరికి, అర్థపుష్టికి భంగములేని తీరున స్వల్పములయిన సవరణలుగావించ సాధుత్వము కల్పించిన వారిలో డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు,[38] శ్రీ కోవెల సంపత్కుమారాచార్యగారు,[39] శ్రీ పాటిబండ మాధవశర్మగారు[40] ప్రముఖులు. దిద్దుబాటులు, సవరణలు లేక నన్నయ మధ్యాక్కరలను మాత్రము సమన్వయింప వీలు లేకున్నది. అనగా మధ్యాక్కరలందు దేశీయలక్షణము లత్యధికముగా స్పష్టమగుచున్నదని అభిప్రాయము.

## మధ్యాక్కర - ఇతర దేశిచ్ఛందములు

ద్విపదపద్యమునకు రెండుపాదములు. ప్రతి పాదమున వరుసగా 3 ఇంద్ర గణములు 1 సూర్యగణము వచ్చుట నియమము. వీనిలో నొక్కొక్క యింద్రగణమును తగ్గించి రెండు ద్విపద పాదములొకే పాదముగా చేయ మధ్యాక్కరయగును.

ద్విపదకు రెట్టింపు తరువోజ. ద్విపద రెండుపాదముల నేక పాదముగాచేయ తరువోజయగును. తరువోజ లక్షణము –

3 ఇంద్రగణములు + 1 సూర్యగణము + 3 ఇంద్రగణములు + 1 సూరకో గణము మొదటి మూడు ఇంద్రగణములలో నొక యింద్రగణమును అట్లే రెండవ భాగమున గల మూడు ఇంద్రగణములలో నొక ఇంద్రగణమును పరిత్యజింప మధ్యాక్కరయగును.

## కన్నడాంధ్ర సాహిత్యములలో మధ్యాక్కరలు

ప్రాచీన కన్నడ సాహిత్యమున మధ్యాక్కరలు (దొరెయక్కరలు) కనుపింపవు. కాని మదన తిలకమను గ్రంథమున మాత్రము ఒక దొరెయక్కర యున్నది. (10–14, 15) జయకీర్తి ఛందోను శాసనమునందు (7.7) అసగుడను కవి రచించిన కర్ణాట కుమారసంభవ కావ్యమున సమానాక్షరములు (దొరెయక్కరలు) ప్రయోగింపబడినట్లు చెప్పియున్నాడు కాని యీ గ్రంథమలభ్యము.

ఆంధ్రశాసనములందును, కావ్యములందును మధ్యాక్కరలున్నవి. నన్నయ 39 మధ్యాక్కరలను, ఎఱ్ఱన ఒక మధ్యాక్కరను మాత్రము తమ భారత భాగములందు ప్రయోగించిరి. మధ్యాక్కర ద్విపదకు సన్నిహితమగుటవలనను. గానానుకూలత మధ్యాక్కరలందు నంతగా లేకపోవుట వలనను తరువాతి కాలమున ద్విపదలకు ప్రచార మెక్కువ యగుట సంభవించెను. శ్రీ రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారు తెనుఁగు అభిజ్ఞాన శాకుంతలమున మూడు మధ్యాక్కరలను వాడిరి. వారు నన్నయ పద్ధతిలో నాలవ గణముపై యతి నిలిపిరి. మరుగుపడిన ఛందస్సునందు ప్రీతి కనబరచి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మధ్యాక్కరల వెలువరించి సాహిత్యలోకమున నూత్నచైతన్యము గలిగించిన వారయిరి. శ్రీగిరి వేములవాడ శతకములలో నన్నయ యతి నియతిని పాటించిరి కాని రామాయణ కల్పవృక్షములో 3వ గణముపైనను 4వ గణముపైనను రెండు యతులు సర్వత్ర నెలకొల్పి యుభయ మతముల పాటించిరి. శ్రీ విశ్వనాథ వారు మకుట నియమము కారణముగా మధ్యాక్కరలనే యెన్నుకొని రచింపవలసి వచ్చినదని పేర్కొ...యున్నారు 41

పై పరిశీలనము వలన తేలిన అంశముల నిట్లు సంగ్రహింపవచ్చును.

మధ్యాక్కర దేశియగణములచే నేర్పడు పద్యవిశేషము. సంస్కృతమున లేని యతి ప్రాస నియమములు మధ్యాక్కరల కున్నవి. ప్రాచీన దాక్షిణాత్య చ్ఛందో విశేషములు మధ్యాక్కరలందు ప్రస్ఫుటముగా గానవచ్చుచున్నవి.

నడువణక్కర - మధురాక్కర :

కన్నడ లాక్షణికులు 'నడువణక్కర' అని మూడవ అక్కర విభేదమును పేర్కొనిరి. జయకీర్తి ఈ అక్కరను 'మధ్యమాక్షర' మని పేర్కొనెను ఆంధ్ర లాక్షణికు లెల్లరు 'మధురాక్కర' అని వ్యవహరించిరి.

అక్కరలలో మొదటిది దీర్ఘమైనది పిరియక్కర. దీనికి 7 గణములు. అక్కరలలో చివరది చిన్నదైనది అల్పాక్కర. దీనికి 3 గణములే. నడువణ క్కరకు 5 గణము లుండుట నియమము. కనుక గణవ్యవస్థను బట్టియు, స్వరూప మనుసరించియు మధ్యనిముడ గలిగినది కావున కన్నడ లాక్షణికుడు 'నడువణక్కర' అని పేరిడి యుండవచ్చును

నాగవర్మ ఛందోంబుధియందు నడువణక్కర పాదమున 1 బ్రహ్మ 3 విష్ణు 1 రుద్రగణము చేరునని (5-6) లక్షణము పేర్కొనెను.

జయకీర్తి నడువణక్కరను మధ్యమాక్షరముగా పేర్కొని లక్షణ మీ విధ ముగా ప్రవచించెను.

ప్రథమే రతిరేవ మన్మథ స్స్యాద్ద్వితీయే తృతీయే
పృథ చతుర్థే బాణ గణమస్తు పంచమస్థాన ఏవ
గ్రథితం లక్షణమితి యస్య తన్మధ్యమాక్షరాఖ్యం
ప్రథితం కర్ణాట మాలతీ మాధవ ప్రభృతి కావ్యే

ఛందోను శాసనము 7-6

నాగవర్మ లక్షణములకును జయకీర్తి లక్షణములకును భేదములేదు.

రేచన కవిజనాశ్రయమునందు జాత్యధికారమున 'మధురాక్కర' లక్షణములను పేర్కొని యున్నాడు. 1 సూర్యగణము 3 ఇంద్రగణము 1 చంద్రగణము వరుసగా గల పద్యపాదము మధురాక్కరయగును. 1-4 గణాద్యక్షరములు యతిస్థానములగును.

పై పరిశీలనమువలన కన్నడాంధ్రములందు మధురాక్కరకు లక్షణమొకటియే యని స్పష్టమైనది.

జయకీర్తి 'కర్ణాట మాలతీమాధవమను' గ్రంథమున 'నడువణక్కర'లు ప్రయోగింపబడినట్లు పేర్కొనియున్నాడు. కాని యీ గ్రంథ మలభ్యము. చంద్రరాజు మదనతిలకమున నొక 'నడుపణక్కర' కలదు (10-14, 15) ఆంధ్రసారస్వతమునందును మధురాక్కరలు కొన్ని కనిపించుచున్నవి. భారతమునందు మూడు మధురాక్కరలున్నవి. నన్నయదొకటి. ఎఱ్ఱనవి రెండు పద్యములు ఆధునికులలో రావూరి దొరసామిశర్మగారు భోజచరిత్రమునందును, శ్రీమతి బుర్రా కమలాదేవిగారు ఛందోహంసియందును మధురాక్కరలను ప్రయోగించియున్నారు.

## ఎడెయక్కర - అంతరాక్కర

'ఎడె' అనగా రమ్యమని అర్థము. ఆంధ్రలాక్షణికులు 'ఎడెయక్కర' అంతరాక్కర యని వ్యవహరించిరి.

ఎడెయక్కరకు నాలుగుపాదములు. ప్రతిపాదమున వరుసగా 1 బ్రహ్మ 2 విష్ణు 1 రుద్రగణము లుండుట ఎడెయక్కర నియమము. జయకీర్తి ఎడెయక్కరను అంతరాక్షరముగా పేర్కొని యిట్లు లక్షణము పేర్కొనియున్నాడు.

యది తు రతిగణః పాదాదౌ పాదమధ్యే
మదన గణయుగం పాదాంతౌ బాణరాగణం
తదిద మంతరాక్షరమక్షరజ్ఞైర్గీతం
విదితమార్గ్వతే కర్ణాటేశ్వర కథాదౌ

— ఛందోనుశాసనము (7-5)

ఆంధ్రలాక్షణికులెల్లరు 1 సూర్యగణము 2 ఇంద్రగణములు 1 రుద్రగణము కలది అంతరాక్కరపాదముగా పేర్కొనిరి. అంతరాక్కరకు నాల్గవ గణాద్యక్షరముపై యతి నిలుపవలయును. పై పరిశీలనమువలన ఎడెయక్కర - అంతరాక్కరల లక్షణములలో భేదములేదని చెప్పవచ్చును.

అంతరాక్కరకు తేటగీతికి కొన్ని సామ్యములున్నవి. ఈ రెండు విధములగు పద్యములకు నాలుగు పాదములే. తేటగీతి పాదమున 1 సూర్యగణము 2 ఇంద్రగణములు 2 సూర్యగణము లుండుట నియమము. రెండు సూర్యగణములు ఒక

చంద్రగణమునందు అంతర్భవించును. ఉదాహరణమునకు నగల, రలగణములు చంద్రగణములు నగల గణములో నగణము గల అను రెండు సూర్యగణములున్నవి. ఇట్లే 'రల' గణములో రెండు గల గణములును సూర్యగణములే. కనుక అంతరాక్కర తేటగీతులకు గణనియమము కూడ సరిపోయినది. తేటగీతులందు కూడ నాల్గవ గణాద్యక్షరముపై యతి మైత్రి పాటింపవలయునను నియమముండుట వలన యతిస్థాన సామ్యము కూడ సరిపోయినది. కన్నడ పద్యములకు యతిలేదు. తెలుగు ఉపజాతులకు ప్రాస నియతము కాదు. ఇదియ ప్రధాన భేదము.

జయకీర్తి కర్ణాటేశ్వరకథ యందు ఎడెయక్కర లున్నట్లు పేర్కొనెను. కాని ఈ గ్రంథమలభ్యము. చంద్రరాజు మదనతిలకమునందు మూడు అంతరాక్కర లున్నవి. వానిలో నొకటి—

అంగ యింగిత శిక్షిత నిందు యశం
పింగ మంగళ లక్షణ యుక్తగీవం
సంగ భృంగిర దక్షను వాయతనుం
సంగ భృంగియ నీక్షిసె రేచనృపం

—మదనతిలక (1-15)

ఆంధ్రలాక్షణికులు అంతరాక్కరలను పేర్కొనినను ప్రాచీన గ్రంథములందు వీని ప్రయోగము లేదు. తేటగీతికి అంతరాక్కరకు సామ్యములుండుట వలన ప్రాస రహితమగు తేటగీతులకే తెలుగున ప్రచారము కలిగినదని యూహింపవచ్చును. శ్రీ రావూరి దొరసామిశర్మగారు 'భోజచరిత్రయందును, శ్రీమతి బుర్రా కమలాదేవి గారు ఛందోహంసియందును అంతరాక్కరలను ప్రయోగించిరి. సంస్కృత సాహిత్యమున అంతరాక్కరలులేవు. కాని మధ్వాచార్యుల ద్వాదశస్తోత్రమున అంతరాక్కరల గతులు కవిపించుచున్నవి. ఉదాహరణమునకు—

సూ ఇంద్ర ఇంద్ర తగ
"సృష్టి సంహార లీలావి లాసాతతం
పుష్టషాడ్గుణ్య సద్విగ్ర హోల్లాసినమ్
దుష్ట నిశ్శేష సంహార కర్మోద్యతం
హృష్ట పుష్టాను శిష్యప్రజాసంశ్రయమ్

కిరుయక్కర - అల్పాక్కర

కన్నడమున 'కిరి' అనగా చిన్నది యని అర్థము. అక్కరలలో చాల చిన్న దగుటవలన ఈ పేరు సార్థకమే. అట్లే తెలుగున గల అక్కరలలో కడపటిది అల్పాక్కర. కనుక ఈ పేరు కూడ సమంజసమె.

నాగవర్మ ఛందోంబుధి యందు 2 విష్ణుగణములు 1 రుద్రగణము కలది కిరియక్కర పాదముగా (5-8) పేర్కొనియున్నాడు. జయకీర్తి కిరుఅక్కరను "అల్పాక్షరమ్" అని వ్యవహరించెను. జయకీర్తి అల్పాక్షర లక్షణమిట్లున్నది—

అంగజగణ యుగాద్బాణగణే
సంగతే ప్రతి పాదమల్పాక్షరం
శృంగార పిండాది కావ్యేషు తత్
సంగీతం కర్ణాటకే ప్రసిద్ధమ్

—ఛందోనుశాసన 7-4

ఆంధ్రలాక్షణికులెల్లరు కిరుయక్కరను అల్పాక్కరగా పేర్కొనియున్నారు. అల్పాక్కర పాదమున 2 ఇంద్రగణములు 1 చంద్రగణముండుట నియమము. యతి 1-3 గణాద్యక్షరములకు చెల్లును. ప్రాస నియతమే. ఉదాహరణమునకు—

చంద్రాస్య కవిజనా శ్రయకవీంద్ర

—కవిజనాశ్రయము-జాత్యధికారము.

ప్రాచీన కన్నడ సాహిత్యములో కిరు అక్కరలు లేవు. జయకీర్తి శృంగార పిండ కావ్యమున కిరుయక్కరలున్నట్లు పేర్కొనెను గాని ఆ గ్రంధ మలభ్యము. చంద్రరాజు మదన తిలకమున కిరుయక్కరలున్నవి. ఉదాహరణమునకు—

గిరిధర సుతనెనె పరనారిగె
గిరిజాశ్ర భవనెనె వరవిక్రమన్
హరిభక్త నవనెనె దొరెయుంగుణి
ఛరితార్థ నతి రుచి హరి సాహసన్

మదన తిలక - (10-14, 15)

ఆంధ్ర సాహిత్యమునందును ప్రాచీన కావ్యములందు అల్పాక్కరలులేవు. శ్రీరావూరి

దొరస్వామి శర్మగారు భోజ చరిత్రమునందును, శ్రీమతి బుర్రా కమలాదేవిగారు చందోహంసి యందును అల్పాక్కరల ప్రయోగించిరి.

కన్నడాంధ్రముల గల అక్కరల సామ్యములను ఈ విధముగా సంగ్రహింపవచ్చును.

1. కన్నడాంధ్రములందు గల అక్కరలు భిన్ననామకములయ్యును గణ వ్యవస్థయందు నేకరీతి నున్నవి.

2. కన్నడమునందు ప్రాచీనకాలము నుండి పిరియక్కరలకు ప్రచార మెక్కువకాగా ఆంధ్రమునందు ప్రాచీన కాలమునుండి మధ్యాక్కరలకు వ్యాప్తి యున్నట్లు చెప్పవచ్చును.

3. ఆటవెలది, తేటగీతులకు నాంధ్ర వాఙ్మయమున ప్రచార మెక్కువకాగా అంతరాక్కర, అల్పాక్కరలు మరుగుపడినవి.

4. కన్నడమున అక్కరలకు ప్రాస మాత్రము ముఖ్యము కాగా తెలుగు అక్కరలకు యతి ప్రాసలు రెండును ముఖ్యము అయినవి.

5. కన్నడాంధ్ర అక్కరలను పోలినవి తమిళమునందును గనిపించుట వలనను, దేశీయ గణవ్యవస్థ యుండుటవలనను అక్కరలు దేశిచ్ఛందోరీతులని నిర్ణయింపవచ్చును.

## 6. 3. ద్విపద - తెలుగు దేశిచ్ఛందస్సు

పాదనియమమనుసరించి యేర్పడిన పద్యములలో ద్విపదలు పేర్కొనదగినవి. ద్విపదయందు రెండు పాదములుండును. వేదవాఙ్మయమున ద్విపదా విరాట్ - ద్విపదాజగతీ మున్నగు ఛందములున్నను వానికిని కన్నడాంధ్రములందుగల ద్విపదలకు నామసామ్యమము తప్ప లక్షణ సామ్యము లేవియు లేవు. ద్విపద ప్రాకృతాది భాషలనుండి వచ్చినదనియు, ద్విపద దేశిచ్ఛందమనియు ప్రధానముగా రెండభిప్రాయములున్నవి.

డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారు ద్విపద ప్రాకృతమునుండి వచ్చినదని భావించి యిట్లు వ్రాసిరి [42]

"మనవారనుకొనునట్లు ద్విపదదేశిచ్ఛందముగాదు. అది ప్రాకృతమునుండి యెరవుతెచ్చుకొన్నది. ద్విపదికయే మన ద్విపదయైనది" కాని ఈ అభిప్రాయము సమంజసముగాదు. సంగీతరత్నాకరములో శుద్ధద్విపదికకు చెప్పబడిన లక్షణమిది–

పాదేభః పంచబాగోన్తే జౌస్తః షష్ఠద్వితీయకౌ
చతుర్భిరీదృశైః పాదైః శుద్ధాద్విపది కోచ్యతే
— సంగీతరత్నాకరము 4-114

శుద్ధద్విపదికకు నాలుగుపాదములుండును. ప్రతిపాదమునందును మొదట 6 మాత్రల గణము. (భగ లేదా మగణములు) 5 భగణములు, అంతమందు గురువు, నడుమ రెండవ, ఆరవగణములు జగణములై యుండును. ఈ శుద్ధద్విపదికయందు తొమ్మిది గణములు. ద్విపదలో నాలుగుగణములే శుద్ధద్విపదికయందు జగణముండవచ్చును. ద్విపదలలో జగణము రారాదు. అది ఇంద్రగణములో చేరదు. నాలుగు పాదములు గల ద్విపదికనుండి రెండు పాదములుగల ద్విపద పుట్టినదనుట ఛందస్సంప్రదాయ విరుద్ధము. గణముల రెట్టింపువలన తెలుగులో రగడ ప్రభేదము లేర్పడుట నిట స్మరింపదగినది.

## ద్విపద - జంభలా : జంభలిక :

శుద్ధ ద్విపదిక 'జంభలా' నామకమగు నొక గీతి భేదముగా చెప్పినట్లు వాచస్పత్య నిఘంటువు నందు కలదు.

శుద్ధ ద్విపదికా గీతిర్జంభలే త్యభిధీయతే – భరతః

విక్రమోర్వశీయమున 'ద్విపదిక' అను గీతి విశేషము పేర్కొనబడినది. అందు ద్విపదికకు లక్ష్యము లేదు. కాని 'జంభలిక' అను గీతమునకు ఈ క్రింది లక్ష్యము కలదు.

"సహ అరి దుక్ఖాలిద్ధ అం
సరవర అమ్మి సిణిద్ధ అం
అరవిల వాహ జలోల్ల అం
తమ్మ ఇహంసీజు అలఅం"
—విక్రమోర్వశీయము 4-762

ఈ జంభలికయు, భరతునిచే పేర్కొనబడిన శుద్ధద్విపదికిరూపాంతరమగు 'జంభలా' ఒకటే అయినచో నప్పుడు జంభలిక శుద్ధద్విబదిక యగును. పై లక్ష్య మనుసరించి ప్రతిపాదమునకు 13 మాత్రలుండుట జంభలిక తెలుగు ద్విపద పాదపరిమితి పదునైదు మొదలు పదునెనిమిది మాత్రలవరకు నుండుటచే జంభలిక ద్విపదయు నొకటి కాదనుట స్పష్టము.

ద్విపద - ద్విపది :

"గుర్వంతం ద్విపదీ భవతి" (వాచస్పత్య నిఘంటువు) అనుటచే 'ద్విపద' గుర్వంతము. కాని తెలుగు 'ద్విపద' లఘ్వంతము. జనాశ్రయి ఛందస్సూత్రము లందు 'ద్విపది' లక్ష్యములు కలవు. కాని ద్విపది పాదమునకు 30 కంటె మించిన మాత్రలు కనిపించుచున్నవి ఉదా : కరుణాకర నిష్కరుణేన వాయునా రిపువారణ దానగంధినా తెలుగు ద్విపదపాదము పదునెనిమిది మాత్రలకు మించి యుండదు. కనుక ద్విపది-తెలుగు ద్విపదలకు లక్షణ సామ్యము లేదు.

ద్విపద - ద్విపదగ

మానసోల్లాసమున 'ద్విపదగ' పేరుతో నొక ఛందో విశేషము చెప్పబడినది ద్విపదగల లక్షణము —

త్రయోగణాగురుశ్చాంతే ప్రథమేథ తృతీయకౌ
ద్వితీయేచ తురీయేచ ద్వౌగణౌద్వౌగురూ తథా
జగణోనాత్రక ర్తవ్యో భాగాంతే యమకం భవేత్
ఇతి ద్విపదగంనామా తస్యోదాహృతిరుచ్యతే

— మానసోల్లాసము 290-291

ద్విపదకు గల నాల్గుపాదములలో 1-3 పాదములందు మూడు గణములు ఒక గురువును, 2-4 పాదములందు రెండు గణములు రెండు గురువులును కల్గియుండుట లక్షణము. 1-2 పాదములకొకే లక్షణము కల్గిన లఘ్వంతమగు తెలుగు ద్విపదకిది భిన్నము.

# దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు — తులనాత్మక పరిశీలన

## ద్విపద – దోధకము

సంగీతరత్నాకర వ్యాఖ్యాత కల్లినాథుడు 'ద్విపధక'మును 'దోధక'ముగా పేర్కొనెను ఈ దోధకమునే తెలుగులాక్షణికులు త్రిష్టుప్ ఛందోవృత్తముగా పరిగణించియున్నారు. 'దోధకము'నకు కల్లినాథుడు చెప్పిన లక్షణమిది —

> ద్విపదం దోధకమితి పర్యాయశబ్దౌ
> తేన దోధక లక్షణమేవ ద్విపద లక్షణంవేదితవ్యమ్
> దోధక లక్షణంతు భౌభగౌగితి

ధోధక పాదమునందు మూడు భగణములు రెండు గురువులుండును. ఈ దోధక లక్షణము తెలుగు ద్విపదలక్షణమునకు కొంత సన్నిహితము దోధక పాదమునందలి చివరి గురువును లఘువుగా చేసినచో నది ద్విపద పాదమగును. కాని దోధకమున 'భ' గణము విహితము. ద్విపద యందు భగణములే గాక నల–నగ–సల–ర–త గణములను గూడ ప్రయోగింపవచ్చును.

## ద్విపద – ద్విపదీఖండము

రత్నావళి నాటకమునందు ప్రాకృతభాషలో వ్రాయబడిన 'ద్విపదీఖండ' మొకటి యున్నది.

> కుసుమా ఉహసి అదూ అ ఓ
> ము ఉలా ఇద బహూ చూద ఓ.
> పిధిలి అమాణగ్గహణ ఓ
> వా అ ఇదాహిణ పవణ ఓ

—ప్రథమాంకము ప. 14.

పై ద్విపదీ ఖండ పాదమునకు 13 మాత్రలున్నవి. తెలుగు ద్విపద పాదమునకు కనీసము 15 మాత్రలేని

## ద్విపద – దోహా

> సంస్కృతే యే ద్విపదగాః
> ప్రాకృతే దోహకోచ్యతే

—సంగీత చూడామణి (జగదేకః)

సంస్కృతమునందు 'ద్విపదగ' అనునదియే ప్రాకృతమున 'దోహా' అని చెప్పబడు చున్నది. కాని లక్షణ విషయమున రెంటికిని భేదము కలదు. దోహాయందు నాల్గు పాదములలో మొత్తము 48 మాత్రలుండును. ఏ పాదములోను జ గణముండకూడదు అని కోల్‌బ్రూక్ (P 413) చెప్పినట్లు కన్నడ ఛందోంబుధి పరిష్కర్త కిటెల్ పేర్కొనెను. దోహా పాదములందు మాత్రల సంఖ్య ఈ క్రింది విధముగ నుండును.

1-3 పాదములలో — 6 + 4 + 3 = 13 మాత్రలు
2-4 పాదములలో — 6 + 4 + 1 = 11 మాత్రలు

ఇది తెలుగు ద్విపదపాదము లందలి మాత్రల సంఖ్యకు భిన్నమైనది

రెండు పాదములకు లక్షణ సామ్యము కలిగినవన్నియు ద్విపదలను భావముతో పైన పేర్కొనబడిన సంస్కృత ప్రాకృత ద్విపద భేదములన్నియు ద్విపదలే కావచ్చును. కాని తెలుగు ద్విపదలక్షణము వానికి విలక్షణమైనది తెలుగు ద్విపద దేశిచ్ఛందము.

## ద్విపద - కన్నడ దువయి - దువవిగ - దువది

నాగవర్మ ఛందోంబుధియందు కంద-ఆర్యాది మాత్రాగణ వృత్తప్రకరణమున 'దువయి' (4-9)ని పేర్కొనియున్నాడు. అట్లే కన్నడిగుడగు జయకీర్తియు 'ద్విపది'కి లక్షణము (6-28) ను ఛందోనుశాసనమున వచించియున్నాడు.

దువయికి రెండుపాదములు. ఒక్కొక్కపాదములో వరుసగా 6 మాత్రల గణము + 5 కందపద్యగణములు = 26 మాత్రలుండును. చతుర్మాత్రాగణముల పిదప నొక గురువును చేర్పవలయునని పాఠాంతరమున్నది. కాగా దువయికి 28 మాత్రలగును. దువయికి నొక యుదాహరణము —

6 మాత్రలగణము 1 2 3 4 5 గ
సురఖచర ర విగరుడ విద్యా ధరప న్నగరా జ వంది తం
పరమపదం విన మిత జనమం పరిరక్షణెగెయ్దనింతిద

— ఛందోంబుధి 4-10

అది యచ్చమగు ప్రాకృతములోని 'దోఅఇ' అగునని శ్రీ చిలుకూరి నారాయణరావు గారు 'మాత్రాచ్ఛందస్సులు' అనువ్యాసమున పేర్కొనిరి. పై పరిశీలనమువలన కన్నడదుపది కంటె తెలుగు ద్విపదభిన్నమని రూఢిగా చెప్పవచ్చును. ఇక తదితర కన్నడ లాక్షణికుల ద్విపద లక్షణములను పరిశీలింతము.

## కన్నడలాక్షణికులు - ద్విపది

గుణచంద్రుడను కన్నడ లాక్షణికుడు ఛందస్సారమున 'ద్విపది' లక్షణమును పేర్కొనెను.

న న న జ
ద్విపది న నన జగణగ ళాగె
ద్విపది చరణయమకవ దాగె

—ఛందస్సార 5-12

పై లక్షణమనుసరించి ద్విపదికి రెండు పాదములనియు, ఒక్కొక్క పాదమునకు వరుసగా న-న-న-జ గణములు వచ్చునని చెప్పవచ్చును. మూడింద్రగణములపైనొక సూర్యగణము వచ్చుట తెలుగు ద్విపద లక్షణము. కాని యిచట మూడు సూర్య గణములపై నొక జగణము వచ్చినది. జగణము ఇంద్రగణములో చేరదు. కనుక గుణచంద్రుని ద్విపది తెలుగు ద్విపద కంటె భిన్నమని చెప్పవచ్చును.

వీరభద్రుడను కన్నడ లాక్షణికుడు నంది ఛందోర్ణవమునందు 'ద్విపద లక్షణము'ను ఈ విధముగా పేర్కొనియున్నాడు.

దేవేంద్ర గణమూరు దినకర నొందు
భావిసు ద్విగణాంత్య భవ్య విశ్రాంతి
చపలాక్షి పూర్వదాచార్యర మతది
ద్విపద లక్షణవెందు తిళియె నీనిందు

—నంది ఛందోర్ణవ 3-22

పై లక్షణమనుసరించి ద్విపద పాదమునకు 3 ఇంద్రగణములు, 1 సూర్యగణము వచ్చునని తెలియుచున్నది. బ్రహ్మ, విష్ణు గణములని చెప్పక సూర్య, ఇంద్రగణము

లని వీరభద్రుడు పేర్కొనుట చూడగా నతడు ద్విపదను తెలుగు జాతి (వృత్తము)గా భావించినట్లున్నది.

<u>ఆంధ్రలాక్షణికులు - ద్విపద :</u>

రేచన ద్విపదకు లక్షణము ఇట్లు చెప్పియున్నాడు.

"ఇంద్రగణములు మూఁడి నగణం బొకటి
చంద్రాస్య ద్విపదకు ఁజను ఁజెప్పరేచ"

—కవిజనాశ్రయము - జాత్యధికారము.

ద్విపదకు రెండు పాదములు. ఒక్కొక్క పాదమునకు వరుసగా మూడు యింద్ర గణములు 1 సూర్యగణము చేరుట ద్విపద లక్షణము.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణియందు ద్విపద లక్షణమును కొంత విస్తృతపరచి చెప్పెను.

"శక్రత్రయంబును సవిత్రుండు ఁబాద
విక్రీడితులు మృదు ద్విపదికి నెపుడు
వళియు ఁబ్రాసంబును వలయు దీనికిని"

—కావ్యాలంకార చూడామణి 8-61

విన్నకోట పెద్దన 'ద్విపద'కు బదులుగా 'ద్విపది' అని వాడియున్నాడు. 'వళి' ని పెద్దన పేర్కొనెను గాని వళిస్థానమును నిరూపింపలేదు. కాని లక్షణ మనుసరించి 1-3 గణాద్యక్షరములకు యతి చెల్లునని చెప్పదగును.

పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రమున యతి స్థానమున 'ద్విపద' అని ప్రయోగించి యున్నాడు.

... ... ఆద్విపాస నియతి
దప్పకుండగ ద్విపదలు రచియింతు"

ద్విపద, ద్విపది పదములలో 'ద్విపద' అను పదమే సాహిత్య ప్రపంచమున రూఢి కెక్కినది. పాల్కురికి సోమన 'ఐహికాముష్మిక ద్విపద హేతువుగా ద్విపద'ను

భావించినట్లగపడుచున్నది. ఈ మహాకవి ద్విపద రచనలో నూత్న ప్రయోగములను పెక్కింటిని ప్రదర్శించి యున్నాడు.

సూర్యేంద్రగణములతో వ్రాయదగు పద్యములలో ద్విపద యొకటి. సూర్యేంద్ర గణముతేవి యనుటలో మతాభిప్రాయము లున్నవి. రేచన కవిజనాశ్రయమున 'ఉప గణములను' గూర్చి యిట్లు తెలిపియున్నాడు.

"వినుత ద్విత్రి చతుర్గురు
జనిత గుణంబులు రవీంద్ర చంద్రాఖ్యములై
చను నక్క రజాతులకె
ల్లను, నాదిమ (లఘువు) మొదలలఘువిడవలయున్"

— జాత్యధికారము

పై పద్యమనుసరించి రెండు, మూడు, నాలుగు గురువులనుపెట్టి ప్రస్తరింపగా వరుసగా నాలుగు సూర్యగణములు, ఎనిమిది ఇంద్రగణములు, పదునారు చంద్రగణము లేర్పడును. ప్రస్తారము చేయునపుడు లఘువుతో మొదలగు గణముల మొదట అదనముగా ఒక లఘువును చేర్పవలయునని రేచన పై పద్యమున స్పష్టపఱచి యున్నాడు. విన్నకోటపెద్దనయు పై అభిప్రాయమునే కావ్యాలంకార చూడామణి యందు (8-51) విశదపఱచియున్నాడు. కనుక రేచన విన్నకోటపెద్దనల మతమున గగ, స, గల, నగణములు సూర్యగణములు. మ, సగ, భ, నగ, త, సల, ర, నల గణములు ఇంద్రగణములు. మగ, యగ, రగ, నగగ, తగ, సవ, భగ, నవ, మల, సహ, రల, నహ, తల, సలల, భల, నలల గణములు చంద్రగణములగును. కాని తరువాతి లాక్షణికులు సూర్యగణములలో గగ, సగణములను, ఇంద్రగణము లలో మ, సగ గణములను, చంద్రగణములతో మగ, సగగ గణములను తొలగించిరి. కనుక పాల్కుఱికి సోమన ద్విపదలను పరిశీలించునపుడు రేచన విన్నకోటపెద్దనల గణవిధానములను గ్రహింపవలయును.

గగ

"హాయకశ్రుతి 'రసాన్నక్తస్య జిహ్వా
శ్రే' యనియేర్పౌద్దు మోయుఁగావునను"

— బసవపురాణము 5 – పుట 19

గగ
ప్రేమం బెలర్పంగ భృత్యాపరాధ
స్వామి నోదండయ న్పదువునిష్ఠించి
సగ
అంథక కరిదైత్య వ్యాఘ్రములాలాజ
లందరాద్యుల నిర్దళనము సేయండె

—బసవ పురాణము 6వ ఆశ్వా - పుట 483

పాల్కురికి సోమన ద్విపదలలో కనిపించు మరియొక నూత్న ప్రయోగము. ఒక్క ద్విపదలో రెండు పాదముల సంయోగము. భిన్న ద్విపద సంయోగము. ద్విపద పాదముల దేనికవి ప్రత్యేకముగా నుండవలెననియు, ఒక పాదములోని తుది పదము రెండవ పాదము లోనికి చొచ్చుకొని పోరాదనియు తాళ్ళపాక చిన్నన్న ఈ క్రింది విధముగ తెలిపెను.

ద్విపదకు ద్విపదకు దెగ జెప్పవలయు
ద్విపదతో ద్విపద సంధిలనేక శబ్ద
మపుడు రెంటను గూర్పనది యయుక్తంబు

అష్టమహిషీ కల్యాణము - అవతారిక

ఈ లక్షణము నితర లాక్షణికు లెవరును సూచింపలేదు. పాల్కురికి సోమనను వదలినచో దాదాపన్ని లక్ష్యగ్రంథము లోను ఈ పద్ధతి పాటింపబడినది. సంస్కృత వాక్యానుకరణ నిర్బంధము, వేదవేదాంతేతిహాస వివిధాగమ పురాణ విహిత సూక్తములను ప్రమాణ వాక్యములుగా ద్విపదలలో చేర్చుట అను విషయములే సోమనాథుని ద్విపద పాద సంక్రమణమునకు ముఖ్యకారణమని తోచును.

ఉదాహరణమునకు—

దాన 'ప్సాతంభక్షిత' మనం 'బ్రియంబు
కేన భక్షిత' మనం బ్రియం బ్రసాదంబు
నంగ నశ్నీయాత్తనఁగఁ దత్ప్రసాద
మంగీకరింపంగ నర్హమై యుండు

—దీక్షా ప్రకరణము పుట 95

పాల్కుఱికి సోమన ద్విపదలలో ప్రాస యతులు కనిపించుచున్నవి. కాని ద్విపదలలో ప్రాసయతి కూడదని తాళ్ళపాక చిన్నన్న ఈ విధముగా పేర్కొని యున్నాడు.

"యతుల లోపలఁ బ్రాసయతి దక్క సకల
యతులు చెల్లును బ్రయోగాను సారమున"

—అష్టమహిషీ కల్యాణము - అవతారిక

ప్రాసగల పద్యములందు ప్రాసయతులు వాడరాదు. కాని ప్రాసనియతి గల లయహారి, లయవిభాతి, లయగ్రాహి త్రిభంగి మున్నగు వృత్తములందు లయప్రాధాన్యముకొరకు 'ప్రాసయతి' ఉపయోగింపబడినది. అట్లే జనవ్యవహారమందున్న గేయములు, సామెత లందును ప్రాసయతులు ఉపయోగింపబడినవి. కనుక ద్విపదలందు ప్రాసయతి వాడుట దోషముగాదు.

సోమనాథుడు పండితారాధ్య చరిత్ర అవతారికలో

"ప్రాసమైనను యతిపై వడియైన
దేశిగా నిలిపి యాది ప్రాస నియతి,
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు"

అని ద్విపదలందు ప్రాసయతిని వాడుటను ప్రకటించుకొనియున్నాడు. కాని సోమనాథుడు ద్విపదలలో ప్రాసయతిని చాల తక్కువగానే వాడియున్నాడు. అను ప్రాసావేశము వచ్చినపుడు, సంస్కృత వాక్యముల కనుకరణము చేయునపుడును ప్రాస యతులను ప్రయోగించినట్లు తెలియుచున్నది. ఉదాహరణమునకు—

వరభక్తి చిరముక్తి కరభక్తి రతులు
నరచర్మ ధరకర్మ హరధర్మ వరులు

—పండితారాధ్యచరిత్ర పుట 9

వాయంగఁ బ్రమథేశ్వరాయనమో న
మోయని భృంగీశ్వరాయ నమో న
మో యని నందినాథాయ నమో న
మో యని

—వాదప్రకరణము పుట 676.

## 6. 3. 1. ద్విపద - ఇతర దేశిచ్ఛందస్సుతో సామ్యము

### ద్విపద - మంజరి

ద్విపదకు లక్షణము చెప్పిన రేచన మంజరీ ద్విపదను పేర్కొనలేదు. కావ్యాలంకార చూడామణియందు విన్నకోట పెద్దన 'వలదు ప్రాసంబంద్రు వరుస మంజరికి' అని మంజరిని ద్విపద భేదముగా సూచించెను. మంజరీద్విపదకు ప్రాసనియతి యుండదనియు ఏపాదమున కాపాదము తెగినట్లుండవలెననియు, నిది ద్విపదభేదమనియు అనంతుడు ఛందోదర్పణమున (3-49) విశదీకరించెను. ప్రాసనియతి లేకుండుటవలన మంజరీద్విపద పద్యలక్షణముకంటె గేయలక్షణమునకు సన్నిహితమగుచున్నది. రెండుపాదములు గల పద్యమునకే ద్విపదయను పేరు సార్థకమగును. కాని ఏకపాదముగల పంక్తికి ద్విపద అనుపదము చెల్లదు. అయినను ఆ ఒక్కపాదలక్షణమును ద్విపదలక్షణమేకనుక ఈ మంజరినిగూడ మంజరీద్విపద అని ద్విపద మంజరి అని లాక్షణికులు పేర్కొనిరి.

### ద్విపద - తరువోజ

తెలుగులో నుపలబ్ధములగు పద్యశాసనములలో మొదటిదగు అద్దంకి శాసనములో (848-892 **A. D.**) నాల్గు పాదములు గల తరువోజ పద్యము కలదు.

> పట్టంబు గట్టిన ప్రథమంబునేడు
>         బలగర్వమొప్పఁగ బైలేచిసేన
> పట్టంబు గట్టించి ప్రభుఁబండరంగుఁ
>         బంచిన సామంత పదువతో బోయ
> కొట్టములన్వం(?)డెందు గొనివేఁగినాటి
>         గొఁలల్చియ త్రిభువనాంకుశబాణసిల్పి
> కట్టెపు దుర్గంబు కడుబయల్సేసి
>         కందుకూర్బెజవాడ గావించెమెచ్చి

పై శాసన పద్యము పూర్వభాగములో 3 ఇంద్రగణములు, 1 సూర్యగణము కలవు.

ఉత్తరభాగములో కూడ నట్లే కనుక ద్విపదయొక్క రెండు పాదములు ఒక పాదముగా నేర్పడుటచే తరువోజ పద్యపాద మేర్పడినది.

తరులోజ, తర్వోజ అను రెండు పేర్లను తెలుగు లక్షణ గ్రంథములందు కనిపించుచున్నవి. కవిజనాశ్రయమున తరువోజ, తర్వోజ (జాత్యధికారము) అను రెండు పేర్లను గలవు. కావ్యాలంకార చూడామణి (8–50) ఛందో దర్పణము (3–39) లక్షణసార సంగ్రహము (ద్వితీయాశ్వాసము చివర) అందు తరువోజ, తర్వోజ లనునవి వాడబడినవి. అప్పకవి మాత్రము 'తరువోజ' అనియే (4–274 260) పేర్కొనెను. విద్యారత్న శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వావిళ్ళవారి కుమార సంభవమునకు పీఠిక వ్రాయుచు నందు 'తరువద' అను పద్యములను నన్నె చోడుడు ఐదుచోట్ల వాడినట్లు పట్టిక యిచ్చి యున్నారు. 'తరువోజ' పదమునకు పరిశోధకులు పెక్కు అర్థముల నిచ్చియున్నారు, "తరువు యొక్క ఓజ (క్రమము విధము, స్వభావము) కలది తరువోజ లేక తర్వోజ ఈ పద్యము తరువువలె కొంత విస్తృతి కలిగి రసజ్ఞులకు హాయి గూర్చును గాక – తరువు యొక్క వ్రేళ్ళ (లేక లే గొమ్మల) వలె విస్తృతమైన పాదములు కలది" అను శ్రీ ఉమాపతి పద్మనాభ శర్మగారి సమన్వయము.[43] ఇచట మరియొక అంశమును గూర్చి ప్రసంగించుట అసం గతము కాదు. తమిళ లాక్షణికులు గణములకు వృక్ష నామములనే పెట్టిరి. మావిళం, కూవిళం, తేమాంగాయ్ పుళిమాంగాయ్ మొదలగునవి. పద్యము వృక్షమైనచో గణములు కాయలగుట, పుష్పములగుట సమంజసమే. ఈ మూల తత్వము 'తరు వోజ' పదమున ప్రతిఫలించు చున్నదని నా అభిప్రాయము.

"తలకొని తగఁ బాలు దంపెడి చోటఁ
దరుణులచే నొంపుదనరుఁ దర్వోజ"

అని కావ్యాలంకార చూడామణి యందు తరువోజ (8–50) స్త్రీలు పనులు చేసికొను సందర్భమున శ్రమాపనోదనము కొరకు పాడునొక పాటగా తెలుపబడినది. పాడుచు దంచునప్పుడు పాట కనుగుణముగా రోకటిదెబ్బ తాళముగా పడుచుండును. ఆ దెబ్బ పడిన అక్షరమే క్షమముగా యతి స్థానమైనది ఇటువంటి చరణము లెన్నైనను ఆ పాటలో నుండవచ్చును. కనుక అవి ద్విపదలు తరువోజలుగావు. అవి కేవలమొక ఛందము మాత్రమే ఈ ఛందములోని వివిధగతుల చరణములే తెటగీతులకు, ఆట

వెలదులకు, సీసములకు మూలములైనవి. నన్నయకు పూర్వపు దేశికవితలో నాలుగేసి చరణములు గల తరువోజలు విరివిగా వాడుకలో నుండి యుండెను. యతి ప్రాసల మరింపజేసి చాళుక్యరాజులు వీనికి శాసన గౌరవమును బహుశః సభాగౌరవమును గూడ కలిగించిరి." అని ఆచార్య బిరుదురాజు రామరాజు గారు పేర్కొనిరి.[44]

దేశియచ్ఛందములందు సీసము, ఆటవెలది అర్ధసమవృత్తము లనదగును. తరువోజ సమవృత్తము. అల్పాక్షరములయిన రెండు పాదములతో ముగియు ద్విపదలో ముక్తకములైన సూక్తులను చెప్పవచ్చునుగాని మహాకావ్యమున విపులార్థములయిన వాక్యములు నిబంధించుట సాధ్యముకాదు. కనుక ఎనిమిది ద్విపద చరణములను గలిపి రెండేసి పాదములకు గల ప్రాసను విడిచి యతిని కూర్చి ఏకత భాసించు నాల్గు పాదములతో విస్తృత వస్తు నివేదనమునకు తగినట్లుగా తరువోజ నిర్మింపబడినదని చెప్పవచ్చును.

ద్విపద - సీసము :

కందుకూరు శాసనము (క్రీ. శ. 9 వ శతాబ్ది) ధర్మవరము శాసనము (892 ఎ. డి.) లందును సీసపద్యములు కలవు. ద్విపద తరువోజగా పరిణమించిన తర్వాత నది సీసపద్యముగా పరిణమించినది తరువోజ పాదములోగల ఆరు ఇంద్ర గణముల మధ్య నొక సూర్యగణమును, చివర మరొక సూర్యగణమును కలదు. తరువోజ పాదమధ్యమందుండు సూర్యగణమును పాదాంతమునకు తోసినచో నేర్పడు రూపము సీసపద్య పాదలక్షణము. ఇట్లు ద్విపద సీసములకు పరోక్ష సంబంధమును స్థాపింపవిచ్చును ద్విపదకు సీసపద్యమునకు ప్రత్యక్ష సంబంధము కలదనియు ఈ క్రింది విధముగ చెప్పవచ్చును. సీస పద్యములోని మొదటి నాలుగు ఇంద్రగణములను ఒక భాగముగాను, మిగిలిన రెండు ఇంద్రగణములును, రెండు సూర్యగణములను చేర్చి మరొక భాగముగాను విభజింపవచ్చును. ద్విపద యొక్క మొదటి పాదాంతమందలి సూర్యగణమును ఇంద్రగణముగాను, రెండవ ద్విపదపాదము చివరి ఇంద్రగణము సూర్యగణముగాను మార్చి కూర్చుట వలన సీసపద్య పాద మేర్పడుచున్నది. కావున ద్విపదకు, సీసమునకు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని పొత్తు కలదని స్పష్టమగుచున్నది.

ద్విపద - మధ్యాక్కర

మధ్యాక్కర కూడ ద్విపద భేదమే. అక్కరలలో మధ్యాక్కరకు మాత్రమే ప్రయోగముండుటకు ద్విపదతో దీనికి సంబంధము హెచ్చుగా నుండుటయే కారణ మని శ్రీ కోవెల సంపత్కుమారాచార్యగారు అభిప్రాయపడిరి [45] మధ్యాక్కర పాదమందు వరుసగా రెండింద్రగణములు, ఒక సూర్యగణము, మరల రెండింద్ర గణములు, ఒక సూర్యగణము మొత్తము ఆరు గణములు రెండు ద్విపద పాదములలోను ఒక్కొక్కదానిలో నొక్కొక్క ఇంద్రగణమును తగ్గించి రెండు పాదముల నొక పాదముగా నేర్పరచినచో మధ్యాక్కర పద్యపాదమగును. ద్విపదలోవలె మధ్యాక్కర పాదమందును సమవిభాజ్యగణము లున్నవి. కనుక ద్విపదకు మధ్యాక్కరకు పోలికలున్నట్లు చెప్పవచ్చును.

ద్విపద - ద్విరదగతిరగడ

"కరమొప్పఁ బంచలఘుగణ చతుష్టయముచే
విరమంబు రెంటిపై ద్విరదగతిపేరిచే"

—అప్పకవీయము 4-484.

ద్విపదలోని చివరి గణమునకు రెండు మాత్రల నధికముగా చేర్చినచో, అనగా చివరి సూర్యగణమును పంచమాత్రాగణముగ చేసినచో ద్విరదగతిరగడ యేర్పడును. లేక ద్విరదగతి రగడలోని చివరి రెండు మాత్రలను తగ్గించినచో ద్విపద యేర్పడుననియు చెప్పవచ్చును. ద్విరదగతి రగడయందు కేవలము పంచమాత్రాగణములే యుండును. కాని ద్విపదయందు పంచమాత్రాగణములతో పాటు చతుర్మాత్రాగణములు, త్రిమాత్రాగణములు కూడ నుండును. కనుక ద్విరదగతిరగడ ద్విపద యొక్క భేదమే. ఇట్లే కేవలము చతుర్మాత్రాగణములతో నొప్పు మధురగతిరగడ కూడ ద్విపద భేదమే యని నిరూపింపవచ్చును.

ద్విపద - చౌపద - కర్ణాటచతుష్పద

ద్విపదలో నుపయోగించు గణములతో ప్రత్యేకముగా గణోపయోగము జరిగినచో ఆనంతాదులు చెప్పిన చౌపద యేర్పడును. ఇంద్రగణములలో చతుర్మాత్రా

గణములేయను నల, భగణములను మాత్రము నుపయోగించిన చౌపదయగును. చతుర్మాత్రాగణములు మూడు – ఒక త్రిమాత్రాగణము ప్రతిపాదమందుండుట చౌపద యొక్క లక్షణము ఇట్లే చతుర్మాత్రాగణములకు బదులు పంచమాత్రా గణములే యగు నగ–సల–ర–తలను ఇంద్రగణములతో ద్విపదయం దుపయోగించి నచో కర్ణాట చతుష్పద యగుచున్నది. పంచమాత్రాగణములు మూడు + ఒక త్రిమాత్రాగణము ప్రతిపాదమందుండుట కర్ణాట చతుష్పద యొక్క లక్షణము. ఈ రెండును చతుష్పదములే కావున రెండు ద్విపదలను, అనగా ద్విపద పాదముల నాల్గింటిని వ్రాయవలసియుండును. యతిప్రాసల విషయమున అయా పద్యములకు విశేషమయిన నియమము లుండవచ్చును. కనుక ద్విపదలకు చౌపద కర్ణాట చతుష్పదలకు పోలికలున్నట్లు చెప్పవచ్చును.

## ద్విపద – త్రిపద

మూడు ద్విపద పాదములు కలిసినచో ఒక త్రిపద ఏర్పడుచున్నది. కాని గణముల కూర్పులో కొద్దిమార్పు కనబడుచున్నది. త్రిపదయందలి గణములివి.

ఇంద్రగణము + ఇంద్రగణము + ఇంద్రగణము + ఇంద్రగణము
ఇంద్రగణము + ఇంద్రగణము + సూర్యగణము
ఇంద్రగణము + ఇంద్రగణము + సూర్యగణము

మూడు ద్విపదపాదములలోని మొదటి పాదముయొక్క చివరి సూర్యగణమును ఇంద్రగణముగా మార్చుటయు, తరువాతి రెండు పాదములందును పాదములో నొక్కొక్క ఇంద్రగణమును తగ్గించియుటయు చేసినచో త్రిపద.

## ద్విపద – షట్పది

ద్విపద భేదమైన సీసపాదముయొక్క చివరిరెండు సూర్యగణములు ఒక చంద్రగణమగునట్లుగా నుపయోగించినచో 'షట్పది' యొక్క సగమగుచున్నది. ఈ విధముగ రెండు సీసపాదములు కలిసినచో షట్పది యగుచున్నది.

అనేక దేశిచ్ఛందోలక్షణములకు ద్విపద మూలమని ఫలితార్థము.

## 6. 3. 2. ద్విపద - ఛందోవతంస :

కన్నడ ఛందో గ్రంథములలో చెప్పబడిన పద్య రీతులందు ఛందోవతంస మొకటి. ఛందోవతంస పద్యమునకు రెండువిధములగు లక్షణములు కనిపించుచున్నవి కిటెల్ సంపాదిత ఛందోంబుధి యందు ఛందోవతంస లక్షణ మిట్లున్నది.

మంథర ధరగణ మొందిరె మొదళొల్
బందిర్కె నాల్కెకె బిసరుహ జన్మం
సందుదు లక్ష్మణ మీతతె దిందం
ఛందోవతంసకెక్కె మదగజ గమనే

—ఛందోంబుధి - 5-16

పై పద్యమనుసరించి ఛందోవతంసకు నాలుగు పాదములనియు, ప్రతి పాదమున 3 విష్ణుగణములు 1 బ్రహ్మగణము రావలయుననియు, ప్రాస నియతమనియు, చతుర్మాత్రాగణ సంయోజనము రామణీయకము కలిగించుననియు చెప్పనగును.

డాక్టర్ బసవరాజుగారు వెలువరించిన ఛందస్సంపుటమందలి ఛందోంబుధిలో ఛందోవతంస లక్షణ మిట్లున్నది.

మందరధర గణ మెసెదిర్కె మొదలొళ్
బంధిర్కె నాల్కె విషరుహ జన్మం
సందుదు మవసియొళ్ లక్షణమీ తెఱదిం
ఛందోవతంసక్కె మదగజగమనె

—ఛందోంబుధి

పై పద్య మనుసరించి ఛందోవతంసమునకు నాలుగు పాదములనియు, ప్రతిపాదమున 1 విష్ణు 4 బ్రహ్మగణములు వచ్చుననియు, ప్రాసనియతమనియు చెప్పవచ్చును. జయకీర్తి పై లక్షణములనే పేర్కొని ఛందోవతంసకు 'ఆదివరాహ' అను పేరు (7-16) గూడ నున్నట్లు తెలిపి యున్నాడు. ఇతర కన్నడ ఛందో గ్రంథము లందు ఛందోవతంస చెప్పబడలేదు.

తెలుగు ఛందో గ్రంథములందెచటను 'ఛందోవతంస' అను పేరుగల పద్యవిశేషము కనిపింపదు. కాని 'ఛందోవతంస'ను పోలినద్విపద తెలుగున ప్రసిద్ధమే. ఛందోవ

తంస పాదమునకు 3 విష్ణుగణములు 1 బ్రహ్మగణము వరుసగా నుండుటనియమను ద్విపదపాదములో 3 ఇంద్రగణములు 1 సూర్యగణమువచ్చుట నియతము. కనుక రెండంటికిని గణసామ్యము కుదిరినది. ఛందోవతంసకు నాలుగు పాదములుకాగా ద్విపదకు రెండే పాదములు.

ఛందోవతంసకుగల రెండవలక్షణముకూడ ద్విపదకు సన్నిహితముగా నున్నది. ఛందోవతంస పాదమునకు 1 విష్ణుగణము 4 బ్రహ్మగణములు రావలయునని అనుశాసనము. నాలుగు బ్రహ్మగణముల స్వరూపము UI III UI UI రూపములనున్నచో UII IIUI UI అను విభాగమువలన 3 విష్ణుగణములు 1 బ్రహ్మగణమును నియమము సరిపోవును. పై పరిశీలనమువలన ఛందోవతంస ద్విపద లొకటియే యనిచెప్పవచ్చును.

జయకీర్తి కర్నాటకుమారసంభవమునందు "ఛందోవతంస" లున్నవని పేర్కొనెను. కాని ఆ గ్రంథమలభ్యము. పురందరదాసు పదములలో ఛందోవతంసను బోలిన పాదములు కనిపించును.

అందుకా శింగన పడెయొళు తుళిద
నందన కందము కుందకాణమ్మ

ఛందోవతంస - కర్ణాట చతుష్పద :

ఛందోవతంసకును తెలుగు లాక్షణికులు పేర్కొనిన కర్ణాట చతుష్పదకును పోలికలున్నవి. రెండింటికిని నాలుగు పాదములే. కర్ణాట చతుష్పద పాదమునకు ఐదు మాత్రల గణములు మూడు తర్వాత నొక సూర్యగణమును గూర్పవలయునని అప్పకవి - (4-286) లక్షణము పేర్కొని యున్నాడు. ఇంద్ర గణములలో నగ, సల తగణ రగణములే పంచమాత్రాత్మకములు. తక్కిన నల, భ గణములు చతుర్మాత్రకములు ఛందోవతంసలో మూడు విష్ణుగణములు 1 బ్రహ్మగణము కూర్పవలయునని నాగవర్మ లక్షణము కనుక పంచమాత్రాత్మకములగు ఇంద్ర గణములను కూర్చినను 'ఛందోవతంస'యే యగును. పై పరిశీలనము వలన ద్విపదకు ఛందోవతంసకు సామ్యము లున్నట్లు చెప్పవచ్చును.

సంస్కృతమున ద్విపద చ్ఛందస్సు వాడుకలోలేదు. కావ్యముల యందును ప్రయుక్తము కాలేదు. అక్షర గణ ప్రధానములగు వృత్తములే యతి ప్రాసాది

లక్షణములచే తెలుగు లనిపించుకొనుచుండగా మాత్రాగణ ప్రధానములగు సీసము, తరువోజ, ద్విపద మొదలగు జాతివృత్తములు దేశీయములని దేశిచ్ఛందస్సులని పూర్వులు వ్యవహరించుట సమంజసమే గాక శాస్త్రీయమై యున్నది. ద్విపద ప్రాచీన మగు దేశిచ్ఛందస్సు. ద్విపద వాఙ్మయమును గూర్చి సిద్ధాంత వ్యాసమును వెలువ రించిన డాక్టరు జి. నాగయ్యగారు ద్విపద ప్రాచీనతను గూర్చి యిట్లు వ్రాసిరి.

"పాడదగిన పదకవిత్వ లక్షణము కొంత, పఠన యోగ్యమగు పద్య కవిత్వ లక్షణము కొంత సంతరించుకొని గేయమును పాఠ్యమును నైనది ద్విపద...ద్విపదలు వరుసగా నెన్నైనను వ్రాయుటకు వీలగుటయు, దీనికి గాన యోగ్యత యుండుటయు కూడ దీని ప్రాచీనతను సమర్థించుచున్నవి"46

## 6. 4. త్రిపది

సంస్కృతములో 'గాయత్రి', తమిళములో 'కుఱళ్‌వెణ్బా' వలె కన్నడములో త్రిపది ప్రసిద్ధిపొందియున్నది. ఆచార్య డి. ఎస్ కర్కిగారు త్రిపదిని 'కన్నడ ఛందోగంగెయ గంగోత్రి'గా భావించిరి.47 కవిరాజమార్గములో తివది, కిటెల్ ఛందోంబుధిలో తివది, జయకీర్తి ఛందోనుశాసనమున త్రిపదికా, లీలావతీ ప్రబంధ మున 'తివుదె' పేర్లతో త్రిపదులు కనిపించుచున్నవి. ఆంధ్రలాక్షణికులెల్లరు 'త్రిపదు'లనియే పేర్కొనియున్నారు.

కన్నడశాసన వాఙ్మయమున త్రిపదులు విరివిగా కనిపించుచున్నవి. క్రీ. శ. 700 మొదలు క్రీ. శ. 1199 వఱకు లభించిన కన్నడ శాసనములలో 34 త్రిపదు లున్నవని డాక్టర్ ఎమ్ ఎమ్. కలబుర్గిగారు పేర్కొనిరి.48 వానిక్రమము — కన్నడ త్రిపదులలోని విశేషములను ఈ విధముగా సంగ్రహింపవచ్చును

శాసనత్రిపదులన్నియు గద్యములవలె వ్రాయబడినవి. వానిలో బళ్ళిగావి తాళగుంద, హుమ్మచ, బెళ్ళూర, చిత్తహళ్ళి, నీలగుంద, నాగమంగల శాసనములలో పద్యములను వింగడించు గీతలున్నవి ఇతర శాసనములలో ఈ గీతలు కానరావు. పాదములను సూచించు గీతలెందును లేవు తాళగుంద, బల్లిగావి శాసనములలో త్రివది, నీలగుంద శాసనములలో త్రిపది, బెళ్ళూర శాసనములో త్రిపది, హుమ్మచ శాసనములలో 'త్రి' అని సూచనలున్నవి. కన్నడములో మొదటి పద్యమయశాస నమగు బాదామి శాసనములో త్రిపదులుండుట త్రిపదుల ప్రాచీనత వ్యక్తమగుచున్నది

## త్రిపది లక్షణము

నృపతుంగుడు కవిరాజమార్గమున మదనవతి, అక్కర చౌపదులతోబాటు 'తివదు' లను గూడ పేర్కొనెను. కాని వాని లక్షణములను చెప్పలేదు. నాగవర్మ ఛందోంబుధియందు జాత్యధికారమున 'అక్కర'ల తరువాత త్రిపదులను పేర్కొనెను. (5-8, 10, 11) గుణచంద్రుడు ఛందస్సారమున తాళాదిప్రకరణమునందు త్రిపదులను (5-13) పేర్కొనెను. మరియు మానసోల్లాసము (4-16-281, 282) సంగీతరత్నాకరము (Iv - 267-270) ఛందోనుశాసనము (7-9 to 13) లందు త్రిపదీవిశేషములు చర్చింపబడినవి.

## త్రిపది - ఇతర దేశిచ్ఛందములతో సంబంధము

త్రిపదికి పిరియక్కరకు కొన్ని సామ్యములున్నవి. పిరియక్కర పాదమునకు 6 విష్ణుగణములు చివరనొక రుద్రగణము చేరుచుండును. త్రిపది రెండు పాదము లొక పిరియక్కర పాదము కాగలదు. ఉదాహరణమునకు—

నంబిన మనుజగె కంబవెదేవరు
నంబద నరగె దేవరె-బందరు
కంబవె కాణె సరసియె

పై త్రిపదిని ఈ విధముగా మార్చి పిరియక్కర పాదము చేయవచ్చును.

వి వి వి వి వి వి రు

నంబిద మనుజగె కంబవె దేవరు నంబద నరగెదే వరెబంధరు

త్రిపదికి షట్పదికిని కొన్ని సామ్యములున్నవి, షట్పది గణవిన్యాస మిట్లుండును

వి + వి
వి + వి
వి + వి + రు × 2 (నాగవర్మ ఛందోంబుధి 5-13)

త్రిపది పద్యములోని రెండుపాదములను షట్పదిలో నొక భాగముగా చేయవచ్చును

ఉదాహరణమునకు –

| | |
|---|---|
| నంబిద మనుజగె | వి + వి |
| కంబవె దేవరు | వి + వి |
| నంబద నరగెదేవరెబందరు | వి + వి + రు |

పై పద్యమున ప్రాసలక్షణముకూడ సరిపోయినది.

త్రిపదికిని, తమిళమునగల సందియల్ వెణ్బా పద్యమునకును పోలికలుండుట ముందే చర్చించితిని.

నాగవర్మ లక్షణ మనుసరించి త్రిపదులకు మూడు పాదము లనియు, త్రిపదులలో మొత్తము 11 గణము లుండుననియు, 6, 10 గణములు బ్రహ్మగణము లనియు తక్కినవి విష్ణుగణములనియు చెప్పవచ్చును. నాగవర్మ సామాన్య త్రిపదులకు లక్షణము చెప్పి పిదప చిత్ర (త్రిపది), విచిత్ర (త్రిపది) లకు గూడ నియమములను పేర్కొనెను. చిత్రాత్రిపది సామాన్య త్రిపదిని పోలినదే. కాని చిత్రా త్రిపదికి నాల్గు పాదము లుండుట మాత్రము విశేష నియమము. చిత్రా త్రిపది నియమములను యథాతథముగ పాటించి 11 వ గణమును రుద్రగణముగ చెప్పిన యెడల విచిత్రాత్రిపది యగునని నాగవర్మ అభిప్రాయము.

జయకీర్తి ఛందోను శాసనములో చిత్రాత్రిపదికా (7–9) విచిత్రాత్రిపదికా (7–10, 7–11) భేదములను పేర్కొనియున్నాడు. జయకీర్తి లక్షణ మనుసరించి త్రిపదికి నాలుగు పాదములు. మొదటి పాదమున రెండు గణములు, రెండవ పాదమున రెండు గణములు, మూడవ పాదమున నాలుగు గణములు, నాల్గవ పాదమున మూడు గణము లుండవలయును. నాగవర్మ జయకీర్తులు తప్ప నితరు లెవ్వరును త్రిపదీ ప్రభేదములను చెప్పలేదు. నాగవర్మ జయకీర్తుల త్రిపదీ లక్షణములను తులనాత్మకముగా పరిశీలింతము.

| నాగవర్మ | జయకీర్తి |
|---|---|
| త్రిపది – వి + వి + వి + వి | |
| వి + బ్ర + వి + వి | |
| వి + బ్ర + వి | జయకీర్తి ఈ భేదమును చెప్పలేదు. |

చిత్రాత్రిపది (లక్షణ మనుసరించి)

వి+వి
వి + వి
వి + బ్ర + వి+వి
వి + బ్ర + వి

లక్ష్యమనుసరించి

| | |
|---|---|
| వి + వి | వి + వి |
| వి+వి | వి + వి |
| IIII | వి + బ్ర + IIIU + వి |
| వి+బ్ర + వి + వి | వి |
| IIUU | వి + బ్ర + IIIU |
| వి + బ్ర + వి | నగ (విష్ణు) |

విచిత్ర

| | |
|---|---|
| వి + వి | వి + వి |
| వి + వి | వి + వి |
| వి | వి |
| వి + బ్ర + IIII + వి | వి + బ్ర + IIUU + వి |
| రు | రు |
| వి + బ్ర + UIII | వి + బ్ర + UUIU |

చిత్రాత్రిపదిలో 7, 11 గణములు లఘ్వాది విష్ణుగణములై యుండవలయునని జయకీర్తి నాగవర్మకంటె నధికముగా పేర్కొనెను. మరియు త్రిపదులలో 62 మాత్రలకంటె మించిన మాత్రలుండువనియు తక్కువ మాత్రలుండవచ్చుననియు జయకీర్తి విశదీకరించియున్నాడు. (7-12; 7-13) పై పరిశీలనమువలన నాగవర్మ జయకీర్తులు ఒకేవిధముగా త్రిపదులకు లక్షణములను పేర్కొనిరని చెప్పవచ్చును.

తెలుగులో త్రిపదులకు ప్రచారములేదు. ప్రాచీన కావ్యములందు త్రిపదులు కనిపించవు. ఆధునికకవులు కన్నడ సారస్వత ప్రభావితులై తెలుగులోగూడ త్రిపదులను రచించిరి. కాని వానికి తగినంత వ్యాప్తి యేర్పడలేదని చెప్పవచ్చును.

లాక్షణికులు మాత్రము ఛందోగ్రంథములందు త్రిపదులకు లక్షణములను చెప్పియున్నారు. వానిని క్రమముగా పరిశీలింతము.

> త్రిదశేంద్రు లాఱగు పదియగునెడనకున్
> గడియ రెంటను మూఁటను
> నడుకుడుఁ ద్రిపదకు నమరు "

అని కవిజనాశ్రయకర్త రేచన జాత్యధికారమున త్రిపదకు లక్షణమేర్పరచెను. రేచన లక్షణమనుసరించి త్రిపదకు 10 గణములు. కాని కన్నడ త్రిపదకు 11 గణము లుండవలయును. రేచన లక్షణమునందు 6-10 గణముల స్థితి ప్రస్తావింపబడలేదు. కనుక రేచన లక్షణము అస్పష్టము.

విన్నకోట పెద్దన రేచనంటె త్రిపదీలక్షణములను కొంత స్పష్టముగా పేర్కొనియున్నాడు.

> త్రిపదికి నొకయంఘ్రి నింద్రులు నల్వురు    ఇం + ఇం + ఇం + ఇం
> ద్యుపతు లిద్దరు సూర్యులిర్వురొల    ఇం + ఇం + సూ + సూ + సూ
> ద్యుపతి ద్వయార్కులు నొల    ఇం + ఇం + సూ
>
> —కావ్యాలంకార చూడామణి 8-60.

పై లక్షణము కన్నడ త్రిపదికి సన్నిహితము. కాని రెండవ పాదమున ఇంద్ర+ ఇంద్ర + సూర్య + సూర్య +సూర్య గణములు వచ్చుట లక్షణవిరుద్ధము.

అనంతుడు విన్నకోట పెద్దనకంటె త్రిపద లక్షణములను స్పష్టముగా చెప్పెను.

> "సరవిఁ బ్రాసము నొంది సురపతుల్ నలువురు
> హరియు గైకొర్కుల కదయు
> జరుగ నిప్పగిది నొప్పుఁ ద్రిపద
>
> —ఛందోదర్పణము 3-47.

మొదటి పాదమున నాలుగు ఇంద్రగణములు, రెండు మూడు పాదములందు వరుసగా రెండు ఇంద్రగణములు, ఒక సూర్యగణము ఉండునని పై పద్యము పేర్కొను చున్నది. ఆంధ్రలాక్షణికు లెవరును త్రిపదీ ప్రభేదములను చెప్పలేదు.

పై పరిశీలన ననుసరించి కన్నడాంధ్ర త్రిపదుల నియమము లీక్రింది విధముగా నున్నవని నిర్ధారింపవచ్చును.

కన్నడ సాహిత్యములో త్రిపదులకు వచనములనియు వ్యవహారము. సర్వజ్ఞకవి త్రిపదులను సర్వజ్ఞవచనములనుట యిందులకుదాహరణము సర్వజ్ఞకవి పెక్కు త్రిపదులు లాక్షణిక నియమములకు లొంగవు. ఆ ప్రయోగముల నన్నిటిని సాధించుటకై శ్రీ ప్రహ్లాదగారు క్రొత్తపద్ధతిని సూచించిరి. వారి సూచన అనుసరించి బ్రహ్మ విష్ణు రుద్రగణములను వదలి మాత్రాగణములను ఎన్నుకొనవలయును. అప్పుడు త్రిపది నియమము లిట్లుండును.

మొదటి పాదములో 5 మాత్రలు గల 4 గణములు రెండవ పాదములో మొదట 5 మాత్రలు గల 2 గణములు పిదప మూడు మాత్రల ఒక గణము తదుపరి 5 మాత్రల గణమొకటి మూడవ పాదముతో మొదట ఒక 5 మాత్రల గణము పిదప ఒక మూడు మాత్రల గణము తదుపరి 5 మాత్రల గణమొకటి చేర్పవలసియుండును. సర్వజ్ఞుని త్రిపదులతో లక్షణ విరుద్ధగణములుండుట వలన పై పద్ధతి తప్పని సరియైనది.

## కన్నడ సాహిత్యములో త్రిపదులు

కన్నడ శాసనములందును, చంపూకావ్యములందును త్రిపదులు ప్రయోగింపబడినవి. మరియు కన్నడమున సొంత త్రిపది కావ్యములున్నవి. జానపద సాహిత్యమునందును త్రిపదుల గతులుగల గేయము లెక్కువ.

పంపమహాకవి ఆదిపురాణము (6-13-6.100) పొన్నకవి శాంతిపురాణము (10.91-92) చావుండరాయ లోకోపకార, దుర్గసింహుని పంచతంత్ర (1-109) శాంతినాథుని సుకుమారచరితె (2-42) చంద్రరాజు మదనతిలక, అగ్గళకవి చంద్రప్రభపురాణ (4-54) నేమి చంద్రకవి లీలావతీప్రబంధ (2-3 2-41); 6-98, 99, 10-2; 11-51) షడక్షరి రాజశేఖరవిలాస (11-89) బంధువర్మ జీవ సంబోధనె, (231-232) జట్టకవి జట్టమత, పరంజ్యోతి అనుభవముకుర మహాలింగ దేవుని గురుబోధామృత గ్రంథములలో పెక్కు త్రిపదలున్నవి. ఇక సొంతత్రిపది కృతులలో అక్కమహాదేవి యోగాంగత్రివిధి, నిజగుణశివయోగి అనుభవసార,

మల్లికార్జునరాయ చోరకథ మొదలగునవి ప్రసిద్ధములు. ఇవియగాక చందనెయకథె, వాగద్వైతసిరసన త్రిపది, అరవత్తుమూవర త్రిపది, ఎల్లాపురాతనర త్రిపది, పురాతనర శరణెయర త్రిపది, సిద్ధేశ్వర త్రిపదులును ప్రసిద్ధములే.49 కన్నడసాహిత్యములో త్రిపదుల కెనలేని గౌరవము కలిగించిన మహాకవి సర్వజ్ఞుడు. సర్వజ్ఞుని త్రిపదులు విజ్ఞాన సర్వస్వములనుట నగ్నసత్యము.

రాగవిద్దరె భోగ భోగవిద్దరె రాగ
రాగదలి సకలసంపదవు జగదలివి
రాగవే యోగ సర్వజ్ఞ

— సర్వజ్ఞుని త్రిపదులు

తెలుగులో త్రిపదులకు ప్రచారము తక్కువ. శ్రీకలుగోటి అశ్వత్థ నారాయణగారు సర్వజ్ఞుని త్రిపదులను తెలుగున భావరమ్యతతో ననువదించిరి. ద్విపద, ఆటవెలది, తేటగీతులకు ఆదరణ ఎక్కువయగుటవలన తెలుగులో త్రిపదులకు వ్యాప్తి కలుగలేదు.

## త్రిపది మరికొన్ని విశేషములు

కళ్యాణి చాళుక్య వంశజుడగు మూడవ సోమేశ్వరుడు విరచించిన అభిలషితార్థ చింతామణి లేదా మానసోల్లాసమను గ్రంథములో త్రిపదీ లక్షణములున్నవి. మానసోల్లాస కర్త త్రిపదులను పాడెడి పద్ధతులను గూర్చి చర్చించి యున్నాడు. త్రిపదులను గానము చేయునపుడు మొదటి రెండు పాదములను మూడవ పాదములో కొంత భాగమును చెప్పి, మరల ఆ పాదములను ఆవృత్తము గావించి నాల్గవ పాదముతో ముగింపవలెనని సోమేశ్వరుడు వీశదీకరించెను. (4-16-281) ఇతడే 'త్రిపదీ ఖండనేచైవ శృంగారే విప్రలంభకే' (4-16-551) అని త్రిపదులను ఏయే సందర్భములలో గానము చేయవలయునో విశదీకరించి యున్నాడు. ఈ వాక్యమనుసరించి త్రిపదులు దంపుడు పాటలుగా, శృంగార గీతికలుగా, విప్రలంభ గేయములుగా నుండుననీ యూహింపవచ్చును. త్రిపదులకు మూడు పాదములనుటయే లెస్స. దంపుడు కార్యమునందు నొకరయినచో విసుగు కలుగును. ఇద్దరయినచో పని మధ్యమము. నలుగురయినచో సౌలభ్యము. కనుక ముగ్గురు చేరి దంచుచుండుట సంభవించుచుండును. ఒక్కొక్కరు క్రమమెరిగియని విధమున నొక్కొక్క పాదము పాడుట వలన నేర్పడిన పద్యముగా 'త్రిపది' నూహింపవచ్చును. ఆంధ్ర

లాక్షణికుడగు విన్నకోట పెద్దన తరువోజను దంపుడు పాటగా భావించి యుండుట (8-50) నిట స్మరింపఁ దగినది. దేవప్పయను కన్నడకవి (క్రీ. శ. 1540) శబరుల ధాన్య ఖండనమును వర్ణించియున్నాడు. కన్నడ ఉద్భట కావ్యకర్తయగు సోమరాజు గూడ స్త్రీలు త్రిపదులను దంపుడు పాటగా పాడువారని యుల్లేఖించి యున్నాడు.

### 6. 4. 1. మదనవతి

కన్నడ లాక్షణికులలో నాగవర్మ యొకడు మాత్రము 'మదనవతి' అను ఛందోవిశేషమును పేర్కొనెను. కన్నడిగుడగు జయకీర్తి ఛందోనుశాసనములో 'మదనవతిని' పేర్కొనియున్నాడు.

'మదనవతి' అంశగణవిన్యాస దృష్టితో పరికింప నొకవిధమగు విషమ వృత్తము. మాత్రాదృష్టితో పరిశీలింప సమవృత్తమగును కనుక నాగవర్మ ఛందోంబుధి యందు మదనవతికి రెండువిధములగు లక్షణములను (5-17&15) పేర్కొనెను.

దేశీయ గణముల ననుసరించి మదనవతికి ఈ క్రింది విధముగా లక్షణము చెప్పవచ్చును.

1. మదనవతికి నాలుగు పాదములు
2. మొదటి పాదమున 5 విష్ణు గణములు 1 గురువు
3. రెండవ పాదమున 4 విష్ణు గణములు 1 రుద్రగణము
4. మూడవ పాదమున 4 విష్ణు గణములు 1 బ్రహ్మగణము
5. నాల్గవ పాదమున 3 రుద్ర గణములు 1 విష్ణుగణము
6. ప్రాస నియతము

నాగవర్మ లక్ష్యపద్యమనుసరించి పరిశీలింప గణములు భిన్నములైనను మాత్రలసంఖ్య సమానముగా కనిపించుచున్నవి. 'పాదమునకు 22 మాత్రలు గలిగి, నాలుగుపాదములు గల పద్యవిశేషము 'మదనవతి' అనుట సమంజసమే.

జయకీర్తి ఛందోనుశాసనములో 'మదనవతికి' ఈ క్రింది విధముగా లక్షణము పేర్కొనియున్నాడు.

ప్రథమక ఇహ గురుపరకృతి పరిమిత లఘ్వదితరే
పృథపాదా రతిగణపరగతి మదనగణాః స్యుః
గ్రథిత పదావలయస్త్యై శ్చేదితి మదనవతీ
ప్రథితయతిః ప్రతిచరణం ద్వావింశతి మాత్రా

—ఛందోనుశాసన - 7-19

జయకీర్తి ననుసరించి మదనవతిస్వరూపము ఇట్లుండును.

| | |
|---|---|
| 20 లఘు + 1 గురు | 22 మాత్రలు |
| వి+వి+వి+వి + బ్ర | 22 మాత్రలు |
| వి + వి + వి + వి + బ్ర | 22 మాత్రలు |
| వి + వి+వి + వి + బ్ర | 22 మాత్రలు |

పై ఇరువురి లక్షణములలోని భేదసాదృశ్యముల ఈ విధముగా వర్గీకరింపవచ్చును.

నాగవర్మ ప్రథమ పాదమున 20 లఘువులు + 1 గురువు అని చెప్పలేదు. నాగవర్మ లక్ష్యపద్యమునందును ఈ నియమము కుదురదు. నాగవర్మ లక్ష్యపద్య మనుసరించి ప్రతిగణమునకు విరామము పాటింపవలయుననుట నియమమై కనిపించును కాని జయకీర్తి పాదాంతయతిని మాత్రము చెప్పినట్లున్నది. నాగవర్మ లక్షణము నందు చివరి పాదమున రుద్రగణములు చెప్పబడినవి. కాని జయకీర్తి రుద్రగణము లను సూచింపలేదు. మదనవతి పాదమునకు 22 మాత్రలుండుటను నాగవర్మ చెప్పకున్నను లక్ష్యమున 22 మాత్రలే యున్నవి. జయకీర్తి 22 మాత్రల నియమ మును వాచ్యముచేసెను. పై పరిశీలనమువలన అంశగణములతో కూడిన ఛందో విశేషము మాత్రాగణాన్వితమైనదని యూహింపవలసియున్నది.

మరాఠీభాషలో ప్రసిద్ధమైన 'శుభకామి' పద్యమున మదనవతి నియమనులు కనిపించుచున్నవి.

| | |
|---|---|
| జాళీల జరీ దీపవునీ లోచన జాఈ | 22 మాత్రలు |
| హతీ సుమనే పాంయతలీ ధన్యతుజ్యాహీ | 22 మాత్రలు |
| భృంగా పరిత్యా పోటభరు లోలుప కామీ | 22 మాత్రలు |
| భేదివ్యపతంగా పరిహామీశుభకామీ | 22 మాత్రలు |

— మాథవపటవర్ధన - ఛందోరచనా పుట 305 పద్య 219

శాసనములందుగాని, చంపూ కావ్యములందుగాని మదనవతి పద్యములు లేవు. ఆంధ్రలాక్షణికులు మదనవతి యను పేరుగల ఛందోవిశేషమును పేర్కొనలేదు. ఆధునిక కన్నడ కవులలో శ్రీ బేంద్రె, శ్రీ కర్కిగారు 'మదనవతి' పద్యములతో కొన్ని ఖండకావ్యములు రచించియున్నారు. శ్రీ బేంద్రెగారి ఋతుగాన, శ్రీ కర్కిగారి నక్షత్రగాన కృతులు 'మదనవతి'తో వ్రాయబడినవియే.

షణ షణవూ హొసహొసతిదు ఘనగగన వితాన
దిన దిన గ్రహ మాలెయరిం గణగుణిసిద తాన
తిరుతిరుగియు హొసతాగిరి ఎనుతిదె ఋతుగాన
ఈ హాడిగె శ్రుతి హిడిదిదె బ్రహ్మాండద మౌన

—బేంద్రె నాదలీలె - ఋతుగాన

### 6. 4. 2. అక్కరికె

కన్నడ లాక్షణికులలో నాగవర్మయొకడే 'అక్కరికె' లక్షణమును పేర్కొనెను. జయకీర్తి ఛందోనుశాసనములో, 'అక్షరికా' అను పేరుతో 'అక్కరికె' నియమములను పేర్కొనియున్నాడు. ఆంధ్రలాక్షణికు లెవరును 'అక్కరికె'ను పేర్కొనలేదు.

నాగవర్మ ఛందోంబుధియందు 'అక్కరికె'కు (5-14) పేర్కొనిన లక్షణములను ఈ విధముగా సంగ్రహింపవచ్చును.

1. 'అక్కరికె'కు నాలుగు పాదములు
2. ప్రతిపాదమున వరుసగా వి-బ్ర-వి-బ్ర వి-రు గణము లుండును. పాదమునకు 26 మాత్రలు.
3. 8 మాత్రలపై యతి పాటింపవలయును.
4. కన్నడ పద్యములలో అక్కరికెకు సమానపద్యమేదియు లేదు.

కన్నడిగుడగు జయకీర్తి ఛందోనుశాసనమున నాగవర్మకంటె విస్తృతముగా 'అక్కరికె'కు లక్షణము పేర్కొనెను.

'స్మరరతి పూర్వం స్మరరతి మధ్యం స్మరయుగ గురు నిధనమ్
చరణ చతుష్కం స్థిరతర చతురుతర శతమాత్రమిదమ్
కరివసు మాత్రా విరమణయుక్ చేత్ స్ఫురతి తదక్షరికా
గురుపర జగణేతరగతి మాత్రాధరణ ధాధధవా'

— ఛందోనుశాసనము 7-18

జయకీర్తి లక్షణమనుసరించి విష్ణుగణములైనను బ్రహ్మగణములైనను చతుర్మాత్రాకములే యుండవలయునని తెలియుచున్నది. జగణము చతుర్మాత్రాకమైనను 'అక్కరికె'లో ప్రయోగింపరాదు.

కావ్యములందుకంటె జానపద గేయములందు ఎక్కువగా 'అక్కరికె'లు కనిపించుచున్నవి ఉదాహరణమునకు —

మావన మగళే మల్లిగె యరళే ఏరుమం చవ తరళే

ఆధునికులలో శ్రీ బేంద్రెగారు 'అక్కరికె' పాదమును మూడు భాగములు చేసి నూత్నలయను సాధించిరి.

కాలూరితు మళె
కత్తెత్తితు బెళె
హనియొడయితు మోడ
కిలికిలి హక్కి
కులుకులు నక్కి
దయెగతెయితు నోడా

— బేంద్రె - నాదలీలె - నిగినిగిముగిలు

దొరెయక్కరతప్ప మిగిలిన అక్కరల పాదాంతమున రుద్రగణముండును. ఈ అక్కరికె యందును పాదాంతమున రుద్రగణమున్నది. అక్కరల ఛాయ యుండుట వలన 'అక్కరికె' అను పేరు ప్రసిద్ధమై యుండవచ్చును

**6. 4. 3. గీతికె :**

కన్నడ లాక్షణికులలో నాగవర్మ యొకడే 'గీతికె' లక్షణమును (5-19) పేర్కొనెను. జయకీర్తియు ఛందోను శాసనమున 'గీతికా' అను పేరుతో గీతికె (7-20) నియమములను విశదపరచి యున్నాడు.

"గీతికె కు నాలుగు పాదములు. 1, 3 పాదములందు మూడు గణములు, 2-4 పాదములందు నాలుగు గణము లుండును. రెండవ ఆరవ గణములు బ్రహ్మ గణములై యుండవలయును. ఇతర గణములు బ్రహ్మ, విష్ణు, రుద్రగణములలో నేవేని రావచ్చును." అని నాగవర్మ లక్షణము.

జయకీర్తి గీతికె లక్షణ మిట్లున్నది–

రగణో ద్వితీయే షష్ఠేచ
లగణో ధగణోవాన్యత్ర పంచస్వర్ధయోశ్చ
త్రిగణోయుక్ సమపాదోద్విగణో
నిగదితా గీతికాలంకారే ప్రభుసేన్యైః

—ఛందోనుశాసన 7-20.

పై శ్లోకమున గల రగణమనుటకు బ్రహ్మగణమనియు, లగణమనుటకు విష్ణు గణమనియు ధగణమనుటకు రుద్రగణమనియు నర్థములు. మొదటి పాదమున 3 గణములు, రెండవ పాదమున 5 గణములని యిట్లే మూడు నాలుగు పాదము లుండవలయునని జయకీర్తి సూచించెను.

నృపతుంగుని కవిరాజ మార్గము, నాగవర్మ కావ్యావలోకనములందు గీతికెలున్నవి. కాని పైన పేర్కొనబడినవన్నియు అలంకార గ్రంథములే. 'మదన తిలక' కావ్యములో గీతికెలున్నవి. ఆంధ్ర లాక్షణికులెవరును కన్నడ గీతికెలను పోలినవి చెప్పలేదు. గీతికె యందలి గణ నిర్మాణము, పాదనియమములు కొంత వఱకు కందములను పోలినవే

## 6. 4. 4. సాంగత్యము – చరిత్ర :

కన్నడ సాహిత్య కావ్యరాశిని ఛందోదృష్టితో నాల్గు విధములుగా వర్గీకరింప వచ్చును. చంపూ కావ్యములు – రగళె కావ్యములు – షట్పది కావ్యములు–సాంగత్య కావ్యములు. ప్రాచీన కన్నడ సాహిత్యములో రగళెలు కలవు. షట్పదులును గలవు కాని సాంగత్య పద్యములు లేవు. లాక్షణికు లెవరును సాంగత్యమును పేర్కొనలేదు.

దేశిచ్ఛందములగు ఏళె, త్రిపదులకంటె గానానుకూలమైన ఛందో విశేషము సాంగత్యమగును. మధురస్వర సాంగత్యము ప్రధాన లక్షణమగుట వలన ఈ

నామము సార్థకము. సంగతితో కూడినది సాంగత్యము. సంగతి యనగా మేళగతి. అనగా వాద్యగతి జంత్రగాత్ర సంగీతముల కనువగు పదబంధము కలది సాంగత్యము. సంగీతశాస్త్రమున గూడ 'సంగతి వేయుట' అను పరిభాష యున్నది. సంగీతమునకు సాంగత్యమునకు సహజసంబంధముండుట వలన సంగతినుండి సాంగత్యమేర్పడిన దనుట సరియగు నూహయే. మరియు సంగతి యనగా సంఘటనమను అర్థమున్నది. పాటలరూపమున నొక సంఘటనమును నిరూపించుట సాంగత్యమే కాగలదు. లాక్షణికులెవరును 'సాంగత్యలక్షణముల' పేర్కొనకపోయినను క్రీ. శ. 15 వ శతాబ్దమునుండి సాంగత్యకృతులు వెలయుట చిత్రము. ప్రయోగముల నాధారముగా సాంగత్య నియమములను ఈ విధముగా చెప్పవచ్చును.

1. సాంగత్యమునకు నాలుగు పాదములు. 1–3 పాదములందు 4 విష్ణు గణములు. 2–4 పాదములందు 2 విష్ణుగణములు 1 బ్రహ్మగణము రావలయును. ఆది ప్రాస పాటింపవలయును.

2. సాంగత్య పాదములందు విష్ణు గణములకు బదులుగా రుద్రగణములను గాని బ్రహ్మ గణములను గాని ప్రయోగింపవచ్చును.

3. బ్రహ్మ, విష్ణు, రుద్రగణ నియమములకు లొంగని అక్షర సముదాయము కూడ సాంగత్యములో నెడనెడ కనిపించును. ఇది గేయ ధర్మమగును. సాంగత్యమున కుదాహరణము:

వి వి వి వి
ముత్తిన చావడి యొళమణి పీఠది
వి వి బ్ర
చిత్తజ రూపుకు శ్శిరలు
వి వి వి వి
చిత్తదొ ళానంద మొదవెకా ణికెగళె
నిత్తుకై గళనెత్తి ముగిదు

—నాగకుమార చరితం సంధి 11-పద్య 94

**సాంగత్యము - ఇతర దేశిచ్ఛందములు :**

సాంగత్యమునకు త్రిపదికిని సామ్యములున్నవి. త్రిపదికి మూడు పాదములు. రెండవ పాదములో చివరి గణము 'తనిసొల్లు' ప్రత్యేక పదము. ఆ 'తనిసొల్లు'ను తొలగించినచో సాంగత్య పాదమగును. ఉదాహరణమునకు—

వి వి వి వి
ఘనభేరి యాదరు నెనెదరె మళెయొళు
వి వి బ్ర
దనియను హేగె కొ టీతు

సాంగత్యమునకు 'ఏళె'కు సామ్యములున్నవి. ఏళెకు రెండు పాదములు. ఏళె మొదటి పాదములో 4 విష్ణుగణములు, రెండవ పాదమున 1 విష్ణు 1 బ్రహ్మ 1 విష్ణుగణము చేరును. చివరి విష్ణుగణములో నొక అక్షరమును ముందటి బ్రహ్మగణమునకు చేర్చినచో నది విష్ణుగణమగును. చివరిది బ్రహ్మగణమగును. అప్పుడు 'ఏళె' సాంగత్యము యొక్క రెండుపాదములగును. ఉదాహరణమునకు

కుదరేన తందేని జీనబి గిసిదేని
బరబేకు తంగీ మ దువెగె

నాడపదగళు - సువ్వియహాడు 90

సాంగత్యమునకు గీతికెకు సామ్యములున్నవి. గీతికెకు కూడ నాలుగు పాదములే 2-6 గణములు బ్రహ్మగణములై యుండి తక్కినవి విష్ణుగణములో, రుద్రగణములో లేదా బ్రహ్మగణములో కావచ్చును. గీతికె రెండవపాదమును సాంగత్యము యొక్క ప్రథమ పాదముగా తలంచిన నాలుగుగణముల నియమము సరిపోవును అట్లే గీతికె మొదటిపాదమును సాంగత్యముయొక్క రెండవపాదముగా భావించినచో సాంగత్యలక్షణ మించుమించు సరిపోవును. ఉదాహరణమునకు —

వి వి వి వి
చరితార్థ నతిరుచి హరిసాహ సేశ్వరం
వి వి బ్ర
హరిభక్త నివనెనె దొరెయుం

మదనతిలక 10-14-15

తమిళభాషలో 'సాంగత్య' మను పేరుగల పద్యములేదు. కాని సాంగత్యమును బోలిన తమిళపద్యమొకటి కన్నడ కైపిడియందు నుదాహరింపబడినది.

పరజమర్ పడై యుడై యూరుమై పరవువార్
అరశర్గ శలగిలా వారే

– కైపిడి – పుట 158

తమిళలాక్షణికులు పైపద్యమును 'ఎళుశీర్ ఆశిరియవిరుత్తముగా' భావింతురు. ఇట్లు సాంగత్యమునకు త్రిపది, ఏళె, గీతికె మొదలగు ఛందోరీతులతో సామీప్య సంబంధము కలదని స్పష్టమగుచున్నది.

## కన్నడ సాహిత్యములో సాంగత్య గ్రంథములు :

కన్నడ సాహిత్యములో బసవమహాకవి (క్రీ. శ. 12) కాలమునుండి సాంగత్య పద్యములున్నట్లు డాక్టర్ డి. ఎస్. కర్కిగారు పేర్కొనిరి.50 కాని బసవమహాకవి కృతిగా చెప్పబడు 'కాలజ్ఞానవచనము'లను గూర్చి పండితుల మధ్య భేదాభిప్రాయము లున్నవి. ప్రసిద్ధికోరిన తరువాతి కవులెవరో బసవమహాకవి పేర 'కాలజ్ఞానవచనము'లను రచించియుండవచ్చునని పరిశోధకులభిప్రాయపడుచున్నారు ఇది సాంగత్య వాఙ్మయ వికాసములో ప్రథమదశయగును.

సొంత సాంగత్యకావ్యములను రచించిన మహాకవి శిశుమాయణుడు (కాలము 1233) అంజనాచరిత్రె, త్రిపురదహన సాంగత్య మొదలగునవి శిశుమాయణుని ప్రసిద్ధ సాంగత్యకృతులు. ఇది సాంగత్య వాఙ్మయ వికాసములో రెండవదశయగును.

సాంగత్య వాఙ్మయ వికాసములో మూడవదశ దేవరాజకవితో (కాలము 1400) ప్రారంభమగుచున్నదని చెప్పవచ్చును. కన్నడ పరిశోధకులగు శ్రీ గోవిందపైగారు దేవరాజు మొదటి సాంగత్య కర్త అని అభిప్రాయపడిరి. శిశుమాయణుని కాలమును గురించి అభిప్రాయ భేదములుండుట వలనను అంజనా చరిత్రె సాంగత్య కావ్యములోని అన్యభాషాపద ప్రయోగముల బట్టియు శిశుమాయణుడు క్రీ. శ. 1472 కాలము నాటివాడయి యుండవచ్చుననియు శ్రీ గోవిందపైగారు భావించిరి.

సాంగత్యవాఙ్మయ వికాసములో 16 వ శతాబ్దమును సువర్ణదశగా చెప్పవచ్చును. క్రీ. శ. 16, 17, 18 శతాబ్దములలో 104 గురు సాంగత్యకవులు

మున్నూటికి మించిన సాంగత్యకృతులను వెలువరించి యున్నారు. వారిలో రత్నాకర వర్ణి, నంజుండ, కనకదాస, మంగరస హొన్నమ్మ ప్రభృతులు ప్రసిద్ధులు.

సాంగత్య కావ్యములను మూడు విధములుగా వర్గీకరింపవచ్చును 51 అవి వరుసగా ధార్మిక కావ్యములు-ఇతిహాస మిశ్ర కావ్యములు – నీతి ప్రధాన కావ్యములు నేమిజినేశసంగతి, భరతేశవైభవ, నాగకుమార చరితె మొదలగునవి జైన ధార్మిక కావ్యములగును. హరిశ్చంద్ర సాంగత్య, భైరవేశ్వర చరితె, సానంద గణేశసాంగత్య మొదలగునవి వీరశైవ ధార్మిక కావ్యములు. పద్మినీ కల్యాణ, మోహన తరంగిణి, కృష్ణచారిత్ర మొదలగునవి వైష్ణవ ధార్మిక కావ్యములు. కుమార రామసాంగత్య, కందీరవ నరసరాజ విజయ, కుమట రామన కథె, బిజ్జళరాయన చరితె మొదలగునవి ఇతిహాస మిశ్ర కావ్యములగును. హదిబదెయధర్మ, నీతిశతకద సాంగత్య, చంద్రహాసనకథె మొదలగునవి నీతి ప్రధాన కావ్యములు.

సాంగత్య కావ్యము లనుటలో సాంగత్య పద్యబహుళ కావ్యమనియే అభిప్రాయము. కల్యాణ కీర్తి (1438) కామనకథెలో కందపద్యములున్నవి. విజయణ్ణ (1448) ద్వాదశానుప్రేక్షలో కొన్ని వృత్తములును గలవు. మంగరస (1509) నేమిజినేశసంగతిలో రగళెలు కూడ నున్నవి. నంజుండకవి (1525) రామనాథ చరితెలో కొన్ని షట్పదులున్నవి.

ఆధునికులలో శ్రీ బేంద్రె, శ్రీ పు. తి. నరసింహాచార్, శ్రీ ఎస్. వి. పరమేశ్వర భట్ట, శ్రీ డి. పద్మనాభశర్మ ప్రభృతులు పెక్కు సాంగత్య కావ్యములను రచించియున్నారు. ఈ సాంగత్య చ్ఛందస్సునకు తెలుగులో ప్రచారము తక్కువ. దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయమున కొన్ని సాంగత్యములు తెలుగులో రచింపబడినవి. సాంగత్య కావ్యములకు వ్యాప్తిలేకున్నను స్త్రీలపాటలలో సాంగత్యచ్ఛాయలు కనిపించుచున్నవి. కనుక కన్నడాంధ్రములందు గల ఛందో విశేషముగా సాంగత్యము నెన్నుకొనుట సమంజసమే.

## 6. 5. ఉపజాతులు :

పద్యములు రెండువిధములు- వృత్తములు, జాతులు. అక్షరగణ నిబద్ధములు వృత్తములు మాత్రాగణ నిబద్ధములు జాతులు. సంస్కృతములోను వృత్తములు

జాతులు అని పద్యములు రెండువిధములుగలవు. వారు వానిని 'అక్షర చ్ఛందస్సు, మాత్రాచ్ఛందస్సు' అని వ్యవహరింతురు. కన్నడములోగూడ వృత్తములు, జాతులను విభాగములున్నవి. తెలుగులో వృత్తములు, జాతులను విభాగముతోబాటు 'ఉప జాతులను' ప్రత్యేక వర్గీకరణమొకటియున్నది. రేచన కవిజనాశ్రయమున 'ఉపజాతి' సంజ్ఞను జాత్యధికారమున వాడియున్నాడు. జాత్యుపజాతులని లక్షణకర్తలు పేర్కొన్నను అప్పకవియే వీనిని సరిగా నిర్వచించెను అతని నిర్వచనమిది.

"గురులఘువులలో నేయ్యది
మురసంహర ! ప్రథమ పాద ముఖమున నిలిచెన్
ధర నుపజాతులు దక్కఁగఁ
బరఁగ నిలుచునని యె నాల్గుపదముల మొదలన్

ధరణిన్ జాతుల కాది వర్ణ మొకఁడే తప్పంగ రా దెల్లెడన్
హరి ! తజ్జాతి గణంబు లైన సరి యిట్టట్టైనఁ గావచ్చు మం
దరధారీ ! యుపజాతులం, బ్రథమ వర్ణంబున్ యథేచ్ఛంబుగా
నొరిడింజెప్పగవచ్చుఁ బ్రాసములు నిల్చున్ వళ్ళకై యొక్కచోన్"

అప్పకవీయము 4-261, 262

పై పద్యములననుసరించి ప్రాసకారణముగా జాతులు, ఉపజాతులను విభేదములు కలిగి నట్లు చెప్పవచ్చును. ప్రాసనియమముకలవి, ప్రాసయతికి వీలులేనివి జాతులు. ప్రాస నియమములేనివి యతికి ప్రాసయతి చెల్లించుటకు వీలయినవి ఉపజాతులు. సీసము, ఆటవెలది, తేటగీతి మంజరీ ద్విపదలు ఉపజాతులగును. ఉపగణములకు సూర్యేంద్ర గణములు ఉపజాతులలో ప్రయుక్తమగును. గురులఘ్వక్షర నివేశక్రమ రాహిత్యము వలన ఈ పద్యముల నిర్మాణమున కవికి అపారమైన స్వేచ్ఛకలదు.

### 6. 5. 1. సీసము :

సీసము సంస్కృతచ్ఛందమనియు, దేశిచ్ఛందమనియు ప్రధానముగా రెండభి ప్రాయములున్నవి.

"సంస్కృతలాక్షణికులగు భరిత, జనాశ్రయ, జయకీర్తులు శీర్షకమును విశదీక రించియున్నారు సీసము శీర్షక భవము. సీసగీతులు విరాట్ఛందో భవములు. వీని

కాకరము ఋగ్వేదబ్రాహ్మణమున కలదు. ఆ బ్రాహ్మణమునందు సీసమునకు త్రపువను పేరుకలదు"—కనుక సీసములు సంస్కృతచ్ఛందో విశేషములే అని యొక అభిప్రాయము.

"సీసము తెనుగు బాసతో వాసికెక్కిన దేశిపద్య విశేషము. ఇది ఉపజాతి వర్గమునకు చెందినది. సంస్కృతములో సీసములకు వ్యాప్తిలేదు"—కనుక సీసము దేశిచ్ఛందమని మరియొక అభిప్రాయము.

భరతుడు నాట్యశాస్త్రమున (32 వ అధ్యాయము) శీర్షకమును వేర్వేఱర్థములందు నుపయోగించెను. ఆ అభిప్రాయములను ఈ విధముగా సంగ్రహింపవచ్చును.

"పదునెనిమిది ధ్రువాంగములలో శీర్షకమొకటి. ఇది ధ్రువాభేదము. శీర్షక పాదమున నాల్గుమాత్రల గణములు 7½ ఉండును. అనగా పాదమునకు 30 మాత్రలు. పాదమునందు 21 మొదలు 26 వఱకు అక్షరములుండును. చపలా శీర్షకము, స్థలిత శీర్షకమని శీర్షకములు రెండు విధములు. నానావృత్త నిష్పన్నములగు పాదములతో శీర్షకములను నిర్మింపవచ్చును. శీర్షకమను తాళభేదమనుసరించి యేర్పడిన పద్యము శీర్షకము."

ఆంధ్ర సీసమునందు పాదమున 30 మాత్రలుండుట సంభవమే యైనను 22 అక్షరము లుండుట అసంభవము. సీస పాదమున 22 అక్షరములకు తక్కువ యుండుటకు వీలులేదు.

శీర్షకమను పద్యభేదమును గూర్చి ప్రసంగించిన మొదటి లాక్షణికుడు జనాశ్రయుడు. అతడు చెప్పిన శీర్షక లక్షణమునకును తెలుగు సీసపద్య లక్షణమునకు సంబంధము కనిపింపదు. జనాశ్రయుని లక్షణములను (5-44-52) ఈవిధముగా సంగ్రహింప వచ్చును.

పాదమున నాలుగు లేక ఐదు మాత్రల గణములు ఆఱు కలది అధికాక్షర, ఇందు సమస్థానముల జగణముండరాదు. తృతీయ స్థానమున జగణమే యుండవలెను పాదాంతమున నగముగాని రగణముగాని యుండవలెను. నగ రగణములు ఒకప్పుడు పాదాదియందును ఉండవచ్చును. ఇట్టి అధికాక్షరపై నొక గీతికను చేర్చినచో శీర్షకము, లలిత, సుభద్ర, రవిద్రుమ, వంశపత్ర, కుంజర, వంశపుష్ప-

దంతమాలలు శీర్షక భేదములు. పాదమున రేడు గణములు గలది లలిత శీర్షకము. ఒక్కొక్క గణము పెరుగుటచే భద్రాది శీర్షకము లేర్పడును.

తెలుగు సీసములో జగణము నిషిద్ధము. సీస పాదాంతమున నగ రగణము లెన్నడును సంభవింపవు కనుక జనాశ్రయుని శీర్షకమునకు ఆంధ్ర సీసమునకు లక్షణమునందెట్టి సామ్యమును లేదని చెప్పవచ్చును.

సీసపద్య లక్షణము :

కన్నడ సాహిత్యములో సీసపద్యములకు ప్రచారము లేకున్నను కన్నడ లాక్షణికులు సీసపద్యములకు లక్షణము చెప్పియున్నారు. కిటిల్ పరిష్కృతమయిన నాగవర్మ ఛందోంబుధియందు నొక కందపద్యమున ( ) సీసనియమములు కలవు. నాగవర్మ నియమమనునరించి సీసపద్య పాదమున ఆరు పురుహూతగణములు, చివర రెండు సరసిజసఖ గణము లుండవలయును. అట్టివి నాల్గుపాదములు కూర్ప సీసమగును. ప్రతిపాదమునందు మొదటి నాల్గుగణములపై ఆదిప్రాస పునరావృతము గావలయును. ఆపై ఆటవెలదిని చేర్పవలయును నాగవర్మ ఆటవెలది లక్ష్యమొసంగెను గాని లక్షణము పేర్కొనలేదు.

కన్నడిగుడగు జయకీర్తి శీర్షకములను జాతులలో చేర్చెను.

"సంస్కృత వాచ్యార్యాద్యాః
ప్రాకృత విషయేతు గళితకాద్యాః బహుధా
కర్ణాటకేషరాద్యాః
విషయ ... శీర్షకాది జాతయ ఉదితాః"

—ఛందోను శాసనము - కర్ణాటజాత్యధికారము.

సంస్కృతమున ఆర్యలు, ప్రాకృతమున గళితకాదులు, కర్ణాటకమున అక్షరాదులు జాతులగును. విషయే అను పదము పిదప అక్షరములు కనిపించుటలేదు. అచట 'ఆంధ్రే' అని యుండవచ్చునని డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు భావించిరి.[52] అట్లయినచో ఆంధ్రమందలి శీర్షకాదులు (సీసములు) జాతులని అర్థము వచ్చును. రేచన గూడ సీసగీతాదులను జాత్యధికారమందే చెప్పెను. 'ఉపగణమాత్రాభిరన్వితా జాతిః (అప్పకవీయము 2 వ ఆధ్యా. - చింతామణికారిక) అను న్యాయమున సూర్యేంద్రగణ నిర్మితమయిన సీసమును జాతియన్నను దోసములేదు.

గుణచంద్రుడను కన్నడ లాక్షణికుడు ఛందస్సారమున సీసమును తాళాది ప్రకరణమున చేర్చి లక్షణము (5-18) ప్రవచించెను. వీరభద్రుడు నంది ఛందోర్ణవమునందు సాధారణసీస - విడిసీస వృత్తగర్భిత సీసములను విశదీకరించియున్నాడు వీరభద్రుడు చెప్పిన సీసలక్షణము తెలుగులక్షణమును పోలినదే.

"సురపతి గణ మొద లారుం
భర డిందెరడ్గ దల్లి భాస్కర గణగళ్
వర నాల్కు చరణకి పరి
బరలదు తుది గీత సీసపద్యవు సఖియే"

—నంది ఛందోర్ణవము 3-19.

వర సీస ద్విపద గళిగొడి
తరుణీ కేళెందు గణది తధ్య మిదెందుం

—నంది ఛందోర్ణవము 3-23.

పై పద్యములందు గల సురపతిగణ - భాస్కరగణ - యతిస్థానములను వివరణమనుసరించి వీరభద్రుడు తెలుగు లక్షణ గ్రంథములను చూచి కన్నడమున సీసపద్య లక్షణములను చెప్పినట్లు తలంపవలసియున్నది.

ఆంధ్రలాక్షణికులెల్లరు సీసపద్యలక్షణములను ఏకాకారమున చెప్పిరి. సీసము లనుగూర్చిన అనంతుని లక్షణమిట్లున్నది.

"నల నగ సల భరతలలో
పలనాయను మీఁద రెండుఁబద్మా ప్తగణం
బులఁదగి నాలుగు పదములఁ
జెలువగు నొక గీతి తోడ సీసము కృష్ణా

—ఛందో దర్పణము 3-22

సీసము రెండు గణంబుల
ప్రాసంబేనియును మఱి విరామంబైనన్
భాసిల్లు ... ... ... 3-23

పై పరిశీలనము వలన సంస్కృత కన్నడ లక్షణముల కంటె తెలుగు సీసముల లక్షణము సమగ్రమని చెప్పవచ్చును.

## సీసములు - వాని ప్రభేదములు :

ఒక విధమగు లక్షణముగల పద్యముపై వేరొక విధమగు లక్షణముగల పద్యమును చేర్చినచో రెండును గలిసి శీర్షకమను పద్యమేర్పడును. రెండవ పద్యము మొదటి పద్యమునకు శిరోభూషణము వలె నుండును. కనుక మొత్తము పద్యమును శీర్షకమని వ్యవహరింపవచ్చును. శీర్షకమునకు వికృతి సీసకము, దేశిచ్ఛందములందు సీసము చాల పెద్దది. రగడాదులందువలె సీసమునందును పెక్కు ప్రభేదము లున్నవి. ఆ విభాగములను మూడు విధములుగా వర్గీకరింపవచ్చును. మొదటిది సీస పాదములకు చేర్పబడు గీతుల ననుసరించినవి. రెండవది సీసపద్యములందు ప్రయుక్తమగు గణ సంయోజన మనుసరించినది. మూడవది యతిప్రాస స్థాన నియమములనుసరించినవి.

అజగరము వంటి దీర్ఘకాయముగల సీసపద్యము విషయ విస్తరణమునకు తగిన వాహనము. అట్టి సీసపాదములకు ఆటవెలదిని గాని తేటగీతిని గాని చేర్పవచ్చునని లాక్షణికులు నిర్దేశించిరి. నాగవర్మ ఛందోంబుధిలో సీసమునకు ఆటవెలది అనుసంధానింపబడినది వీరభద్రుడు నందిఛందోర్ణవమునందు సీసములకు ఆటవెలది, తేటగీతులను చేర్పదగునని చెప్పుటయగాక లక్షణ గ్రంథమందు పెక్కుచోట్ల రెంటింటిని ప్రయోగించియున్నాడు. ఆంధ్రసాహిత్యమునందాది కవియగు నన్నయ సీసపాదయులకు ఎక్కువగా ఆటవెలదులనే అనుసంధానించెను. ఆటవెలది పాదద్వయము సీసపాదముగుటవలన గతిసామ్యము కుదురుటకు వీలున్నది. నన్నయ తరువాత సీసములకు తేటగీతులను జేర్చుట ఎక్కువయ్యెనని చెప్పవచ్చును గతిసామ్యము వలన గలుగు రస నిష్కర్షకంటె గతిభేదమువలన నెక్కువచమత్కారము నాపాదింప వీలగును. కనుక గతివైషమ్యము నభిమానించి తిక్కన శ్రీనాథాదులు సీసపాదములకు తెటగీతులను జతచేసిరి.

మహాకవులు సీసపద్యగణముల నెంపికయందును వైచిత్రి ప్రదర్శించియున్నారు. 6 ఇంద్రగణములు మరియు రెండు సూర్యగణములు చేర్చుట సీసపద్య లక్షణము ఇంద్రగణములలో నగ సల, రత గణములు పంచమాత్రాకములు. నల, భగణములు చతుర్మాత్రాకములు. శ్రుతిరమ్యతకు ప్రాధాన్యమొసగిన మహాకవులు

పంచమాత్రాత్మక గణసంయోజనమునకు నగ్రతాంబూలమొసగినట్లు కనిపించు చున్నది ఉదాహరణమునకు —

మందార మకరంద మాధుర్యమునదేలు మధుపంబునే వోవుమదనములకు
(పోతన భాగవతము)

కవిరాజ కంఠంబు కౌగలించెనుగదా పురవీధినెదురెండ పొగడదండ
(శ్రీనాథునిచాటువు)

నెత్తమ్మిలేకుండ నెత్తమ్ము లందాడు విద్యాధరీ కోటివిటుతోడ
(మనుచరిత్ర 4-78)

ఒకచాయ ననపాయ పికగేయ సముదాయమొకసీమ నానాతుయూరనినద

మొకవంక నకలంక మకరాంక హయహేష లొక్కేవ వనదేవ యువతిగీత
(వసుచరిత్ర 2-7)

క్రమదింద సురరాజ గణగళా రరమేలె ఖాను ద్వయవ నిడల్ పాద వాయై
(నందిఛందోర్ణవ 3-18)

సర్వలఘు సీసములను గూడ ఈ విభాగమునందే చేర్పవచ్చును. సర్వత్ర లఘువులే నిలుపుట సర్వలఘు సీసము. ఛందఃకర్తలందరు సీసపాదచతుష్కము లఘువులతో వ్రాసిరి. మరియు లక్షణమట్లే చెప్పిరి గీతపద్యమున సర్వలఘునియతి నొక్కరును బాటింపలేదు సర్వలఘునియమము సీసభాగమందేగ క తుదిగీతిలోను పాటించుటయుక్తము. అనగా నలగణములను వాడుట అని అభిప్రాయము. పంచ మాత్రాత్మక సర్వలఘు సీసములు, చతుర్మాత్రాత్మక లఘుసీసములు ఆంధ్ర సాహిత్యములో కనిపించుచున్నవి. పంచమాత్రాత్మక సర్వలఘు సీసమునకు ఉదాహరణము.

నవవికచ సరసిరుహ నయనయుగ నిజచరణ
గగనచర దివిజనుత నిగమ వినుత
—భాగవతము 10-72.

అచ్చ తెనుగు రామాయణము (అరణ్య-114, లక్షణ శిరోమణి, ప్రబంధరాజము (75, 221) అందు చతుర్మాత్రాత్మక సర్వలఘు సీసములున్నవి. ఇట్టి సీసములను చిత్రకవిత్వములో చేర్చుట లెస్స.

లాక్షణికులు తమ ఛందోగ్రంథములందు పెక్కుసీస భేదములను నిపేర్కొని యున్నారు. ఆ భేదములన్నియు చాలవఱకు యతిప్రాసల విన్యాసమను సరించినవి. వానిని క్రమముగా పరిశీలింతము.

రేచన కవిజనాశ్రయము జాత్యధికారమున ప్రాససీసము - అక్కిలిప్రాస సీసము - అవకలి సీసము - వడిసీసము - అక్కిలి వడిసీసములను పేర్కొనెను.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి (8-85) యందు ప్రాససీసము, అక్కిలి ప్రాస సీసము, అవకలి సీసము - అక్కిలి వడిసీసములను పేర్కొనెను.

అనంతుడు ఛందోదర్పణమున సమప్రాససీసము, అక్కిలి ప్రాససీసము, అవకలి ప్రాససీసము, వృత్తప్రాససీసము, సర్వతఃప్రాససీసము, వడిసీసము, అక్కిలి వడిసీసములను (3-24-33) పేర్కొనెను.

చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహమున సమప్రాస సీసము, అక్కిలి ప్రాససీసము. వృత్తప్రాస సీసము, సర్వతః ప్రాస సీసము, వడిసీసములను (పుట 73,74) విశదీకరించెను.

అప్పకవి 7 సీసభేదములను మాత్రము చెప్పగా కస్తూరి రంగకవి 12 సీస భేదములను (4-137) పేర్కొనెను. కాని లక్ష్యలక్షణములు చూపలేదు. వృత్త పాస సర్వతః ప్రాస, అర్ధసమ, అవకలిసమ, అవకలివడి, అవకలిప్రాస, సర్వేఘు, ఉత్సాహలేదంత, విషమ, సమనామప్రాస, గీతిరహిత చతుష్ప్రాస, సర్వవడి సీసను లను పండెండు విధములు.

కన్నడ లాక్షణికులలో వీరభద్రు డొకడు మాత్రము నంది ఛందోర్ణవమునందు వృత్తగర్భితసీస, వడిసీస, సాధారణ సీసములను (3-16-18) పేర్కొనెను.

పై పరిశీలనమువలన అనంతుని సీసపద్యవిభాగము స్పష్టమై యున్నదని చెప్పవచ్చును.

ఆధునికులలో డాక్టరు గిడుగు వెంకట సీతాపతిగారు లాక్షణిక విభేదములు-ప్రయోగ విశేషములను పరిశీలించి షోడశసీస చక్రమును నిర్మించిరి.[53] నన్నయ సీసము లెన్నివిధముల నుండునో ఈ క్రింది పట్టిక తెలుపును.

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|---|
| సీ | యతి | యతి | యతి | యతి | ప్రాస | ప్రాస | ప్రాస | ప్రాస |
| గీ | యతి | ప్రాస | యతి ప్రాస | ప్రాస యతి | యతి | ప్రాస | యతి-ప్రాస | ప్రాస-యతి |
| | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| సీ | యతి ప్రాస | యతి ప్రాస | యతి ప్రాస | యతి ప్రాస | ప్రాస యతి | ప్రాస యతి | ప్రాస యతి | ప్రాస యతి |
| గీ | యతి | ప్రాస | యతి ప్రాస | ప్రాస యతి | యతి | ప్రాస | యతి-ప్రాస | ప్రాస-యతి |

డాక్టరు పాటిబండ మాధవశర్మగారు సీసములను యతిప్రాధాన్యము - ప్రాస యతి ప్రాధాన్యము - తదుభయ సామ్యములని వర్గీకరించిరి.[54]

## సీసము - ఇతర దేశిచ్ఛందములతో సామ్యము

### సీసము - కుసుమషట్పది

కన్నడములో ప్రసిద్ధమగు పద్యవిశేషము కుసుమషట్పది. కుసుమషట్పదికి సీసపద్యమునకు చాలసామ్యములున్నవి. కుసుమషట్పది గణవిన్యాసమిట్లుండును.

5 మాత్రలగణము 5 మాత్రలగణము

5 5 — గురు×2

కుసుమషట్పదికాక లక్ష్యము - సంగీత రసలోల

సాహిత్యదానంద

పొంగువర్క్గెహోలి పమలకిరణా

దీనినే సీసపద్యముగా వ్రాసిన లక్షణము సరిపోవును

సంగీత రసలోల సాహిత్యదానంద పొంగువర్క్గెహోలి పమల కిరణ కుసుమ షట్పది పూర్వార్ధము సీసపద్యపాదమగునని ఫలితార్థము.

## సీసములు - రగడలు

నాలుగేసి గణములు పాదమునకుండుట రగడల సామాన్యలక్షణము. నాలుగేసి గణములను రెట్టింపు చేయుటచే మరికొన్ని రగడభేదము లేర్పడుచున్నవి. సీసము కూడ నాలుగేసి గణములుగల పాదములను రెట్టింపు చేయగా నేర్పడినదని చెప్ప వచ్చును. రగడలలో గణములయందలి మాత్రల సంఖ్య యన్నిట సమానముగా నుండును. కాని సీసములందుపయోగించు ఇంద్రగణములలో చతుర్మాత్రాత్మకములు పంచమాత్రాత్మకముములు, కలవు. సూర్యగణములలో త్రిమాత్రాత్మకములే కలవు. కనుక సీసపాదమునకు నాలుగేసి దేశీయగణములతో కూడిన దళములు రెండుండు నని చెప్పినచో నపుడు చివర సూర్యగణములను గూడ నిలుపుటకు వీలుండును. ఈ దృష్టితో చూడ సీసములుకూడ నొక రగడభేదమే

## సీసములు - ద్విపద :

ద్విపద పాదమునకు మూడింద్రగణములు ఒకసూర్యగణముండుట నియమము. అట్టివి రెండు పాదములు కూర్చిన ద్విపద. అనగా 8 గణముల పద్య విశేషమని ఫలితార్థము. సీసమునకు గూడ 8 గణములే. ద్విపద తరువోజగా పరిణమించిన పిదప సీసపద్యముగా మారి యుండునని భావింపబడుచున్నది. పాదమధ్యమంద గల సూర్యగణములు పాదాంతమున కూర్చుటవలన సీసములేర్పడి యుండును. రెండు ద్విపద పాదముల కూడిక యనుటవలన సీసపాదమందు రెండు యతి స్థానము లేర్పడినవి.

సీసము - ఆట వెలది :

ఎనిమిది ద్విపదలు తరువోజయైనట్లు 12 ఆటవెలది పాదములు ఒక సీసపద్య మగుటకు వీలున్నది. కాని గణసంయోజనమందొక నియతక్రమము పాటింప వలయును.

తమిళమునగల అరుశీర్ ఆశిరియ విరుత్తమునకు సీసమునకు పోలికలున్నట్లు ముందు ప్రకరణమున చర్చింపబడినది.

శాసనములలో సీసములు :

కన్నడ శాసనములందు సీసములులేవు. కాని తెలుగు శాసనములందు సీసములు కలవు. మొదటిది గుణగ విజయాదిత్యుని కందుకూరి శాసనము (క్రీ. శ. 848-892) ఈ శాసనమును మొదట కనుగొన్న శ్రీ వేణుగోపాలచెట్టిగారొక విధముగ, శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు మరొకవిధముగ, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వేరొకవిధముగ పాఠముల నిచ్చియున్నారు. మొత్తము మీద శాసనమందలిది సీసపద్యమని నిర్ణయింపబడినది. పద్యము పూర్తిగా లేదు ఈ శాసనమందలి సీసపద్యమందు కొన్ని పాదములలో ప్రాసయతి యుప యోగింపబడినది. కొన్నిట కేవలయతి యుపయోగింపబడినది కనుక సీసపద్యము లందు కేవల యతియో లేక ప్రాసయతియో పాదమంతట నొకే రీతి నుండవలయునను నియమములేనట్లు చెప్పవచ్చును. మరియు శాసనపాఠ మనుసరించి క్రింద తేటగీతి యున్నట్లు భావింపబడుచున్నది

కందుకూరి శాసనము నందుకంటె సీసపద్యస్వరూపము ధర్మవరము శాసన మందు స్పష్టముగా గోచరించుచున్నది. ఈ శాసనకాలము క్రీ. శ. 892 సీసపద్యపు నాల్గు పాదములందు, ఆట వలది నాల్గు పాదములందును ప్రాసయతి ఉపయోగింప బడుట ఈ శాసన ప్రత్యేకతయగును.

సీసపద్యశాసనములలో తరువాత గణింపదగినది దీర్ఘాసి శాసనము. ఈ శాసన కాలము 1075. ఈ శాసన సీసమునందు ఎనిమిది పాదములున్నవి. ఆపై ఆటవెలది చేర్చబడినది. పెక్కుపాదములందు ప్రాసయతులే కలవు [55]

అచ్యుతదేవరాయల కొండపల్లి శాసనము (1538 A. D.) మట్ల అనంతుని సిద్ధవటము శాసనము (1605 A. D.) చెంచయ్య రుద్రుని కల్లూరు శాసనము (1612-13 A D.) లందును సీసపద్యములున్నవి. పై శాసన సీసముల ననుసరించి తెలియనగు విశేషములు. ఏ పాదమున కాపాదము విడిగానుండుట ఆటవెలది గాని తేటగీతిగాని చేర్పవచ్చుననుట, ప్రాస యతియో లేదా కేవల యతియో పాటింప వచ్చుననుట శాసన సీసనియమములుగా తలంపవచ్చును.

## సీసపద్యము - మరికొన్ని విశేషములు :

"తెలుగు కవితలో నన్నయకు పూర్వమునను, తరువాతను గూడ సమానమైన ప్రాధాన్యమును వహించినవి సీసగీతములు. ఇవియే ఆంధ్రఛ్ఛందోరచనలలో ప్రాచీనములు. కన్నడముతో పోల్చినపుడు ఆంధ్రకవితకు లక్షణములునై కనబడుచున్నవి" అని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు సీసపద్యముల ప్రాచీనతను పేర్కొనిరి.56

జానపద సాహిత్యములో సీసపద్యగతులు గల పాటలు పెక్కు కనిపించుచున్నవి. ఉదాహరణమునకు స్త్రీలు పాడు శ్రావణ మంగళవారపు పాట.

"శ్రావణ మాసాన శుద్ధపాడ్యమినాడు
మహలక్ష్మి ముత్యాల చీరగట్టి
కైలాస గిరిలోన కల్పవృక్షము క్రింద
ప్రమథాది గణములు కొలువగాను"

ఇట్లే వినాయకచవితినాడు పిల్లలు పాడుకొను మంగళహారతి కూడ నించుమించు సీసపద్యమే.

శ్రీ శంభు తనయునకు సిద్ధగణనాథునకు
వాసిగల దేవతా వందితునకు

క్రింది వేదాంత కీర్తనపాదము గూడ సీసపద్యగతి కలిగినదే

పంచభూ తంబులు భస్మమై నందుకే
నేమందు రారామ యేమందును

తెలుగులో నన్నయకు పూర్వకాలమందే ఈ సీసపద్యము ప్రచారములోనుండినట్లు శాసనాధారము వలన తెలియవచ్చుచున్నది. ఇవికాక పద్మకవి జినేంద్ర

పురాణమునుండియు సర్వదేవుని విరాటపర్వము నుండియు ప్రబంధ రత్నావళి యందు దాహరింపబడిన పద్యములలో రెండు సీసపద్యములున్నవి. ఇవి రెండును సమ సీసములే. నన్నయ నన్నెచోడు లిరువురును ఈ సీసపద్యమునకు సామాన్య ప్రతిపత్తిని మాత్రమే యొసగి తద్రచనమునందు మాత్రము కొన్ని వన్నె చిన్నెలు గావించిరి. కాని "పాల్కురికి సోమన తొలుత వారినే అనుకరించినను పిదప సంస్కృత కవుల అనుకరణముచేత గాబోలు సీసమునకు కూడ—ద్విపదకును రగడకును నిచ్చినట్లే ప్రత్యేక ప్రతిపత్తి కల్పింప నెంచెను తత్సంకల్ప ఫలమె ఆతని చతుర్వేదసారము, చెన్నమల్లు సీసములు, అను నాతని గ్రంథములు" అని ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు భావించిరి.[57]

"భాషఁ బ్రకటింతుఁబద్య ప్రబంధముగను
వసుధ సత్కవి సమ్మతి బసవలింగ"

అను పాదముల ననుసరించి పాల్కురికి సోమన చతుర్వేద సారమును పద్య ప్రబంధ ముగా తలంచినట్లున్నది. ఇందలి పద్యములన్నియు నేకమకుటముతో కూర్పబడుట వలన దీనిని శతక గణములో గణించుట సమంజసమగును. చెన్నమల్లు సీసములను లఘుకృతి యందు ముప్పదిరెండు సీసపద్యములున్నవి. ప్రతిపద్యముచివర 'చెన్నమల్లు' అనుమకుటము కూర్పబడినది. చెన్నమల్లు అనునదిచెన్నమల్లికార్జునుడనుటకు సంగ్రహ రూపము. సంస్కృత కావ్యములలో నొక్కొక్క సర్గయు నొక ప్రత్యేకచ్ఛందము వలన రచింపబడినట్లుగా — తెలుగున నొక ప్రత్యేకచ్ఛందమును గ్రహించి కడదాక అదే ఛందములో నిర్వహింపబడిన గ్రంథములు చతుర్వేద సారము చెన్నమల్లు సీసములు. ఈ గ్రంథరచనా నంతరమే తెలుగులో సొంత సీసలఘుకృతులు పెక్కువెలసినవి వానిలో తాళ్ళపాక పెదతిరుమలాచార్యుని నీతి సీసపద్యశతకము, శ్రీగిరివిరూపాక్షయ్య శ్రీకాళహస్తిలింగశతకము. గోగులపాటి కూర్మనాథకవి సింహా ద్రినారసింహశతకము, కర్తపేరుతెలియని శత్రుసంహారశతకములు ప్రసిద్ధములు.

కన్నడ సాహిత్యమునందువలె సీసపద్యములకు తగినంత ప్రచారము లేదనుట సత్యము. కాని శరణ సాహిత్యమందును, జానపద సాహిత్యమునందును సీసపద్య గతులుగల పద్యములు కనిపించుచున్నవి.

ఉదాహరణమునకు —

నాగారి గమన అనురాగదింద భయకర
నాగవేణిగె కొట్టు నలిద శౌరి — శరణలీలామృత

ఆధునికయుగమున సీసములు కన్నడాంధ్రములందు వినూత్నగతిశోభితములై కనిపించుచున్నవి. వానిని 'ఆధునికచ్ఛందస్సు' అను ప్రకరణమున పరిశీలింతము.

పై పరిశీలనమువలన సీసముదేశిచ్ఛందమనియు, తెలుగులో దీనికి ప్రచార మెక్కువయనియు రూఢిగా చెప్పవచ్చును. తెలుగులో ద్విపద సీసములకున్నంత చరిత్ర ఇతరపద్యములకు లేదనుట అతిశయోక్తి కాదు.

### 6. 5. 2. ఆటవెలది :

మేలు మేలటంచు మిత్రులు ముగ్గురు
వింత వింత యనుచు విబుధు లిద్ద
అహహ యనుచు సూరులయిదుగురును మెచ్చ
నాటవెలఁది మూఁట నలరు సగము

—అప్ప కవీయము 4-537.

మూడు సూర్య గణములు, రెండింద్ర గణములు, నైదు సూర్య గణములు గలిసి ఆట వెలదియందు సగమగును. ప్రతిపాదమందును నాల్గవ గణాద్యక్షరముపై యతి నిలుపవలయును.

లాక్షణికులు ఆటవెలదిని సమగీతులలో నొక భేదముగా చెప్పిరి. కాని ప్రథమ తృతీయ చరణములయు, ద్వితీయ చతుర్థ చరణములయు లక్షణములు భిన్నములుగా నున్న ఆటవెలదిని అర్ధసమపద్య భేదముగా చెప్పుట సమంజసము.

కన్నడ లాక్షణికుడగు వీరభద్రుడు మాత్రమూ నంటి ఛందోర్ణవమునందు ఆటవెలది లక్షణములను విశదీకరించి యున్నాడు.

"ఇనగణత్రయగళు యింద్రద్వయంగళు
హంసపంచ కంగ ళాట వెలది 3-17
ఆదిత్య గణమూరు అమరేంద్ర గణవెరడు
అర్కపంచకమిరె లాటవెలది" 3-18

అను ఆటవెలది లక్షణములు తెలుగు లక్షణములను పోలియున్నవి.

ఆటవెలది యనగా నట్టువపడుచు, ప్రథమ పాదాంతమున గల రెండింద్ర గణములు ద్వితీయ పాదము కంటె దీర్ఘముగా నుండుట సహజము. కాగా ప్రథమ ద్వితీయముల పాదముల గతి యెత్తి యడుగువైచినట్లుండును. అది నర్తన రూపమగు కౌటిల్యమును భాసింపజేయును. లాక్షణికులెవరును ఆటవెలదియందు నుపభేదములను చెప్పలేదు. కాని డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు ఆటవెలదియందు కొన్ని భేదముల నిర్మింపనగునని సూచించిరి 58 సూర్యేంద్ర గణములలో సర్వలఘువులు, గురుమిశ్ర గణము లుండుటవలన ఆటవెలదిని లఘుబహుళముగా గురుబహుళముగా సమ గురులఘువులుగా నిర్మింపవచ్చును. ఇక మిగిలిన భేదములు.

1. సర్వపాదములందును యతి
2. సర్వ పాదములందును ప్రాసయతి
3. విషమ పాదములందును ప్రాసయతి
4. సమపాదములందు ప్రాసయతి
5. పూర్వార్థమున ప్రాసయతి
6. ఉత్తరార్థమున ప్రాసయతి

ఆటవెలది పద్యమున (ద్వితీయాక్షర) ప్రాస నియమము పాటించినచో పవడ గీతి యగునని అప్పకవి (4-355) పేర్కొనెను.

ఆంధ్ర శాసనములందు ఆటవెలదు లుండుటను ముందే గుర్తించితిమి. క్రీ.శ. 1403 నాటి పంచదార్ల స్తంభ శాసనమునందు సంస్కృత భాషలో రచింపబడిన ఆటవెలది యొకటి కలదు. ఇందు యతి నియమము కూడ పాటింపబడినది. ఉదాహరణమునకు

మహిత గండవెండ మధ్యదేశాధీశ
జనక దత్తరాజ్య సమధికేన

పై పరిశీలనము వలన ఆటవెలది శుద్ధదేశీయ చ్ఛందమని రూఢిగా చెప్పవచ్చును. కన్నడములో దీనికి ప్రచారములేదు.

### 6. 5. 3. తేటగీతి

"భారతదేశపు పల్లెపదాల్లో ఎక్కువభాగం మద్దెలు వాయిస్తూ పాడుతారు. అందుచేత వాటి తాళగతులు ఖచ్చితంగా ఏర్పడి ఉంటాయి ... గ్రామీణ ప్రజలలో సంగీతమూ నృత్యమూ విడివిడిగా గాక రెండూ కలిసే ఉంటాయి" అని శ్రీ కపిలా వాత్స్యాయన్ శ్రీ సచ్చిదానంద వాత్స్యాయన్‌గారు తమభారతీయ జానపద నృత్యాలు అనే గ్రంథంలో వ్రాశారు. అయితే ఈ స్పష్టమైన తాళగతికనిపించకుండా యతి మార్చి కుంచినడక ఏర్పడ్డ పద్యాలలో తేటగీతి వొకటి. అని శ్రీ ఉమాపతి పద్మనాభ శర్మగారు పేర్కొనిరి.[59]

ప్రాచీన కన్నడ ఛందోగ్రంథములందు తేటగీతి లక్షణము చెప్పబడలేదు. వీరభద్రుడను కన్నడలాక్షణికుడు మాత్రము (19వ శ) నంది ఛందోర్ణవమునందు తేటగీతిలక్షణమిట్లు పేర్కొనియున్నాడు.

సూర్యనొర్వమేలె సురరాజరిర్వరు
దినకరద్వయ మిరల్ తేటగీతి 3–17
వారిజసఖనొర్వ వాసవగణయుగ్మ
దినకర యుగళవె తేటగీతి 3–18

తెలుగులక్షణ గ్రంథములను పరిశీలించి తేటగీతి లక్షణములను వీరభద్రుడు పేర్కొనె నట్లు తెలియుచున్నది.

ఆంధ్రలాక్షణికులెల్లరు 'తేటగీతి' లక్షణములను విశదీకరించినవారే. రేచన సమగిదియలో డేటగీదియ యని పేర్కొని తేటగీతికి లక్షణమిట్లు చెప్పెను.

"నాలుగడుగులను నసల నల న నంబు
లోలిసలిపి మూఁడగు కడ నొందె వళ్లు
వ్రాలు నిదియొండె జెప్పిన వస్తుకవిజ
నాశ్రయా ! తేటగిదియ యగు ధరిత్రి"

—కవిజనాశ్రయము – జాత్యధికారము.

తేటగీతికి నాలుగు పాదములనియు, ప్రతిపాదమున వరుసగా 1 సూర్యగణము 2 ఇంద్రగణములు 2 సూర్యగణములు వచ్చుననియు, 1–4 గణాద్యక్షరములకు

మైత్రి అనియు లాక్షణికులు పేర్కొనిరి. సూర్యేంద్ర గణములనక రేచన న-నల గణములని పై పద్యమున వ్యవహరించియున్నాడు. యతి ప్రాస నియతి ననుసరించి తేటగీతి యందును కొన్ని భేదముల నిరూపింపవచ్చునని డాక్టరు పాటిబండ మాధవ శర్మగారు భావించిరి.[62] వాని క్రమము ఇట్లుండును.

1. సర్వపాదములందును సాధారణ యతి
2. సర్వపాదములందును ప్రాస యతి
3. విషమ పాదములందు ప్రాస యతి
4. సమపాదములందు ప్రాస యతి
5. పూర్వార్థమున ప్రాస యతి
6. ఉత్తరార్థమున ప్రాస యతి

సూర్యేంద్ర గణ నిర్మితమైన తేటగీతి యందు లఘుబాహుళ్య గురుబాహుళ్య లఘు గురు సామ్యములచే ద్రుతవిలంబిత మధ్యవృత్తులను భాసింపజేయవచ్చును. పద విన్యాసవైచిత్రిచేత అవిద్యమాన (లాక్షణికానుక్త) గణములను రూపింపవచ్చును.

తేటగీతి అచ్చమగు తెలుగు పద్యము. దీనిని పద్యమనుట కంటె పాట యనుట సమంజసము. తేట - ఇది తెలుగుమాట. గీతి — సంస్కృత శబ్దము. దీని కర్థము పాటయే. జానపద వాఙ్మయమందలి లాలిపాటలు, జోలపాటలు తేట గీతులే యగును.

ఫాల లోచన వీరభద్రావ తారి
లాలి గరుడతురంగ లాలి భవభంగ
జోర వికులకు భాంగజో సన్నుతాంగ

అట్లే పాటలలోని అడ్డు గీతములను ఒక్క అక్షరము తరువాత జరిపిన యెడల తేట గీతులవలె చదువవచ్చును.

గుండె గొంతుక లోన కొ - ట్లాడు తాది
అయ్యవారికి చాలు - ఐదు వరహాలు
పాలు త్రాగేనాడు - పారాడు నాడు

పై పరిశీలనము వలన పాటలలో నొక యక్షరమును జరిపి కవులు యతిస్థాన నియమ మేర్పరచి పద్యత్వము కల్పించిరని చెప్పవచ్చును.

తేటగీతికిని ఎత్తు గీతికిని కొన్ని సామ్యము లున్నవి. ఎత్తుగీతి పాదమునకు 1 ఇంద్రగణము 2 సూర్యగణములుండును. తేటగీతి పాదములోని మొదటి రెండు గణములను తొలగించినచో ఎత్తుగీతి కాగలదని చెప్పవచ్చును.

తేటగీతికిని ఎడెయక్కరకును కొన్ని పోలికలున్నవి. ఎడెయక్కరయే తెలుగున అంతరాక్కరయగును. అంతరాక్కర పాదమునకు వరుసగా 1 సూర్య 2 ఇంద్ర 1 చంద్రగణము రావలెను. నహ, రల అను రెండును చంద్రగణములు వీనిని వింగడింపగా రెండు సూర్యగణము లేర్పడును. అంతరాక్కర ఆదిలో ప్రాస యుండును. తేటగీతి యుపజాతి పద్యము గాన ప్రాసలేదు. అంతరాక్కరకు త్రిగణాంతయతి నిర్బంధము. తేటగీతికి నాల్గవ గణము ప్రథమాక్షరము యతి స్థానమగును.

తేటగీతికిని తమిళ పద్యవిశేషమగు ఇన్నిశైవెణ్బా పద్యమునకు గల సామ్యములు తమిళ మలయాళదేశిచ్ఛందోరీతులను ప్రకరణమున చర్చింపబడినవి.

ఆంధ్రశాసనములందు తేటగీతులు ప్రాచీనకాలమునందే సీసపాదముల కనుబంధముగా రచింప బడుచుండెడివి. సీసపాదము పూర్వార్థము యొక్క చివరి మూడు మాత్రల కాలమును ఉత్తరార్థముతో కలిపి చదివిన తేటగీతి యగును. కనుక సీస పాదముల కనుబంధములై తేటగీతులు వ్రాయబడినవని యూహింపవలసియున్నది. తెలుగులో సొంతతేటగీతి కావ్యములును గలవు. అటువంటి రచనలో విఖ్యాతుడైన వేమనవలె తేటగీతి రచనలో విఖ్యాతిపొంద ప్రయత్నించినవారిలో శ్రీ శంకరంబాడి సుందరాచారిగారు ప్రముఖులు.

ఆధునిక కన్నడాంధ్రకవులు 'తేటగీతి' రచనలలో పెక్కు చమత్కారములు గావించియున్నారు. ఈ ఛందస్సంబంధ చమత్కారములు 'ఆధునిక చ్ఛందస్సు' అను ప్రకరణమున తర్కింపబడును.

ఈ ప్రకరణమునందు కన్నడాంధ్రలాక్షణికులు పేర్కొన్న కందము, రగడ, చౌపది, వితాళచతుష్పద, పంచపద, సప్తపది, త్రిపుట, ఉత్సాహము, దండక

ములు, షట్పదులు, ఏల, అక్కరలు, ద్విపద త్రిపది, మదనవతి, గీతికె, సాంగత్యము సీసము, ఆటవెలది, తేటగీతి మొదలగు పద్యరీతుల లక్షణములలోని సామ్యవైషమ్యములు పరిశీలింపబడినవి.

కన్నడాంధ్ర శాసన వాఙ్మయమందును, సారస్వతమునందును కందము, రగడ, అక్కరలకు అత్యధిక ప్రాధాన్యముండుటను గుర్తించితిమి. కన్నడశాసన అక్కరలకంటె తెలుగు శాసన అక్కరలు ప్రాచీనములని తెలిసికొంటిమి

కన్నడ సాహిత్యమున త్రిపదీషట్పదీ సాంగత్యపద్యరీతులకు ప్రచారమెక్కువ. కన్నడమున త్రిపదీకావ్యములు, షట్పదీకావ్యములు, సాంగత్య కావ్యములు ఛందస్సు కారణముగా వికాసమొందిన సాహిత్యప్రక్రియలగును. తెలుగు సాహిత్యమున ద్విపద, దండక, సీసములకు ప్రచారమెక్కువ.

కన్నడసాహిత్యములో ద్విపద (ఛందోవతంస) ఆటవెలది, తేటగీతి, సీసములకు ప్రచారము చాలతక్కువ. అట్లే తెలుగున షట్పది, సాంగత్యము, మదనవతి, అక్కరికె, గీతికెలకు ప్రచారములేదు. కన్నడమున మహాక్కరలకు ప్రాధాన్యముండగా తెలుగులో మధ్యాక్కరలకు ప్రచారము. అట్లే తెలుగున నవవిధరగడలుండగా కన్నడమున త్రివిధరగడలకే ప్రసిద్ధి.

కన్నడ పరిశోధకులు 'ఏళె'ను దేశిచ్ఛందములకు మూలముగా తలంచుచున్నారు. ఆంధ్రపరిశోధకులు 'ద్విపద'ను దేశిచ్ఛందోరీతులకు మూలమునుగా భావించుచున్నారు.

## సంఖ్యాసూచి :

1. కన్నడ ఛందోవికాస – పుట 105
2. కన్నడ ఛందస్సిన చరిత్రె – పుట 513
3. కన్నడ ఛందస్సు – పుట 41
4. గ్రంథ సంపాదనాశాస్త్ర పరిచయం – పుట 207
5. తెలుగులో ఛందోరీతులు – పుట 128
6. ఆంధ్ర మహాభారతము – ఛందఃశిల్పము – పుట 440
7. తెలుగులో ఛందోరీతు – పుట 129, 130
8. శాసన వ్యాసంగ – పుట 79
9. కన్నడ ఛందఃస్వరూప – పుట 300
10, 11. శాసన వ్యాసంగ – పుట 79
12. ఆంధ్ర మహాభారతము – ఛందఃశిల్పము – పుట 450
13. నాడోజ పంప – పుట 279–80
14. పంప భారతదీపికె – పుట 134
15. సమాలోకన – పుట 179
16. ఛందోంబుధి పీఠికె
17. కన్నడరగళె ఛందస్సుగళు – ప్రబుద్ధ కర్ణాటక 51–1
18. కన్నడ ఛందస్సిన చరిత్రె – రగళె: ఉగమ లక్షణ ఇతిహాస
19. కన్నడ రగళె ఛందస్సుగళు – ప్రబుద్ధ కర్ణాటక 51–1
20. నన్నిచోడ కవి చరిత్ర – పుట 137, 139
21. **Karnataka Vishaya Jati Bombay University Journal - S(**
**1940 - IX-pt 2 - P. 170-181**
22. భారతి, మార్చి – 1967
23. శాసన వ్యాసంగ – పుట 79, 82

24. ఆంధ్ర సాహిత్యములో దేశికవితోద్యమము - పుట 435
25. తెలుగు భాషలో ఛందోరీతులు - పుట 176
26 ఉద్దండ షట్పదియ సమస్యె, ప్రబుద్ధకర్ణాటక - 54-1
27. కన్నడ ఛందస్సిన చరిత్రె
28 కన్నడ ఛందస్సిన చరిత్రె
29. మానసోల్లాస దల్లి ఛందస్సు - ప్రబుద్ధ కర్ణాటక 48-11
30. దేశీయ ఛందస్సుగళ మూలపలె - మానవిక కర్ణాటక 1-3
31. దేశీయ ఛందస్సుగళ మూలపలె - మానవిక కర్ణాటక 1-3
32 దేశీయ ఛందస్సుగళ మూలపలె - మానవిక కర్ణాటక 1-3
33. కన్నడ ఛందః స్వరూప - పుట 425-56
34. శాసన వ్యాసంగ - పుట 86
35. నన్నిచోడ కవి చరిత్ర - పుట 60
36. తెలుగులో ఛందోరీతులు - పుట 199
37. తెలుగులో ఛందోరీతులు - పుట 204-206
38. నన్నయ భారతము - పుట 909-921
39. తెలుగు ఛందోవికాసము - 78-80
40. ఆంధ్ర మహాభారతము - ఛందఃశిల్పము 377-378
41. నేను నా సాహిత్య రచనలు - మహతి పుట 8
42. దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము - యక్షగానము 5-87
43. ప్రాదెలుగు - యతి భారతి ఆగష్టు 1967
44. తెలుగు జానపదగేయ సాహిత్యము పుట 782
45. తెలుగు ఛందో వికాసము పుట 37
46. తెలుగు ఛందో వికాసము పుట 39
47. కన్నడ ఛందోవికాస - పుట 75
48. శాసన వ్యాసంగ 84-85

49. కన్నడదల్లి త్రిపది కావ్యగళ పరంపరె ప్రగతి
మత్తు ప్రభావ ప్రబుద్ధ కర్ణాటక 51-2
50. కన్నడ ఛందోవికాస పుట 224
51. సాంగత్యద కెలవు సంగతిగళు - ప్రబుద్ధ కర్నాటక 42-1
52. ఆంధ్ర మహాభారతము ఛందః శిల్పము పుట 468
53. అప్పకవీయ పీఠిక ... పుట 69
54. ఆంధ్ర మహాభారతము ఛందః శిల్పము పుట 495
55. **Selected Telugu Inscriptions Edited by N. Venkatarao**
56. దక్షిణ దేశభాషా సారస్వతములు - దేశి పుట 188
57. ఆంధ్ర సాహిత్యములో దేశి కవితోద్యమము
పాల్కురికి సోమనాథుని పాత్ర పుట 451
58. ఆంధ్ర మహాభారతము - ఛందః శిల్పము పుట 524
59. ప్రాదెలుగు - యతి భారతి ఆగష్టు 1967
60. ఆంధ్రమహాభారతము - ఛందః శిల్పము పుట 517

# 7. దాక్షిణాత్య జానపదచ్ఛందస్సు

మార్గదేశీవిభేదములలో జానపద సాహిత్యమంతయు దేశీవర్గమున చేరును. మార్గదేశీ విభాగములందు ఛందస్సు ఒక ప్రధానాంగము. దక్షిణ భారతభాషలన్నింటి యందును శిష్టసాహిత్యమందలి ఛందస్సంప్రదాయములతో పాటు జానపద సాహిత్య మందలి ఛందస్సంప్రదాయములు కూడ సజీవములై యున్నవి. మీదు మిక్కిలి జానపదచ్ఛందోరీతులే కవుల ఆదరణమునుపొంది శిష్టసంప్రదాయములో నొకభాగమై స్థిరత్వము నొందుచుండును.

జానపదవాఙ్మయమునకు తమిళమున 'నాట్టుప్పాడల్గళ్' అనివ్యవహారము. నాడు అనగా దేశము, పల్లెప్రాంతమని అభిప్రాయము. ఇట్టిప్రదేశములందు పాడ బడు పాటలే 'నాట్టుప్పాడల్గళ్' అగును. కన్నడమునందు జానపదసాహిత్యమనియు నాడు పదగళు అనియు పేర్లున్నవి. మలయాళములో నిట్టివానిని 'పళయప్పాట్టుగళ్' ప్రాతపాటలు అని యందురు.

జానపదవాఙ్మయ ప్రధాన లక్షణము గేయత్వము. గేయధర్మముండుటవలన శ్రుతిరమ్యత, మనోహ్లాదకత్వము, రాగరంజకత్వము, పండితపామరప్రియత్వములు వీనికి సిద్ధించినవి. మార్గచ్ఛందముకంటె జానపదచ్ఛందము భిన్నము. మార్గ చ్ఛందములో నియమబాహుళ్యము ప్రధానముకాగా జానపదచ్ఛందములో శైథిల్యము ప్రధానస్థానమలంకరించును. మార్గచ్ఛందమునకు అనువర్తించు ఛందోంగములన్నియు జానపదచ్ఛందమునకు సరిపోవు. జానపద చ్ఛందమునగల లఘుగురువిధానము, గణస్వరూపము – మైత్రీవిశేషములు – పదనిర్మాణము – వరుసలు భిన్నముగా కని పించును. వీనిని ప్రత్యేకముగా చర్చించుట ప్రస్తుతవిషయము.

## 7. 1. జానపదగేయ లఘు గురు నిర్ణయము :

జానపదచ్ఛందము సంగీతాత్మకము. కనుక అక్షరముల లఘుగురు నిర్ణ యము భావమనుసరించియు, ఛందమనుసరించియు, గాయకు ననుసరించియు మారు చుండును. మార్గచ్ఛందమున గల హ్రస్వాక్షరములకు లఘుత్వము మాత్రమేగాని గురుత్వము కలుగుటకు వీలులేదు. అట్లే దీర్ఘాక్షరములు లఘుత్వమొందుటకు లాక్షణిక

నియమము సమ్మతింపదు. మార్గచ్ఛందమున లఘుగురువులను రెండు సంజ్ఞలు సరి పోగా జానపద చ్ఛందమునందు లఘుగురువులతోబాటు ప్లుతము, కాక పాదములను సంజ్ఞలును తప్పనసరి యగుచున్నవి. పద్యములందు ప్లుతయతి విధించినప్పుడు మాత్రము ఆంధ్ర లాక్షణికులు ప్లుతత్వప్రయోజన మపేక్షించిరి. మరెచటను దీని ప్రయోగము కనిపింపదు.

అక్షరములందు హ్రస్వాక్షరము లున్నవి. దీర్ఘాక్షరములున్నవి. ప్లుతాక్షరములు లేవు. ఉచ్చారణ మనుసరించి ప్లుతత్వ మారోపింపబడు చున్నది. పాటలలో వీని ప్రయోజన మెక్కువ. ప్లుతములేగాక నాలుగు మాత్రల కాలములో నుచ్చరించు అక్షరములు కూడ నుండవచ్చును. ఇట్టివానిని కాక పాదములుగా గ్రహింపవలయు నని శ్రీ రాజగోపాల నాయుడుగారు పేర్కొనిరి.[1] దాక్షిణాత్య జానపద చ్ఛందము నందు హ్రస్వ దీర్ఘ ప్లుతకాక పాదములను నాలుగు స్థితులును సమానముగా కనిపించు చున్నవి.

గాయకుడు గాన ధర్మమనుసరించి పాటలలోని అక్షరములకు లఘుత్వ గురుత్వ ప్లుతత్వములను ఆపాదించును. దీర్ఘాక్షరములను హ్రస్వము చేయుటయో, హ్రస్వములను దీర్ఘముగా పలుకుటయో గాయకాధీనమై యుండును. తమిళ లాక్షణికు లిద్దానిని పద్యధర్మముగా కూడ భావించి తమ ఆమోదమును ప్రకటించిరి.

ఓఒదల్ వేణ్డుమ్ ఒళిమాళ్కుం చెయ్విణై
ఆఅదు మెన్నుమవర్ — కురళ్

పై పద్యమునందు ఓదల్, ఆదు అను పదములకు బదులుగా ఓఒదల్, ఆఅదు అను పదములు ప్రయోగింపబడినవి. రెండవ అక్షరమగు ఒ, అ లను గ్రహింపకున్నచో గణభంగ మేర్పడును దీర్ఘస్వరముప్రక్క హ్రస్వస్వరముకూడ నుండునని ఫలితార్థము. కన్నడభాషలోని దాసర సాహిత్యములోగూడ ఈ ధర్మము కనిపించుచున్నది. హ్రస్వాక్షరములను దీర్ఘాక్షరములుగాను, దీర్ఘాక్షరములను హ్రస్వములుగాచేయుట మాత్రముగాక ద్విత్వాక్షరములను ద్విత్వరహితములుగా, ద్విత్వరహితములను ద్విత్వాక్షరములుగా చేసి పాడుటగూడ గానధర్మమే. ఉదా॥–

కృష్ణావతారదలి (ల్లి) దుష్టరగెలిదనె (నే)
వృష్ణియరకులతిలక (కా) నెనిసిద శ్రీకృష్ణ (ష్ణా)

శ్రీకృష్ణనె (నే) నమ్మమనెద్దైవ (వా)

కుండలీకరణమునగల అక్షరములు గేయోచ్చారణకలవి. ఆంధ్ర జానపద సాహిత్యము నందును ఈ ధర్మము స్పష్టమై గోచరించుచున్నది

శ్రీరామ భూపాలుడూ(ఉ) పట్టాభి
షేకుడై యుండగానూ (ఊ)

మలయాళ జానపదచ్ఛందము తమిళ జానపదచ్ఛందమును పోలినదే. శ్రీ కె. ఆరుముగంగారు మలయాళదేశిచ్ఛంద బాహ్యస్వరూపమునుగూర్చి యిట్లువిశదీకరించిరి.

"The lengthening and shortening of vowels in a syllable are popular in Malayalam also In Tamil poems these changes are made by the poet himself but in Malayalam these changes are made not by the poet in the written form of his composition but by the person who recites the poem"[2] హ్రస్వదీర్ఘ శైథిల్యము గాయకాధీన మని ఫలితార్థము.

ఒ. టి. శారదా కృష్ణన్‌గారు మలయాళ జానపద గేయ స్వరూపమును ఇట్లు విశదీకరించిరి.

"In Vatákkam Pattu there is no much distinction as short and long syllables. Normally every syllable has to be pronounced as a long in the recitation of these songs.

జానపదగేయములందేగాక 'కిళిప్పాట్టు' అను మలయాళ దేశిచ్ఛందమునందు హ్రస్వదీర్ఘశైథిల్య స్వభావము కలదని డాక్టర్ ఎం. అనుజన్‌గారు నిరూపించిరి.[4]

పై పరిశీలనము వలన గురులఘు నిర్ణయమునందు దాక్షిణాత్య జానపద వాఙ్మయమున సమానధర్మమున్నదని తెలిసినది.

## 7. 2. జానపదగేయ వరుసలు - గణపద్ధతి సూచన :

మార్గ చ్ఛందములో అక్షరగణములకు ప్రాధాన్యము. ప్రాకృత చ్ఛందము లందు మాత్రాగణములకు ప్రచారమెక్కువ, దాక్షిణాత్య భాషలందు అక్షరగణములు, మాత్రాగణములతోబాటు దేశియగణములకు ప్రాధాన్యమున్నది.

తమిళములో గల గణనిర్మాణము ననుసరించి తమిళగణములలో కొన్నిటిని మాత్రము గ్రహించి, ప్రస్తార పద్ధతిని జోడించి కన్నడ లాక్షణికులు బ్రహ్మ, విష్ణు, రుద్రగణములను వర్గీకరించిరి. ఆంధ్ర లాక్షణికులు వానియందును కొన్నిటిని పరిత్యజించి సూర్య, ఇంద్ర, చంద్రగణములను విభాగము గావించిరి. ప్రస్తారము వలన నేర్పడిన గణములను స్వీకరించుట వలన మాత్రా సంఖ్యకు, ఆయా మాత్రాసూచకములుగా నుండు గురులఘుక్రమమునకు ప్రాధాన్యము కలిగినది. ఈ పద్ధతివలన కొన్ని దేశీయ రచనలే లక్షణయుక్తములైనవి. అనేకము లనాదృతములైనవి. జానపద గేయములలో గణము పదమధ్యమున విఱుగదు. పదమంతయు నొక ప్రమాణముగా (Unit) గ్రహింపవలసియుండును. ఈ ధర్మము తమిళములో నేటికిని నిలిచియున్నది. కన్నడాంధ్రములందు సర్వత్ర ఈ ధర్మము ననువర్తించుటకు వీలు లేకున్నది.

తమిళములో ప్రాచీన కాలమునందే పాటలను సేకరించుట, వర్గీకరించుట, లక్షణము కల్పించుట సంప్రదాయమైనట్లు సంగయుగ లక్షణముల బట్టి రూఢిగా చెప్పవచ్చును. తమిళభాష యెంత వర్ధిల్లినను ఛందస్సునకు సంబంధించిన మూల తత్త్వమే మాత్రము మారలేదు. కనుక లాక్షణికులు పేర్కొనిన నియమములతో నెట్టి జానపదగేయమును గాని వర్గీకరింపవచ్చును.

కన్నడములో గల జానపద చ్ఛందవర్గీకరణమునకు నాగవర్మ పేర్కొనిన దేశీయగణములు కొంతవఱకు సరిపోవును. దేశిచ్ఛందములగు అక్కర, త్రిపది, ఏళె, రగళె మొదలగునవి జానపదగేయములందును కనిపించుటయే యిందులకు ప్రధాన కారణము. 17 వ శతాబ్దమునాటి గుణచంద్రుడు ఛందస్సారమున తాళాది ప్రకరణమును విస్తరించి చెప్పియున్నాడు. పై సూచనవలన జానపద చ్ఛందములను తాళ గణములతో వర్గీకరింపవచ్చుననియు చెప్పవచ్చును.

ఆంధ్ర జానపద చ్ఛందమును వర్గీకరించుటకు లాక్షణిక గణములు కొంతవఱకు మాత్రమే యుపకరించును. మాత్రా సంఖ్యకు గాక మాత్రా సూచకములుగా నుండు గురు లఘుక్రమమునకు ప్రాధాన్య మేర్పడుట వలన ఆ గణములు సంకుచితములైనవి. కనుక సూర్యేంద్ర చంద్ర గణములకు మారుగా మూడు, నాలుగు, ఐదు, ఏడు, తొమ్మిది మాత్రలుగల గణములను స్వీకరింపవలెను. ఇట్టి

గణములతో దేశీయ రచనలందు పాదములేర్పడునని చెప్పినచో అనేక రచనలకు లక్షణము కుదురును. దేశీయ రచనలన్నియు త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ గతులు కలపి యగుటవలన పై విభాగము సరిపోవును. కనుక డాక్టర్ గిడుగు వేంకట సీతాపతిగారు 'మాత్రాగణ వర్గము'లను నిరూపించిరి.[5] న, హ, వ గణములు మూడు మాత్రలు గలవి త్ర్యస్రములు నల, భ, స, జగణములు – నాలుగు మాత్రలు గలవి చతురస్రములు. నలల, భల, త, ర, నగ, సల, జల, యగణములు అయిదు మాత్రలు గలవి ఖండ గతి గణములు. నన, సలల, నవ, సగ, నహ, భలల తల, రల, హవ, మ, జలల, యల జగ గణములు ఆఱు మాత్రలు గలవి రూపక తాళగతి గణము అగును. ననల, సన, సహ, సవ, నస, నజ, నభ, నగగ, భన, తలల, మల, తగ, భవ, భహ, రలల, రగ, జన, యలల, జవ, యగ, జహ గణములు మిశ్రగతి గణములగును. ననలల, భనల, సనల, తన, నజల, భభ, సభ, మలల, ననగ, భస సస, తవ, నయ, భగగ, సగగ, మగ నభల, రన, నసల, భజ, నత, రహ, నర, రవ, జనల, యన, యహ, యవ, జస, జజ, జభ, జగగ గణములు ఎనిమిది మాత్రలుగలవి ఆదితాళగతి గణములు ఏపద్యమందయినను పాదములు ఒకేవిధముగా గణముల కూర్పుగలిగియున్న యెడల ఇంపయిన గతికనబడగలదు. ఏదో ఒక తాళమునకు లొంగగలదు తాళమునకనుసరించి పాడుకొనుటకు వీలుగా నుండగలవి గేయములే. మానవుడు సంతోష పారవశ్యమున చిందులు త్రొక్కినపుడు ముద్రితములైన పదాంకములందు గేయరీతులున్నవి. కవిత్వారంభదశ, నాట్యారంభదశ, సంగీతారంభదశలను పురస్కరించుకొని పరిశీలింపగా జానపదగేయములన్నియు నేదియో యొక తాళమునకు లొంగుట సహజము.

'పాటలలో ఛందస్సు' అను గ్రంథమును వ్రాసిన శ్రీ రాజగోపాలనాయడు గారు తాళమునకు సంబంధించిన గణములను పేర్కొనిరి[6] వారిమతమనుసరించి పాటలకు గణములననుసరించి తాళముల నిర్ణయింపవచ్చును. ఆదితాళమునకు రెండు చతుర్మాత్రాగణములు, రూపకమునకు రెండు త్రిమాత్రాగణములులేక ఒక షణ్మాత్రాగణము, జంపెకు రెండు పంచమాత్రాగణములు, త్రిపుటకు త్రిమాత్రాగణము + చతుర్మాత్రాగణము, త్ర్యశ్రఏకతాళమునకు ఒక త్రిమాత్రాగణము, దేశాది తాళములకు ఒక చతుర్మాత్రాగణము, మధ్యాదికి ఒక చతుర్మాత్రాగణము ఉండును. పాటకు తాళం ప్రాణం. పాటమొత్తము మీద ఒకేతాళము పడుట శోభ నొడగూర్చును

ఉదాహరణమునకు త్యాగయ్యకృతి.

5 5 5 5
గురులేక యెటువంటి గుణికితెలి యగబోదు

పంచమాత్రాగణ విన్యాసముండుటనలన పైపాట జంపె తాళములో నడచిన దని చెప్పవచ్చును. జానపదగేయములలోని ఈ క్రింది పాటగూడ జంపెతాళమునకు చెందినదే యగును.

బంగారు చెంబుతో పన్నీరు పట్టుకొ
పడతి రుక్మిణివచ్చె మేలుకో

మలయాళ ఛందోగ్రంథములందు వర్ణగణములు, మాత్రాగణములు చెప్పబడినవి. కాని జానపదచ్ఛందమును వర్గీకరింప పై గణములు చాలవు. కనుక 'A Study of Malayalam Metres' అను సిద్ధాంతవ్యాసమును వెలువరించిన డా॥ ఎన్. వి. కృష్ణవారియర్ తాళగణములను కల్పించిరి. మలయాళ ఛందోరీతులను వర్గీకరించునపుడు గుర్తింపదగు నంశములను గూర్చి డా॥ ఓ ఎం. అనుజన్ గారు ఇట్లు వ్రాసిరి.

"If we accept that there is some kind of rhythmic regularity in the composition of the ganas in a line and that obvious lack of rhythmic unity has to be made up by singing, we have to admit that a syllable can have as many matras as its position requires. It is on this basis that Kuti Krishna Marar has tried to define Malayalam matras on the basis of their gati. According to him musical gatis which are devided into those having three, four. five and seven matras should be the measuring rod."7

పై పరిశీలనము వలన జానపదగేయచ్ఛంద వర్గీకరణమునకు అక్షర గణములు సరిపోవనియు తాళగణములే యుక్తమనియు నిర్ధారింపవచ్చును. జానపదగేయములు మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది ఆ వృత్తములలో నడచునను ప్రమాణము దాక్షిణాత్య జానపద చ్ఛందముల కనువర్తించు అధికార సూత్రము కాగలదు.

## జానపదగేయములలోని యతిప్రాసనియమములు

పద్యపాదమును చదువుచున్నప్పుడు మధ్యలో కొంతయాగి విశ్రాంతిని తీసికొనుట సంభవించును. ఈవిశ్రాంతి స్థానమునే సంస్కృతములో యతిస్థానమందురు.

పాదాంతవిరామము పాటింపవలయునని సంస్కృత లాక్షణికుల నియమము. కాని ఈ నియమము ద్విపద రగడలందు మాత్రము కనిపించును. ఇతరపద్యరీతులందు ఈ నియమము అడుగంటినది. పద్యకవితలో కంటె పదకవితలో పాదాంత విరామము తప్పక పాటింపబడును. ఇక రెండవది యగు అక్షరమైత్రి సంస్కృతములో లేదు. పద్యకవితలో యతిమైత్రి యేర్పడుటకు జానపదగేయములే ఆధారములు. పద్యములందు యతిస్థానము పాదమధ్యమునగాని పాదాంతమునగాని యుండవచ్చును. గాని జానపదగేయ సారస్వతములో యతిస్థానము పాదమధ్యమునందుండును. మరియు పద్యములలో యతి పదాది, పదమధ్య, పదాంత అక్షరములపై నిలుపవచ్చునుగాని జానపద గేయములలో పదాదియందే నిలుపుట సహజధర్మముగా నున్నది. ఉదాహరణమునకు —

తమిళము : నాదర్ ముడి మేలిరుక్కుం నాగ పాంబే
నచ్చుప్పల్లై వైత్తిరుక్కుం నల్ల పాంబే
కన్నడము : నాగ భూషణ తాను నగుత గౌరియకండు
ఈగేను కొట్టరు ఇన్నేను కొడువరు
తెలుగు : చందమామరావె జాబిల్లిరావె
మలయాళము : మా వేలి నాడు వానిడుం కాలం
మనుష్యరెల్లారు మొన్నుపోలే

సంస్కృత ఛందోగ్రంథములలో యతిమైత్రి గూర్చిన చర్చలేదు. కాని తమిళాంధ్ర మలయాళ లాక్షణికులు యతిమైత్రినిగూర్చి విపులముగా చర్చించియున్నారు. యతిమైత్రి పద్య కవితయందు నేర్పడుటకు జానపద గేయము లాధారములని పరిశీలించితిమి. కాని జానపద గేయములందును అక్షరమైత్రి కుదరని పాదములు కనిపించుచున్నవి. ఉదాహరణమునకు—

కొమ్మ గాదది మంచి కుదురైన కెందమ్మి
తమ్మి గాదది మంచి ఘనమైన దండ
దండు గాదది మంచి తగుమేలు చెంగలువ
కలువ గాదది మంచి ఘనమైన చిలుక

పై గేయమునందు రెండవ పాదమున త-ఘ లకు మైత్రి కుదురదు.

పద్య కవితతో అక్షరరూప మైత్రికి స్వరసామ్యము ప్రధానము. హల్సామ్యము కూడ నుండవలయును. జానపద గేయములందు పలుచోట్ల హల్సామ్యమైత్రి పాటింపబడినట్లు చెప్పవచ్చును.

తొలకరి ఒక మబ్బు తొంగి చూచింది
మబ్బులో ఒక మెఱపు మెఱసి పోయింది

పై గేయమునందు రెండవ పాదమున హల్సామ్యముతో మ - మె లకు మైత్రి పొసగినదని సమర్థింపవలయును. తమిళ జానపదగేయముల నుండియు నిట్టిదానికి నొక యుదాహరణము—

కడుగు సిఱు తాలి కల్పదిచ్చ అడ్డియలాం
కల్పదిచ్చ అడ్డియలై కళట్టివైక్కనాళ్ అచ్చే
మిళగు సిఱుతాలి ముగప్పువైచ్చ అడ్డియలాం
ముగప్పువైచ్చ అడ్డియలై ముడిచ్చు వైక్కనాళ్ అచ్చే

పై పాటలో అన్ని పాదములందు అక్షరమైత్రి సరిపోయినది, మూడవ పాదమున 'మి-ము' లకు హల్సామ్యముచే మైత్రి పాటింపబడినది.

తమిళ లాక్షణికులు ఛందోగ్రంథములందు పెక్కు మోనై విభేదములను పేర్కొని యున్నారు. వానిలో "ఒరూఉమోనై, పొళిప్పుమోనైలు తప్ప తక్కినవి తెలుగు శిష్ట కవితలోని పద్యములలో కానరా"వని శ్రీ కోరాడ రామకృష్ణయ్య వ్రాసిరి.[8] కాని దేశికవితలో మిగిలిన వానికి గూడ నుదాహరణములు కనిపించు చున్నవి. వానిని క్రమముగా పరిశీలింతము.

1. ఒరూఉమోనై – 1, 4 గణముల ఆద్యక్షరములకు మైత్రి.

చుట్టి చుటుక యేంత సుడిగిన పాము
పుట్టి చొచ్చే టపుడు పొడుగారవలదె

2. పొళిప్పుమోనై – 1, 3 గణముల ఆద్యక్షరములకు మైత్రి

చిత్తుమ్మ ఏకాశి చిలుకు దాదోశి
మాదుమ్మ ఎకాశి మంచి దాదోశి
తమ్మల పాకోలె తలవంచుకోని
ఇస్తానని పలుకవే ఇయ్యంపురాల
నీకూను నాకూను ఎవ్వరే సాక్షి
బాసికం కట్టిన బ్రాహ్మడే సాక్షి

3. ఆడిమోనై : పాదములో అన్ని గణముల ఆద్యక్షరముల మైత్రి.

మాపాప మామల్లు మత్స్యావతారం
వరుసైన బానలు వరహావతారం

కాకమ్మ కూతలు కల్లలు కావు
మామిడీ మామిడీ మంచి మామిడీ

4. ఇణైమోనై : ప్రతిపాదములో మొదటి రెండు గణముల ఆద్యక్షరములకు మైత్రి పాటించుట.

చిక్కుడు చెట్టుకు తీగలందమ్మ

సువ్వన్న చుక్కల్లు రాజమామిండ్లు

కూళైమోనై : 1, 2, 3 గణాద్యక్షరములకు మైత్రి
ఏనుగును ఎక్కేవు ఎల చిన్నవాడ
వరుసకు వేసెడు వరహాలపేరు

తమిళములో అక్షరమైత్రికి సంబంధించినది 'తొడై' విభాగము : 'తొడై'లో పెక్కు విభేదములున్నవి. వానిలో ఇయైప్పుత్తొడై యొకటి. ఇది పాదములలోని తుది గణముల యొక్కగాని, అక్షరములయొక్కగాని మైత్రితో సంబంధించినది.

తమిళము — పూవే ముదలిల్ అరుంబామే
అరుంబే వళరిన్ ముగైయామే
మలరే విరియిన్ అలరామే

ఇది యించుమించు అంత్యప్రాసను పోలినదని చెప్పవచ్చును. పాదముయొక్క చివరి వర్ణము ప్రాస అయినచో అంత్య ప్రాస " దాక్షిణాత్య భాషల కాదిప్రాస ప్రధానము. కాని జానపద గేయములందు అంత్యప్రాసలును గలవనుటకు పై తమిళ గేయమొక ఆధారము. తెలుగులో గూడ నిట్టివి కలవు. ఉదాహరణమునకు—

శ్రీరామ చింతల్ల పండు పండింది
చూచిరావే సీత కోసుకొందామే

బీరెల్లి వారింట కన్య పుట్టింది
చూచిరావే లక్ష్మి చేసుకొందామే

పాదము విడిచి పాదమున అంత్యప్రాస పై గేయములో కలదు

దాక్షిణాత్యభాషలకు యతులకంటె ప్రాసలు సహజములని చెప్పవచ్చును. యతిమైత్రిలేని స్థలములందు ప్రాసమైత్రి పాటించుట తమిళాది భాషలలో సర్వత్ర కనిపించుచున్నది. తమిళలాక్షణికులు పేర్కొనిన ప్రాస భేదములు చాలవఱకు జానపదచ్ఛందమునందు కలవు. వానిలో కొన్నిటిని పరిశీలింతము.

1. అడిఎదుగై : అన్నిపాదములలో మొదటిగణము రెండవ అక్షరమునకు మైత్రి చెప్పుట.

తమిళము
వట్ట మాన తటు
తట్టు సిఱైయ లడ్డు

తెలుగు
చల్ల చిత్తనోము నోచవే తల్లీ
వెల్ల అవులపాడి చేయవే తల్లీ
ఇల్లు పాలనేత అలుకవే తల్లీ
ఎల్ల సొమ్ములునీవు తాల్చవే తల్లీ

2. ఇణెఎదుగె 1, 2 గణముల రెండవ అక్షరములకు మైత్రి
ఎప్పు డొ స్తిరి మీరు కుప్పావధాన్లు
ఇప్పుడే వస్తిమి ఈ చిరుతనికి

3. పొఱిప్పుఎదుగై : 1, 3 గణముల రెండవ అక్షరములకు మైత్రి
వేద శాస్త్రముల వాదముసుమ్మీ
వాదుల నోళ్ళకు బూదిదు సుమ్మీ

తడుచుకో చెల్లెలా ముడుచుకో కురులు
పెట్టుకో సొమ్ములు కట్టుకో చీర

4. ఒరూఉ ఎదుగై : 1, 4 గణముల రెండవ అక్షరములకుమైత్రి.
తేజమైనది రామ నామము రాజమార్గము శృంగా

మార్గమెఱుగక మాయలోపడి మరచితిని సద్గురువరా
స్వర్గలోకము చేరెడవరి వర్గముల నరికితె శిష్యుడా

గేయములందు గణాంతపదము సమానముగా నుండుట 'ఇయైప్పుతొడై'లో చేరును. ఇట్టివి తెలుగు జానపదగేయములందును గలవు.

తమిళము : పడగు మిదక్క ఓడివన్ద కావిరి
పాట్టు ప్పాడి ఆడివన్ద కావిరి
కుడగు మలైయిల్ కుదిత్తువన్ద కావిరి
కొండు వందపొరుళం ఎంగె కావిరి

తెలుగు : ఆముదాలు పండిన చేను చూడండి
ఆడవార్ని కన్నతల్లి నరసి చూడండి
మోదుగు పూసిన బీడు చూడండి
మగవార్ని గన్న తల్లి మోజు చూడండి.

**ఊతపదములు :**

జానపదగేయములందు గమనింపదగిన మరియొక అంశము 'తనిచ్చొల్'. దీనిని తెలుగున ఊతపదము, ఎత్తుపదము అని పేర్కొనవచ్చును. కొన్నిపాటలలో ప్రతిపాదము కడపట నొక పదము లేక కొన్ని పదములు చేరుచుండును. రెండవ పాదము నెత్తుకొనుటకును ప్రథమ పాదమును ఆ వృత్తము సేయుటకును 'ఎత్తు పదము'లు సహాయపడును. ఇది పూర్తిగా సంగీతమునకు సంబంధించిన అంశమే. ఈ గేయ ధర్మమును గుర్తించిన తమిళ లాక్షణికులు వెణ్బా, ఆశిరియప్పా మొదలగు పద్యములందును 'తనిచ్చొల్'కు ప్రాధాన్యమొసగి యుపవిభేదములను పేర్కొనిరి. 'తనిచ్చొల్' గల తమిళజానపదగేయముల కుదాహరణములను పరిశీలింతము.

ఇదునల్ల తరుణం — అరుళ్ సెయ్య
ఇదునల్ల తరుణం
పచ్చైక్కిళియో—కణ్ణె
పార్వతిక్కు కెక్కిళియో

ఆడుమయిలే - నడం
ఆడుమయిలే - ఉన్
అంగమెల్లాం అశైన్దాడ
ఆడుమయిలే

పై పాటలందు ఆదుళ్ సెయ్యు, కణ్ణేనీ-నడం-ఉన్ మొదలగునవి తనిచ్చొల్ అగును. ఇట్లే 'తంగమే' అని వచ్చుట తంగచ్చిందు 'ఏలేలో' అని ఆవృత్తివలన ఆగేయము లకు ఏలప్పాట్టు అను పేర్లు ఏర్పడినవి.

కన్నడ జానపదగేయములందును 'తనిచ్చొల్' కలదు. శ్రీ ఎం. కృష్ణమూర్తి గారు 'జానపదఛందస్సు - త్రిపదియన్ను కురిత ఒందు వివేచనె' అను వ్యాసము నందు అరెసొల్లు, సవిసొల్లు, తనిసొల్లు మొదలగునవి కంటికి వెలుగు, దేహమునకు ప్రాణమువలె దీప్తినొసగునని పేర్కొనిరి [9] పద్యములలో తనిసొల్లు భావసమన్వయ మును సాధించు సంబంధపదమని శ్రీకృష్ణమూర్తిగారు నిర్ణయించిరి. తనిసొల్లుల వలన గేయనామములు స్థిరమగును. సువ్వి - ఏగిణియే - యారమగనమ్మ, కోలు, శోభాన, నారిపదములట్టివి.

అరెసొల్లునకు ఉదాహరణము :

రాగి బీసో కల్లె రాజా...ా ఒడిగల్లే।
రాయ అణ్ణయ్న అరమానే॥
రాయ అణ్ణయ్న అరమనె రాగికల్లే।
రాజబీదిగె దనిదోరే ॥

[ గీత నుంచిన చోట 'అరెసొల్లు' 2, 4 పాదాంతమందుగల విరామముకంటె 1-3 పాదాంతమందుగల విరామము స్వల్పకాలికము. స్వల్పకాలిక విరామమునకు తోహదము చేయు చివరిపదము 'అరెసొల్లు' అగును.

విసొల్లునకు ఉదాసారణము :

గంగేయా దడదాగే తుంబి హోవత్తోళే ।
లింగా కొండ్హోవ దయమాడే ॥

లింగాకే ఒంద్హోవా । దయమాడిద్దాదరే
శంభు శంకరను ఒలివోనే ॥

గీత నుంచిన చోట్ల సవిసొల్లు. రాగధాటికి తట్టుకొనుచు భావరమ్యతను ఆపాదించు స్థలములందు 'సవిసొల్లు' లుండును.

తనిసొల్లునకు ఉదాహరణము :

కప్పు హెండతి యెందు సిట్టు మాడలు బేడ
నేరిశె హణ్ణు ఖలు కప్పు - అణ్ణయ్యా
తిందు నోడిదరె రుచిబాళ

పై త్రిపదియందు ఎనిమిదవ గణమగు 'అణ్ణయ్యా' అనునది తనిసొల్లు. ఈ పదము రెండు మూడు పాదముల కలిపెడి 'బంగారపు కొక్కి' అని చెప్పుట సమంజసము. జానపద గేయములందు కొన్నిచోట్ల 'తనిసొల్లు' లేకపోయినను 'ఎత్తు పద ములే' తనిసొల్లులుగా వ్యవహరించును. ఉదాహరణమునకు—

రామర బాణవ బీదీలి బిట్టారె
హోగి నోడన బన్ని జనరెల్లా సువ్వి జనరెల్లా
హోగి నోడన బన్ని జనరెల్ల

పై పాట యందు 'సువ్వి' అనునది తనిసొల్లగును.

ఆంధ్రజానపద సాహిత్యమునందు కూడ కన్నడమునందువలె ఊతపదములు లేదా ఎత్తుపదముల ననుసరించి పాటలపేర్లు కలిగెనని చెప్పవచ్చును ఆచార్య బి. రామరాజుగారు సోమనాధుని పదములను గూర్చి యిట్లు వ్రాసిరి.

"కన్నులార చూచిన జానపదగేయ ప్రియుడు సోమనాథుడు ధన్యుడు. తుమ్మెద నివ్వాళి, వాలేశు, గొబ్బి, వెన్నెలపదములీ మాటలనే పాదాంతములందు కలిగిన ఈనాటి పాటల వంటివి కాబోలు ప్రభాతపదములనగా మేలుకొలుపులు స్ఫురించుచున్నవి. పర్వతపదములు శ్రీశైల పర్వత ప్రశంస చేయునవి కాబోలు. శంకరగీతములు భక్తిపదములు కానోపును. సంజవర్ణన, గణవర్ణన పదములు మాయమైపోయినవో లేక మారువేషమున అజ్ఞాతవాసకాలము గడుపుచున్నవో తెలియదు." ఇవి గాక పాటలను పేర్లతో లాలి - జోల - ఏల - సువ్వి - అల్లో

నేరెళ్లు - శోభనములు - ధవళములు మొదలగునవి పెక్కు గేయములు తెలుగులో నున్నవి. పై పాటలను బోలినవి తమిళ కన్నడ మలయాళములందు కనిపించు చున్నవి. ఉదాహరణమునకు చిలుక పదములు.

తమిళము : పచ్చక్కిళియో కణ్ణె నీ
పార్వతిక్కు కైక్కిళియో

కన్నడము : ఊరుమేలెయూరు దొరవేనో తమ్మయ్య ఏగిణియే
గ్యాసిల్లవేనో నన్నామేలే ఏగిణియే ఏగిణియే

తెలుగు : చెలగి చెప్పెద బుద్ధి చేకొనీ విననీదు
చింత మీదా నుండు చిలుకా

తమిళ కన్నడాంధ్రములందు సమానముగా కనిపించు పాటలలో జోలపాటలు పేర్కొనదగినవి. తమిళములో జోలపాటలను తాలాట్టుపాటలని యందురు తమిళములోగల కావ్యభేదములలో 'తాలాట్టు' కూడ నొకటి. భగవంతుని బిడ్డగా భావించి పాడబడిన జోలపాటలు పెక్కు తమిళమున గలవు. కన్నడమునందు జోలపాటలను 'జోగుళ' అని యందురు. తెలుగులో 'జోల' పాటలుగా నివి ప్రసిద్ధములు.

తమిళము : కణ్ణే యెన్ కణ్మణియే
కర్కండే ముక్కనియే
ఎణ్ణే ఎళుత్తే యెన్
ఇన్నముదే కణ్వళరాయ్ - తొడైయడికారం - 296

కన్నడము : తూగు తొట్టిలకే తుంబిగెజ్జె కట్టి
నాతూగి వనదా గిళతూగి- కొల్లూర
మూకాంబ తూగీ సుఖనిద్రె
తూగువ తొట్లిగె తుంబగెజ్జెకట్టి
నాతూగి వనద గిణి తూగి-నమ్మగిన
దేవరు తూగి సుఖనిద్దె

— కర్ణాటకదకరావళియ జానపదగీతిగళు - 7

## దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు — తులనాత్మక పరిశీలన

తెలుగు : తాళ్ళపాక అన్నమయ్యగారి కీర్తనములు జానపదవాఙ్మయమున చేరకపోయినను వారు రచించిన జోలపాటమాత్రము జానపద గేయముగా ప్రచారము గాంచినది.

జో అచ్యుతానంద జోజోముకుందా
రారపరమానంద రామగోవింద

సాధారణముగా జోలపాటలలో ఐదుమాత్రల గణములుమూడు, ఆపై మూడులేదా నాలుగుమాత్రల దళమొకటియునుండును. జోలపాటలు సాధారణముగా ఖండగతిలో సాగుచుండును.

కన్నడాంధ్రములందు ప్రసిద్ధి పొందిన గేయములలో ధవళములు గణింప దగినవి. కన్నడములో రన్నకవి గదాయుద్ధమను కృతియందు ధవళశబ్దమును ధవళమంగళ గేయార్థమున (5-41) ప్రయోగించియున్నాడు వివాహసమయములో ధవళములు పాడు సంప్రదాయమును కన్నడ కవులనేకులు సూచించియున్నారు. ఆంధ్రసాహిత్యమునందును 'ధవళముల'కు ప్రఖ్యాతి ప్రాచీనకాలము నుండి యున్నదనుట సత్యము. అప్పకవి, కస్తూరి రంగకవులు 'ధవళములను' విశదీకరించియున్నారు. కాకమాని మూర్తికవి పాంచాలీ పరిణయమునందు ధవళగేయములకు భైరవి, పాడి రాగము లుపయుక్తమగు సంప్రదాయమును (4-10) పేర్కొనియున్నాడు.

సంగీతరత్నాకరములో ధవళమొక గీతప్రబంధ విశేషముగా పరిగణింపబడినది.

"త్రివిధో ధవలః కీర్తి ర్విజయో విక్రమ స్తథా
చతుర్భిశ్చరణైః షడ్భిరష్టభిశ్చ క్రమాదసౌ 4-298
ఆశీర్భిర్ధవలో గేయో ధవళాది పదాన్వితః
యదృచ్ఛయా వా ధవలో గేయో లోక ప్రసిద్ధితః 4-302

ధవళము ధవళాది పదాన్వితమగు ఆశీర్వాదగేయము. ధవళము కీర్తి, విజయ, విక్రమములని త్రివిధములు. అవి వరుసగా 4, 6, 8, పాదములు గలవియని సంగీతరత్నాకరకారుని లక్షణము.

ధవళములనగా హారతి పాటలని చెప్పవచ్చును. ధవళ శబ్దమునకు కర్పూర విశేషమనియు అర్థము. కర్పూరము తెల్లనిది అందులకే హారతి పాటకును ధవళ మను పేరు వచ్చియుండును. ఇవి శోభన గీతపురస్సరముగా కనిపించును. మరియు స్తోత్ర పాఠ ప్రచురముగా జయశబ్దాది సంబుద్ధిగుచ్ఛముగా నుండును. ఇక కన్న డాంధ్ర ధవళముల సామ్యములను పరిశీలింతము.

కన్నడ ధవళములు చతుష్పది వర్గములో చేరినవి సాధారణముగా ప్రతి పాద ములో రెండు ఆరుమాత్రల గణములు వచ్చును కొన్ని పాదములందు మాత్రలు తక్కువైనను గాన ధర్మ మనుసరించి సమాన మాత్రలు కలవిగా చేయబడును.

తన్నకులద హిరియరను
మన్నిసికరె యిసి మనెగె
బిన్నవిసిద నవరిగె
తన్నంతస్థవను

కన్నడ జానపద సాహిత్య భండార పు. 684

ఆంధ్ర ధవళములందు సాధారణముగా పాదమునకు నాలుగు మాత్రల దళములు మూడేసి యుండును. రెండేసి పాదముల కంత్యప్రాస కన్పట్టును. నాలుగు మాత్రల దళములు మూడేసి యుండును. రెండేసి పాదముల కంత్యప్రాస కన్పట్టును. నాలుగు మాత్రల దళములు మూడని చెప్పటవలన పాదమునకు 12 మాత్రల నియతి కుదురుచున్నది. కనుక కన్నడాంధ్ర ధవళముల లక్షణ మొకటే యనుట సమంజసము ఆంధ్ర ధవళమున కుదాహరణము :

జయజయ దురితవిదూరా
జయజయ చిత్తవిచోరా
జయజయ దరమృదుహాసా
జయజయ దనుజ నిరాశా

—ఒబయ గరుడాచలము

ఇట్లే కన్నడాంధ్రములందు గల నలుగు పాట, చెండ్లాట పాట, శోభన గేయ ములు, విసరుచాతి పాట, అప్పగింతల పాటలకు సామ్యములు చెప్పవచ్చును. తెలుగు గేయములందు ద్విపదచ్ఛాయ కన్నడ గేయములందు త్రిపదిచ్ఛాయ గోచరించును.

## దాక్షిణాత్య దేశి చ్ఛందోరీతులు — తులనాత్మక పరిశీలన

జానపదగేయ వరుసలు లాక్షణిక నియమములకంటె భిన్నములైనవి. పద్యములు చదువుకొనుటకు గేయములు పాడుకొనుట కుద్దేశింపబడినవి. పద్యచరణములకు పాదములనుట రూఢికాగా గేయపాదములకు చరణములని వ్యవహారము. పద్య పాదము గణముల కూడికవలన నేర్పడినట్లు గేయపాదములు ఆవృత్తములవలన కూర్పబడును. పద్యమందుగల గణములు సమకాలికము గాకపోవచ్చును. కాని గేయము లందుగల ఆవృత్తము లన్నియు కాల ప్రమాణములో సమానముగానుండును. శిష్ట వాఙ్మయమునగల పెక్కు పద్యరీతులకు జానపదగేయవరుసలే ఆధారములని చెప్పవచ్చును. లాక్షణికులదృష్టి లిఖిత వాఙ్మయపర్యాప్తము. జానపద చ్ఛందము స్వతంత్రము. సువ్యాప్తము. రాగతాళాత్మకము. అంతమాత్రమున జానపద చ్ఛందము నియమరహితమునుగాదు.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు లాక్షణికమర్యాదల కనుగుణముగా ఆంధ్ర జానపదగేయములను పరిశీలించిరి 10 తెలుగు పద్యములు, పాటలు వర్గీకరించునపుడు కన్నడఛందోరీతులను గూడ జతచేయవలయునని సూచించిరి. జానపదగేయ వరుసల నెన్నుటలో నిదియొక విధానము.

ఆచార్య బి. రామరాజుగారు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు సూచించిన పద్ధతి ననుసరించి తొలుత జానపదచ్ఛందమును పరిశీలించి యా మార్గము పరిమిత ప్రయోజనాత్మకమగుట వలన నూత్న విధానమును సూచించిరి. జానపదగేయములు 3, 4, 5, 6, 7, 8 ఆవృత్తములతో నడచునను ప్రమాణముతో గేయములను సమన్వయించిరి. ఇది జానపదగేయ వరుస లెన్నుటలో రెండవ పద్ధతి యగును.

"ఉత్తమ కవిత్వము లయాత్మకము. దేశిచ్ఛందములందు లయ గుప్తము కాగా జానపద చ్ఛందములందు లయ సుస్పష్టమగును. వాఙ్మయములోగల ఈ రెండు విధములగు ఛందోరీతులను లలిత - ఉత్సాహ - మందానిల విభాగములుగా వర్గీకరింపవచ్చును. త్రిమాత్రాగణ సంయోజనము కలది ఉత్సాహలయ. చతుర్మాత్రాగణసంయోజనము కలది మందానిల లయ. పంచమాత్రాత్మక గణసంయోజనము కలది లలితలయ. ఈ త్రివిధ లయలతో జానపద చ్ఛందములను వర్గీకరింపవచ్చు" నని డాక్టర్ కర్కిగారు కన్నడ ఛందోవికాసమున పేర్కొనిరి. పై విధానము ఇంచుమించు ఆచార్య బిరుదు రామరాజుగారి జానపదగేయ చ్ఛందః ప్రమాణ పద్ధతిని పోలినదే.

అక్షరములను బట్టి అధిక మాత్రలు కలవియైనను సమమాత్రా కాలమునకు కుదించి పాడుట సంగీత సంప్రదాయము. సంగీత శాస్త్రమునందు మాత్రలను చెప్పుటకు తక కిట అను అక్షరములు వాడుదురు. ఈ నాల్గక్షరములు విడివిడిగా నొక్కొక్క మాత్రాకాలమును సూచించును. పాటయొక్క గమనములో రెండేసి మాత్రలను చెప్పవలసినపుడు 'తక' అని గాని 'కిట' అని గాని చెప్పుట సంప్రదాయము. మూడు మాత్రలయినచో తకిట, నాల్గుమాత్రలయినచో కిటతక అనియు సూచించుట పరిపాటి. జానపద గేయ వరుసలన్నియు వీనిపై ఆధారపడి యున్నవి తమిళ, కన్నడ, ఆంధ్ర, మలయాళ జానపద గేయములను పై పద్ధతి ప్రకారము సమన్వయించుటకు వీలున్నది. ఈ భాష లన్నిటియందును పాడుకొనుటకు తగినట్లు రచితములైన గేయముల నుండి చదువుకొనుటకు తగిన పద్యము లుత్పన్నములయ్యె నని రూఢిగా చెప్పవచ్చును.

## 7. 3. త్ర్యస్రగతిలో నడచు జానపదగేయములు – పద్యములు

లయసహజసిద్ధమైనది లయనుండి తాళము పుట్టినది. లయను సాధారణముగా అందఱును చేతులు తట్టిగాని, తప్పెట తట్టిగాని చూపింపగలరు. కాని తాళము కళా ధర్మమగుట వలన నందరు చూపలేరు. తాళమునకు మొదటిమెట్టు లయ. అది త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణగతులలో నుండును. సంకీర్ణమనునది అంతగా ప్రచారమందులేదు. జానపదములన్నియు తక్కిన నాలుగు గతులతో కనిపించుచున్నవి.

త్ర్యస్రములనగా మూడు మాత్రలు కలవని అభిప్రాయము. పద్యములందు, గేయములందు త్ర్యస్రవిన్యాసము కలదు. వృత్తములందు పంచచామరము, సుగంధి, ఉత్సాహ, తరళ, విచికిలిత మొదలగునవి త్ర్యస్రగతి కలవి. ఉపజాతి గీతులలో కమలన గీతి కూడ త్ర్యస్రగతి కలదే. మచ్చుకు :

| | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | |
|---|---|---|---|---|---|---|---|---|
| సుగంధి : | ఏడు | హమ్ము | లున్ గ | మున్ వ | దెన్మి | దిన్ సు | గంధి | కిన్ |

| | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 |
|---|---|---|---|---|---|---|---|---|
| పంచచామరము : | జరల్ | జరల్ | జగం | బు గూ | డి స | న్నుతిన్ | రచిం | పగా |

త్ర్యస్రములనుట వలన నగణ హగణములే గాక వగణము గూడ స్వీకరింపదగును. దేశిచ్ఛందోరీతులగు రగడలందు త్ర్యస్రవిన్యాసము కలవి. హయప్రచార రగడ - తురగవల్గన - విజయ మంగళరగడ లెన్నదగినవి.

హన చ తుష్ట యంబు బుతుల
జనిత యతుల జరగుc గృతుల
జను హ యప్ర చార రగడ
వినుత శాస్త్ర విదులు వొగడ

—అనంతుని ఛందోదర్పణము 3-53

త్ర్యస్ర గతితో నడచు జానపద గేయములు కన్నడాంధ్రము లందు పెక్కు గలవు.

3 3
కన్నడము హిండు దనువి నొళగె నుగ్గి
3 3 3
హసవు హాలు కుడిద నే

—నాడపదగళు పుట 45

తెలుగు — పూలు కోయ బోయి
3 3 3
విభుని పొలతి తెస్తివా

—వరదరాజు పెండ్లిపాట

ఇంద్ర పదవి బోయి తెచ్చినట్టి కనక మెల్ల
ఇంపు గాను నీకు ఇచ్చె కృష్ణమూర్తి

—తులసీ దళము

కొండ మీది వెండి గిన్నె
కొక్కు రాజు కాలు విరిగె అను బాలగేయమును

సువ్వీ సువ్వీ రామచంద్ర
సువ్వీ సువ్వీ కీర్తి సాంద్ర మొదలగు సువ్వీ పాటలను

త్ర్యస్రగతిలో సాగినవియే యగును. ఆధునిక గేయములందు కూడ త్ర్యస్రగతి గలవి యెక్కువగా కనిపించుచున్నవి. అట్టివి 'ఆధునిక చ్ఛందస్సు' అను ప్రకరణమున పరిశీలింతము.

## 7. 4. చతురస్రగతిలో నడచు జానపదగేయములు – పద్యములు

నాలుగు మాత్రల గణములు చతురస్రములగును. కందము, కందార్థములు, మధురగతిరగడ, హరిగతిరగడ, చతుష్పద, మత్త, తోదకము, ప్రకరణకలిత, మానిని, కవిరాజ విరాజితము, సరసిజము, క్రౌంచపదము మొదలగు పద్యములు చతురస్రగతిలో నడచుచున్నవి. వీనిలో కొన్నింటిని మాత్రము పరికింతము.

4 4 4 4

తోటకము : కమలా కుకచూ చుకకుం కుమతో
నియతా రుణితా తులసీ లతనో

—శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము

తమిళము : కలిమిగు గణపతి శరణం శరణం
గజముక గుణపతి శరణం శరణం

—అరుణగిరి నథర్ పాడల్

తెలుగు : శ్రీవని తాధిపు చేరి భ జింపుడు
భావజ జనకుని భక్తిఁ దలంపుడు

—ఛందోదర్పణము 3–58

ఆంధ్రజానపద గేయములందు కోలాటపుపాట, సీతనత్తవారి కంపుట, కుశలవ కుచ్చలకథ, బొబ్బిలకథ. దేశింగురాజుకథ, జాజర పాటలు, లక్ష్మిదేవి సోగటాలు మొదలగునవి నాలుగు మాత్రల ఆవృత్తముతో నడచు జానపదగేయములగును.

కన్నడము – ముదిమది జంగమ ఆదను స్వామి
ముంగలి జోళిగె హాకిద స్వామి

—నాదపదగళు పుట 4–112

తెలుగు — వినుమా నాథుని ముంగిట నెన్నడు పకపక నవ్వకు మీ
సుందరి నాథుని కన్నా ముందర మేత్కాను మీ
—సీతన త్తవారింటికి పంపుట

ఏనుగు ఏనుగు నల్లన
ఏనుగు కొమ్ములు తెల్లన
ఏనుగు మీద రాముడు
ఎంతో చక్కని దేవుడు
—బాలగేయము

## 7. 5. ఖండగతిలో నడచు జానపద గేయములు - పద్యములు

అయిదు మాత్రలు గలవి ఖండగతి గణములగును. ద్విరదగతి, దండకము పద్మనాభ వృత్తము, మంగళ మహాశ్రీ వృత్తము, లయగ్రాహి, లయవిభాతి, లయహారి, లయకాంత మొదలగునవి ఖండగతిలో నడచు పద్యములగును.
ఉదాహరణమున కొకటి—

ఫాలతల విస్ఫురిత లోలతర భాసురవి శాలభయ దాసురక
5 4
రాళనయ నాగ్నిజ్వాలలొకొ

తెలుగులో స్త్రీల పాటలు చాలవఱకు ఖండగతిలో సాగినవి. మాహూరమ్మకథ, మాత పురాణము, సుభద్రా కల్యాణము, సంక్షేప రామాయణము, తుమ్మెదపాటలు, జోలపాటలు, ధర్మరాజు జూదము, శశిరేఖ పెండ్లి, శాంతాకల్యాణము, గోవింద నామాలు, శ్రీరామ దండకములు ఖండగతిలో సాగిన గేయములు, ఖండగతిలో సాగిన కన్నడ జానపద గేయమున కొకయుదాహరణము.

నాగభూషణ తాను నగుతగౌరియ కండు
హోగిబంద్యానిన్న తవరూరిగె
ఈగేను కొట్టరు ఇన్నేను కొడువరు
బేగనె హేళు హేళెందనవను
—నాడపదగళు పుట 198-199

తెలుగు :—

తూర్పాన గొట్టించె నడియలో
పరమట గొట్టించె నడియలో
...  ...  ...
తెరదీయ ఓగంగ నడియలో
మరివ్రుగ మైపారె నడియలో
—జట్టి జాము పాటలు - జానపద కళాసంపద - పుట 195

ముత్యాల రత్నాల ముత్తైదలారా
ఇంటిలో చేసేరు ఏమేమి పనులే
గోధూమ లిసిరేరు గోదపూ సేరు
పందిర్లు యేసేరు పసపుదం చేరు
—విసరు రాతిపాట - జానపద కళాసంపద

కారూరి పట్నాన ఆరుగురు తెలుగోళ్ళు
ఆరుగురు తెలుగోళ్ళు ఒక్కటే వెంగమ్మ
గంగాల వాడకి వెంగమ్మ నిచ్చిరి
పంద్రెండు ఏండ్లయ్యె ఫలమెలేదయ్యో
కలుపు పాటలు పుట 125.

## 7. 6. మిశ్రగతిలో నడచు జానపద గేయములు - పద్యములు :

ఏడు మాత్రలు గలవి మిశ్రగతిలో చేరును. మత్తకోకిల, ధ్రువకోకిల, హరిణగతి రగడ, వృషభగతి రగడలు మిశ్రగతిలో నడచు పద్యములు. రామరాజ భూషణుడు వృషభగతి రగడను మిశ్రగతిలో నడిపించి యున్నాడు.

బాల బాల రసాలమిది పిక పాలి పాలిటి యదుర సాలను
గేలిఁ గేలిడి గ్రుచ్చఁగడు రా గిల్లు గిల్లుము తత్ప్రవాళము
వసుచరిత్ర 3-149

మత్తకోకిల కూడ మిశ్రగతిలో నడచు పద్యమని చెప్పవచ్చును.

మత్తకోకిల మత్తకోకిల మత్తకోకిల వృత్తమా

కందుకూరి రుద్రకవి (16 వ శతా) జనార్దనాష్టకమున వృత్త లక్షణముల కతీతమైన గేయ లక్షణమును మిశ్రగతిలో సాధించెను. ఉదాహరణమునకు —

నిన్న రాతిరి చవికె లోపల నీవు చెలి కూడుంటిరా
ఉన్న మార్గములన్నియును నేనొకతె చేతను వింటిరా
విన్న మాత్రమె కాదురా నిను వీధిలో గనుగొంటి రా
కన్నులారా దనుజమర్దన ! కందుకూరి జనార్దనా

మిశ్రగతిలో నడచిన కన్నడ జానపద గేయమున కొక యుదాహరణము.

కైలాసదలి సభకూడిత్తు ఇంద్రాగ్ని యమనైఋత్య
వరుణవాయు కుబేర ఈశాన్య అష్టదిక్పాల కరకూడిసుతా
సప్తఋషిగళు బందరు అల్లి శక్తితా పార్వతా
సరిగమ పదనిస సనిదప మగరిస సప్తతాళ గళకూడిసుతా

—కన్నడ ఛందోవికాస - పుట 250

పైన పేర్కొనబడినవి గాక ఆరుమాత్రల ఆవృత్తములు గల పాటలు కూడ జానపదగేయములలో కలవు. ఇవి 3×2=6 మాత్రల గతిలో నడచును. కనుక నీ పాటలను త్రిశ్రగతి పాటలుగా చెప్పవచ్చును. కాని ఒక్కొక్కప్పుడు 6 మాత్రల ఆవృతములు 2 + 4 మాత్రలతో 'తక కిటతక' అని నడువవచ్చును. ఏలపదములీ వరుసలోనే నడచును. ఇక దేశిచ్ఛందములకు మూలములైన జానపదగేయముల నించుక పరిశీలింతము.

కన్నడములో గల త్రిపది, ఛందోవతంస, సాంగత్య, షట్పదీ పద్యములు జానపదగేయములనుండియే యుత్పన్నము లయ్యెనని చెప్పవచ్చును. లాక్షణికులు పేర్కొనిన నియమముల కించుమించు సరిపోయెడి జానపదగేయములు.

త్రిపదిచ్ఛాయ గల గేయము —

రుద్రన్న రాణిగే ముద్దన్న పూర్ణిగే
ఇద్దల్లి వరవ కొడువొళు గౌరమ్మగె
వజ్రాదారుతీయా బెళాగిరే

హారతి పాట

ఛందోవతంసను పోలినది —

ముదిమది జంగమ ఆదను స్వామి
ముంగైలి చోళిగె హోకిద స్వామి

నాడపదగళు - 112

సీసపద్య గతి కలది -

ఇష్టాద మగళెందు ఇష్టోను నినిగిత్తె
సృష్టి గౌడెయనె కే ళెంద కాకె

— నాడపదగళు పుట 198-199

సాంగత్యచ్ఛందమును పోలినది.

నెత్తద హాలిగె యందద బెన్నా నళితోళు
మత్త గజద మస్త కరవు
చిత్రద ప్రతిమె యందది రూపు సౌబగుళ్ళ
ఎత్తణ కొరవంజి ఇవళు

కన్నడ సాహిత్య పరిషత్పత్రికె - అక్టోబరు 1933

ఉత్సాహ రగళెను పోలినది.

కామ నూరా హోళి యింద
కుంతు నింతు బరుతిద్ద
కామన్ యారు తడెదోరు
బారయ్య బెళుదింగళె - నమ్మూర
హోలి నంథ బెళు దింగళె

—నాడపదగళు - తింగళు మూవనపద

ఉత్సాహవృత్తమును పోలినది

బ్ర బ్ర బ్ర బ్ర బ్ర బ్ర బ్ర గ
దాగి బీసో రాజ్యా దొళగె రంగనో డక్కా బలుతెం పో

—కన్నడ ఛందోవికాస 155

'ఏళె' ను పోలిన జానపద గేయము

బిసగె బిసిలణ్ణా కూసిన తాయణ్ణా
హేగె బరలణా మదువెగె

—నాదపదగళు పుట 90

కన్నడఛందోగ్రంథములందు చెప్పబడిన నియమముల ననుసరించి కన్నడ జానపదగేయములను పరిశీలించినట్లు ఆంధ్రఛందోగ్రంథములందు చెప్పబడిన నియమముల ననుసరించి తెలుగు జానపదగేయములను వర్గీకరింపవచ్చును. కన్నడాంధ్రములకు సాజాత్యముండుట వలన తెలుగు లాక్షణికులు పేర్కొనని కన్నడ పద్యముల కనుగుణముగా గూడ జానపదగేయములను సమీక్షింప వచ్చును.

ద్విపదచ్ఛాయ —

కాకమ్మ నీకాల కట్టేము గజ్జె
రత్తమ్మ మావార్ని రాగుయ్యేకాకి
... ... ...
నేరేడు పండంటి అన్న నాయన్న
నేడు వస్తానని నెలకన్న రాడు

సీసపద్యచ్ఛాయ —

ఈ రీతిగా వారు ఘోరయుద్ధము సేయ
కడుకష్టమని తోచె కాలనేమికిని
ఈశ్వర పుత్రునకు గా జావ తారునకు
పార్వతీ తనయునకు భక్తితో
రత్నాల మొలనూళ్ల రమణియందెలు మ్రోయ
రవికుల రామన్న జో జో

మధ్యాక్కరను పోలిన జానపదగేయము —

అంతట రాములవారూ అంగన సీతను గూడీ
సంతస మందుచు వేగా స్వపురానికి చనుదెంచి
తమ్ముల తోడను కలిసీ నెమ్మది రాజ్యములేలే
ధర్మముతో ప్రజలెల్లా తామర తంపరలై రీ

భోగషట్పదిని పోలిన పాట -

తులసి యింట నుంచువార్ని
తులసి పూజ చేయువార్ని
తులసియందు భక్తియుంచి మెలగువారి - నీ

కిరిసీసములను పోలిన జానపద గేయములు :

ఏముంది ఫలమేమి పెట్టినా మామయ్యా
పసుపు కుంకుమ నాకు కొదవాయె మామయ్యా
విధవ విభవము మీరు చూడాల మామయ్యా
పతితోడి లోకమే పడతికి మామయ్యా

సీసపద్యములను పోలినవి కన్నడమున చాల తక్కువ. కాని సీసపద్యచ్ఛాయలు గలిగి నాలుగు పాదములతో కూడిన వానిని కిరిసీసములు. తెలుగులో కూడ కిరిసీసము లున్నవని సారాంశము.

శరషట్పది :

శ్రీ తరు ణిరో నే
శ్రీ రఘు రాముడ
చేరిక వాటము తీ(ఈ)వే

కుసుమషట్పది :

శ్రీశంభు తనయునకు
సిద్ధిగణ నాథునకు
వాసిగల దేవతా వందితున కూ

భామినీ షట్పది

గుమ్మ - దేదే - గోపి - దేవి
గుమ్మ - దేదే - కన్న - తల్లీ
గుమ్మ - డిని పౌడ - సూప - గదవే - అమ్మ - గోపె - మ్మో

ఇట్లు తెలుగు జానపద గేయములే రగడకో, షట్పదికో, తరువోజకో, అక్కరకో, ద్విపదకో, సీసమునకో దగ్గరగా చేరువగా నున్నవని చెప్పవచ్చును. కాని

జానపదగేయ వరుస చెప్పుటకు కాలసూచి మాత్రా పద్ధతి మాత్రమే సరియైనదని తులనాత్మక పరిశీలనము వలన నిర్ధారింపవచ్చును.

## 7. 7. యక్షగానములలోని దేశిచ్ఛందో రీతులు :

మార్గదేశిచ్ఛంద సమ్మేళనము గల సాహితీప్రక్రియలలో ఉదాహరణములు' యక్షగానములు పేర్కొనదగినవి. ఉదాహరణ కావ్యములందు వృత్తములు, రగడ విభేదములగు కళికోత్కళికలు ప్రయోగింపబడినట్లుగా యక్షగానములందు వృత్తములు, జాతులు, ఉపజాతులు ప్రయోగింపబడుచుండును. మరియు చంపూకావ్యములందు కానరాని రేకులు, దరువులు, ఏలలు, అర్ధచంద్రికలు, ధవళములు, శోభనములను గీత ప్రబంధములును యక్షగానములందు ప్రయోగింపబడుచుండును పై కారణముల వలన యక్షగానములందు దేశియత స్ఫుటముగా ప్రతిబింబించు చున్నదని నిర్దిష్టముగా చెప్పవీలున్నది.

కన్నడ యక్షగానములందు మత్తేభ, శార్దూల, చంపకమాల వృత్తములు' ద్విపది, చౌపది, సాంగత్య, షట్పదీ భేదములు కనిపించుచున్నవి. మార్గచ్ఛందోరీతుల కంటె దేశిచ్ఛందోరీతులకే కన్నడయక్షగానములందు ప్రాధాన్యము. శ్రీమతి నిర్మలా ఇనాందార్ గారు కన్నడయక్షగానములందు షట్పదులెక్కువయని కందాదులకు ప్రచారము తక్కువయని వ్రాసిరి.[12] యక్షగానములందు సంభాషణము ప్రధానము. కనుక సంభాషణాత్మకమగు ఛందమును యక్షగాన కర్తలు అభిలషించిరి. కనుక షట్పదుల నెన్నుకొనిరి ఆంధ్ర యక్షగానములందు సంభాషణలకు ప్రాధాన్య మున్నను నృత్యసంగీతములకు ప్రాధాన్యమొసగుట వలన రాగతాళాత్మక పద్యరీతులకు ప్రచారము సిద్ధించినది. యక్షగానములందు వాడదగిన ఛందో రీతులను గూర్చి లక్షణదీపిక "యక్షగానంబునన్ వెలయు పదంబులు దరువులు నేలలు ధవళంబులు మంగళ హారతులు శోభనంబులు నుయ్యాల జోలలు జక్కుల రేకుపదంబులు చందమామ సుద్దులు అష్టకంబులు ఏకపద ద్విపద త్రిపద చతుష్పద షట్పదాష్టపదులు నివి యాదిగాగల్గు నన్నియు లయ ప్రమాణంబుల నొప్పి మృదు మధుర వచన రచనల ప్రసిద్ధంబైన యవి మధుర కవిత్వంబులు" అని వివరించినది. పై వివరణము వలన చంపూ ప్రబంధ ద్విపద ఉదాహరణ శతకాది ప్రక్రియలకదలి ఛందోరీతులన్నియు యక్షగానములందు కనిపించు చున్నవని రూఢిగా చెప్పవచ్చును.

కన్నడ యక్షగానములందు షట్పదు లెక్కువగా కనిపించునట్లు తెలుగు యక్ష గానములందు రేకులు, దరువు లెక్కువగా కనిపించుచున్నవి. యక్ష గానములందు సంగీతచ్ఛందములకు సామీప్య సంబంధ ముండుటవలన ఛందోరీతులకు తాళములను గూడ చెప్పుట అనివార్యమైనది. కనుక శ్రీ పి. వి. హాస్యగార్ షట్పదులకు తగిన తాళములను గూర్చి యిట్లు పేర్కొనిరి.

శరషట్పదిని ఏకతాళ మరియు రూపక తాళములలో ప్రయోగింతురు. కుసుమ షట్పదిని ఝంపె మరియు రూపక తాళములలో పాడవచ్చును. కాని ఏకతాళమే అనుకూలమైనది. భోగషట్పదిని శంకరాభరణ ఏకతాళములో యక్షగాన కవులు ప్రయోగించి యున్నారు. కాని అష్ట రూపక తాళములలో పాడుట సులభము. భామిని షట్పదిని త్రిపిడెలో మాత్రమే సుఖముగా పాడవచ్చును. వార్ధక షట్పది ఏకతాళ గతికి అనుకూలమైన ఛందోవిశేషము.[13]

చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహమునందు యక్షగాన లక్షణము నిట్లు పేర్కొనెను.

వృషభగతి త్రిపుడరే కంత్రి యుగమగు
 దుదనేడు లఘువులు తొలఁగఁజేయ
జంపెరేకునకు లక్షణము ద్విరదగతి
 యగుఁగొన నొక లఘువందు మాన
రచ్చరే కగును దురగవల్గనము గతి
 మఱియేక తాళియౌ మధురగతిని
ఆటతాళమున మాత్రలంత్రి కిర్వదినాల్గు
 నాల్గిట విరతి పద్మాలుగింట

నిలుచు నర్ధంపు నర్ధచంద్రికలు దీన
యక్షగానాది కృతులలో నార్యులిడిన
రగడభేదంబు లివియౌను రమ్యచర్య
యవితనిజదాస సముదాయ యాంజనేయ

లక్షణసార సంగ్రహము 2-141

పై పరిశీలనవలన షట్పదుల స్థానమునందు తెలుగున 'రేకులు' ప్రముఖ స్థానము వహించినట్లు చెప్పవచ్చును. షట్పదులకు రాగతాళములు చెప్పినట్లు రేకులకుగూడ యక్షగాన కర్తలు రాగ తాళముల చెప్పిరి.

## రేకులు :

రేకులనగా పాటలు లేక పదములని స్థూలముగా చెప్పవచ్చును. తాళ ప్రధానములును, రగడ వికృతులునగు గేయ రచనలే రేకులగును. రగడల గతులకు రేకులకు సామ్యములున్నవి. కనుక చిత్రకవి పెద్దన త్రిపుటరేకు వృషభగతి కలదనియు, జంపె రేకు ద్విరదగతి గమనము కలదనియు, రచ్చరేకు తురగవల్గన సరళి సాగుననియు, ఏకతాళి మధురగతిచ్ఛాయ నడచు ఛందోబంధమనియు అటతాళము 24 మాత్రలు గల పద్యబంధమనియు పేర్కొనెను. చిత్రకవి పెద్దన కొన్ని రగడలకు మాత్రము తాళగతులు సూచింప కస్తూరి రంగకవి నవవిధ రగడలకును తాళములను (4-187) సూచించెను. అతని అభిప్రాయమనుసరించి హరిగతికి అటతాళము, హయప్రచార తురగవల్గన విజయమంగళములకు రూపక తాళము, మధురగతికి ఏకతాళము, ద్విరద గతి విజయభద్రలకు జంపెతాళము, హరిణగతి వృషభగతులకు త్రిపుటతాళములు నిర్దిష్టములని తెలియుచున్నది. లాక్షణికులు చెప్పిన జంపె, త్రిపుట, అటతాళ, ఏకతాళములేగాక యక్షగానములందు ధ్రువ, మఠ్య రూపక, ఆది, రచ్చ, చిత్ర తాళాను కూలములగు ఛందోబంధములు కనిపించుచున్నవి. వీనిని క్రమముగా పరిశీలింతము.

## త్రిపుటరేకు – వృషభగతి :

వృషభగతి పాదమున నేడేసి లఘువుల దళములు నాల్గుండును. రెండు పాదములందెనిమిది. అందేడు లఘువులను తొలగింపగా అట్టిదళములేడగును. ఇట్టివి త్రిపుటరేకులగును.

| 7 | 7 | 7 | 7 |
|---|---|---|---|
| లలితగాత్రుడు | శుభచరిత్రుడు | దళితశత్రుడు | సుజనమిత్రుడు |
| 7 | 7 | 6 + 1 | |
| నలిననేత్రుడు | కందుకూరి | జనార్దనుండు | |

—సుగ్రీవ విజయము.

పై ఉదాహరణమునందు రెండవ పాదాంతమున చివర నొక లఘువు తగ్గినను గేయ ధర్మమనుసరించి 7 మాత్రలేయగును. కనుక వృషభగతిచ్ఛాయ నడచిన పద్యవిశేషము త్రిపుటరేకు కొన్ని యక్షగానములందు త్రిపుట అనియు త్రిపుట తాళమనియు కలదు

జంపెరేకు - ద్విరదగతి :

ద్విరదగతిలో నగ, నలల, భల, సల, త, రగణములలో నేవేని నాలుగు గణములు రాదగును. అనగా పంచమాత్రాత్మక గణములు రాదగునని ఫలితార్థము. పాదమునకు నాలుగు పంచమాత్రాత్మక గణములు వచ్చుట ద్విరదగతి కాగా నందు నొక మాత్ర తక్కువ యైనచో 'జంపె రేకు' అగును.

5 5 5 5
సురరాజ సన్నుతికి సురుచిరాధర మతికి
5 5 5 4
కరుణా రసోన్నతికి గరుడాద్రి పతికిన్

—ఓబయ గరుడాచలము.

ఈ జంపెరేకునకు జంపెత్రిపుటలు, జంపెతాళములను పేర్లు గలవు. జంపెరేకునకు మరియొక యుదాహరణము.

భానువంశజుడు నీ పాలింటి దైవమై
వానరేశ్వరుజంపె వర్ధిల్లు మికనూ
ఏ పాటి పౌరుషము హెచ్చేనిం దులనీకు
పాపమని మదిలోన పరికింప వైతి

—సుగ్రీవ విజయము.

ఈ జంపెరేకులనే ప్రభావతీ ప్రద్యుమ్న యక్షగానమునందు నడరేకులనియు, కపోత వాక్యమను యక్షగానమునందు మధ్యమనడలనియు నేతత్కృతి కర్తలు వ్యవహరించిరి. అల్లొనేరేళ్లు, అలక పాటలు చాలవఱకు జంపెగతిలో సాగునవే. ఉదాహరణమునకు—

శ్రీరామ విభవంబు చెలువొంద గాంచి
ధారుణికి పుత్రియై తగనుద్భవించి

కూరిమితో జనకునకు కూతురని పించీ
కోరికతో దశరథుని కోడలనిపించీ

—జానకీ పరిణయము.

## రచ్చరేకు - తురగవల్గనము

హయప్రచారమునకు తెట్టింపు తురగవల్గనము. తురగవల్గనముగతి కలది రచ్చరేకు. తురగవల్గన రగడపాదమునందు ఎనిమిది సూర్యగణములుండుట నియతము. ఇట్టివి రెండుపాదములున్నచో రచ్చరేకు. చినకపోతయ్య వీరచోడవ్వచరిత్రమున తురగ వల్గనగతిగల రేకునకు 'మటిమెరేకు'లను పేరు కనిపించుచున్నది.

కట్ట పాదల దుప్ప టమ్మ పెట్టు కొనగ చిలువ సొమ్ము
పుట్టు తిరిపె మడుగు నమ్మ తిట్టవలదు వెనుక మమ్ము

## ఏకతాళి - మధురగతి

గగ, భ, స, నలగణములలో నేవేని నాలుగు గణముల కూర్చుట మధురగతి పాదమగును.

ముక్కులు చెక్కులు మూపులు వీపుల్
ప్రక్కలు పిక్కలు బరులును దరులున్

— సుగ్రీవవిజయము

సింగయ ప్రభావతీ ప్రద్యుమ్నమున మధురగతిగల రేకును 'ఆదితాళరేకు'గా కృతి కర్త పేర్కొని యున్నాడు. ఇతడే మరొకచో మధురగతి ఛాయగల రేకును 'నడ రేకులు'గా పేర్కొనెను. ఉదాహరణమునకు —

సరులో తావుల గురులో స్త్రీలను
మరులు కొలుపు మచ్చరులో జాణ

## అటతాళము - హరిగతి

'అంఘ్రి కిర్వది నాలుగటతాళమున'

అప్పకవీయము 4-303

లాక్షణికులు అటతాళమునకు మాత్రలు పేర్కొనిరి గాని దానికి సమానమగు రగడను పేర్కొనలేదు. కాని కస్తూరిరంగకవి మాత్రము అటతాళమునకు హరిగతిని పేర్కొనెను. కాని "అట తాళమున నడుము తేలిపోయినను ఎత్తుగడ నుండి చివరంటనున్న గతి హరిణగతి లేక వృషభగతి గాని హరిగతి మాత్రముగాదు. ఒక్కొక్కచో అట తాళమునకు తురగ వల్గన గతియు చూపట్టాడు" అని ఆచార్య ఎస్. వి. జోగారావుగారు తెలియ జేసిరి.[14]

రగడ భేదములందు గాని తాళభేదములందు గాని అన్వయించుటకు వీలుకాని రేకులు పెక్కు యక్షగానములందు కనిపించుచున్నవి. వానిలో వెండిరేకు, పాళిరేకులు, బౌళిరేకులు, ముఖారి రేకులు ప్రసిద్ధములు. వీనియందన్నిట లయాత్మక పదబంధము మాత్రమున్నది.

## అర్ధ చంద్రికలు :

అర్ధచంద్రికలకే అర్ధరేకులనియు పేరు. చిత్రకవి పెద్దన, అప్పకవి మొదలగు లాక్షణికులు త్రిపుట, జంపె మొదలగు రేకులందు సగము పరిమితి కలవి అర్ధచంద్రికలని సూచించిరి. రగడ భేదములగు కళికోత్కళికలు ఉదాహరణ కావ్యములందు ప్రయుక్తమైనట్లు యక్షగానములందు అర్ధచంద్రికలు ప్రయోగింపబడును రేకులెన్ని విధములో అర్ధచంద్రికలును అన్ని విధములే.

5 5 5 4
పన్నీట జలకంబు బాగుగా నాడెన్
5 5 5 4
సరిగంచు చీరచుం గులుదీర్చి కట్టెన్

—శారదాకురవంజి

అక్షర హరివిక చాంబురు హాక్షున్
యక్షప సఖనుత యదుకుల దక్షున్
రక్షక సురవిదు రద్విప రక్షున్
రాక్షస విదళన ప్రచురచిర వక్షున్

అప్పకవీయము 4-404

దరువు :

యక్షగాన నాటకములందలి గీతులను దరువులనుట వ్యవహారము సంస్కృతమందలి ధ్రువాశబ్దము కన్నడాంధ్రభాషలలో 'దరువు' అయినదని పండితుల అభిప్రాయము. సంస్కృత లక్షణ గ్రంథములగు నాట్యశాస్త్రము, నాట్యదర్పణము, భావప్రకాశము, వసంతరాజీయము, సంగీతసమయ సారములందు ధ్రువాలక్షణములు విస్తరింపబడియున్నవి. సంస్కృతరూపకములందు ధ్రువలకు ప్రవేశ, ఆక్షేప, నిష్క్రామ, ప్రాసాదిక, అంతరములను సాంకేతిక ప్రతిపత్తి యున్నది. సంస్కృత లక్షణ గ్రంథములందు ధ్రువాగానము ప్రస్తావింపబడినను ధ్రువారీతులకుగాని ఆ తాళములకు గాని నియతఛందః ప్రక్రియ చెప్పబడలేదు.

తెలుగులో దరువువేయుట అనగా తాళమువేయుట లేక మద్దెల వాయించుట అను అర్థములున్నవి ఇది క్రమముగా తాళ లయానుగుణమగు గీతికి కూడ పేరైనది. దరువులు కాలక్రమమున చరణముల రూపాంతరములైనవి చరణములు రాగప్రధానములు కాగా దరువులు గతిప్రధానములయినవి. సంస్కృత ధ్రువలకు వలె తెలుగు దరువులకు కేవల సాంకేతిక ప్రతిపత్తిలేదు. ఆయా ప్రయోగ సందర్భములకు పనికి వచ్చు నెట్టి గేయరచన యైనను దరువులు కావచ్చును. గానము మీద గాక నడకమీద ప్రాధాన్యముంచి నడపిన ఆవృత్తములు దరువులని ఫలితార్థము. పై కారణముల వలన సంస్కృత ధ్రువలకు తెలుగు దరువులకు సంబంధము లేదని రూఢముగా చెప్పవచ్చును.

దరువులు ఐదు విధములు. ప్రవేశికదరువు. వర్ణదరువు, సంవాదదరువు, స్వగతదరువు, జక్కిని దరువులు. ఛందోదృష్టితో పరిశీలింప మొదటి నాలుగు దరువు లొకే విధమున రచింపబడగా జక్కినిదరువునందు మాత్రము జతులు, మరల సాహిత్యము చేర్పబడును. తక్కిన దరువులలో స్వరక్రమము చెప్పుట ఐచ్ఛికమగును. ప్రావేశికదరువు

రాజువెడలె రవితేజము లదరగ

కుడియెడమల డాల్ కతులు మెఱయగ

సంవాదదరువు

మదిరాక్షి హెచ్చుతలంపు మదిని తలంచితివి
అదినీకు తెలిపెద నతివయేమిచ్చేవే
అలరు విల్తుండు మించుచెలువుండు నినుజేర
కలకంటివి రేయి కలకంఠి యీావు

— మన్నారుదాసవిలాస నాటకము

జక్కినిదరువు

కర్పూర ధవళాంగ కందర్పభంగ
సర్వభూషణ ధృతగంగ సదయ త్యాగరాజఉత్తుంగ
నిసగారిగమాప ధథపమ
గరిగమపమ పధనిధధప
పధసిసరి సనిరి సనిధప
సానిధథ పమ ధా పామగారిసరిస
సల్లాము సల్లాము రే
తికమిధమికిట ఝంతరి తక్కిటకిటతక

— పంచరత్న ప్రబంధము

పదములకు దరువులకు కొన్ని భేదములున్నవి. పదములు చతురస్ర వంటి యేగతిలో సాగినను రాగస్వరములతో చేరి నెమ్మదిగా నడచును. కాని దరువులు స్వరములకుగల కాలప్రమాణమును కుంచించుకొనుచు మాత్రలపై అఘాతమునిలిపి త్వరితగతి సాగుచుండును. కనుక దరువులందు తాళప్రధానములు, సర్వప్రధానము లను భేదము లేర్పడినవి. శహాజీ దరువులలో సలాముదరువు, ప్రబంధదరువు, పదాభి నయముదరువు, సవ్యాపసవ్యసమపదలీలాదరువు, క్రమసప్తస్వర వర్ణార్థ లీలాదరువు మోహరం, గణపతికవృత్తం, నెలకట్ట, సొల్లుకట్టు, త్రికాలస్వరం, వర్ణత్రికాలసొల్లు, వర్ణసొల్లు, జతి, స్వరజతి, స్వరసొల్లుజతి పంచఘాతములనునవికలవు. యక్షగాన మొక సంగీత ప్రక్రియానిక్షేపము.

<u>పదార్థములు</u>

యక్షగానములందు కందార్థదరువు, గీతార్థదరువు, సీసార్థదరువు, ద్విపదార్థ దరువు, వృత్తదరువులనునవికూడ కలవు.

కందార్థదరువు

కందపద్యములో నాలుగవ పాదమున కొన్ని గుణములను తగ్గించి, యద్దానితో పాటలోని యొకభాగమును చేర్చిన కందార్థదరువు అగును.

నీవారనగనునెవ్వరు
నీవెవ్వరు గురువు లెవరు నేనెవ్వరయా
భావాభావము తెలియగ
లేవైతివి చైతన్యుడు

– చిరుతలకృష్ణ రాయబారము

పై కందపద్యముతో ఈ క్రింది దరువుకూడ చేర్పబడినది.

లీనమైయుండి జగము తానె పెంపుముంపుచుండె
కావున సకలంబు నీవుదైవరూపమే యనుకొను

గీతార్థదరువు

గీతపద్యము కడపటిపాదములో కడపటి రెండు సూర్యగణములు తగ్గించి పాట చేర్చిన గీతార్థదరువగును.

కరుణసాగర యాభీష్మ ఘాతలకును
నిలువ లేకనె సైన్యముల్ నేల గూలె
గాన జయమొందజేయు యా కౌరవులతో
వైరమును బూని యిప్పుడు

దరువు : వనమూన కేగియున్న వడిగా కలుగూను మేలు
వనమాలీ వినుము మేము వదిలె రాముదురము చాలు
మొనసీ కాయలు ఆకులు దినుచూ పదమూ డేడులు
మనమూ గడిపితిమి గాని రణమూ మోమోపమయ్యా

–చిరుతల శ్రీకృష్ణరాయబారము.

సీసార్థము :

సీసపద్యము రెండవపాదములో కడపటి రెండు సూర్యగణములను వదలి, పాటకలిపిన యెడల సీసార్థములగును

వినవె మందాకిని వేమాఱు నాతోను
ఎనసిన మాట లింకేల నీకు
వనజాక్షి నీ వింత వగలు చేసిన గాని
మనసు నీపైలేదు మత్స్య కంఠి
గొనకొని భ్రమరాంబ కోపముచేసీని
నను నీవు పిల్వ రాకువే మందాకిని
ననునీవు పిల్వరాకువె నాతోడ నీవు
చనవు మాటాడ రాకువె

—తరిగొండ వెంగమాంబ శివలీలా విలాసము

## ద్విపదార్థ దరువు :

మొదటి సగము ద్విపదయు రెండవ భాగము దరువులగుట ద్విపదార్థ దరువు.

భామరో నీమాట బహుచిత్రమమ్మ
కోమలా కారుడౌ కృష్ణుండు నీకు
మామ పుత్రుండను మాటయే కాని
ఆ మహామహుని నీవు
చూడలేదెట్టు లతివా మోహించినావూ
తామరా సాక్షి నీకు తగునే యీ వట్టి భ్రమలు

నందిపాటి మిత్రవిందా పరిణయము.

## వృత్తార్థ దరువు :

ఎత్తుగడ వృత్తమై సగములో దరువు ధోరణికి సాగిన పద్యమును వృత్తార్థ దరువని చెప్పనొప్పును.

ఉ. సుందరమైన రూపమును జూచి మనంబున నాసచేతుగా
నందము నొంది తార హరిణాంకుని ప్రక్కను నిల్చియేమిరా

ద. దంధాన సేయగ నేను మారుని బారి
తొందర కోర్వగ లేను
డెందము కుందగ చిందర బెందుచు
కందువ లరయుచు నందున పొందగు

—ఎల్లయ చంద్రతారావిలాసము.

మొదటి రెండు పాదములు ఉత్పలమాల పాదములగును. తరువాతి పాదములు దరువు లగును. ఇట్టిదే మరియొక యుదాహరణము –

ఉ. శ్రీమధురాధరీ వినవె శేషగిరీశుడ నీదు కేళికా
ధామమునందు నింతవడి దర్పక లీలలనుండి యంతటన్
వేమరువేట లాడజని వేగమె వచ్చితి తల్పుతీయవే
భామా సద్గుణధామా లావణ్య చతురసీమా
అలమేలు మంగానామా

## ద్విపద :

రేకులు, దరువుల తరువాత యక్షగానమున ప్రధానమైనది ద్విపద. ప్రాయిక ముగా ద్విపదలేని యక్షగానమే లేదనవచ్చును.

శృంగార మమరంగ చెలువ మన్నారు
చెంగమ్మ పెండ్లికి చెలులార రారె

— హేమాబ్జనాయికా స్వయంవరము.

కన్నడ యక్షగానము లందును ద్విపదలు కలవనియు, 5, 5, 5, 4 గణ విన్యాస ముతో సాగెడి ద్విపదలు 'జంపె' తాళముతో పాడబడునని శ్రీ పి. వి. హాస్యగార్ గారు పేర్కొనిరి.[15]

తెలుగు యక్షగానములందు మంజరీ ద్విపద. సువ్వాల ద్విపద మొదలగు ద్విపద భేదములు గూడ కనిపించుచున్నవి. ప్రాసలేని ద్విపద మంజరీ ద్విపద. శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారి ప్రహ్లాద చరిత్రమునందు పాదమునకు 28 మాత్రలుగల ద్విపద కలదని ఆచార్య ఎస్. వి. జోగారావుగారు తెలిపిరి.[16] యక్ష గానము లందు ప్రసిద్ధమైన మరియొక ద్విపద సువ్వాల ద్విపద యగును.

అప్పకవి 'సువాల' అను పేరుగల ఛందోవిశేషమును (4-402) పేర్కొని యున్నాడు. అతని లక్ష్యపద్యమిది

అక్షర హరివిక చాంబురు హాక్షా
యక్షప సఖనుత యదుకుల దక్షా
రక్షక సురవిదు రద్విప రక్షా
రాక్షస విదళన ప్రరుచిర వక్షా

సువ్వీసువ్వాలవే సువ్వివ్వసువ్వాల అనునవి దంపుళ్ళ పాటగా ప్రసిద్ధములు. పై పద్యము అచ్చమగు ద్విపదయే. పాదాంతమున గల 'సువ్వీసువ్వాలే' అనునది ఒక యూతపదమగును. యక్షగానమున గల 'సువ్వాల ద్విపద' ద్విపద లక్షణములతో గాక రగడ లక్షణములు గలిగియున్నవి.

గూని వీపు గొగ్గి పండ్లు కొంగ మెడయు గొప్ప నడుము
డోనె ంతుపు దొప్ప చెవులు డోమ కన్నులు
—కుండినపుర కురవంజి.

పదములు

యక్షగానములందు రేకులు, దరువులు, ద్విపదలకు పిదప పదములెక్కువ కనిపించుచున్నవి. పదమునకు రాగతాళములు రెండును సమానముాల ద్రవ్యములు. పదములు తొలుత సామాన్యగేయార్థమున ప్రచురమైనను కాలక్రమమున శృంగార రసమయమగు రాగతాళబద్ధరచనలకు మాత్రము రూఢియైనది. భరతుడు నాట్య శాస్త్రమున పదలక్షణమిట్లు పేర్కొనెను.

గాంధర్వం యన్మయా ప్రోక్తం స్వరతాళపదాత్మకమ్
పదం తస్యభవేద్వస్తు స్వరతాళాను భావకమ్
యత్కించిదక్షరకృతం తత్సర్వం పదసంజ్ఞితమ్
నిబద్ధంచానిబద్ధంచ తత్పదం ద్వివిధంస్మృతమ్
అతాళంచ సతాళంచ ద్విప్రకారంచ తద్భవేత్
సతాళంచ ధ్రువార్థేషు నిబద్ధం తచ్చవైస్మృతమ్
నాట్యశాస్త్రము 32-25-27

యక్షగానములందుగల పదములు చాలవఱకు పైలక్షణములకు లోబడినవియే యగును. ఆంధ్రయక్షగానములందు తుమ్మెదపదము, వెన్నెల పదము, చందమామపదము, నివాళిపదము, సమపదము, చౌపదము, జాళపదము, సారంగపదము, షట్పది, పాళి పదము, గొబ్బిపదము, ఏలపదములున్నవి. ఇవిగాక అధ్యాత్మలు, అనువులు, అప్పగింత పాట, అలకపాట, అల్లొనేరేళ్ళు, అష్టకము, చౌపద్యష్టకము, అష్టపది, ఇంగ్లీషు మెట్టు, ఊంజల్, ఓడం, కీర్తన, కోతియాటపదము, గజల్, గొబ్బిళ్ళు, చెండ్లాటపాట, జాతిస్వరమట్లు, జావళి, జోల, డిండిమము, దోహా, తంగం, తందనపదము, తరంగము

తలంటుపాట, తలుపుదగ్గరిపాట,తిలానతరగతి,తేవారము, తౌహదు త్రిభంగులు, త్రిస్తబకము, దండెయాడింపు పాట, దిండి, ధవళము, నలుగుపాట, నోటు, బంతులాట, పాట, మంగళము, మేలుకొలుపు రాసప్రబంధము, లఘువులు, లాలిపాట, లావణి, వర్ణము, విరాళిపదము, శబ్దజతి, శోభనము, సంగీతమకరందము, సువ్వి సువ్వాల, హెచ్చరిక, సంవాదపదములున్నవి. పైవానితో ఉంజల్, ఓడం, తందనపదము, తంగం, తిలాన, తేవారము అనునవి తమిళభాషలో ప్రచురములయిన ఛందోభేదములగును షట్పది, చౌపదము, సాంగత్యము మొదలగునవి కన్నడ భాషలో ప్రచురములయిన పద్యరీతు లగును. వానిలో కొన్నిటిని పరిశీలింతము.

## తంగం (తంగప్పాట్టు) :

తమిళమున గల చిందు విభేదములలో 'తంగచ్చిందు' ఒకటి. తంగచ్చిందు నకు పాదనియమములేదు. పాదమునకు రెండు గణములుండుట మాత్రము నియతము. 'తంగమే' అను పదము ఆవృత్తి యగుటవలన 'తంగప్పాట్టు' అనబడినది. ఆచార్య ఎస్. వి. జోగారావుగారు తంగం - ఇదియొక తమిళగీత ప్రబంధవిశేషము. భగవత్స్తుతి పరమగుట దీని సంప్రదాయము"17 అని వ్రాసిరి. కాని తంగచ్చిందు నందు స్తుతి మాత్రమే గాక సామాన్య సంభాషణములు. నిత్యజీవిత వ్యవహారములును వర్ణింపబడినవి. తంగచ్చిందున కొక యుదాహరణము -

ఆడువదుం పాడువదుం
ఆళడిమె సెయ్గిఅదుం
ఓడువదుం తేడువదుం - తంగమే
ఒరుజాణ్ వయిట్రుక్కాడి

—తొండైయడికారం 274

పై పాటలో నాలుగు పాదములున్నవి. పాదమునకు రెండు గణములున్నవి. మూడవ పాదాంతమున 'తంగమే' అను ఊతపదమున్నది, ఇక తెలుగు 'తంగం' పాటను పరిశీలింతము. 1900 ప్రాంతపు యక్షగానములందు కొన్నిట మాత్రమే 'తంగం' కనిపించునని ఆచార్య ఎస్. వి, జోగారావుగారు ఆంధ్ర యక్షగాన చరిత్రలో (పుట 326) వ్రాసిరి. షడుచేటి సుబ్బరాయ కవి గౌరీశంకర విలాసమునందు ఈ క్రింది

తంగప్పాట్టు కలదు.

ఫాలసులోచన - పాపవిమోచన
పాలించి నన్నేలరా - మరుకేశి
లాలించి తేలించరా

దీసినే	ఫాలసులోచన
పాపవిమోచన
పాలించి నన్నేలరా - మరుకేశి
లాలించి తెలించరా

అని నాలుగు పాదములతో వ్రాయవచ్చును. 'తంగమే' అను పదమునకు మారుగా 'మరుకేశి' అను పదము మాత్రము ఈ పాటలో వచ్చినది. కనుక తమిళాంధ్ర లక్షణములు 'తంగం' పాటకు సరిపోవునని చెప్పవచ్చును.

తందన పదము - తణ్ణానేచ్ఛందం, తన్ననచ్ఛందం

'తందనాన' అనిగాని 'తందనాన తాన' అనిగాని యూతపదము ప్రతి పాదాంతమున ఆవృత్తమగు పద విశేషము తందనపదము ఇది సంగీతములో గానాంగ విశేషమైన తానశబ్ద సంబంధియై యుండనగును. ఈ తందన పదములు ప్రాచీన కాలమున తెలుగునాట ప్రచారమున నుండినట్లు వేంకట నాథుని పంచతంత్రము, కళాపూర్ణోదయము, భోజసుతా పరిణయము, దశావ చరిత్ర మొదలగు కావ్యములందలి తత్ప్రసక్తిని బట్టి యూహింపవలసి యున్నది. శహజీ జలక్రీడలను యక్షగానమున మాత్రము తందనపద మొకటి కలదు.

తమిళమునందును తందనపదములకు వ్యాప్తి తగుమాత్రమున్నది తందన పదమున కొక యుదాహరణము —

పోగాదే పోగాదే ఎన్ కణవా
పొల్లాద సొప్పనం కండేనైయా

—తాడె యదికారం - పుట 285.

గంతా దోచుకు పోయెనె తందనానా కృష్ణ
ఎంత మోసము చేసెనె తందనానా

—శహాజీ జలక్రీడలు.

పై రెండు ఉదాహరణములందును సామ్యములున్నవి. పాదమునకు మూడు గణము లుండుట, తందనానా పదము ఆవృత్తియగుట, ప్రాస విన్యాసముగల రెండు పాదము లుండుట సమానధర్మములై యున్నవి.

## తేవారము - తేవారం

ఇదియొక దైవస్తవ పరమైన దాక్షిణాత్య పద్య ప్రబంధ విశేషము. ఇందలి 'తేవ' సంస్కృత తేవ శబ్దమునకు తమిళ తద్భవము కావచ్చును. ఇది మాత్రా ఛందోఘటితము. 19-20 శతాబ్దపు (సంధికాలపు) యక్షగానములందే ఎక్కువగా తేవారము ప్రయుక్తము.

తమిళ తేవార పద్యమునకు నొక యుదాహరణము.

మాసిల్ వీణైయుం మాలై మదియముం
వీసు తెన్ఱలుం వీంగిళ వేనిలుం
మూసు వండఱై పొయ్‌గైయుం పోన్ఱదే
ఈశన్ ఎనై ఇణై యడి నిళలే

—తిరునావుక్కరసర్.

తెలుగు తేవారమునకొక యుదాహరణము

సరస యోగీశ్వరేశా సన్నుతామరమేశా
వరకృపాదృష్టిజూపీ వంతయంతయును బాపి
అరసినాదరికిడాసీ అనుజుగానంగజేసీ
నరహరీ చిత్స్వభావా నన్నుగానంగరావా

— గుండు అద్వైతబ్రహ్మశాస్త్రి సత్యభామాపరిణయము

పైరెండు పద్యములును దైవస్తవపరములే. రెండింటికి నాలుగు పాదము లున్నవి. ప్రతిపాదమునందు రెండు దళములున్నవి. నాలుగు పాదములందును ఏక ప్రాసనియమము పాటింపబడినది. రెండవదళము ప్రథమాక్షరము యతిస్థానమై యున్నది. కనుక తమిళమునుండి తెలుగున ప్రవేశించిన ఛందోబంధముగా తేవార మును పేర్కొనుట సమంజసమే కాగలదు.

ఊంజల్ - ఊయలపాట

'ఊంజల్' తమిళశబ్దము. లాలి, జోలపాటలుగూడ ఊయలపాటలే. కాని యిచట 'ఊంజల్‌పాట' వివాహవేళ వధూవరుల నుయ్యాలలూచునపుడు పాడు పాట యగును. ఇది వైష్ణవసంప్రదాయము. దేవాలయములందు ప్రసిద్ధమైన సేవలలో 'ఊంజల్ సేవ' యొకటి, చెన్నపురమున రచింపబడిన 'ఆండాళ్' చరిత్ర యక్షగాన ములో ఊంజల్‌పాటకలదు. తెలుగులోగల అన్నమయ్య ఉయ్యాలపాట (7-140; 1-67) త్యాగయ్య ఉత్సవసంప్రదాయ కీర్తనలోని ఉయ్యాలపాటలు ఝంపతాళములో పాడదగినవి. తమిళ ఊంజల్‌పాటకూడ నట్టిదే. ఉదాహరణమునకు —

శ్రీవిల్లిపుత్తూరు వుంజల్ తొట్టి
చతుర్వేదంగళుం శంగల్ వూట్టి
ఆరుశాస్త్రంగళుం తూణ్ణల్‌నాట్టి
అండాళుమన్నారు ఆదిరూంజల్

— ఆండాళ్ చరిత్ర

కన్నడ యక్షగానములందు షట్పదులకును, తెలుగు యక్షగానములందు రగడ ప్రభేదములకును ప్రచార ముండుట ముందే పరిశీలించితిమి. అయినను కన్నడ యక్షగాన ఛందోరీతులు తెలుగు యక్షగానములందు లేకపోలేదు. వానిలో షట్పది, జాళపదము, చౌపదము, సాంగత్యము మొదలగునవి ముఖ్యములు.

షట్పది :

కన్నడ యక్షగానములందు శర, కుసుమ, భోగ, భామిని, వార్ధక, పరివర్ధినీ షట్పదులు గలవు. కాని తెలుగు యక్షగానములందు కన్నడ భామినీ షట్పదికి సమాన మగు 'షట్పది' మాత్రము శ్రీ బాగేపల్లి అనంత రామాచార్యుల సావిత్రీ చరిత్రమున కనిపించు చున్నది.

కన్నడ భామినీ షట్పదికి నుదాహరణము.

బసవళిదు బాలకరు బందా
దశముఖ ఖంగరుహిదరు రామన
విశిఖ దలి మకరాక్షహోద్యను యమనపురకెందూ

—ఇంద్రజితు కాళగ యక్షగానము

తెలుగు భామినీ షట్పదికి నుదాహరణము.

అశ్వపతియని తొల్లి మద్రమ
హీశ్వరుడు తనరారు నిస్తుల
శాశ్వతైశ్వర్యాదులను హరి దశ్వతేజుండు

—సావిత్రీ చరిత్రము.

పై రెండియందును సప్తమాత్రాకములైన దళము లేదు విరుగుచున్నవి. రెండేసి దళములపై ప్రాస యతియు పాటింపబడినది. త్రిపుట తాళగతులకు సన్నిహితముగా నుండుట రెంటికిని సమానము.

## జాళపదము – చతుష్పద

మొగిఁబంచలఘుగణంబులు మూఁడు రవియుఁ
దగుతుదఁ బ్రాసంబు దాఁక రెంటిపయి
నగు విశ్రమమ్ము కర్ణాట చౌపదయె
సఁగుఁ గృతుల సత్కవుల సమ్మతముతోడ

అప్పకవీయము 4-286.

పాదమునకు మూడు పంచలఘుగణంబులు 1 సూర్యగణము చేరుట కర్ణాట చౌపద లక్షణము. 'కపోత వాక్యము' నందు కర్ణాట చతుష్పద లక్షణమునకు సరిపోయిన పద్యమొకటి కలదు.

గజరాజవరద శ్రీభుజగేంద్రశయన
గజము ఖాశ్రిత శేష త్రిజగ వందితుడ

పై పాదములందు ప్రాసయతియు పాటింపబడినది.

## సాంగత్యపదము – సాంగత్య

సాంగత్యము కన్నడమున మిక్కిలి ప్రసిద్ధిపొందిన ఛందోభేదము. కన్నడమున సాంగత్యకృతులు పెక్కుకలవు. సాంగత్యమును ప్రయోగించిన యక్షగాన కవులు 'సాంగత్య రూపకతాళ' అను పేరుతో నిద్దానిని వ్యవహరించిరి.

దీనిని రూపక, అష్ట, ఏకతాళములందు పాడుదురని శ్రీ పి. వి. హాస్యగాం గారు పేర్కొనిరి.[18] సాంగత్యపద్యము యొక్క గణ విధానము ఈ విధముగా నుండును.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| వి | వి | వి | వి | | 5 | 5 | 5 | 5 |
| వి | వి | బ్ర | | లేదా | 5 | 5 | | |
| వి | వి | వి | వి | | 5 | 5 | 5 | 5 |
| వి | వి | బ్ర | | | 5 | 5 | | |

విజయరాఘవుడు సాంగత్యపదములు రచించినట్లు తెలియుచున్నది. గాని నేడు మన్నారుదేవుని హేమాబ్జనాయికాస్వయంవరమున మాత్రమే ఒక సాంగత్యము కనిపించుచున్నది. ఇందలి చరణములు ప్రశ్నోత్తర పరంపరగా సాగినవి.

5 5 5 5
చెలువైన శ్రీవత్స చిహ్నంబు ఉరముపై
5 5 5 3
కలిగిరాజించుయీ ఘనుడెవ్వ(డె)చెలియ
పొలమీను రూపముంబూని యానలువకు
తొలుబల్కు లొసగిన దొరయీతడమ్మా

కన్నడప్రభావమువలన ఈ సాంగత్యము తెలుగునందు వ్యాపించినదని చెప్పవచ్చును.

తెలుగు యక్షగానములందు ద్విపదలు, ద్విపదచ్ఛాయగలిగిన పద్యరీతులకు ప్రచారమున్నట్లు కన్నడయక్షగానములందు త్రిపదులు, త్రిపదులపోలిన ఛందఃప్రభేద ములకు వ్యాప్తియెక్కువ. అట్లే తాళములపేర్లు సంస్కృతమయ్యును అంశగణము లతో కూడిన పద్యరీతులు కన్నడమునందు కనిపించుచున్నవి. ఉదాహరణమునకు —

---

రు రు రు రు
నందగో పనిజనబిట్టు బేగSSకర సిSకోధుర

SS
రు రు బ్ర
కిందుమౌS శిSయ బెంబల కేగ ముఖారి ఏకతాళ

కేళయ్యా ssదొరె రాయపే ళవెనాను
ఏ ఏ ఏ ఏ
లీలెయలికా మ్యకడిపాండవ రాలయవమా దిదుదను

— ఘంటారవఅష్టతాళ 19

పై పరిశీలనమువలన తెలుగు యక్షగానములందు తమిళ, కన్నడ మరాఠీ, పార్సీ, ఆంగ్ల ఛందోరీతులు కూడ కలవని తెలియుచున్నవి. యక్షగాన ఛందోరీతులు కూడ కలవని తెలియుచున్నది. యక్షగాన ఛందోరీతులందు తమిళ కన్నడాంధ్రము లకు సామ్యము లెక్కువయని ఫలితార్థము.

## 7. 8. హరికథలలోని దేశిచ్ఛందోరీతులు :

పండిత పామర రంజకమైన విశిష్ట కళారూపములలో హరికథ యొకటి. ఈ ప్రక్రియ తమిళ కన్నడ మలయాళభాషలలో కాలక్షేపము, కథాకాలక్షేపనామములతో, తెలుగులో హరికథ లేదా హరికథాకాలక్షేపములను, పేర్లతో వ్యవహరింపబడుచున్నవి. ఆచార్య తూమాటి దొణప్పగారు తెలుగు హరికథా సర్వస్వంలో (పుట 73) హృద్య పద్య గేయాత్మకమై, అనవద్య వచన రచనా భాసురమై, సంగీత నృత్యకళా సమ్మి శితమై, ఉపకథా వ్యాఖ్యానాదిక బృంహితమైన కళారూపమును హరికథగా నిర్వచించిరి.

యక్షగానములందు ప్రయోగింపబడు వృత్తములు, జాతులు, ఉపజాతులు, దరువులు, వర్ణనాత్మక సంవాదాత్మక వచనములు పదములు మొదలగునవి హరికథ లందును గలవు. ఇవి మాత్రముగాక తొహరా, డోరా, తోహరా, మంజరి, నర్తకి, కీర్తనములు మొదలగునవి హరికథలందు నెక్కువ ప్రాముఖ్యము వహించును.

### తోహరా - తొహరా - డోరా

మరాఠీ భాషలో 'దోహరా' ప్రసిద్ధమగు సంగీత రచనానుకూలమగు ఛందో విశేషము. ఇది సంస్కృత 'ద్విధారా' శబ్ద భవమని మరాఠీ లాక్షణికుల అభిప్రా యము. మరాఠీ హరికథా ప్రవక్తలు ఆఖ్యాన రీతికి నుపకరించు రచనా విశేషముగా 'తోహరా' లను ఎన్నుకొనినట్లు తెలియు చున్నది. ఇదియే తెలుగున తోహరా -

తొహరా - దోరా మొదలగు పేర్లతో వ్యవహరింపవడుచున్నవి. కథాఖ్యానమునకు యక్షగానములందు ద్విపదలు, జంగం కథలలో రగడలు, హరికథలలో దోరాలు ప్రయోగింపబడును. ఈ 'దోహ' - అనుదానికి తప్ప తక్కిన మరాఠీ ఛందోరీతులకు తెలుగున ప్రవృత్తియున్నట్లు కనిపింపదు. 'దోహరా'కు నిర్ణీతమగు ఛందఃప్రస్తారము కనిపింపదు. రచయితలు తమ వీలుననుసరించి కుదించిగాని పెంచి గాని 'తోహరాలు' వ్రాయుచుందురు. తొహరాలకు ఆదిప్రాస నియమము నియతమని చెప్పవచ్చును. అంత్యప్రాస వికల్పమగును.

యక్షగానములందు కథాఖ్యాన సందర్భమున దోరాలు ప్రయోగింపబడినవి. గజేంద్రాఖ్యాయని చరిత్రలో 'డోరా' అనియు, పురాణం పిచ్చయగారి కపటవేశ్యా నాటకమున 'డోరాగజల్ మట్టు' అనియు, గోపాలరామదాసకవి సీతాస్వయంవరమున 'డొహరాదరువు' అనియు, సత్యనారాయణ కథాసుధాలహరిలో 'తొహరా' అను పేర్లతో కొన్ని గేయములు కనిపించుచున్నవి[20] వీనికి క్రమముగా నుదాహరణములు.

| | |
|---|---|
| ఆయిందిర యును నతివిస్మితయై | 8 + 8 |
| యరుగు చుండె వెనుక | 3 + 3 + 3 |
| వినవే తల్లీ యూరమ్యాంగుని | 8 + 8 |
| విషయము తెల్పెదను | 4 + 5 |
| జగతిలోన మిధిలాపురమునను | 8 + 8 |
| జనకన్నపాలుండనగా | 8 + 4 |
| ఎక్కడి యతివేమెఱుగవు సరసము | 8 + 8 |
| నేమిటి కడిగెదు నీవు | 8 + 3 |

పై పరిశీలన వలన డోరాలకు 'ద్రుతిగతి' స్వభావమును ఆపాదింపవచ్చును. పై వాని యన్నిట మధురగతిచ్ఛాయ ప్రస్ఫుటించుచున్నట్లు నిర్ణయింపవచ్చును.

**మంజరి :**

ఇది పద్యమంజరికాదు. మంజరికి రెండుపాదము లుండును. ప్రతిపాదమందును ఏడు చతుర్మాత్రాగణములుండును. కడపటి అక్షరమును మరొక గణముకాలము

హెచ్చించి పాడుకొనుట సంభవించును. మంజరికి ప్రాస అంత్యప్రాసలుండును. యక్షగానములలో 'రేకుమంజరు'లనునవి కలవు. సంభాషణలకు నడుమగల కథాంశముల చెప్పుసందర్భములందును, కథను శీఘ్రముగా సాగింపవలసిన సందర్భములందును, మంజరులు యక్షగానములందు ప్రయోగింపబడినవి. మంజరిలో పల్లవి, అనుపల్లవులుండవు. అన్నియు చరణములే రెండేసిభాగములుగల చరణములు రెండుగాని మూడుగాని నాలుగుగాని యుండుట మంజరీలక్షణముల ప్రధాననియమమై కనిపించును. యక్షగానమంజరి – గిరిరాజు లీలావతీకల్యాణమునుండి

ఈరీతిగ ధరణీశుడువెడలిన 16 మాత్రలు
సారివా ర్తమచారులచేవిని 16 మాత్రలు

హరికథలలోని మంజరులు :[21]

1) అనిచండామార్కులను గురువులకు నప్పగించెనబ్బాలున్ 16 + 12
కనకకశిపుండు సుమూర్తంబున గంజాక్షభక్తిలోలున్ 16 + 12
4 4 4 4 4 4 4 —

2) నిరతము మమ్ముల నిలువనీక గడు మెఱపించెడి రావణువి
4 4 4 4 4 4 4 —
బొరిగొంటిని మాపుణ్యంబున సుఖముగ నుండెదమక భువిని

పై ఉదాహరణములందు రెండవవిభాగమునకు చెందిన మంజరులకే వ్యాప్తి యెక్కువ.

## కీర్తనలు

కీర్తనలందు సంగీతమునకే ప్రాధాన్యము. సాహిత్యము కీర్తనలకు ద్వితీయాంగము. హరికథలందు కీర్తనలకు విశేషప్రచారమున్నది కీర్తనములందు పల్లవి, అనుపల్లవి, చరణములను మూడు విభాగము లుండును. ఇవిగాక మధ్యమకాల సాహిత్యము స్వరాక్షరములను మరిరెండు ఉపవిభాగము లున్నవి. కాని ఇవి యన్నియు సంగీతాంగములేయగును. తమిళ కన్నడాంధ్రభాషలలో పెక్కు కీర్తనలున్నవి. కీర్తనల నిర్మాణమునందు గల వైవిధ్యమును ఈ విధముగా పేర్కొనవచ్చును.

1. పల్లవి - అనుపల్లవి - చరణము లుండుట.

2. పల్లవి చరణములుండి అను పల్లవులు లేకుండుట.

3. పల్లవి ఒక పాదము - అనుపల్లవి రెండు పాదములు - చరణములు నాలుగు పాదములై యుండుట.

4. పల్లవి, అనుపల్లవి ఒక పాదము కలిగి చరణములు రెండు పాదములు కలిగియుండుట.

5. పల్లవి - అనుపల్లవి - చరణములకు నొక్కొక్క పాదమే యుండుట.

6. పల్లవి, అనుపల్లవులుండి చరణములే లేకుండుట.

7. పల్లవి, అనుపల్లవులందు సమానమాత్రాసంఖ్య గల పాదములుండి చరణములందు మాత్రము భిన్నమాత్రలు గల పాదములుండుట.

8. ప్రాస నియమమును నియతముగా పాటించుట.

9. పల్లవి, అనుపల్లవి, చరణములందలి గణము లొకేసంఖ్యలో నుండుట.

10. పల్లవి పాదమందలి గణములకంటె భిన్నముగా అనుపల్లవి చరణము లందు గణము లుండుటయు సహజమే.

తమిళ భాషలో కీర్తనలను 'ఇశైప్పాడల్' అని అందురు. ఇశైప్పాడల్ అనగా సంగీత గేయములు తమిళ వాఙ్మయములో నందన్ చరిత్తిర క్కీర్తనై, ముత్తుతాండవర్ కీర్తనై, రామలింగర్ కీర్తనై, ముత్తుస్వామి కవిరాయర్ కీర్తనై పళని యాండవర్ కీర్తనై, మాంపళక్కవి రాయర్ కీర్తనై, దాశరథి కీర్తనై మొదలగు కీర్తన గ్రంథములు పెక్కు కలవు. తమిళ కీర్తనమున కొక యుదాహరణము.

పల్లవి

ఇందవరం తారుం - స్వామి
ఇందవరం తారుం

అనుపలవి

బందవినై యెల్లాం అఱవేండుం - ఉన్
పాద దరిశనం పెఱవేండుం - ఇంద

కణ్ణిగళ్

డినమున్ పదమలర్ తొళ వేండుం - నాన్
దేగ పరవశమాయ్ ఎళ వేండుం
అనల్ మెళుగా యురుగి యళ వేండుం - ఇని
ఆనంద కడలిల్ నాన్ విళ వేండుల
—సర్వసమయ సమర సక్కీర్తనై

తెలుగు కీర్తనమునకొక యుదాహరణము

పల్లవి : నిను సేవించిన జనులకు నిక ఈ
జనన బాధలు గలవే

అనుపల్లవి : కనకాంగి శ్రీ రుక్మిణీ హృదయాబ్జ
దినమణే పార్థసారథి సామి

చరణము : భవసాగర తారకమై యున్నదినీ
పద సారస యుగ్మము
భువి మానవలోకులకు
భుక్తి ముక్తిప్రదము (నీ పదను)

—సుబ్బరాయశాస్త్రి

కీర్తనలందు సంగీతమునకు పాలెక్కువ యని ఫలితార్థము

**లావణి :**

ఇది కన్నడ మహారాష్ట్రాది భాషాసంబంధియగు నొక పదచ్ఛందము. తమిళ కన్నడాంధ్రభాషలందు 'లావణి'కి తగు మాత్రము ప్రచారమున్నది.

తమిళలాక్షణికులు 'లావణి' ప్రభేదములను చిందువర్గమున చేర్చియున్నారు. "ఎదురొడ్డి సంభాషణము సలుపుటకు నుచితమైన ఛందోబంధము లావణి" అని పులవర్ కుళందై గారు తొడైయడికారమున (పుట 285) పేర్కొనిరి.

కన్నడ పరిశోధకులు శ్రీ సింపిలింగణ్ణగారు 'లావణి' నామనిర్వచనమును గూర్చి యిట్లు వ్రాసిరి.[23]

'లావణి' అనుశబ్దమునకు లావణ్యమే మూలరూపమని కొందరు చెప్పుదురు. పొలములలో విత్తనములు చల్లునపుడు పాడెడు పాటలని కొందరు వచింతురు. 'లూ' అనుటకు కోయుట అర్థముండుటవలన కోతకోయునపుడు పాడబడెడి పాటలని మరి కొందరు పేర్కొందురు. సుందరార్థకమగు లవణశబ్దమునుండి లావణ్యమేర్పడినదగుట వలన స్త్రీ సౌందర్యమును వర్ణించుపాటలే 'లావణి' గేయములని కొందరు భావింతురు. లాపనికాశబ్దభవమే లావణి యనియు కొందరు ఊహించుచున్నారు. ప్రతిభాపూర్ణ మగు జానపదగేయములలో లావణి యొకటి యనుటలో పరిశోధకులకు అభిప్రాయ భేదములులేవు.

లావణిగేయములకు డప్పుపాటలనియు, గీగీ, జీజీ పదములనియు పేర్లు కలవు. పాదాంతమున గీగీ,జీజీ స్వరములను ఆవృతముచేయుటవలన గీగీ, జీజీ పదములను పేరు కలిగియుండవచ్చును. డప్పు (చర్మవాద్యము) వాయించుచు పాడెడిపాట గనుక డప్పు పాటలను పేరు స్థిరపడి యుండవచ్చును. పురుషుల లావణీగేయములు హరదేశి. తురాగేయములనియు చెప్పబడును. స్త్రీల లావణీగేయములకు నాగేసి కల్గి అనియు పేర్లున్నవి 'డప్పు తుంతుణి' మొదలగు వాద్యములతో గానము చేయునపుడు 'మేళలావణి' అనిపేరు వాద్య రహితముగా, గజ్జెలుకట్టి, చిటికెలు వేయుచు పాడెడి పాటలు బయలు లావణీగేయములగును.

కన్నడ లావణీగేయములు చాల పాదములు కలవి. మొదటి భాగము పల్లవి. రెండవ భాగము చాలు. (సాలు) ఇట్టివి మూడు, ఐదు, ఏడు వరుసలుండవచ్చును. పాట చివర గురుస్తుతియో, గాయకనామమో యుండును. 'శ్రీ సానిధప మగరిస సరిగమ నారి నిన్న గత్తా' అనుట లావణి సూత్రమని కర్కిగారు తెలిపిరి. 24 లావణిగేయపాదములు రగడలను పోలినవి. ఒక పాదనియమము మరొక పాదమున నుండకపోవుట లావణి ప్రత్యేకతయగును.

కన్నడ వాఙ్మయములో వీరభద్ర లావణి, కృష్ణ లీలెలావణి, సరస్వతిలావణి మొదలగునవి ప్రసిద్ధములు.

తెలుగు యక్షగానములందును, హరికథలందును లావణిగేయములు కలవు. కన్నడమునందువలె తెలుగునందును దీని స్వరూప మిద మిత్థమని నిర్ణయించుట మిగుల దుర్ఘటముగా నున్నది. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు

మధుర సౌరాష్ట్రసభవారికి చెందిన కుచేల, రుక్మాంగద, తామ్రధ్వజ చరిత్రములు, ద్రౌపదీ వస్త్రాపహరణము అను హరికథాకల్పములగు రచనల ప్రతులందు లావణి గేయము లున్నవని ఆచార్య ఎస్. వి. జోగారావుగారు ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్రలో (పుట 344) తెలిపియున్నారు. ఇక తమిళ కన్నడాంధ్ర లావణి గేయముల ననుసరించి లావణి లక్షణములను పరిశీలింతము.

తమిళ లావణి :

1 2
మండలమె ళానదుంగ
3 4
త్తొండైకిళి యక్కట్టిడుం
5 6
మగాకూర విర్తువానే అయ్యా అయ్యా
1 2
మంగల మిగుంగుణ
3 4
శంకరన్ నుదల్విళియాల్
5 6
మన్మదవేళ్ మడిందదుం పొయ్యా పొయ్యా

—ఎరిందకట్చి ఎరియాక్కట్చి

పై తమిళ లావణియందు 6 గణములున్నవి. ఆపై ఏదేని ఊతపదము రావచ్చును ఆరు గణములుండుట వలన "అరుశీర్ కళినెడిలడి' వర్గమునకు చెందిన పద్యమని చెప్పవచ్చును.

కన్నడ లావణి :

1 2 3 4 5 6
ఇరువెను నడెనా నిన్న ఒందిగె నాళె జగదొళ గె
భరది హోగువె ముందు గడెగె పెరియ పట్టదొళ గె

—పేరియ పట్టదజగళ

పై కన్నడ లావణి యందును 6 గణములున్నవి. అద్యంత ప్రాసలున్నవి. చతుర్మాత్రాగణ విన్యాసము గోచరించుచున్నది.

తెలుగు లావణి :

4 4 4 4 4
జయజయ చారు వికాసిత సదమల వదనా
వదనాంబుజాత సురాహిత హరణ ధురీణా
—తిమ్మరాజు రుక్మిణీ కల్యాణము

పై లావణి చూర్ణికవలె నున్నది. చతుర్మాత్రాగణ విన్యాసమందు కలదు. అంత్య ప్రాస నియమము పాటింపబడినది.

ఆంధ్రలావణీగేయములకంటె కన్నడ లావణీగేయములందు గతివైవిధ్యము, ప్రాసవైవిధ్యమున్నట్లు చెప్పవచ్చును. పురుషులుపాడెడి లావణీగేయములందు అంత్య ప్రాస, స్త్రీలు పాడెడి లావణులందు ఆదిప్రాస ఆధిక్యము కనిపించును.

ల్యాళాగి హోక్క అర్జునమాడి కురిహింద
కౌరవన దండ
గర్జనెమాడి బాణబిట్టు హోరిసిద యుండ
ఆడిదంగ చండ
ఆభీమ హోడెద హోకారి గదావితగొండ
హొక్కనంవపుండ
— ఉత్తరకర్ణాటకద జానపదగీతిగళు – పు 85

సతి పతి కూడి జోడి
హిత దింద మలగి దాగ
గొత్తమాడి హేళ్ గండాహ్యాంగ మాదోన
— జీవనసంగీత – కృష్ణలీలె పుట 56

నరకి :

ఇది మాత్రాచ్ఛందజన్యమగు గేయము. నారాయణదాసు రగడలనే 'నర్తకి' అను పేరుతో మార్కండేయచరిత్ర, సావిత్రీచరిత్ర కథలలో ప్రయోగించెను. పల్లవి, అనుపల్లవులులేక 'నర్తకి' అందు చరణములే యుండును. రెండేసి భాగములుగల చరణములు రెండుగాని మూడుగాని, నాలుగుగాని యుండును. రెండేసి భాగములకు ప్రాసయు, ప్రతిభాగమునకు యతియు పాటింపబడును.

హరికథలలో తౌహరా, లావణి మొదలగునవిగాక కందార్థములు, ద్విపదలు మొదలగునవిగూడ ప్రయోగింపబడుచుండును. కీర్తన, లావణి, తౌహరాగేయములు తమిళకన్నడాంధ్రములందు నించుమించు సమానముగా నున్నవి.

ఈ ప్రకరణమునందు దేశిచ్ఛందో రీతులకు జానపదచ్ఛందో రీతులే మూలములనుటను తులనాత్మకముగా పరిశీలించితిమి. గణనియమము, యతిప్రాసలు మొదలగు ఛందోంగములు జానపదగేయములందు సహజమై యుండుటను గుర్తించితిమి. జానపదగేయవరుసలను త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్రగతుల ననుసరించి విడదీయుట తగునని తులనాత్మక పరిశీలనము వలన తెలిసికొంటిమి. యక్షగాన ఛందోరీతులు, హరికథలలోని ఛందోరీతులను చర్చించితిమి. లావణి, కీర్తనై మొదలగునవి తమిళ కన్నడాంధ్ర భాషలందన్నిటను ఏకాకారముగా నుండుటను సమీక్షించితిమి. తమిళ కన్నడాంధ్ర మలయాళ భాషలలోని ఛందోవికాసమునకు జానపదచ్ఛందమే మూలమనుటను అవలోకించితిమి.

## సంఖ్యా సూచి :

1. పాటలలో ఛందస్సు - పుట 20.
2. Rhythimic Adjustments in Tamil Malayalam Metres D. L. A. Seminar 1974.
3. Vadakkan paltu - M. V. Journal 1947.
4. A study of Malayalam Metres - P. 204
5. తెలుగులో ఛందోరీతులు - 243-248.
6. పాటలలో ఛందస్సు - పుట 122.
7. Malayalam Metres - A study - P. 244
8. దక్షిణదేశ భాష సారస్వతములు, దేశి - పుట 149
9. ప్రబుద్ధ కర్ణాటక 53-1
10. దక్షిణదేశ భాష సారస్వతములు, దేశి - పుట 175-185.
11. కన్నడ ఛందోవికాస - పుట 245
12. యక్షగాన - యక్షగానద కవిగళు, కృతిగళు - పుట 17
13. యక్షగాన కలె మత్తు ప్రయోగ - పుట 81-83
14. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - పుట 231
15. యక్షగాన కలె మత్తు ప్రయోగ - 81-83
16. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - పుట 258
17. ... ... ... ... 326
18. యక్షగాన కలె మత్తు ప్రయోగ - పుట 86
19. ... ... ... ... పుట 34
20. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - పుట 326-330
21. పాటలలో ఛందస్సు - పుట 150
22. ... ... ... ... పుట 37-57
23. ఉత్తర కర్ణాటకద జానపదగీతెగళు - పుట 30
24. ఛందోవికాస - పుట 249

# 8. ఆధునిక చ్ఛందస్సు

ఆధునిక కాలమందు ఛందోవైవిధ్యము అత్యధికముగా గోచరించును. ఇంతటి వైవిధ్యము పూర్వమెన్నడును ఛందస్సునందు కలిగినట్లు కనిపించదు. ఈమార్పుల కెన్నియో కారణములున్నవి. మొదటిది నవ్యతాప్రీతి. రెండవది ఇతరభాషల సాహిత్యముతో పరిచయము. ఈ మార్పులు కేవలము 20వ శతాబ్దమునందే ఏర్పడినవని తలంచుట పొరబాటు నదీప్రవాహసదృశమగు సాహిత్యమునందు మార్పు లెప్పటి కప్పుడు సంభవించుట సహజమే. ఈ దృష్టితో తమిళ కన్నడాంధ్రమలయాళ భాషలందు కలిగిన ఛందస్సునకు సంబంధించిన మార్పులను పరిశీలింతము.

తమిళ ఛందస్సులో 'పా-పావినం' అను రెండు ప్రధాన భేదములున్నవి. ఆశిరియప్పా, కలిప్పా, వంజిప్పా, పరిపాడల్, మరుట్పా అనునవి పాభేదములు. తాళిశై, తుఱైవిరుత్తం అనునవి పావినం భేదములగును. సంగకాలసాహిత్యమునందు 'ఆశిరియప్పా' ఛందస్సునకే ప్రచారము ఎక్కువగా నుండినట్లు చెప్పవచ్చును. పత్తుప్పాట్టు ఎట్టుత్తొగై అను ప్రాచీన తమిళగ్రంథము లందు ఆశిరియప్పాపద్యములే ఎక్కువగా కనిపించుచున్నవి. సంగకాలానంతరము 'పా' భేదములు మఱుగుపడి పావినం భేదములకు వ్యాప్తి కలిగినది. శిలప్పదికారమున పాభేదములతోబాటు ఆశిరియవిరుత్తం, ఆశిరియత్తుఱై, కలివిరుత్తం, కలితాళిశై భేదములు ప్రయోగింపబడినవి. కంబమహాకవి 'విరుత్తములను' స్వీకరించి ఛందః ప్రపంచమున విప్లవము సాగించెనని చెప్పవచ్చును. జయకొండార్ కలింగత్తుప్పరణి, ఒట్టకూత్తర్ తక్కయాగప్పరణి గ్రంథములు పాభేదములలో నొకటియగు తాళిశై ఛందమున వ్రాయబడినవి. 15వ శతాబ్దమున వెలసిన విల్లిబారతం, తిరుప్పుగళ్ గ్రంథము లందు విరుత్తములే ప్రయోగింపబడినవి. 16-18 శతాబ్దములందు 'కట్టళై కలిత్తుఱై' ఛందస్సునకు ప్రచార మెక్కువగా నున్నట్లు చెప్పవచ్చును. ఛందో వ్యాకరణాలంకార గ్రంథములు, లఘుకృతులు, మహాకావ్యములు 'కట్టళై కలిత్తుఱై' ఛందస్సులో వ్రాయబడినవి. 1920 శతాబ్దములందు జానపద చ్ఛందములు వ్యాప్తిలోనికి వచ్చినవి. పై పరిశీలనమువలన తమిళమునందు మూడు దశలున్నట్లు చెప్పవచ్చును. ప్రాథమిక దశయందు పాభేదములకు ప్రఖ్యాతి యేర్పడుట, ద్వితీయ దశయందు సంస్కృత

ప్రభావము వలన అక్షరముల లెక్కించి వ్రాయబడు వృత్తములకు ప్రచారమేర్పడుట, తృతీయ దశయందు జానపద ఛ్ఛందములకు గౌరవార్హత కలుగుట తమిళ ఛందో వికాసమున సుస్పష్టమగు త్రివిధ దశలగును.

తమిళమునకు పిదప కన్నడమున విశిష్ట ప్రాచీన సాహిత్యమున్నది. కన్నడ సాహిత్యమున పెక్కు కావ్యప్రక్రియ లేర్పడుటకు 'ఛందస్సు' హేతుభూతముగా నుండినట్లు నిర్ధారింపవచ్చును. కన్నడ ఛందో వికాసమున ఐదు దశలు కనిపించు చున్నవి. మొదటిదశలో మార్గ కవితకు ప్రచారముకలుగుటను చెప్పవచ్చును. కన్నడ కవిత్రయము దేశిఛ్ఛందములకంటె సంస్కృత వృత్తములకు ప్రాధాన్యమొసగుట ఈ దశలోనిదే. ఇక రెండవదశ రగళెల ప్రచారమునకు సంబంధించినది. మూడవ దశలో షట్పదీ పద్యములకు ప్రచారము కలుగుటను చేర్పవచ్చును. నాల్గవ దశలో సాంగత్య గ్రంథములు విరివిగా వెలువడుటకు గూర్పవచ్చును. ఐదవదశలో జానపద ఛ్ఛందో రీతులకు గౌరవార్హత కలుగుటను గుర్తింపవచ్చును

నన్నయకుపూర్వము తెలుగుభాష యెప్పనుండి ఉన్నదను విషయమును పరిశీలించుటకు శాసనములు మాత్రమే ఏకైక సాక్ష్యములు. క్రీ. శ. 848కు చెందిన పండరంగని అద్దంకి శాసనములో ఒక తరువోజ కలదు. ఆకాలమునకు సంబంధించిన కందుకూరు ధర్మవరశాసనములలో సీసపద్యములున్నవి. క్రీ. శ. 934కు చెందిన యుద్ధమల్లుని బెజవాడశాసనములో అయిదు మధ్యాక్కరలున్నవి. శాసనములందు లభించు ఈపద్యములు జాతులో, ఉపజాతులో అయియున్నవి. వృత్తములుకావు. క్రీ. శ. 1000 ప్రాంతము నాటిదని పరిశోధకులచేత నిర్ణయింపబడిన విరియాలకామ సాని గూడూరు శాసనములో మూడు చంపకమాలలును, రెండు ఉత్పలమాలలును గలవు. ఇవి సంస్కృతవృత్తముల ఛాయలను సంతరించుకొన్న తెలుగువృత్తములు. తెలుగు ఛందోవికాసమున ప్రాఙ్నన్నయయుగమును తొలిదశగా చెప్పవచ్చును.

భారతరచనకు పూనుకొన్న నన్నయమహాకవి తన కాలమునాటి భాషను సంస్కరించుట మాత్రముగాక ఛందస్సునందును నవ్యప్రయోగములను గావించెను. కేవలము తరువోజ, సీసము, మధ్యాక్కర మొదలగు దేశిపద్యములలో మహాభారత రచన కొనసాగించుట దుస్సాధము. అప్పటికి తెలుగులో శార్దూలాది సంస్కృత వృత్తములు ప్రవేశింపలేదు. కేవల సంస్కృతవృత్తములను గ్రహించినచో దేశీయతకు

భంగముకలుగును. కనుక ఈరెంటిని సమన్వయము చేయవలెనని నన్నయ సంకల్పించెను. కన్నడ చంపూకావ్యవిధానము నన్నయకు మార్గము చూపినది. కన్నడములోని ప్రాసలతో, తెలుగునకు సహజమయిన యతిని మేళవించి దేశీయతను నిలిపెను. మరియు కొన్ని సంస్కృత వృత్తములలోని యతి నియమమును మార్చివేసి క్రొత్తచోట యతిని ప్రవేశపెట్టెను ఇవి నన్నయ ఛందోవిషయకముగా చేసిన క్రొత్తప్రయోగములగును. నన్నయ తరువాత ఛందో విషయకముగా నవ్య ప్రయోగములు గావించిన మహాకవి నన్నె చోడుడు. తెలుగు కావ్యములలో తొలిసారిగ షష్ఠ్యంతములను, చిత్ర కవిత్వమును, గర్భ కవిత్వమును రచించినవాడు నన్నెచోడుడే. వృత్తము పేరు వృత్తములో నిమిడ్చు ముద్రాలంకారమును తెలుగున నితడే మొదటిసారిగా ప్రవేశపెట్టెను. ఈ సంప్రదాయమును ఎఱ్ఱాప్రెగ్గడ మున్నగు కవులు కొందరనుకరించిరి. శ్రీతో కావ్యమును ప్రారంభించి మంగళమహాశ్రీతో ముగించుట కూడ ఈ మహాకవి చూపిన మార్గములలో నొకటి.

తెలుగు సాహిత్యములో ఛందో వికాసమునకు దోహదము చేసిన మహాకవి పాల్కుఱికి సోమనాథుడు. సోమనాథునికి ముందు దేశీయచ్ఛందస్సుల కంతగా నాదరము లేదు. తరువోజలు, మధ్యాక్కరలు మొదలైన కొన్ని దేశిపద్యములు మాత్రమే నన్నయాదుల మన్నన అందినవి. కాని వానికి తగినంత వ్యాప్తి సిద్ధింపలేదు. సోమనాథునికి ముందు ద్విపదకు కావ్యగౌరవము కలుగరాలేదు. డాక్టర్ సి. నారాయణరెడ్డిగా రన్నట్లు 'రోకలి పాటగానున్న ద్విపదను నవరసపోషణ చరణముగా లయసమన్వితముగా, భావవైవిధ్యవాహికగా, వివిధరీతి విలసితముగా మలచి దానికి తెలుగు కావ్యజగత్తులో స్వర్ణాసనమును సమకూర్చిపోయిన కవీంద్రుడు సోమనాథుడు' తెలుగులో తొలిసారిగా రగడలను, గద్యలను, మకుట నియమములతో కూడిన శతకములను సంతరింపజేసివాడీ కవియే.

శ్రీనాథమహాకవి సీసపద్యముల చిత్రవిచిత్రగతులు పోతన ప్రత్యేక దండక కృతి, అన్నమయ్యపదములు, దక్షిణాంధ్రయుగమున వెలసిన యక్షగానములు, గేయ రచనలు మొదలగునవి తెలుగు ఛందోవికాసపథమునందు మైలురాళ్ళనవచ్చును.

సాహిత్యోద్యమములు కొన్ని ఛందస్సును గూడ నాశ్రయించి యుండుననుటకు మలయాళసాహిత్యమొక చక్కని యుదాహరణము తమిళరాజులగు పెరుమాళ్ రాజ

వంశీయులు మలయాళదేశమును క్రీ. శ. 825 దాక పరిపాలించిరి. అప్పటికిమల యాళములో కావ్యభాషలేని కారణమువలన తమిళభాషకు (శెంతమిళ్) ప్రాధాన్య మేర్పడెను. కనుక 'రామచరితము'లో తమిళ ఛందోరీతులు కానవచ్చుచున్నవి క్రీ. శ. 12, 13, 14 వ శతాబ్దములందు మణిప్రవాళ భాషోద్యమము కారణముగా సంస్కృత భాషకు, సంస్కృతచ్ఛందోరీతులకు గౌరవాదరములు లభించినవి క్రీ. శ. 15వ శతాబ్ద మున వెలువడిన గాథాకవితోద్యమము కారణముగా 'మంజరీ' ఛందస్సునకు ప్రచార మేర్పడినది. క్రీ. శ. 14, 15 శతాబ్దములందు వెలసిన సిరణకవితోద్యమమువలన 'సిరణవృత్తములకు, కావ్యగౌరవము కలిగెనని చెప్పవచ్చును. క్రీ. శ, 16, 17 శతాబ్దములందు కిళిప్పాట్టు ఉద్యమము మలయాళ సాహిత్యమున నేర్పడినది. కిళిప్పాట్టు అనగా చిలుకపాట. ఇదియొక ఛందోవిశేషము. ఈ ఛందస్సునకు వ్యాప్తిగొని తెచ్చినవారిలో 'ఎళుత్తచ్చన్' ప్రథముడని మలయాళపరిశోధకులు పేర్కొనుచున్నారు. క్రీ. శ 20 వశతాబ్ది ప్రారంభమున బాలకృష్ణపణిక్కర్, కుమారన్‌ఆశాన్ మొదలగు వారు గేయరచనలకు ప్రాధాన్యమొసగిరి. శంకరకురుప్, కె కె. రాజా, లలితాంబికా అంతర్జనం, మేరీజాన్ తొట్టం మొదలగువారు ఆధునికకవులు. శంకరకురుప్ స్వచ్ఛంద కవితారీతులను మలయాళమున వ్యాపిగావించిన మహాకవి. మలయాళమున వరుసగా తమిళ మాతృకగలవి - సంస్కృతమాతృక గలవి. జానపద గేయమాతృక కలవి యగు ఛందోరీతులకు వ్యాపికలిగెనని ఫలితారము.

## 8. 1. ప్రాచీన చ్ఛందస్సులో క్రొత్త రీతులు :

మత సాంఘిక రాజకీయములందువలె భాషా విషయమునందును ప్రాచీనులకు నియమానుసరణమున పట్టుదలయు, నవ్యులకు నూత్న ప్రయోగము లందునురక్తియు కనిపించుట సహజము. ఛందోవిషయమునందు కూడ ఈ సత్యమును వర్తించును. ప్రచురములయిన ప్రాచీన చ్ఛందోపయోగములోని వైవిధ్యమును మొదటి దశగా చెప్పవచ్చును. ఇతర దాక్షిణాత్య భాషలతో పోల్చి చూచినవుడు తమిళమునందు మాత్రము క్రొత్తప్రయోగములు చాల తక్కువ అని చెప్పవచ్చును. నూతన ప్రయో గముల కంటె ప్రాచీన నియమ సంరక్షణము పట్ల తమిళుల కనురక్తి మెండు. మల యాళ కవులకు జానపద చ్ఛందములపై 'మోజు' అతివేలము. కనుక ఈ భాగమున కన్నడాంధ్రకవుల 'ప్రాచీన చ్ఛందస్సులో క్రొత్తరీతులు' మాత్రము పరిశీలింతము.

పాదనియమ పాలనమున స్వాతంత్ర్యము, గణసంయోజనమున వినూత్నత, యతి ప్రాసల పరిత్యాగములనునవి ప్రాచీన చ్ఛందస్సులో క్రొత్తరీతులగును.

## 8. 1. 1. గీతములు :

కన్నడ సాహిత్యములో రెండుమొదలుకొని ఆరు పాదములవరకు గల పద్యము లున్నవి. కన్నడకవులు పాదనియమ పాలనమునందు నూత్న పథము త్రొక్కియున్నారు. కొన్ని పద్యములలో నుండవలసిన పాదముల కంటె తక్కువ వ్రాయుటయు, కొన్ని పద్యములలో నియమమున కంటె భిన్నముగా పాదములు పెంచి వ్రాయుటయు చేసిరి.

'అక్కరికె' ఛందమునకు నాలుగు పాదములు ప్రతిపాదమునందు విష్ణు - బ్రహ్మ - విష్ణు - బ్రహ్మ - విష్ణు - రుద్రగణములు వచ్చుట నియమము. ఆధునిక సుప్రసిద్ధ కవులు శ్రీ బేంద్రెగారు అక్కరికె పాదమును మూడుభాగములుగావించి షట్పదీవిన్యాసమును ప్రదర్శించిరి. ఉదాహరణమునకు —

కాలూరితు మళె
కత్తెత్తితు బెళె
హని యొడెయితు మోడ
కిలికిలి హక్కి
కులుకులు నక్కి
దయె గెకయితు నోడా

— నాదలీలె - నిగినిగిముగిలు

ఇట్టి పాదనియమభంగము ఆంధ్రసాహిత్యమునందును కనిపించుచున్నది. భావకవులు ఈనియమవ్యతిరేకతను తొలుత ప్రవేశపెట్టినట్లు చెప్పవచ్చును. క్రిందితేటగీతి పద్యమునందు మూడుపాదములేయున్నవి.

నా విరుల తోట పెంచు కొన్నాడ నొక్క
పవడపు గులాబి మొక్క నా ప్రణయ జీవ
నమ్ము వర్షముగా ననయమ్ము గురిసి

— కృష్ణపక్షము

విశ్వనాథవారి గిరికుమారుని ప్రేమగీతాలలో రెండుపాదములుగల తేటగీతులున్నవి.

అసలు మ్రోగునో మ్రోగదో ఆవిపంచి
ఏల మ్రోగదు నాదుర దృష్టమనుము

పాదసంకుతచిత్వముమాత్రముగాక పాదములందు కొన్నిగణములను తీసివేయు టయు భావకవులరచనలందు కనిపించును. 'గిరికుమారుని ప్రేమగీతాలు'లో రెండవ పాదము మధ్యలోనే పద్యము ఆగిపోయినది.

ఉగ్రరాహుచంద్రార్ధబింబగ్రసనము
వోలెనున్నది నాస్థితి ... ...
... ... ... ... ... జయముజయము
లలితసుమనోజ్ఞకావ్యమంజుల లతాంత (కృష్ణపక్షము)

ఇచటపద్యము మధ్యలోనే ప్రారంభమయినది. మొదటిపాదమున తేటగీతి కుండదగిన మూడుగణములులేవు.

మరలగుడ్డిరాతిరివడు, మరలనోరు
కానిశ్రుతులులేని చీకటులుమరల
మరల పాడిల్లు ... ... (కృష్ణపక్షము)

పై పద్యమునందు మూడవపాదమున మూడుగణములులేవు.

కొన్నిగీతపద్యములు మనకు వాని ఛందోవిషయమైనజ్ఞానము లేకుండ జేయు నట్లుగా రచింపబడినవి.

నింగినీడలమెట్లుగా నీలిమొయిలు
జిలుగు విరుపులుగా పులుగులుగ నలరు
లుగ న లలుగా కలలుగాగ (ఊర్వశి)

ఇదియొక బలమైన వచనభ్రాంతిని కలిగించుచున్నది.

**ఆటగీతి :**

ఒక పద్యమున రెండు పాదములను ఆటవెలది లక్షణములతో వ్రాసి మిగిలిన రెండుపాదములను తేటగీతి లక్షణములతో వ్రాసినయెడల 'ఆటగీతి' యగును. చేజెర్ల శాసనమందు నిట్టి పద్యమొకటి కలదు.

సిద్ధి వందు డైన చేజెఱువుల కవో
తీశ్వరునకు భక్తి శాశ్వతముగ
మనుమ కులుడైన తాడూరి ఘనుడు మార
మాంబ కేతు డఖండ దీపంబు నిలిపె

— శాసనపద్యమంజరి - 47

ఆధునికులలో డాక్టర్ జి. భానుమూర్తిగారు 'కవి - కవిత' అను గ్రంథములో నిట్టి చమత్కారములు పెక్కు చేసియున్నారు.

**తేటవెలఁది :**

మొదటి రెండుపాదములను తేటగీతిలక్షణములతో వ్రాసి ఆపై రెండుపాదము లను ఆటవెలది లక్షణములతో వ్రాయగా తేటవెలదియగును. డాక్టర్ జి భానుమూర్తి గారు "కవి-కవిత" అను గ్రంథమునందిట్టి నూత్నప్రయోగములను గావించియున్నారు.

**తేటి :**

తేటగీతిపాదమునకు చివరనొక చంద్రగణమును చేర్చినచో తేటియగును. ఈ పద్యసృష్టికర్త కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు

కృష్ణవేణివి గావునఁ గృష్ణవయితొ - కృష్ణకృష్ణ

— బిల్వేశ్వరీయము

**తేటిబోటి :**

ఆటవెలది సరిపాదములే నాల్గుపాదములుగా లేకబేసి పాదములే నాల్గుపాదము లుగాకూర్చి, ప్రతిపాదము చివరనొక చంద్రగణము చేర్చినచో 'తేటిబోటి' యగును.

అడువారలారయఁగనేర కెల్లెల్లొ - యాడువారు
ఆటవెలది చేసియడుగుల యల్లేని యైననాల్గు

— బిల్వేశ్వరీయము

**ఆటబోటి :**

ఆటవెలది నాల్గుపాదములకు చివరనొక చంద్రగణము చేర్చినచో 'ఆటబోటి' యగును.

8. 1. 2. కందములు :

కంద పద్యములందు 1-3 పాదములలో మూడు గణములు, 2-4 పాదము లలో ఐదుగణము లుండుట నియతము. 2, 4 పాదములందలి చివరి అక్షరములు గుర్వంతములుగా నుండవలెను. కాని శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు కందపద్య నియమములందు కొన్ని మార్పులను చేసిరి.

చివురాకు లెక్కలమరిచి
యువతులు గురిగా ముఖమ్ములునిచిన వరసాలాదుల్
పువులలుగు లొనర్చున గా
నివసంతుఁడు తా ననంగునికి నాములుకు లొసంగడు

—ఆంధ్ర ధ్వన్యాలోకము.

పై పద్యమునందు 2, 4 పాదములలో ఆరు గణములున్నవి. నాల్గవ పాదము చివరి అక్షరము లఘ్వంతము.

కందపద్యములందు గా-భ-జ-స-నల గణములే కూర్చవలెనని నియమము. కాని ఆధునికుల రచనలందు కందములందు రాదగని గణములు కూడ నున్నవి.

ఇది విడిది ఆల మందలకు
నిదియే గొఱ్ఱెలకు తావు నింకమేకలన్

—విద్వాన్ విశ్వం పెన్నేటిపాట.

పై కంద పద్యము ప్రథమ పాదమున 'భల గణము' రెండవ పాదమున ర-లగ గణములు వచ్చినవి. కాని పై పద్యమును చదువునపుడు కందపద్య స్ఫూర్తియే మనకు తోచును.

కందమునకు 64 మాత్రలుండుట నియమము. కందపద్యగణములకు ప్రాధాన్య మొసగక మాత్రలసంఖ్యకుమాత్రము ప్రాధాన్యమొసగిన ప్రయోగములును గొన్ని కలవు. ఉదాహరణమునకు

శివశిరః కలాపముశశి 12 మాత్రలు
అవతరించె పూవువోలె అభ్రపథమ్మున 20 మాత్రలు

సుప్రసన్న.

శ్రీకొక్కొండ వెంకటరత్నంపంతులుగారు కందపద్య నియమములందు కొన్ని మార్పులను గావించి నూతనపద్యములను సృష్టించిరి. వానిలో మాకందము, రమాకందము, మహాకందములు పేర్కొనదగినవి. మొదటిదగు మాకందము పథ్యాలక్షణములను కలిగినది. రెండవది యగు రమాకందము చపలా లక్షణములను బోలినది. మూడవదియగు మహాకందము ఆర్యాలక్షణములను బోలినది. పాదాద్యక్షరము గురువేని లఘువేని కావచ్చునను నియమములతో రచింపబడు కందములు మహాకందములు.

## 8. 1. 3 ద్విపద :

రెండుపాదములుగల చిన్నపద్యము ద్విపద. పాదమునకు మూడింద్రగణములు ఒక సూర్యగణము కూర్పవలయుననుట ద్విపదలక్షణములలో ప్రధానమైనది. నల, నగ, సల, భ, ర, త గణము లింద్రగణములు. గలనగణములు సూర్యగణములు. కన్నడ లక్షణమనుసరించి గగ, సగణములుకూడ సూర్యగణములేయగును మ-సగగలు ఇంద్రగణములగును. చతుర్మాత్రాత్మక గణములనే స్వీకరించి వ్రాయబడిన ద్విపదలు కన్నడమునగలవు. అట్టివానిని డాక్టర్ కర్కిగారు కన్నడ ఛందోవికాసమున 'మందానిలద్విపది'గా భావించిరి. పంచమాత్రాత్మక గణసంయోజనముగలిగిన ద్విపదలను లలితచౌపదిగా డాక్టర్ కర్కిగారు విశదీకరించిరి.[2] పై విభేదముల కుదాహరణము —

మందానిల ద్విపది

| | | | | |
|---|---|---|---|---|
| మంజి బ్బన్నిగళు ఎరెయువ నావు | 4 | 4 | 4 | 3 + 1 |
| బెట్టద కోడలి బెళెదితు హూవు | 4 | 4 | 4 | 3 + 1 |

—బేంద్రె రత్నపదగళు

పాదాంత లఘువు గేయధర్మ మనుసరించి గురువగుచుండును. ఆ కారణమువలన చతుర్మాత్రాగణ విన్యాసము పై పద్యమున సరిపోయినదనవచ్చును.

లలిత చౌపది :

1) హిందిరువ హగెయాగ అంగార వాయు   5 + 5 + 5 + 3
ముందిరువ గెళెతనద సింగార వాయు

ఇందుము ట్టిదప్రతి బంగార వాయ్తు
హోగోణ బాఇన్న సీమెయను దాటి
బేంద్రె - గరి - సీమోల్లంఘన్

పై చూపబడిన పద్యము ద్విపద లక్షణములు గలవియే. ద్విపదకు రెండు పాదములు కాగా నిచట నాలుగు పాదము లొకే లక్షణముతో నమరియున్నవి.

తెలుగు కవులలో కూడ కొందరు ద్విపద ఛ్ఛందమునందు కొన్ని నూత్న ప్రయోగములను చేసియున్నారు. ద్విపద గణములు గాని వానిని స్వీకరించుట యందు ప్రధానమైనది. భల - నలలు పంచ మాత్రాత్మకము లైనను ఇంద్ర గణములు గావు.

వాల్మీకి కవిచక్రవర్తినీ వెవరు
సరసకవి తాలతా శాఖ లందుండి
యామని కోయిల యట్లుకూసెదవు
ఎచ్చోట పుట్టితి వెడ పెరిగితివి (దువ్వూరి) వాల్మీకి

రెండవ పంక్తియందు నలల గణము, నాల్గవపంక్తియందు 'భల' గణము ఉపయోగింప బడినవి. 'అట్టి గణవిభేదమువలన ద్విపద యొక్క యేకగతియందలి విసుగువేసటలు తొలగు'నని తమఅభిప్రాయముగా శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు 'నైవేద్యము' యొక్క 'విన్నపము' నందు పేర్కొనిరి.

**8. 1. 4. సీసము :**

"సీస పద్యమునకు నాలుగు పెద్ద పాదము లుండును. ప్రతి పాదమునందు వరుసగా 6 ఇంద్రగణములు, 2 సూర్య గణములు, కూర్పవలయును. అపై ఆట వెలదిని గాని తేటగీతిని గాని చేర్పవలెనని' లక్షణము పేర్కొను చున్నది. కాని కన్నడ కవులు సీసపద్యములందు పెక్కు ప్రయోగములను చేసియున్నారు. వానిని క్రమముగా పరిశీలింతము.

శ్రీ బేంద్రేగారు 'ఉయ్యాలె' అను కవితా సంపుటిలో 'తరంగ'మను పేరు గల విభాగమున 23 సీసపద్యములను రచించిరి.

మచ్చు కు :—

| | |
|---|---|
| ఏళు మెట్టిన హాలియ బీర బేంచెయ బిడిసి | 5 5 5 5 |
| మగువ ముద్దాడు వొాలు మాడిదాకె | 5 5 5 గు |
| గురియిట్టి కణ్ణుగళ కివి యూది హారళిసుత | 5 5 5 5 |
| తానె తన్నష్టక్కె హాడిదాకె | 5 5 5 గు |
| తళిరినుడుగెయనుట్టు గరితొాడుపుగళతొాట్టు | 5 5 5 5 |
| అడవియలి హూదోట హూడిదాకె | 5 5 గు |
| గిడకె గుడియను కట్టిబేరొాందు లోకవను | 5 5 5 5 |
| మూక మాతుగళింద బేడిదాకె | 5 5 గు |
| మనెయ హొాస్తిలకె శుభబరెయువాకె | 5 5 5 గు |
| మంగలవె బాళెందు కరెయువాకె | 5 5 5 గు |
| బాళ సుళియలి బెళియ తోరువాకె | 5 5 5 గు |
| దినదినవునవజయవ కోరువాకె | 5 5 5 గు |

— తరంగ (గృహిణి)

నల, నగ, సల, భ, ర, తలను గణములనిర్దేశింపక పంచమాత్రాత్మక గణములేవేని సీసపద్యమున రావచ్చునని చెప్పినచో పై సీసపద్యపాదములు సరిపోవును. పాదాంతమున రెండు సూర్యగణములుండు నియమముకూడ కుదురును. పైపద్యమున యతి ప్రాసలు రెండునులేవు.

కన్నడమున 'కిరిసీస'లను పేరుగల సీసములు కలవు. సీసపద్యమునకు నాలుగు పెద్దపాదములు కాని వ్రాతలో 8 పాదములుగా వ్రాయుట తెలిసినదే. రెండు సీసపాదములనుగాని నాలుగు దళములనుగాని కూర్చి పద్యము పూర్తిచేసినచో నట్టివి కిరిసీసలగును.

| | |
|---|---|
| జగవతుంబిదబెళకు నమగేకా సాలదిదె | 5 + 5 + 5 + 5 |
| ఎనితుమానవనెదెయ అళఅగల | 5 + 5 + 5 + గు |
| బందష్టు ఇంగుతిదె మత్తెబరి దాగుతిదె | 5 + 5 + 5 + 5 |
| ఎష్టుసెలె యొడెదరూ విఫలవిఫల | 5 + 5 + 5 + గు |

— చిన్నవీరకణవి - చిరంతనదాహ

ఇంద్రగణములని నిర్దేశింపక పంచమాత్రాత్మక గణములు లాచును, రెండు సూర్య గణములు నుండవచ్చునని చెప్పినయెడల పై పద్యము తెలుగు సీసార్థమగును. ఆధునిక కన్నడ సాహిత్యమున కిరిసీసములకు అగ్రతాంబూలము ఒసగబడినది. భావగీతములకు, కథా గేయములకు, ఖండ కావ్యములకు తగిన ఛందోబంధముగా మహాకవులు 'కిరిసీస' ముల నెన్నుకొనిరి.

ఆంధ్రకవులలో శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు సీసపద్యరచనలో పెక్కు మార్పులు గావించిరి. సీసపద్య పాదమునకు 6 ఇంద్ర గణములు + 2 సూర్యగణము లుండుట నియతము కాగా ఆ గణములపై నదనముగా నొక చంద్ర గణమును చేర్చి 'బంగార'మను పేరుగల పద్యములను పంతులుగారు వ్రాసిరి. 'సువర్ణ సిద్ధి కలుగుచుండ సీసమేల' అనుట పంతులవారి అభిప్రాయము. సీసపద్య యతి నియమములను పాటించుట మాత్రము గాక చంద్రగణ ప్రథమాక్షరమునకు కూడ యతిని నిలుపుట 'బంగారము యొక్క ప్రత్యేక లక్షణము. ఇట్టి బంగారము నాలుగు పాదములపై ఆటవెలది, తేటగీతి, తేటి, తేటిబోటి, ఆటబోటి మొదలగు పద్యములలో దేనిని కూర్చినను 'వెండి' పద్యమగునని పంతులుగారి అభిప్రాయము. ఉదాహరణము—

భరతాభ్యుదయము నెవ్వడు వేడ్కఁజేయించి
నలుమొగంబులఁ గాంచు ఫలముల నొగి వెలయునుగా

ఇచట 'వెలయునుగా' చంద్రగణము.

సీసపద్య రచనలో నింద్రజాలము చేసినవారు వెంకటపార్వతీశ్వరకవులు. సీస పద్యముల వచన గేయములుగా భాసిల్ల జేయుటయే యా యింద్రజాలము. ఛందో దృష్టితో పరిశీలించునంత వఱకు నవి సీసములను సత్యము తోపకుండుటయే యందలి చమత్కారము. ఉదాహరణమున కొక పద్యము —

"నాభారతి తన మనసువచ్చిన పసిపాపలగూడి
తొక్కు పల్కులను బల్కుచున్నది
తనయీడు చిన్నబిడ్డల జేరి
పదములఁ బాడుచున్నది

తనచెలిక త్తెలనెల్ల దగ్గఱజేర్చి
యోమనగుంటలాడుచుఁ బ్రొద్దుగెంటుచున్నది
ఎరువుబొమ్మలఁదెచ్చి పెళ్ళిళ్ళలో
గుజ్జెనగూళ్ళనుఁ గూర్చుచున్నది
ఎపుడీబాల భారతీదేవియనఁగ బలుకునో –
పరాత్పరు బొగడునో—
జగమ్మె బొమ్మరిల్లుగ నాడఁగలుగునో
అపుడు పితామహుడే యయిపోదును ప్రభు"

— భావసంకీర్తనము

దీనిని సీసపద్యముగా వ్రాసిన ఇట్లుండును.

నాభారతి తనమనసువచ్చిన పసిపా
పలగూడి తొక్కుపల్కులను బల్కు.
చున్నది తనయీడు చిన్నబిడ్డలజేరి
పదములఁ బాడుచున్నది తనచెలి

ఆచార్య సి. నారాయణరెడ్డిగారు పై పద్యములను సీసపద్యములనుటకన్న వచనగేయము లనుటలో సరసత, సార్థకత యున్నట్లు భావించిరి.[3] పైరచనలో రెండవచరణము లన్నియు క్రియాంతములగుట, అక్కడికి చెప్పదలచుకొన్న విషయము, భావము సమాప్తమగుట, భావమునుబట్టి చరణముల హ్రస్వత్వదీర్ఘత్వము లేర్పడుట మొదలగు లక్షణములవలన దీనిని వచనగేయమనుట సమంజసము.

### 8. 1. 5. షట్పది

తెలుగుసాహిత్యమున షట్పదులకు ప్రచారములేదు. కన్నడమున షట్పదులకు ప్రచారమెక్కువ. ఆధునిక కవులు షట్పదిరచనలో పెక్కుమార్పులను గావించి యున్నారు. వానిని పరిశీలింతము.

కుసుమషట్పది :

ఆధునికకవులు కుసుమషట్పదులరచనలో ఆదిప్రాసలను పరిత్యజించి అంత్య ప్రాసలకు ప్రాధాన్యమొసగియున్నారు.

| | గణవిన్యాసము |
|---|---|
| తుంబు తుంబెలె తుంబి | 5 5 |
| దిగ్దేశగళ తుంబి | 5 5 |
| తుం బి మీరెలె నీను నాకలోక | 5 5 5 + 2 |
| ఒందొంద పదిస్పర్శ | 5 5 |
| ఒందెచుంబన హర్ష | 5 5 |
| ఒగెయిసలి నవసరస సృష్టిపాక | 5 5 5 + 2 |

— ఈశ్వరసణకల్ల - తుంబి - తుంబిగె

పై పద్యమునందు అంత్యప్రాస ఒకేవిధముగాలేదు. 1, 2 పాదములందు నేకప్రాస 4, 5 పాదములందు ఒకప్రాస. 3–6 పాదములందు భిన్నప్రాస. పైపద్యముక్రింది ఆంగ్ల పద్యమును పోలియున్నదని డాక్టర్ కర్కిగారు తెలిపిరి.[4]

**Where sunless rivers weep**
**Their waves into the deep**
**She sleeps a charmed sleep; awake her not**
**Let by a single star**
**She came from very far**
**To seek where shadows are; her pleasant lot**

— Christina Rossetti - Dream Land

షట్పదికి ఆరు పాదము లుండవలయును మొదటి మూడు పాదము లొక వర్గము. తరువాతి మూడు పాదము లొక భాగమగును. ఆధునిక కవులు కొందరు షట్పదిలో అర్ధ భాగమును మాత్రము గ్రహించి పెక్కు రచనలు సలిపియున్నారు. కుసుమ షట్పదిలో గావించిన ఇట్టి ప్రయోగములను 'వికసిత కుసుమార్ధము'లుగా చెప్పవచ్చునని డాక్టర్ కర్కిగారు పేర్కొనిరి.[5]

| | |
|---|---|
| హూవె బెందరె అరస | 5 5 |
| చెందదొళు ఇదు సరస | 5 5 |
| ఇదువె చెందద గుడియ గోపురకె కళస | 5 5 5 3 |

—బేంద్రె 'గరి-హూ'

ఇట్లే కన్నడమునందు 'అర్ధభోగ షట్పదులును' కలవు.

| | |
|---|---|
| కుణియు వంతె మత్త శిఖి* | 3 3 3 3 |
| కుణియు తిహను నోడె సఖి* | 3 3 3 3 |
| నోడె సఖీ బారె సఖి* | 3 3 3 3 |
| నోడె శశము ఖి* | 3 3 గు |

—కువెంపు – నవిలి – (కుణియువంతెమత్తశిఖి)

*పాదాంత లఘువులను గురువులుగా నెన్నుట గేయధర్మము. కనుక పై పద్యమును 'అర్ధభోగ షట్పది'గా నెన్నుట సమంజసము

శ్రీ కువెంపుగారు భోగషట్పదిలో కొన్ని గణములను తీసివేసి యొక క్రొత్త పద్యమును రచించిరి.

| | |
|---|---|
| ఎదెయ బనకె బారో నీ | 3 3 4 2 |
| గోప బాల నే | 3 3 గు |
| ముదది శశియ కిరణ సిన్న | 3 3 3 3 |
| కరెయు తిరువుదు | 3 3 గు |

—కొళలు – రాధెయకరె

పై భోగషట్పది పద్యములో మొదటి పాదమున 3 3 3 3 మాత్రలు గల గణములకు మారుగా 3 3 4 2 మాత్రల గణము లున్నవి. కాని పాదమునందుండ వలసిన మాత్రాసంఖ్య సరిపోయినది. ఇక రెండవ పాదము నందుండవలసిన 3 3 3 3 మాత్రల గణములకు మారుగా 3 3 గు (2) మాత్రల గణము లున్నవి. అనగా నాలుగు మాత్రలు కొఱవడినవనుట.

శ్రీ బి. ఎం. శ్రీకంఠయ్యగారు, శ్రీ డి. వి. గుండప్పగారు అర్ధభోగ షట్పది రచనలో మరియొక నూత్న ప్రయోగము గావించిరి. మూడవ పాదమును బోలిన మరియొక పాదమును అదనముగా చేర్చుటయే యా ప్రయోగము. పూర్ణషట్పది యందు 4, 5 పాదములను తొలగ జేసిన ప్రయోగమని దీనిని పేర్కొనవచ్చును

కన్నడ నుడి నమ్మ హెణ్ణు
నమ్మ తోటె దినియ హణ్ణు
బళక బేరె బెళెద హెణ్ణు

బళిగె సుళిదరు
హోసదు రసద బళ్ళి హణ్ణు
ఒళగె సుళిదరు

—బి. ఎం. శ్రీకంఠయ్య -(కాణికె)

సాంగత్యమును షట్పదిగా మలచి గావించిన రచనలును గన్నడమున కలవు.

| | |
|---|---|
| జీవవ కొరెయువ | వి వి |
| సావను కరెయువ | వి వి |
| బడతన వీణెయ గైదు | వి వి బ్ర |
| హసవిన తంతియ | వి వి |
| ఏరిసి గోళిన | వి వి |
| రాగవ మిడియుత లిహుదు | వి వి బ్ర |

—శంకర నారాయణరావు - (బదుకినహాడు)

8. 1. 6. రగళెలు :

రగళెలకు ఆద్యంత ప్రాసలు ముఖ్యధర్మములు. కాని ఆధునికకవులు కొందరు ఆద్యంతప్రాసలను పరిత్యజించి రగళెలు వ్రాసియున్నారు. శ్రీశ్రీనివాసకవి 'హాళూరు కథె', శ్రీగోవిందపై 'గోల్గొథ'. పుట్టప్ప 'చిత్రాంగద' యమనసోలు, రక్తాక్షి, శ్రీ బి. ఎం శ్రీకంఠయ్య 'అశ్వత్థామన్' గ్రంథములందు ఆద్యంతప్రాసరహిత రగళెలుకలవు. ప్రాసరహితలలితరగళెను 'మహాఛందస్సు' పేరుతో వ్యవహరించి 'రామాయణదర్శన' మను మహాకావ్యమును సంతరింపజేసిన ఘనత శ్రీకువెంపుగారిదే యగును.

ప్రాసరహిత లలితరగళెకు నొక యుదాహరణము.

చిమ్మిదుదు జింకెమరి యొందుహొద రొడలిందె
కరిముగిల్గబ్బదిం దొగెవమరి మించంతె

— చిత్రాంగదా - పుట 4 చరణములు 72-73

లలితరగళెలందువలె ఉత్సాహరగళెలందును ఆద్యంతప్రాసలను పరిత్యజించి రచనలు సలిపినవారిలో శ్రీ డి. వి. గుండప్పగారు ప్రముఖులు. ఆదిప్రాసలను వదలి

పెట్టి అంత్యప్రాసమునకు ప్రాధాన్యమొసగి రచనలు సలిపినవారిలో శ్రీకువెంపుగారు గణింపదగినవారు

బెంబెగెనుతుమొందు దినం

పోదనవన్ దట్టె జనం

— కువెంపు - నవిలు - సఖ క్తగీన్

రగళెలకు పాద యతిలేదు. ద్విపదలవలె నెన్నిపాదములేని వ్రాయవచ్చును. ఆధునిక కన్నడకవులలో కువెంపుగారు చతుష్పాదయుక్త లలితరగళెలను వ్రాసిరి. ఇట్టి రగళెలను 'లలితచతుష్పది' అని పిలువదగునని కర్కిగారు పేర్కొనిరి.6 ఉదాహరణమునకు —

| | |
|---|---|
| ఉదయదలి కుసువతా సరళవుదు తెరళవుదు | 5 5 5 5 |
| ముదదింద బరువుదా మధుమాస విధిహాస | 5 5 5 5 |
| పదుళదిం పక్షిగళు పాడువువు బేడువువు | 5 5 5 5 |
| విదెయసం తసమాత్ర కొళగుతిదె సొరెగుతిదె | 5 5 5 5 |

— కువెంపు - సౌబగనాస్వాదిసలు

పై పద్యమున నాలుగుపాదములున్నవి. ప్రతిపాదమునందును నాల్గు ఐదుమాత్రల గణములున్నవి. ఆదిప్రాస పాటింపబడినది ఈపద్యగమనము గజపతిగతి పోలినది

పై పరిశీలనమువలన కన్నడాంధ్రములందు యతిప్రాస పాదనియమములను మహాకవులు ఉల్లంఘించిరని చెప్పవచ్చును కట్లు చేయుటకు స్వేచ్ఛాప్రియత్వము ప్రధానకారణమయినను మరొక కారణమున్నట్లు గోచరించును. ఒకభావము పద్యములో చెప్పబడవలయుననగా, పద్యమంతటిని వ్యాపించగల వైపుల్యము అభావమున కుండవలయును. భావపరిమితికంటె పద్యము పెద్దదయినచో పద్య పూర్తికయి భావమును సాగదీయుటయో వ్యర్థపదములను గూర్చుటయో చేయవలసియుండును. అందువలన భావమెక్కడ పూర్తియైన పద్యమునక్కడ ఆపుట సంభవించియుండును. ప్రాచీన నియమోల్లంఘనమునకు అన్యభాషాప్రభావము కూడ నొక కారణమగును.

### 8. 1. 7. క్రొత్తపద్యములు :

ఇంతవరకు సాంప్రదాయిక ఛందస్సులలో గావింపబడిన మార్పులను గూర్చి పరిశీలింతము. క్రొత్తపద్యములను పరిశీలింతము. క్రొత్తపద్యములస్సృష్టికి నెన్నియో

కారణములున్నవి. మొదటిది ఇతరభాషలందుగల ఛందోవైవిధ్యము ప్రధానకారణము. రెండవది నూత్నప్రక్రియలను సృష్టించు కవి అభిలాష మూడవది సమకాలికభాషా వస్తువుల నాదరించి రచనచేయవలసిన పరిస్థితి. పై కారణమువలన క్రొత్తపద్యము లేర్పడినవి.

క్రొత్తపద్యములలో పాదములసంఖ్య పరిమితముగా నుండదు. కన్నడ సాహిత్యములో రెండు మొదలు ఆరుపాదములవరకుగల పద్యములున్నవి. కాని ఆధునిక కవులు ఐదు, ఏడు, పదునొకండు పాదములవరకుగల పద్యములను రచించియున్నారు[7] ఇట్టినియమవిస్తృతి యేర్పడుటకు తొలుత మార్గము చూపినవారు శ్రీ బి. ఎం. శ్రీకంఠయ్యగారు కన్నడసాహిత్యములో ప్రచురమైన నూత్నఛందోరీతులలో అష్టషట్పది ప్రగాథలు ముఖ్యములు.

అష్టషట్పది

ఆంగ్లసాహిత్య ప్రభావమువలన కన్నడమునందవతరించిన నూతన ఛందోరీతులలో అష్టషట్పదియొకటి దీనిని ఆంగ్లమున **'Sonnet'** అందురు. అష్టషట్పదికి కన్నడమున చతుర్దశపది, సునీత అను పేర్లను వాడుకలో నున్నవి ప్రాసదృష్టితో పరిశీలింప అష్టషట్పదిలో రెండుభాగములున్నవి. మొదటిభాగమునకు అష్టపదమనియు రెండవభాగమునకు షట్పదమనియు పేర్లుకలవు. ఇటాలియన్ అష్టషట్పదిలో అష్టపదమందలి ప్రాసవిన్యాసము 'అబబ అఅబబ అ' అనురీతినుండును. షట్పదమందలి ప్రాస విన్యాసము 'కడఈ కడఈ' అనువిధమున కూర్చబడును. ప్రాస విన్యాసభేదములనుసరించి షట్పదులలో మూడు విధము లేర్పడినవి. మొదటిది ఇటాలియన్ అష్టషట్పది. రెండవది ఆంగ్ల అష్టషట్పది. మూడవది షేక్స్పియర్ అష్టషట్పది. కన్నడ సాహిత్యము నందు మూడు విధములగు షట్పదులును గలవు. కన్నడ అష్టషట్పదులందు పంచమాత్రాత్మకములగు నాలుగు గణములు పాదమున కుండును.

అష్టషట్పదికి నొక యుదాహరణము —

| | |
|---|---|
| గంధవతి పృధ్వియ సుగంధ - కందద బళ్ళి | అ |
| హబ్బుతిదె బెట్ట సాలుగళల్లి గిరిశిఖర | బ |
| ముకులదోలు మొగవనెత్తివె నభదల్లల్లి; | అ |
| మలయనపవదెందో కొనెయ ప్రళయ ప్రఖర | బ |

ద్వాదశాదిత్య పడిసిద మేలె చెళి తళ్ళి అ
నవవసంతవు బరలు, సురతారకానికర బ
భృంగదంతెరగి నరుగంపన్ను హారచెల్లి అ
మగమగిసె దెసె ఆగముగిల మౌనవె ముఖర బ
ఈ చిత్త సరసియలి మధుకల్పనా కుసుమ క
తురుగి తుంబిదె. ఒడల కావణదొళీ ప్రాణ డ
కాదలినిగాగి కుళితిదె కామ గంభీర ఈ
బార, తళువదె జగజ్జీవనవె! అతివిషమ క
సంకట దోళిదె తడెయువరె తాను నిత్రాణ డ
ఉసిరొళుళిదిదె మలయ పవన విలయసమీర ఈ

—బేంద్రె - ఉయ్యాలె గంధవతి

కన్నడ సాహిత్యమున శ్రీశ్రీనివాస, శ్రీ బేంద్రె, శ్రీకువెంపె ప్రభృతులు పెక్కు అష్టషట్పదులను విరచించిరి. తెలుగులో నిట్టి అష్టషట్పదులు లేవు. కాని శ్రీ మల్లవరపు వారు 'కీలాంజలి' అను గేయమున 4 చరణముల ఖండములో **A. B, A B.** పద్ధతిని మాత్రము ప్రవేశ పెట్టిరి.

| | | |
|---|---|---|
| స్మృతిలోకం | **A** | 6 మాత్రలు |
| తలుపు తెరవకే | **B** | 8 మాత్రలు |
| చితి మంటలు | **A** | 6 మాత్రలు |
| పైకి పర్వనే | **B** | 8 మాత్రలు |

## ప్రగాథ :

ఆంగ్లమున గల 'Ode' అనుటకు కన్నడ కవులు 'ప్రగాథ' అని పేరిడిరి. సాధారణముగా ప్రగాథలు సంబోధనాత్మకములుగా, ధ్యానప్రధానములుగా నుండును. వివిధ ప్రాస చమత్కారము గలిగి అనియత చరణములుగల ఛందోభేదమే 'ప్రగాథ' యగును. నియత గణ విన్యాసము, నిర్దిష్ట చరణములుగల పిండారిక్ ఓడ్ వంటివి కన్నడములో లేవు. కన్నడ సాహిత్యమున శ్రీ డి. వి. గుండప్ప, శ్రీకువెంపు ప్రభృతులు ప్రగాథ రచనలో నిష్ణాతులు. ఆంగ్లమున **Ode to Nightingale, Ode on a Grecian Urn** రచనలవలె కన్నడమున బేలూరిన శిలాబాలికెయరు, గోమతేశ్వర, స్వాతంత్ర్యోద్యమ మహాప్రగాథలు ప్రసిద్ధములు. కన్నడ ప్రగాథలందు సీసపద్య ఛాయలున్నవి.

ఉదాహరణమునకు –

మాధుర్య మంజూష మధురతర మానదిం
దారచట తెగళ శకిగుసిరు తిరువె
ముగ్ధమోహన వదనె ముకురదొళ్ నోడిసి
నారనెనెదింతు నసునగు తలియవె
—బేలూరిన శివబాలికెయరు.

తెలుగు సాహిత్యములో శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు క్రొత్త పద్యములను సృష్టించినవారిలో ప్రముఖులు. పంతులుగారి వెండి, బంగారము, ఆటబోటి, తేటబోటి, తేటిబోటి మొదలగు పద్యములన్నియు ప్రాచీనపద్యములకు నదనముగా కొన్నిగణములను చేర్చుటవలన నేర్పడినవియే. కాని ఆపద్యములకు ప్రచారము కలుగలేదు. కొన్ని వందల యేండ్ల ప్రయోగ నైరంతర్యమువలన కొన్ని కొన్ని పద్యములు ప్రత్యేకమయిన గమనములతో స్థిరపడియున్నవి నియత గమనముగల పద్యములే స్థిరపడును. లేకున్న క్రొత్తపద్యములను ప్రయోగించుట జరిగినదను కొనుట తప్ప నితర ప్రయోజము ఉండదు.

శ్రీరామచంద్ర కౌండిన్యగారు "రమణస్మరణ" అను గ్రంథమున "వెణ్బా" ఛందస్సులో కొన్నిపద్యములను వ్రాసిరి. 'వెణ్బా' తమిళ ఛందస్సులలో నొకటి. నాకు తెలిసినంతవఱకు తమిళ ఛందోరీతులను తెలుగున వాడినవారిలో వీరే ప్రథములు.
ఉదాహరణము –

కమనీయశీల మముగన్న మహాలక్ష్మి
కమరించు పుణ్యనిలయమ్మ – రమణ
తనయు తపించుటలు తల్లి ఋణమీగన్
వినవె యశగాత్మ జుడవే

డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు 'మాకందములు' అను పేర క్రొత్త ద్యములను ప్రచారమునకు గొనివచ్చిరి. ఇవికందములవంటివే. లాక్షణిక కందములందు 1–3 పాదాలు పొట్టివి. 2–4 పాదములు పొడుగయినవి ఇట్లుగాక మొదటి రెండు పాదములను పొట్టివిగా 3–4 పాదములను దీర్ఘముగానిడి వ్రాసినచో మాకందము. కందము పాదులో పుట్టినదగుటవలన మాకందములను పేరు సార్థకము. ఉదాహరణము –

కందమునే మలచితి మా
కందముగా పలికితి ఆ
ఛందమునకు వింతగతులు సమకూరుస్తూ
స్పందమునకు క్రొత్త ప్రశంసలు సంపాదిస్తూ

బసవరాజు అప్పారావుగారు సృష్టించిన క్రొత్తపద్యము 'పగడాలదండ'. ఇది త్ర్యస్రగతిలో రచింపబడినగేయము. కాని శ్రీ బసవరాజు అప్పారావుగారు నాలుగు చరణములలో చివరిచరణమును ముత్యాలసరములోవలె త్రుంచి గేయమునుపూర్తిచేసిరి.

జలజలమని పాఱెడు నీ
సెలయేటి దరింగూర్చొని
విలపించెదవేల సిటులు
చెలియ చెప్పవే

— కామాసురగేయము

ఈ 'పగడాలదండ' మను పేరు వీరియీరచనతోనే అంతరించినది.

"సాహిత్యము ప్రగతిశీలము. సుభగము, సుందరమునయిన దానిగమనము నిరంతరము సాగుచుండును. అప్పుడప్పుడు సాహిత్యమున స్తబ్దతకూడ నేర్పడు చుండును... ఒకపెను సుడిగాలివీచినట్లు నిశ్చలసముద్రములో నువ్వెత్తుగనొక పెద్ద తరంగము లేచినట్లు ఉప్పెన పొంగి పొరలువాఱినట్లు ఆ స్తబ్దతయంతయుఁదొలఁగి సాహిత్యము మహావేగముతో నుఱకలు పరుగులు వేయునట్లు నేదోయొక సంచలనము ఒకజాగృతి, ఒకయుద్యమము ఏర్పడుచుండును. ఆ యురవడితో ఆ వేగముతో సాహిత్యము కొంత ముందునకు సాగును. అగమ్యమయిన గమ్యము దెసకుఁ బురోగమించును." అను డాక్టర్ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారి వాక్యములు 'క్రొత్త పద్యముల వికాసమందును అనుసంధానించుకొనుట సమంజసమే.[8]

## 8. 2. నూతన దేశిచ్ఛందములు :

నూతన దేశిచ్ఛందములకు జానపద చ్ఛందోరీతులే మూలము. మహాకవులు జానపదచ్ఛందోరీతులందుగల లయరమ్యతను గుర్తించి యించుక మార్పుచేసి పెక్కు దేశిచ్ఛందముల ప్రచారమునకు గొనివచ్చిరి. వానిని క్రమముగా పరిశీలింతము.

తమిళ దేశిచ్ఛందములలో చిందు, కుమ్మి పళ్ళు, ప్పాట్టు, ఆనందక్కళిప్పు మొదలగునవి ప్రసిద్ధములు. చిందు కలిప్పా విభేదమునకు చెందిన పద్యము దీనికి రెండు లేదా నాలుగు పాదము లుండవచ్చును. పాదమునకు రెండు మొదలు 7 గణములు రావచ్చును. ఆదిప్రాస నియతము తమిళ వాఙ్మయమున 'కావడిచ్చిన్దు' దేవాలయములందు పాడబడు స్తోత్రగతికి చెందిన పద్య విశేషము. ఆ చిందు ఫక్కిని గ్రహించి భారతియార్ 'ఎంగళ్ తాయ్' అను గేయమును రచించెను. 'చిందు' పద్యమున కొక యుదాహరణము.

ఓడి విళై యాడు పాప్పా - నీ
ఓయ్న్దిరుక్క లాగాదు పాప్పా
కూడి విళై యాడు పాప్పా - ఒరు
కుళందయైవైయ్యుం వై యాదేపాప్పా

—భారతియార్

ఇట్లే భారతియార్ 'నొండిచ్చిన్దు' అను ఛందోవిశేషమును గూడ తన కవితలో ప్రయోగించియున్నాడు. తమిళమున 'కోవలనాడగనొండిచ్చిందు' చాల ప్రసిద్ధమైనది.

"నెంజు పొరుక్కు దిల్లై యే-ఇంద
నిలై కెట్ట మనిదరై నినైత్తు విట్టాల్
అంజియంజి చిచ్చావార్ - ఇవర్
అంజాద పొరు శిల్లై అవనియిలే"

భారతియార్ తన రచనలలో ఇరుశీరరట్టై, ముచ్చీరరట్టై నమనిలైచ్చిన్దు విభేదములు, ఇరుముచ్చీరిరట్టై, అడుక్కిరు నార్చీరొాటై, నాలిరుశీరిరట్టై నాముచ్చీరిరట్టై ఇరుమూవిరు ఇరుమూవిరుశీరొాట్టై, మూవిరుశీరిరట్టిరట్టైనియనిలై చిన్దుభేదములను ప్రయోగించి యున్నాడు.

"కుమ్మి" స్త్రీలక్రీడావిశేషము. ఇదివెణ్బా విభేదమే. ఇయఱ్కుమ్మి, ఒయిర్కుమ్మి ఒరదిక్కుమ్మి అని 'కుమ్మి' మూడు విభేదములు. అరిచ్ఛందిరకుమ్మి, వాలకుమ్మి, ముత్తునాచ్చిచణ్డై మొదలగునవి కుమ్మి ఛందములో వ్రాయబడిన గ్రంథములు.

"కుమ్మియడి తమిళ్ నాడుము ఝదుం
కుళుంగిడ కైక్కొట్టి కుమ్మియడి"

— భారతి - సుదంతిరక్కుమ్మి

ఇది మలయాళ 'మంజరి' ఛందమును పోలినదని డా॥ ఒ. ఎం. అనుజన్‌గారు పేర్కొనిరి.[9]

'పళ్ళుప్పాట్టు' అనునది జానపదచ్ఛందము. రైతులు పాడుకొనెడి పాట. 'పళ్ళుప్పాట్టు' గతిలో భారతియార్ కొన్ని పాటలను వ్రాసెను.

పార్పనై ఐయర్ ఎన్ఱ
కాలముం పోచ్చేవెళ్లై
ప్పరంగియై దురై ఎన్ఱ
కాల ముం పోచ్చే"

భారతియార్ 'బుడబుడక్కులవాని' పాటల సరుసలో కూడ కొన్ని పాటలను రచించి యున్నాడు. ఉదాహరణమునకు —

"నల్ల కాలం వరుగుదు నల్లకాలం వరుగుదు
దరిద్దిరం పోగుదు సెల్వం వరుగుదు
పడిప్పు వళరుదు పావం తొలైయుదు"

జానపద చ్ఛందములను గ్రహించి నవ్యకవితలు వెలువరించిన వారిలో భారతి దాసన్, నామక్కల్ కవిజర్, ఉలగనాదన్, రామలింగర్ మొదలగువారు ప్రసిద్ధులు. 'ఆనందక్కళిప్పు' పద్ధతిలో రామలింగర్, భారతియార్ ప్రభృతులు పెక్కు పాటలను రచించిరి.

"తిణ్ణప్పళం కొండు తరువాన్ - పాఢి
తిన్నిన్ఱ పోదిలే తట్టి ప్పఱి ప్పాన్
ఎన్నప్పన్ ఎణ్ణయన్ ఎన్రాల్ - అదణై
ఎచ్చి ఱ్పుడు త్తి క్కడిత్తు క్కొడుప్పాన్

బాల సాహిత్యమునగల తాలాట్టు (జోలపాట) పుఱాప్పాట్టు (పావురగేయము) సేవఱ్పాట్టు (కోడిపాట) తెంపాంగు, ఉడుక్కైప్పాట్టు మొదలగు వానికెల్ల జానపద చ్ఛందోరీతులే ఆధారములు.

మలయాళ సాహిత్యమునందును జానపద చ్ఛందోరీతులకు ప్రచార మెక్కువ ప్రసిద్ధి పొందిన కవులు గూడ జానపద చ్ఛందముల నభిమానించి రచనలను సలుపు చున్నారని డా॥ వి. ఎం. అనుజన్‌గారు విశదీకరించిరి.10 మిళ కన్నడాంధ్ర మలయాళ కవులకు జానపదచ్ఛందోరీతుల నెన్నుకొనుటలో ఆదరమున్నదని సారాంశము.

## కన్నడ దేశిచ్ఛందములు :

కన్నడ జానపదచ్ఛందములకు కావ్యగౌరవమును గలిగించిన మహాకవి శ్రీబేంద్రెగారు, శ్రీబేంద్రెగారి బెళగు, కోగిలె, పాతరగిత్తిపక్క, నన్నకిన్నరి, బిసిలుగుదురె, నన్నకైయహిడిదాకె, కుణియోణుబా, కూసువిన్నాణ, రాగరతి, నగినవిలు మొదలగు పాటలన్నియు జానపదగతులు కలవే.

1. ఉత్సాహలయ కలిగిన జానపద ద్విపదికి నుదాహరణము.

పాతరగి త్తిపక్కా
నోడిదేను అక్కా
హసిరు హచ్చి చుచ్చి
మేల కరిషణ హచ్చి

నాగిద్దాగ కాక

— బేంద్రె గరి–పాతరగి త్తిపక్క

పైపాట త్ర్యస్రగతి కలిగినది. ఆయాపాదములందుగల యొకటి రెండు హెచ్చుమాత్రలు గేయధర్మమనుసరించి సంకుచితము చేయబడును తెలుగుగేయములందు కూడ త్ర్యస్ర గతిగల రచనలు కొన్నియున్నవి.

మెట్లు మెట్లూ
రాతి మెట్లు
కాలు నల్ల
రాతి మెట్లు

—— మెట్లు – బాపిరాజుగేయము-వైతాళికులు

2. మందానిల లయగలిగిన జానపదచ్ఛందము చతురస్రగతితో నడచును. అట్టి చతురస్రగతితో సాగు ఆధునిక కన్నడగేయములు కొన్ని కనిపించుచున్నవి. శ్రీ చెన్నమల్లప్పగారు మందానిలలయకు ప్రాధాన్య మొసగి పెక్కు గేయములను రచించిరి ఉదాహరణమునకు -

బారే రాణి
మించిన రాణి
అప్సర నారి
మైజర తారి
ధాట మాట మాడి కోత
ఆట పాట ఆడి కోత
అల్లే కుళితి
బారే గెళతి

—మధురచిన్న - నన్నల్ల - రోహిణి.

చతురస్రగతిగల తెలుగు పద్యమునకు నొక యుదాహరణము.

లకుమకు తోచెను రాయడు
ప్రకృతికి పురుషుని పోలిక
వారిరు వురి సాం గత్యము
వాగ ర్థమ్ముల కేలిక

—డాక్టర్ సి. నారాయణరెడ్డి - కర్పూర వసంతరాయలు

ఆధునిక కన్నడ కవులు జానపద గేయములందు కనిపించు త్రిపది, షట్పది, సాంగత్యములను పోలిన పద్యములను, గేయములను రచించియున్నారు. ఇవి కావ్య వాఙ్మయమందుగల త్రిపది, షట్పది, సాంగత్యములకంటె నించుక భిన్నములు.

జానపద త్రిపది -

హోగ్గినీ హొస్తిలె హోగ్గినీ బాగిలె
నాగ సంపగి నడుమనెయె భావయ్యే
హోగి బర్తీనె తౌరిగె

— నాడపదగళు

శ్రీ బేంద్రెగారు 'కామకస్తూరి' కవితా ఖండికలో జానపద త్రిపదులను పోలిన కొన్ని పాటలను రచించి యున్నారు. మచ్చున కొక యుదాహరణము.

"బరిగౌడద బాలి కొడన్యాక తుంబిల్ల
దడదాగ నింతె సుమ్మనె కోల
దడదాగ నింతె నినగ్యాకే చింతె
జనుమక బందు దివసేస కోల"

పై పాటయందు 2-4 పాదముల చివర 'కోల' అను పదము జానపదగేయము లందు కల 'ఊతపదమును' తలపించుచున్నది. రెండవపాదమందుగల పదములు కొన్ని మూడవ పాదమందును ఆవృతమగుటవలన జానపద త్రిపదుల ఛాయ స్పష్టముగా గోచరించుచున్నది.

కన్నడకావ్యములందు మాత్రా షట్పదులకే ప్రచారమున్నది. అంశగణములతో కూడిన షట్పదులకు ప్రచారము చాల తక్కువ. జానపదగేయములందు అంశగణాన్వీత షట్పదులకు ప్రచారమెక్కువ యున్నట్లు చెప్పవచ్చును. శ్రీ బేంద్రెగారు అంశగణ షట్పదీ లక్షణములతో కొన్ని గేయములను రచించిరి.

| | | | |
|---|---|---|---|
| బిగర్యాగి | తిగర్యాగి | విష్ణు | విష్ణు |
| నిద్దియ | బగర్యాగి | వి | వి |
| గాళిగు | హగురాగి కుణియోణు బా | వి | వి రు |
| కైమై | బీసాడి | వి | వి |
| ఇళిగొద | పీసాడి | వి | వి |
| బెవర్హని | సూసాడి కుణియోణు బా | వి | వి రు |

— కుణియోణుబా

మాత్రాగణములననుసరించినచో, రెండు, నాలుగు, ఐదుపాదములందు గణభంగము కలుగును. పంచమాత్రాత్మక గణములేయున్నచో నిది కుసుమషట్పది యగును. ఇట్లే నృత్యగతి కలిగిన, జానపదచ్ఛందోరీతులను పోలిన గేయములు, ఆధునిక కన్నడసాహిత్యమున పెక్కు కలవు. పైపరిశీలనమువలన కన్నడ మహాకవులకు కూడ జానపద చ్ఛందోరీతులపై ఆదరమున్నదని నిర్ధారింపవచ్చును.

## 8. 2. 1. ముత్యాలసరాలు :

నూతనాంధ్రదేశిచ్ఛందములలో 'ముత్యాలసరాలు' మొదట పేర్కొనదగినవి. యూరోపియను భాషలలో కవులు క్రొత్తవృత్తములను కల్పించి భాషాభివృద్ధిచేసినట్లు తననేర్పుకొలది గురజాడవారు సృష్టించిన క్రొత్తఛందస్సు ముత్యాలసరము. కుఱళ్ అనగానే తిరువళ్ళువర్ జ్ఞాపకమువచ్చినట్లు, త్రిపదులనగానే సర్వజ్ఞకవి మదిలో మెదలినట్లు, గురజాడకవియనగానే ముత్యాలసరము గుర్తునకు వచ్చును. గురజాడ ముత్యాలసరమునుగూర్చి ఆచార్య సి నారాయణరెడ్డిగారి అభిప్రాయమిది.

"గురజాడవారు చేసిన అత్యంత సాహసోపేతమైన ప్రయోగములలో ముత్యాలసరమొకటి. పద్యమునుండి గేయమునకు తిరిగిపోవుటయే గొప్పప్రయోగము. అందులో ఒక్క మాత్రానియమముతప్ప, యతిప్రాసల నియమములేని గేయమును చేపట్టుట పైగా వాడుకమాటలు ప్రయోగించుట, ఆగేయము సుఖసుపోకకుగాక ఉదాత్త విషయములను భావమయముగా వ్యక్తీకరించుటకు సాధనము చేయుట, ఒకదానికన్నొకటి అపూర్వప్రయోగములు".

ముత్తెము రూపమున చిన్నది. తేటదనము కలది. తెలుగులిపి ముత్యములవలె సుందరమయినది. తెలుగుపలుకులు ముత్యములవంటివి. కనుక తెలుగుపలుకుబడికి ననువగు ఛందస్సును ముత్యాలసరము పేరుతో పిలుచుట సమంజసము.

ఆధునికగేయములన్నియు ఖండగతి, త్ర్యస్రగతి, చతురస్రగతి, మిశ్రగతి కలిగినవి. నవ్యకవిత్వమున మిశ్రగతిలో నడచి అశేషవ్యాప్తిగాంచిన మాత్రాచ్ఛందస్సు 'ముత్యాలసరము', ఈ ఛందస్సు అప్పారావుగారి స్వతంత్ర సృష్టికాదను వాదము కూడ నున్నది. జానపద గేయములలో ప్రసిద్ధమైన

'గుమ్మదేడే గోపి తల్లీ
గుమ్మదేడే ముద్దుగుమ్మా
గుమ్మదేడే కన్నతల్లీ
గుమ్మదేడమ్మా' అను దానికి

మేలుకొలుపు పాటయగు

మేలుకొను నవనీత చోరక
మేఘ సుందర నీలమేచక

మేలుకోవయ్యా ... ... అను దానికివి

ముత్యాలసరమునకు పోలికలున్నవి. ఇట్లే ముత్యాలసరము నడక వసుచరిత్రాదులలోని

'బాల బాల రసాలమిది శుక

పాలి పాలిటి యమర సాలము

గేలిఁగేలిడి గ్రుచ్చ గదురా

గిల్లు గిల్లుము తత్ప్రవాళము'

అను వృషభగతి రగడను పోలియున్నది.

కన్నడమున గల షట్పదీ ప్రభేదములలో భామినీ షట్పది యొకటి. కన్నడ లాక్షణికుడగు అభినవ కేశిరాజ ఈశ్వరకవి భామినీ షట్పదికి ఈ విధముగా లక్షణము పేర్కొని యున్నాడు.

ఏళెరడు మాత్రెగళు చరణగ

ళోళి యెరడ రొళిర్కె సంతత

వాళె నవలఘుగళను మూఱనెయంగ వెగ్గళిసి

తూళవతి మరియూనెయంగదొ

కేళినువ రమణీయ మోహనె

కేళికవిమతదింద భామిని నామషట్పదవా

— కవిజిహ్వాబంధన 4-30

భామినీషట్పదికి ఆరుపాదములు. ఈ పద్యముయొక్క గణక్రమమిట్లుండును.

7-7 (3-4-3-4) మాత్రలు

7-7 (3-4-3-4)

7-7-7-గురు (3-4-3-4-3-4+ గురు)×2

మూడవపాదముచివరగల 9 మాత్రలను తీసి నాల్గవపాదముగా వ్రాసినచో నదియె ముత్యాలసరమును పోలినదగును.

గుత్తునా ముత్యాలసరములు 3+4+3+4

కూర్చుకొని తేటైన మాటల 3+4+3+4

క్రొత్తపాతల మేలు కలయిక  3 + 4 + 3 + 4
క్రొమ్మెరుంగులు చిమ్మగా  3 + 4 + 3 + 2

అబ్బూరి రామకృష్ణారావుగారు ముత్యాలసరమును గణబద్ధముగా లక్షణము చెప్పుటకు ప్రయత్నించినవారిలో నొకరు. ముత్యాలసరము పాదమునకు నాలుగు గణములు. సూర్యగణము - ఇంద్రగణము - సూర్యగణము-ఇంద్రగణము. ఇంద్ర గణములలో నాలుగుమాత్రలుగల వానినే స్వీకరింపవలయును. అనగా భగణము నల గణములనుట. ఇంద్రగణము గాకపోయినను 'గగ'ను స్వీకరింపవలెను. అట్లే మూడు మాత్రలుగల 'లగ'నుగూడ సూర్యగణముగా గ్రహింపవలెను. పైనియమ మనుసరించి ముత్యాలసరమునకు లక్షణముచెప్పుట వలన గురజాడ గేయములకు సంకుచితత్వమేర్పడును. కనుక శ్రీశ్రీగారు ముత్యాలసరములను మాత్రాచ్ఛందస్సు లలో నొకటిగా భావించి యిట్లువ్రాసిరి.

"ఛందస్సులు మూడు తెగలు. సాగదీయడానికి వీలు లేనివి. కొంతవరకు సాగేవి. బాగా సాగగలవి. అంటే **rigid, semi elastic and elastic metres.** నా ఉద్దేశంలో వృత్తాలు (గణబద్ధ ఛందస్సులు) మొదటి రకానికి, గీతసీసాదులు రెండవ రకానికీ, మాత్రాఛందస్సులు మూడవ తరగతికీ చెందుతవి. గణబద్ధాలు కృత్రిమఛందస్సులనీ, నైసర్గిక గమనం లయవల్లనే నిరూప్య మవుతుందనీ, కావున మాత్రాఛందస్సులు స్వాభావికములైనవనీ నేను విశ్వసిస్తున్నాను"[12]

"ఒకజాతి పార్శీగజలు యొక్క నడక ముత్యాల సరములలో తెచ్చుటకు నే ప్రయత్నించితిని" అని గురజాడవారే వ్రాసికొన్నారు. కాని గురజాడవారు 'పార్శీగజలును' నిరూపింపలేదు డాక్టర్ సి. నారాయణ రెడ్డిగారు ముత్యాలసరము లోని ఛందస్సున కనుకూలముగా నడచు పార్శీగజలును గుర్తింపగలిగిరి.[13]

వా ఇజాకీ 'జల్వాబర్ మ్రహాబొ మెంబర్ మీకునంద్
చూఙు ఖిల్వత్ మీరవంద్ ఆఁ కారెదీగర్ మీకునంద్ — హాఫిజ్

ఈగజలులో కూడ 3 + 4 = 7 మాత్రల గణములు గల మిశ్రగతియే యున్నది ఈవిధముగా ముత్యాల సరము మిశ్రగతిలో నడచు వృషభగతి రగడకు, కన్నడ భామినీ షట్పదికి, జానపద గేయముల వరుసలకు పార్శీగజలునకు సరిపోవుచున్నది. ఇంత మాత్రమున 'ముత్యాలసరము'నకు ప్రత్యేకత లేదని భావించుటకు వీలులేదు.

వృషభగతి రగడలో అంత్యప్రాస నియమమున్నది. యతి ప్రాసల నియమ మున్నది. జానపద గేయములలో ప్రాస నియమమో, యతి నియమమో విధిగా నుండును. గురజాడవారీ లక్షణముల నన్నిటి నతిక్రమించి స్వేచ్ఛ నవలంబిం చిరి. యతిప్రాసలను బుద్ధిపూర్వకముగా పరిత్యజించిరి. పాదములను త్రుంచు టందును, పాదసంఖ్యానియతియందును వాడుకభాషను ప్రయోగించుట యందును నవ్యప్రయోగములు గావించి కృతార్థులైరి అప్పారావుగారు ముత్యాలసరములనన్ని టిని ఏకాకారమున తీర్చలేదు. విసుగు తప్పించుటకై గతిచమత్కారములనెన్నిటినో గురజాడవారు ప్రవర్తించిరి. డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు ముత్యాలసరములందలి గతివిభేదములను 16 విధములుగా వర్గీకరించిరి.[14]

1. నాలుగు పాదములు సమానముగా కూర్చినవి
2. చివరి పాదములో 12 మాత్రలు చివరగురువు
3. చివరి పాదములో 12 మాత్రలు చివర రెండు లఘువులు
4. చివరి పాదములో 9 మాత్రలు
5. చివరి పాదములో 8 మాత్రలు
6. చివరి పాదములో 3 మాత్రలు
7. మొదటి మూడు పాదములలో 13 మాత్రలు
8. మూడవ పాదములో 12 మాత్రలుమాత్రమే
9. 5 చరణములగేయము
10. 2 చరణముల గేయము
11. పాదనియతిలేక స్వేచ్ఛగ సాగిపోవుగేయము
12. పాదమధ్యమున అధికమాత్ర
13. పాదాదిలోనే అధికమాత్ర
14. అధికపాదము (ఎందులోను ఇముడనిది)
15. పాదపూర్తిగాక రెండుఖండములవరకు అల్లుకొనిపోయిన భాగములు
16. మాత్రలు (ఒకటిరెండు) లోపించినవి.

ముత్యాల సరములో అప్పారావుగారు యతి ప్రాసల విషయము అనియమిత మని సూచించినను చాలవరకు ప్రాస నియమమును పాటించిరి. 'లవణరాజు కల'

అను కథాత్మక ఖండకావ్యమున 98 Stanza లలో దాదాపు 58 Stanza లలో ప్రాస నియమము (3 పంక్తులకు మాత్రమే) పాటించిరి. డామన్ పితియస్‌లో మాత్రము 4, 5, Stanza లలో తప్ప అంతట ప్రాసను పాటించిరి. ప్రాసలేని చోట్ల ఒక పాదముయొక్క మొదటి అక్షరమునకు మరొక పాదముయొక్క మొదటి అక్షరమును యతిగా నుపయోగించిరి.

శ్రీలు పొంగిన జీవగడ్డయి }
పాలుగారిన భాగ్యసీమయి } ప్రాస

యతి { ప్రాలినది యీ భరతదేశము
{ భక్తి పాడర తమ్ముడా

ఇట్టి యతి తెలుగు సంప్రదాయము కాదని శ్రీ కోవెల సంపత్కుమారాచార్య గారు తెలిపిరి.[15] కాని గేయములందు నిట్టి మైత్రిని అంగీకరించుట సమంజసమే. గురజాడను పోలిన తమిళ మహాకవి భారతియార్ రచనలందు నిట్టి ప్రయోగములు లెక్కకు మిక్కిలిగా నున్నవి.

తొండు చెయ్యుమడియై - ఉనక్కు
సుదందర నిణైవోడా
వెళ్లై నిఱత్తొరు పూణై - ఎంగళ్
వీట్టిల్ వళరుదు కండీర్
మలరిన్ మేవుం తిరువే - ఉన్మేల్
మైయల్ పొంగినిన్రేన్

—భారతియార్

గురజాడ ముత్యాలసరమును చేబట్టినవారిలో రాయప్రోలు, అబ్బూరి, దువ్వూరి, కృష్ణశాస్త్రి. వేదుల, బసవరాజు, మల్లవరపు, శ్రీశ్రీ, పురిపండా మున్నగువారు ప్రసిద్ధులు. వీరెల్లరు 'ముత్యాలసరము' ఛందస్సున పెక్కు ప్రయోగములను గావించి నూత్న గమనమును సాధించియున్నారు. వానిలో కొన్నింటిని మాత్రము పరిశీలింతము. శ్రీ కొడవటిగంటివారి 'ఆతిథ్యములో'ని ముత్యాలసరము.

'నీరజాప్త నిశాతకిరణో
న్మీలితములై పరిమళించెడు

వారియహములఁ గ్రుమ్మరిలిన తు
షారమియ్యదియే'

గతిప్రధానముగా రచింపబడిన ముత్యాలసరములందు క్రమముగా పద్యలక్షణములు గూడ ప్రవేశించినవనుటకు పైపాదములే తగిన ఉదాహరణములగును. పాదములు విడివిడిగా నుండక ఉభయపాదములలో నొకే పదము వ్యాపించియుండుట పద్య లక్షణమగును.

శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు మిశ్రగతిలో మొదట రెండుమాత్రలు పెంచి (బేసిపాదములందు) మరొక గమనమును సాధించిరి.

పూ జాశిరీషము లేరు కొంటిని
పోయివచ్చెదొ జవ్వనీ
తే జో విలీన దృగంచలమ్ముల
తేటి చూచెదవెవ్వని

— నవీనకావ్యమంజరి - పుట 88

మొదటి చరణమున 'పూ' అను రెండుమాత్రలు, మూడవ చరణములో 'తే' అను రెండుమాత్రలు తీసివేసిన ముత్యాలసరపు పాదమగును. ఈగేయమంతట రెండవ నాల్గవ చరణముల కంత్యప్రాసము పాటించుట ప్రత్యేకతయగును.

గురజాడవారి ముత్యాలసరములను అనుకరించినవారిలో రాయప్రోలువారొకరు. వీరు గురజాడవారివలె యతిప్రాసలను పరిత్యజింపలేదు. యతియో, ప్రాసయతియో విధిగా పాటించిరి. వీరి ముత్యాలసరములందు గేయత్వముకంటె పద్యధర్మ మెక్కువ.

వెండిగొలుసులు లంకెవేసి ప్ర
చండమగు నీ నీలితెరలను
తూర్పువాకిలి తలుపురెక్కల
తొలగ లాగెదరెవ్వరో (ప్రభాతము)

శ్రీబసవరాజు అప్పారావుగారు రెండుపాదముల నడుమ నొక హ్రస్వపాదముంచి దానిని పల్లవిగాచేసి చరణములవలె కొన్ని పాదములను చేర్చి ముత్యాలసరమునందు గేయత్వమున కధిక ప్రాధాన్య మొసంగిరి.

ఒంటి గాను య్యాల లూగితివా
నాముద్దు కృష్ణా
జంటగానను పిల్వదగదోయీ !
జగములన్నీ కాలయోనిలా
మొగము లెరగక నిదురబోవగ
నగుమొగముగల ముద్దుబాలుడ
వగుచు జోలలబాడు కొంటూ

— వటపత్రశాయి - వైతాళికులు - 248

గతివైవిధ్యము అధికముగాగల ముత్యాల సరము లను శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు తమ 'కోకిలమ్మ పెళ్ళిలో' ప్రయోగించినారు.

| | |
|---|---|
| సుళ్ళుతిరిగే కడలినడుమా | 3 + 4 + 3 + 4 |
| చూపుకందీ అందకుండా | 3 + 4 + 3 + 4 |
| తెప్పవేసుకు పాముపడుచులు | 3 + 4 + 3 + 4 |
| తేలిపోతారోయ్ | 3 + 4 + 2 |

ఈ 'కోకిలమ్మ పెళ్ళి'యందే పాదములను పెంచియు, తగ్గించియు వ్రాయబడిన 'ముత్యాలసరములు' గూడకలవు,

'ముత్యాలసరము'లో శ్రీశ్రీ గావించిన ప్రయోగములు కూడ కొన్ని కలవు. 14 మాత్రలుగల పాదమును 7 + 7 గా విరిచి చిన్న చిన్న ఛందస్సులుగా చేయుట ఆ ప్రయోగములలో నొకటి.

| | |
|---|---|
| నేను సైతం | 3 + 4 |
| ప్రపంచాగ్నికి | 3 + 4 |
| సమిధ నొక్కటి ఆహుతిచ్చా(ను) | 3 + 4 + 3 + 4 + (1) |

—శ్రీశ్రీ (అవతారం)

మొదటి పాదమును 14 మాత్రలు కలదిగా నుంచి రెండు మూడు పాదములను ఏడు మాత్రలు కలవిగా చేయుట మరియొక ప్రయోగము.

| | |
|---|---|
| యమున మహిషపు లోహఘంటలు | 3 + 4 + 3+4 |
| మబ్బు చాటున | 3 + 4 |
| ఖణేల్మన్నా (యి) | 3+4 + (1) |

—శ్రీశ్రీ (అవతారం)

ఈ విధముగా ఎవరికి తోచినట్లుగా వారు ముత్యాలసరమును భిన్నముచేసి, చిన్ని చిన్ని పదము లతికించి, అతికించక బహు విధములుగా ప్రయోగములు గావించి యున్నారు.

## తోకముత్యాల సరము :

శ్రీ వెలువలి వీరరాఘవస్వామిగారు 'ముసలమ్మగారి కార్తిగ స్నానమ'ను హాస్య రచనలో 'తోక ముత్యాల సరము'ను ప్రయోగించినట్లు శ్రీశ్రీగారు వ్రాసిరి.16 కాని తోకముత్యాల సరములకు కూడ గురజాడవారే ఆద్యులనవచ్చును. 14 మాత్రలు గల (3 + 4 + 3 + 4) మూడు పాదములతో. 9 మాత్రలుగల 4 వ పాదమును చేర్చి, ఆపై 7 మాత్రలు గల ఐదవ పాదమును జతచేసిన తోకముత్యాలసరమగును.

| | |
|---|---|
| పసిడి కడవల పాలు పెరుగులు | 3+4+3 + 4 |
| పశ్చిరమ్ముల పళ్ళుపువ్వులు | 3 + 4 + 3 + 4 |
| మోములందున మొలక నవ్వులు | 3 + 4 + 3 + 4 |
| చెలగి చెలిక త్తెల్ | 3+4 + 2 |
| వెంటనడచిరి | 3 + 4 |

— కన్యక

ఈపద్ధతిలో తరువాతి కవులు పెక్కుపాటలు రచించిరి. ఉదాహరణమునకు శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి గేయము –

| | |
|---|---|
| కాలి యందెలు ఘల్లు మనుననియొ | 3 + 4+3 + 4 (1) |
| ఓ వలపురాణీ | 3 + 4 + 2 |
| కేలఁగైకొని మెల్లనడచెదవు | 3+4+3+4 (1) |

అభిసారిక - వైతాళికులు - పుట 76

ముత్యాలసరమునకు అప్పారావుగారి తరువాతనే సుస్థితి యేర్పడినది. భావ కవితాయుగమందు గీతపద్యమునకు కలిగినంతటి ప్రాచుర్యము ముత్యాలసరమునకును కలిగినది. అప్పారావుగారు తరువాతి కవుల కందించిపోయిన ప్రక్రియలలో 'ముత్యాలసర' మొకటియని సారాంశము.

## 8. 2. 2. షట్పదీ ప్రయోగములు :

కన్నడ సాహిత్యమునందు షట్పదులకు ప్రచార మెక్కువ. ఆంధ్రలాక్షణికులు షట్పదులను పేర్కొనిరిగాని ప్రాచీన సాహిత్యమునందు షట్పదులు కనిపింపవు. కన్నడలాక్షణికులు శర – కుసుమ – భోగ – భామిని–పరివర్ధిని – వార్ధకషట్పదులను మాత్రము పేర్కొనిరి. కాని ఆధునిక కన్నడ సాహిత్యమున షట్పదుల రచనలందు పెక్కు నూత్న ప్రయోగములు చేయబడినవి. వానిని క్రమముగా పరిశీలింతము. శ్రీ బేంద్రెగారు 'గరి–నన్నహాడు' ఖండికలో ఈ క్రింది షట్పదిని వ్రాసిరి.

| | గణవిన్యాసము |
|---|---|
| నన్నహరణ | 3 3 |
| నినగె శరణ | 3 3 |
| సకల కార్య కారణా | 3 3 3 2 |
| నిన్న మనన | 3 3 |
| దింద తనన | 3 3 |
| మెనుతి దెతను పావనా | 3 3 3 2 |

మూడు మాత్రల గణవిన్యాసముగల పై షట్పదులను 'తలషట్పదులు'గా శ్రీ పట్టేద గారు నిర్ణయించిరి.[17] ఆధునికాంధ్ర సాహిత్యమందును తలషట్పదులు కలవు.

| | |
|---|---|
| బొమికి లరుగ | 3 3 |
| నడుము విరుగ | 3 3 |
| కష్ట పడెడి శ్రామికా | 3 3 3 2 |

—పాటలలో ఛందస్సు – పుట 30

కన్నడ షట్పదియందు ఆరు పాదము లుండగా తెలుగు షట్పదియందు మూడు పాదములే యున్నవి. రెండింటను ఆదిప్రాస లేదు. అంత్యప్రాస కలదు. ఇంతియ భేదము.

శ్రీకువెంపుగారు 'నవిలు' అను కవితా ఖండికలో వినూత్నమగు షట్పది నొకదానిని రచించిరి. ఆ షట్పది స్వరూప మిట్లున్నది.

| | |
|---|---|
| దోణి సాగలి | 3 4 |
| ముందె హోగలి | 3 4 |
| దూర తీరవ సేరలి (లీ) | 3 4 4 లేదా 3+2 |
| బీసు గాళిగె | 3 4 |
| బీఝ తేఝవ | 3 4 |
| తెరయ మేగడెహారలి (లీ) | 3 4 4 లేదా 3 + 2 |

— దోణియహాడు

తెలుగు సాహిత్యమునందును 'జలషట్పదులు' గలవనుటకు శ్రీశ్రీ మహాప్రస్థానములోని యొకగేయము —

నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను

పైన పేర్కొనబడినవిగాక తెలుగులో శరషట్పది కుసుమషట్పది, భోగషట్పది' పరివర్ధిని షట్పది, భామినిషట్పది, వార్ధకషట్పదులు గూడ కలవు.

| | | |
|---|---|---|
| శరషట్పది :- | మరో ప్రపంచం | 4 4 |
| | మరో ప్రపంచం | 4 4 |
| | మరో ప్రపంచం పిలిచింది | 4 4 4 2 |
| | పదండి ముందుకు | 4 4 |
| | పదండి త్రోసుకు | 4 4 |
| | పోదాం పోదాం పైపైకి | 4 4 4 2 |

— మహాప్రస్థానం

కన్నడ సాహిత్యమునందు శరషట్పదులు చాల తక్కువ. కువెంపుగారు వ్రాసిన 'కోగిలె' కవితయందు శరషట్పది కలదు

మావిన తళిరొళు దేవత యందది
నీనడ గేనను హేళతి హే
కోహో కోహో ఎన్నుత కోగువ
కిన్నర కంఠద కోగిలె యే

పై పద్యము నాలుగు పాదములు కలది. కాని గణ విన్యాసమనుసరించి చూడగా నది యచ్చమగు శరషట్పదియే.

| | |
|---|---|
| మావిన తళిరొళు | 4 4 |
| దేవతె యందది | 4 4 |
| నీనడ గేనను హేళతి హే | 4 4 4 2 |

కుసుమ షట్పది :-

| | |
|---|---|
| స్వప్నాలలో నన్ను | 5 5 |
| స్వర్గాల దేలించి | 5 5 |
| ఆనందమున ముంచివేళావురా | 5 5 5 2 |

—పాటలలో ఛందస్సు పుట 32

భోగ షట్పది :-

| | |
|---|---|
| పాలు పెరుగు దొంగి లించి | 3 3 3 3 |
| గోపి కలను పరిహ సించి | 3 3 3 3 |
| తనువు కొనుచు వెళ్ళి తివా నంద నందనా | 3 3 3 3 3 3 2 |

—పాటలలో ఛందస్సు పుట 32

పరివర్ధిని షట్పది :-

ప్రేమకు కారణమేమది చెలియా
హృదయము పొంగున దేలనె సకియా
వినవలె తెలుపుము నీమది విప్పుము ప్రాణసఖీ

—పాటలలో ఛందస్సు – పుట 32

పై పద్యము యొక్క ఛందస్సు -

4 + 4 + 4 + 4
4 + 4 + 4 + 4
4 + 4 + 4 + 4 + 4 + 2

భామినీ షట్పది :—

ఆగు మాగుము తెరువరీ ఆ
యాస ఖేదమ్మపనయింపుము
మాగృహాంగణ కుసుమసముదయ మధులయ్యేవిగో

— కొడవటిగంటి - వైతాళికులు - 22

భామినిషట్పది ఛందస్సు 3 + 4 + 3 + 4
3 + 4 + 3 + 4
3 + 4 + 3 + 4 + 3 + 4 + 2

వార్ధకషట్పది

ఛందస్సు 5 + 5 + 5 + 5
5 + 5 + 5 + 5
5 + 5 + 5 + 5 + 5 + 5 + 2

నీ మురళి మ్రోతలో వలపు పిలుపుందెరా
నీలేత నవ్వులో వెన్నెలలు గురిసెరా
మ్రోయించరా మురళి మోహనాంగాకృష్ణ లోకాలు పులకింపగా

— పాటలలో ఛందస్సు పుట 33

ఆధునిక కన్నడషట్పదులందు ప్రాసనియమము పాటింపబడుటలేదు. పైన చూపబడిన తెలుగుషట్పదులందును చాలవరకు ప్రాసలు లేనివి కలవు. ప్రాచీన ఆంధ్రసాహిత్యమున రగడలున్నవి. షట్పదులులేవు. ప్రాచీనకన్నడ సాహిత్యము నందును రగడలే కలవు. కన్నడమున షట్పదీకావ్యములు వెలువడిన పిదప రగడలకు ప్రచారము తగ్గినది. తెలుగున షట్పదులకు ప్రచారములేకున్నను జానపదగేయము లందు షట్పదీగతులుండుట సత్యము.

## ఆధునిక గేయ చ్ఛందోరీతులు :

ఆధునిక గేయచ్ఛందస్సు మార్గ ఛందస్సుకంటె భిన్నమైనది. సంప్రదాయ సిద్ధములగు త్రికములు దేశిచ్ఛందస్సునకు, విశేషతః ఆధునిక గేయ చ్ఛందస్సునకు సరిపోవు. మాత్రాగణములే ఆధునికగేయ చ్ఛందమునకు తగినవి.

డాక్టర్ కర్కిగారు ఆధునిక గేయచ్ఛందములను ఉత్సాహలయ – మందానిల లయ – లలిత లయ – అధికోత్సాహలయ – భామినిలయ – మందానిల ప్రభేదలయ అని వర్గీకరించిరి.[18]

డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు భావ కవులు రచించిన గేయములను ఖండగతి త్ర్యస్రగతి – చతురస్రగతి – మిశ్రగతులను వర్గీకరణమున పరిశీలించిరి.[19]

పై పరిశోధకుల వర్గీకరణమునందు పెక్కు సామ్యములున్నవి. ఉత్సాహలయ త్ర్యస్రగతికిని, మందానిలలయ చతురస్రగతికిని, లలితలయ ఖండగతికిని, మిగిలిన లయలు మిశ్రగతికిని సరిపోవును. ఇక ఆధునిక గేయములను పరిశీలింతము.

### ఉత్సాహలయ - త్ర్యస్రగతి

ఇది 3, 3 మాత్రల ఆవృత్తిలో నడచు గతిగల ఛందస్సు. కన్నడాంధ్రము లందు త్ర్యస్రగతిగల గేయములు పెక్కు కలవు.

కన్నడము : మహాకాశ శిరద మేలె
అహా పృథ్వి రమ్య ముందె
భాను భూమి అప్పిదల్లి
ఏను రమ్య దూరదల్లి

— మధురచెన్న 'రమ్యసృష్టి'

ఆంధ్రగేయమునకు నొక యుదాహరణము :-

పాడు సిగ్గు పీడ దాయె
ప్రాణి శాదేవాసీ
చూడ చక్కనైనమోము
చూడలేక వెఱగుపడితి

— బసవరాజు అప్పారావు గీతాలు - పాడుసిగ్గు

పైపాటలో రెండవపాదమున త్రిమాత్రాగణవిన్యాసము లేకున్నను పాదమునకు 12 మాత్రలు సరిపోయినవి.

మందానిలలయ - చతురస్రగతి

ఇది 4, 4 మాత్రల గతిలో నడచు ఛందస్సు. ఈ లయలో సాగిన కన్నడాంధ్రగేయములను పరిశీలింతము.

కన్నడము :- బెళ్ళియ హాళ్ళియ మేరెయ మీరి
తింగళి సూరిన సీరను హేరి
మంగళ లోకద అంగళ కేరి
అడలు హాడలు తాహా రాడలు

— బేంద్రె - హక్కి-హారుతిదె

తెలుగు :- మేలిమి బంగరు మెలతల్లారా
కలువల కన్నుల కన్నెల్లారా
తల్లుల గన్నా పిల్లల్లారా
విన్నా రమ్మా యీకథను

గురజాడ - పూర్ణమ్మ

పై పాటలో మొదటి మూడు చరణములు సమమాత్రలు కలిగినవే. 4 వ చరణములో మాత్రము 16 మాత్రలకు బదులుగా 13 మాత్రలే యుండును. 3 మాత్రలు తగ్గుటలో గేయాంతమున విశ్రాంతికి వీలుచిక్కి కథాకథనమునకు బలమేర్పడినది.

లలితలయ - ఖండగతి :

ఇది 5, 5 మాత్రల గతిలో నడచు ఛందస్సు. కన్నడమున గల ఆరు విధములగు లయలలో 'లలితలయ'కు ప్రచార మెక్కువ. ఇట్లే ఆంధ్రమునందును ఖండగతిగల గేయము లెక్కువ. ఇది ద్విపదకు, సీసమునకు సన్నిహితమైన దగుట వలన, మన కవులు తొలుత పద్యములతో తమ కవితా సాధనము ప్రారంభించినందు వలన, ఈ ఖండగతి అనుకొనకుండ వారిని వశపరచుకొన్న దనుట సత్యము.

కన్నడ ఛందో రీతులగు త్రిపది, పిరియక్కర, ఛందోవతంస, వార్ధకషట్పది, లలిత రగళె, చౌపద, సీసములు లలితలయలో సాగు పద్యములగును. డా॥ కరి,

గారు లలిత లయను 'గట్టుల నొరసికొని పోవు ప్రవాహ' ముగా భావించిరి కన్నడ మహాకవులగు మాస్తి, డి. వి. గుండప్ప, పుట్టప్ప, బేంద్రె మొదలగువారు 'లలితలయ' నెక్కువగా నభిమానించిరి. ఇట్లే తెలుగునందును భావకవులు రచించిన గేయము లలో అధిక భాగము ఖండగతిలోనే యున్నవి. ఎంకి పాటలలో నేకొన్నియో తప్ప అన్నియు ఈ గతిలో కలవు. కృష్ణశాస్త్రిగారి గేయములు కూడ అధిక భాగమీ గతిలోనే కలవు.

కన్నడ లలితలయకు నొక యుదాహరణము :-

నిన్న నాడీ నాడు నిమ్మ మక్కళు నావు
ఎమ్మన్ను నీ సడెసు దిగ్విజయకె
భారతాంబుధి యల్లి హెరరు కడెదిహ విషవు
ఇన్నొమ్మె నీ కుడిదు కాపిడయ్య

—దీపగళు - ప్రార్థనె - పుట 4

తెలుగుగేయములలో లలితలయకు నొక యుదాహరణము

అడివోరి చిన్నాడ అమృతధారలహాడ
అభినంద నములివే అందుకో చెలికాడ

— రాయప్రోలు - అడివోరిచిన్నాడు

## అధికోత్సాహలయ :

ఇది 6, 6 మాత్రల ఆవృత్తములతో నడచు ఛందస్సు. దీనిని 'ఉత్సాహ లయ'లో కూడ చేర్పవచ్చును.

కన్నడ అధికోత్సాహ లయగేయము :-

అదొహుల్లిన మెకమల్లిన
హొసపచ్చెయ జమఖానె (నే)
పసరిసుతిదె మైముచ్చిరె
బేరెబణ్ణ వనెకాణె (నే)

— కువెంపు 'హసురు'

తెలుగులోకూడ అధికోత్సాహలయగల గేయపాదములున్నవి.

6 6 6 6
మారువాడి అప్పుకంటె మాయదారి బ్రతుకుకంటె
6 6 6 6
బరువా ఇం తోటిపెద్ద బండరాయి మామయ్యా

కొనకళ్ళ వెంకటరత్నం – బంగారిమామపాటలు

భామినీలయ :

ఇది 7 మాత్రల ఆవృత్తములతో సాగెడి ఛందస్సు. సాధారణముగా 3 + 4 = 7 మాత్రలగణవిన్యాసముతో భామినీలయ నడచును.

కన్నడము :– 3 4 3
చెలువు చెల్లువ తొరెయ కరెగళ
3 4 4
ఎంతు మెరెవితొ – అరళుత

బిట్టహెణ్ణు
– శ్రీకంఠయ్య ఇంగ్లీష్‌గీతగళు

భామినీ లయలో సాగిన మరియొక చక్కని గేయము.

వరుష హోయితు వరుష బందితు
హరుష బారదు బారదు
బయకె ఆసెయె ఒందు ఫలిసదు
ఎదెయ వేదనె తీరదు

— శ్రీ వి. సీ – వరుషహోయితు.

తెలుగులో కూడ భామినీ లయగల పాటలు పెక్కు కనిపించుచున్నవి.

3 4 3 4
1) ఎంత చల్లని కన్నులమ్మా
ఎంత ఎఱ్ఱని పెదవులమ్మా

వంత లనుమర పించు నీదర
హాస చంద్రిక లేవి కాంతీ

— సోమసుందర్ - కాహళి

3 4 3 4

2) పూల మాలిక లల్లి నందుకు
కరకు కతులె కాను కాయెను
తేనె సుధలను చల్లి నందుకు
తేటి పోటుల కాటు లాయెను

— విశ్వసుందరమ్మ - 'కుపితవిధి'

3 4 3 4

3) కూటి కోసం కూలి కోసం
బయలు దేరిన బాట సారికి
మబ్బు పట్టి గాలి కొట్టి
వాన వస్తే వరద వస్తే
చిమ్మ చీకటి క్రమ్ముకొస్తే
దారి తప్పిన బాటసారికి
ఎంత కష్టం ?

— శ్రీశ్రీ - బాటసారి

## మందానిల ప్రభేదలయ :

ఇది 8 మాత్రల ఆవృతములతో సాగెడి ఛందస్సు ఇందు సాధారణముగా 3+5=8 మాత్రల గణక్రమముండును.

కన్నడ మహాకవి శ్రీ బి. ఎం శ్రీకంఠయ్యగారు 'చోళకన్నెయరు' అను కవితను మందానిల ప్రభేదలయలో రచించిరి. ఉదా -

తాళు కంబనియ తుంబు కంబనియ
చోళ కన్నెయర భంగకె

తెలుగులో కూడ మందానిల ప్రభేదలయగల పాటలు కొన్ని కనిపించుచున్నవి

| | |
|---|---|
| చెట్టు కదిలినా పుట్ట వదలదూ | 3 5 3 5 |
| నీరు పోయినా నాచు కదలదూ | 3 5 3 5 |
| గుడిపాడయినా గూబ వదలదూ | 16 మాత్రలు |
| గుడిపోలాలుపూ జారి వదలదూ | 3 5 3 5 |

— అడవి బాపిరాజు - 'గంగిరెద్దు'

పై తులనాత్మక పరిశీలనమువలన కన్నడాంధ్ర గేయములలో ఆరువిధములగు లయలున్నవని నిర్ధారింపవచ్చును. కన్నడాంధ్రగేయములలో ఈ లయలు ఏకాకారమునలేవు. ప్రతిలయయందును విభిన్నములగు ప్రయోగములు కనిపించుచున్నవి. పాదసంఖ్య, మాత్రాధిక్యము. మాత్రాల్పత్వము మొదలగువానితో ఆధునిక కన్నడాంధ్ర కవులు ప్రధానమైన గతిచమత్కారమును, లయవిన్యాసమును ప్రతిభాసంపన్నులు చేసి యున్నారు. కన్నడాంధ్రములందు ఖండగతికి ప్రచారమెక్కువయని ఫలితార్థము.

## 8. 2. 3. రగడలలో క్రొత్తభేదములు :

ఆధునికమయిన అనేక గేయ ఛందస్సులు, జానపద గేయముల వలెనే రగడ యందు అంతర్భవించును. కొలది భేదము లుండుటచే రగడ భేదము లేర్పడినవి. ఆధునిక గేయములు అధికముగా గతి ప్రధానములయినవి. అందువలన త్ర్యస్ర, చతురస్ర, ఖండ మిశ్ర గతుల కనుగుణముగా ఆధునిక గేయములను పరిశీలించితిమి. కాని శ్రీ కోవెల సంపత్కుమారాచార్యగారు లాక్షణిక పరిగృహీతమయిన రగడలనే ప్రాతిపదికలుగా గ్రహించి తదనుగుణముగా ఆధునిక గేయచ్ఛందస్సులను పరిశీలించుట యుక్తమని భావించుచున్నారు.[20] రగడలలో కొలది భేదములచే నేర్పడిన ఈ ఛందస్సులను రగడ భేదములుగా వర్గీకరించుట సమంజసమని ఆచార్యులవారి అభిప్రాయము. ప్రాచీన సాహిత్యమందుగల రగడలకును ఆధునిక గేయ చ్ఛందస్సులందుగల రగడలకును కొన్ని భేదములున్నవి.

పూర్వ సాహిత్యమునందు రగడలు అనియత పాదములుగా నుపయోగింపబడనవి. ఎన్ని పాదము లయినను బేసి సంఖ్యలో గాక సరి సంఖ్యలో నుండును. ఆధునిక రచనలన్నియు పరిసంఖ్యా పాదములతో నుండవనుటకు వీలులేదు. బేసి సంఖ్య పాదములతో గూడ నుండుననుటయే ప్రధానము.

పూర్వసాహిత్యమునందు పాదమునకు నాల్గేసి గణములు ఉపయోగించుట నియతము. ఆధునిక రచనలయందు ఈలక్షణము అనియతము. ఒకటి, రెండు, మూడు, నాల్గుగణములతోగూడ నొక్కొక్కపాదముండవచ్చును. అయినను పాదమునకు నాల్గేసి, రెండేసి గణములుండుటయే అధికముగా కనవచ్చును.

ఆధునిక గేయచ్ఛందస్సులయందు యతిప్రాసలు అనియతములు. అందును ప్రాస మరింత అనియతము. కొన్నిచోట్ల యతిప్రాసలు రెండును పాటింపబడవచ్చును. లేకపోవచ్చును. అట్లే కొన్నింట యతి, కొన్నిట ప్రాసయు, యతిస్థానమున ప్రాసయతియు నుపయోగింపబడవచ్చును.

ప్రాచీనరగడలందు నొక పాదమునకు నాలుగు గణములయినచో రెండు పాదములందును నాలుగుగణములే యుండవలెను. కాని ఆధునిక రగడ భేదములలో అల్పగణపాదములు, అధికగణపాదములు గూడనుండవచ్చును.

ఆధునిక రగడభేదములందు పాదమునకుండవలసిన గణములకన్న మించి ఒకటి లేక రెండుమాత్రలు అధికముగా కన్పించుచున్నవి. లేదా ఒకపాదము పూర్తి యయిన పిదప ఒకగణము మాత్రమే విడిగా తత్పాదపుటూపుతోడనే సాగదీయబడి నట్లు – కూర్పబడుటయు కొన్నిచోట్ల కనిపించును. ఉభయపాదములమధ్య నొక గణము విడిగా నిల్పి పూర్వోత్తర పాదములనడకొక విశ్రాంతి కల్పించుటయు కొన్నిటి యందు కనిపించును

త్ర్యస్ర – చతురస్ర – ఖండ – మిశ్రగతుల నాధారముగా చేసికొని వరుసగా హయప్రచార – మధురగతి – ద్విరదగతి – హరిణగతి రగడలేర్పడినవి. ఈ నాల్గు విధములయిన వానిలో మొదటి రెండింటికన్న తరువాతి రెండింటికే అధికప్రచారము కనిపించుచున్నది. ఇక శ్రీసంపత్కుమారాచార్యులవారి నవ్యరగడవిభేదములను[21] పరిశీలింతము.

## నవ్యరగడ విభేదములు :




వీనిలో కొన్నింటికి మాత్రము ఉదాహరణములను పరిశీలింతము.

## ద్విరదగతి - గణపదరగడ

పాదమునకు నైదుమాత్రలుగల ఒకే గణముండుట.

ఒక పలుకు
నీ పెదవు
లకు వెనుక
దాగినది

– విశ్వేశ్వరరావు - సింగారము
వైతాళికులు - పుట 41

## ద్విరదగతి - అర్ధరగడ :

పాదమునకు నైదుమాత్రలుగల రెండుగణములుండుట.

పాడవే కోకిలా
పాడవే యింపుగా
ప్రాణముల్ హాయిచే
పరవశ మ్మొందగా

– బసవరాజు - కోకిల - వైతాళికులు పుట 48

## ద్విరదగతి - త్రిగణరగడ

పాదమునకు నైదుమాత్రలుగల మూడుగణములుండుట

ఒకవంక - రాణివే - రొకవంక-లసమతన
స్మృతిపథ - మ్మునసిల్వ - ప్రతిమయ-య్యెనురేడు

– డాక్టర్ సి. నారాయణరెడ్డి - కర్పూరవసంతరాయలు - పుట 142

## ద్విరదగతి - పూర్ణరగడ

పాదమునకు నైదుమాత్రలుగల నాలుగుగణములుండుట ఇది లాక్షణికరగడ. కనుక ఉదాహరణ మొసగబడలేదు.

## ద్విరదగతి - అర్ధరగడ - వివృత

పాదమునకు నైదుమాత్రలుగల రెండుగణములుండి ఆపై ఒకటి రెండు అధిక మాత్రలు పాదాది – పాదమధ్య – పాదాంతములయందు కూడ నుండుట. మొత్తము మీద మాత్రలు విస్తరించియుండుట యిందు ప్రధానము.

కడలిన ట్టడుగుపొడ-ము
ము త్తియమ నీదు శాం-తిన్
బడయగను మునుగవలె-నా
వలలెన్నొ పన్నవలె-నా

కవికొండల - ఆశయము వైతాళికులు - పుట 189

## ద్విరదగతి - అర్ధరగడ - లంబిత

పాదమునకు నైదుమాత్రలగణములు రెండుండుట అర్ధరగడ యగును. ఇట్టి రగడలచివర నొక గణము మాత్రము తరువాతి పాదములతో సంబంధము కల్పించు కొనక పాదమును ఆలంబనము చేసికొనియున్నచో నవి లంబిత అర్ధరగడలగును.

జలరాశి – కద్దరినె
మిలమిలా – మెరిసేటి
జలజమ్ము – సౌరభమె
వలచాను

– మల్లవరపు - ఆకాశతార –(కల్యాణకింకిణి)

## ద్విరదగతి అర్ధరగడ సంధిత :

పాదమునకు రెండు ఐదుమాత్రల గణములుండి మధ్య నొకపాదమునందొకే గణమున్నచో ద్విరదగతి అర్ధరగడ సంధిత భేదమగును.

పువ్వటే – నీసొగసు
వేలుపుల
బువ్వటే – నీనవ్వు

– బాపిరాజు - (శశికళ - 16)

## ద్విరదగతి త్రిగణరగడ – వివృత

పాదమునకు మూడు ఐదుమాత్రలగణములుండి చివర నొకటిరెండు మాత్ర లధికముగా నిలచుట.

ఆనాటి నావోడు సెందురూ–డా
అలిగిరా లేదోయి సెందురూ–డా
– నండూరి – ఆనాటి నావోడు వైతాళికులు 109

## ద్విరదగతి – త్రిగణ రగడ – లంబిత :

మనసులో నెలకొన్న భావంబు
అక్షరా కృతిజేయు యత్నంబు
ఫలియించు నోలేదొ తెలియంగ
రాదు
– మదీయము.

పై గేయమునందు 'రాదు' అనుపదము మూడవ పాదముతో నైక్యమొంది యుండుట వలన లంబిత త్రిగణ రగడ యగుచున్నది.

## ద్విరదగతి – త్రిగణ రగడ – సంధిత :

పూల బాసలు తెలుసు – ఎంకికి
తోట
పూల మనసులు తెలుసు – ఎంకికి
– నండూరి – ఎంకి పాటలు

## ద్విరదగతి – అసమ భేదములు :

పంచమాత్రాత్మక గణములు పాదము లందొకచో నెక్కువగా నురొకచో తక్కువగా నుండుటయు, పాదాంతమున నాలుగు మాత్రల వఱకు గల పదములు నిలుపుటయు ద్విరదగతి అసమ భేదములగును.

తొలి చిన్ని చూలాలు
కొల సిగ్గు ప్రేమతో
విభుని చూచినవేళ
విన్నబోయిన వేళ

బిజపు మిన్నులలోన ఒక నీలి తెరమబ్బు
సంజలో తారింది లే
జాలుగా మారింది లే

– శ్రీ విశ్వనాథ – చిన్నిమబ్బులు

ఆధునిక గేయములను చాలవరకు రగడ విభేదములుగా చెప్పవచ్చునని సారాంశము.

## 8. 3 వచనకవిత్వము - దాక్షిణాత్య భాషలలో పరిణామము :

తమిళకన్నడాంధ్రమలయాళ భాషలలో వచనకవిత్వ పరిణామములను గూర్చి పరిశీలించుటకుముందు వచనకవిత్వము యొక్క ప్రాదుర్భవికాసములను గూర్చి తెలిసికొందము.

వచనగేయమును ఫ్రెంచిభాషలో **Verse Libre** అని, ఆంగ్లభాషలో **Free Verse** అని యందురు. ఈ ప్రక్రియకు మొదట ఫ్రెంచిభాషలో జూలిస్‌లాఫోర్గ్ **(Jules Laforgue)** మున్నగువారు పాదులు వేసిరి. ఛందోబద్ధమైన కవిత్వమునకు ఈగేయములేమాత్రమును తీసిపోవని గుర్తించిరి. మలార్మే అను ప్రసిద్ధ ఫ్రెంచి రచయిత సాహిత్యములో వచనమను ప్రత్యేకప్రక్రియలేదని అభిప్రాయపడెను. ఒకటికి మించిన శబ్దములు సంయుక్తమైనప్పుడది పద్యమేయగునని వాదించెను. మలార్మే ప్రభృతులు విషయవైశద్యమున్నప్పుడు వచనమని, నిగూఢభావ నిబంధనమున్నప్పుడు పద్యమని భావించిరి. ఫ్రెంచికవుల ప్రభావమునకు లోనైన ఆంగ్లకవులీప్రక్రియను చేపట్టిరి. ఈ ప్రక్రియ ఆంగ్లభాషలో అర్నాల్డు, వాల్ట్‌విట్‌మన్ వంటి వారి రచనలలో వికాసమొందినది. కాని ఆంగ్లవిమర్శకులు కొందరు షేక్స్పియరు, వెబ్బరు, మిల్టన్‌మున్నగువారి రచనలలో వచనగేయమునకు సన్నిహితమయిన భాగములు కలవని అభిప్రాయపడిరి. అయినను ప్రధానముగా ఫ్రెంచికవుల ప్రభావమువలననే ఆంగ్లములో వచనగేయమునకు రూపురేక లేర్పడినవి ఆంగ్లభాషాప్రభావము వలన

ఈ ప్రక్రియ దాక్షిణాత్య భాషలందును వికాసమొందినదని చెప్పవచ్చును. తమిళమున ఈ ప్రక్రియను వచనకవిదై, పుదుక్కవిదై అనియందురు కన్నడమున దీనిని 'నవ్యకవితె' అని వ్యవహరింతురు. తెలుగులో వచనగేయం, వచనపద్యం, వచన గీతం, వచనకవిత్వమను పేర్లు వాడుకలో నున్నవి. ఇక వివిధ భాషలలో వచనకవిత్వ మునకు చెప్పిన లక్షణములను పరిశీలింతము.

Encyclopaedia Britanica యందు Verse Libre (Free verse) లక్షణమిట్లు చెప్పబడినది.

"In verse libre, the basic metrical unit is the phrase rather than a line of fixed number of syllables as was traditional in French versification since the Middle ages. In verse libre, the lengths of lines may vary according to the sense of the poem, the complete sentence replace the stanza as a unit of meaning and rhyme is optional.

x vol - page 406

'Free verse - It is free only in a relative sense It does not have the steady, recognizable rhythm of traditional poetry Free verse eliminates much of the artificiality and some of the aesthetic distance of poetic expression and substitutes a flexible metre suited to the modern idiom and more causal tonality of the language'.

vol - page 304.

Columbia Encyclopaedia యందు Free verse లక్షణము మరికొంత స్పష్టముగా చెప్పబడినది

Free verse - (Ver te bru) — term loosely used for rhymed or unrhymed verse made free of conventional and traditional limitations and restrictions in regard to metrical structure. Cadence, espeially the cadence of common speech, is often substituted for rhythmical metre

Columbia Encyclopaedia - page 722

పై పరిశీలనమనుసరించి పాదనియమ రాహిత్యము, సంప్రదాయభిన్నము. ప్రయోగవినూత్నము, లయాత్మకము, లయవిరహితము, సహజలక్షణసామీప్యము, నవ్యత్వప్రతిపకమునయినది వచనకవిత్వమని చెప్పవచ్చును.

తమిళవిమర్శకులు 'Free Verse'ను 'వసనకవిదై', 'పుదుక్కవిదై' అని వ్యవహరించిరి. కాని పైపేర్ల కంటె "సొజ్కోలం సిన్దణైమిన్నల్ సొత్చిత్తిరం" అను పేర్లు Free Verse నకు తగునని ఆచార్య ఎమ్. సుందరంగారు పేర్కొనిరి.[22] పైవానికి వరుసగా శాబ్దికవిన్యాసము, తటిదాలోచనాత్మకము, శబ్దచిత్రములనుఅర్థములు చెప్పవచ్చును. కాని యివి యన్నియు వచనకవిత్వ లక్షణములే యగును. తమిళ కవులుగాని తమిళవిమర్శకులుగాని వచనకవిత్వ లక్షణములను గూర్చి వివాదములను పెంచుకొనకుండుట గమనింపదగినది. తమిళదేశములో సాంప్రదాయకవిత్వమున కున్న యాదరము నవ్యకవిత్వమునకు లేదు

కన్నడ విమర్శకులు 'Free verse' ను హొసకవితె, నవ్యకవితె, అనిర్బంధ పద్యరచనె అని వ్యవహరించిరి 'అనిర్బంధ పద్య రచనె' అనునది వచన కవిత్వ లక్షణములలో నొకటి యగును. "అనియత పాదత్వము, లయాత్మక శబ్ద సంయోజనము, వ్యావహారిక భాషాప్రయోగాత్మకము భావప్రాధాన్యమునగు కవిత అనిర్బంధ పద్య రచనె" అగునని డాక్టర్ కర్కిగారు పేర్కొనిరి.

దాక్షిణాత్యభాషలలో వచనకవిత్వమును గూర్చిన చర్చలు తెలుగులో విస్తృతముగా సాగుచున్నవి. వచనకవిత్వ స్వరూప స్వభావములను గూర్చి విమర్శకులమధ్య అభిప్రాయభేదములున్నవి Free Verse నకు పర్యాయముగా తెలుగులో చాలపేర్లు వాడుకలోనున్నవి. శ్రీరంగం శ్రీనివాసరావు, శ్రీకుందుర్తి ఆంజనేయులు వచనగేయం వచనగీతములను పేర్లు వాడిరి శ్రీపఠాభి, శ్రీసంపత్కుమారగారు వచనపద్యమను పేరును ప్రయోగించిరి. శ్రీయుతులు కుందుర్తి ఆంజనేయులు, కె వి. రమణారెడ్డి, కోవెలసుప్రసన్నాచార్యులు 'వచనకవిత' అను పేరును తఱచు వాడుచున్నారు. శ్రీసోమసుందర్ ముక్తచ్ఛందమనియు, శ్రీవరవరరావు స్వచ్ఛందకవిత్వమనియు వ్యవహరించిరి. డాక్టర్ అరిపిరాల విశ్వంగారు తాము తొలుత 'వచనకవిత' అను పేరు పెట్టినట్లు 'వచనకవితా మహోద్యమం' వ్యాసములో విశదీకరించిరి.[24] ఈనాడు 'వచనకవిత' అను పేరునకు స్థిరత్వమేర్పడినట్లు చెప్పవచ్చును. ఇక విమర్శకులు పేర్కొనిన 'వచనకవిత' నియమములను పరిశీలింతము.

శ్రీశ్రీ – "కవిత్వం పరిగెడుతుందన్నాను. ఈ వేగాన్ని సాధించే ఒక ఉపాయం ఛందస్సు. ఛందస్సుసహాయం లేకుండాకూడా ఈవేగాన్ని తీసుకురావచ్చు.

ఉత్తమమైన Prose Poems అన్నిటిలో ఈగుణం కనబడుతుంది. అనుప్రాసలవల్లను' ఒకమాటగాని, కొన్నిమాటలనుగాని పునశ్చరణ చెయ్యడం వల్లను, యమకంవల్లను, వాక్యరూపాన్ని మార్చడంవల్లను వచనగీతంలో ఈగుణాన్ని సాధించవచ్చును".

— నా కవిత్వం - పుట 505.

"వచన గీతానికి ప్రాణప్రదమైన లక్షణం గమన వైవిధ్యం ఇది సంభాషణ లోని యాసలూ, కాకువులూ, ఉచ్చారణ విశేషాల మీద ఆధారపడి వుంటుంది. శైలికి, రీతికి సంబంధించిన సమస్యలెన్నో దీనినుండి బయలుదేరుతాయి"

— నేటి తెనుగు కవిత - క్రొత్తపోకడలు - పుట 478

కుందుర్తి ఆంజనేయులుగారు వచన కవిత్వమును గూర్చి క్రింది అభిప్రాయములను వివిధ వ్యాసములలో ప్రకటించి యున్నారు

> "వచన గేయానికి మొట్టమొదటి లక్షణం నిరాడంబరత".
>
> "వచన గేయానికి ఒక స్థిరత్వం, ఒక స్థిమితత్వం ఏర్పడాలంటే పంక్తి నిర్మాణంలో ఒక తూగు కూడా అవసరం"
>
> "వదిలేసిన ఛందస్సుయొక్క effects మరో రూపంలో సాధించబడుతున్నవి. ఆధునిక వచన గేయాల్లో విరుపూ, విసురూ, ధోరణీ. పలుకుబడి ఇందుకే పుట్టినవి"

డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు వచన గేయమును గూర్చి ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు ప్రయోగములు' అను సిద్ధాంత గ్రంథమునందు ఇట్లు వ్రాసియున్నారు.

"గేయములోని మాత్రానియమముగాని, కనీసము మాత్రాచ్ఛందస్సుల గతిగాని లేక యుండుట వచన గేయమునకు ప్రాథమికమైన గుణము".

"వచన గేయమునకు 'లయ' ముఖ్యము. ఏ నియమములు లేకుండ శుద్ధ వచనమును లయాత్మకముగా మార్చినచో అది వచనగేయమగును "

"వచనగేయములో వైశద్యము ప్రధానగుణముగాదు. పాఠకునిలో భావోద్వేగము కలిగించు 'అంతర్లయ' దీని ప్రధానలక్షణము."25

సునిశిత పరిశీలనాదృష్టితో వచన కవితాస్వరూపమునకు లక్షణములను ప్రతి

పాదించినవారు శ్రీకోవెల సంపత్కుమారాచార్యగారు. శ్రీ ఆచార్యులవారు వచనకవిత కు చెప్పినలక్షణములు ఈ విధముగా నున్నవి.26

భావము నాశ్రయించి పాదములను విభజించుట.
అంత్యప్రాసల నాశ్రయించుట
అనుప్రాసాదుల నుపయోగించుట.
వాక్యము నసంపూర్ణముగా వదలుట.
క్రియాపదములతో పాదములను ప్రారంభించుట.
సమానక్రియాపదములతో పాదపూర్వోత్తరార్ధముల చివళ్ళను గ్రంథించుట.
దీర్ఘతరపాదముల వెనువెంటనే హ్రస్వతర పాదములను గూర్చుట అసమాన పాదముల మధ్యమధ్య సమ హ్రస్వపాదములను సంయోజించుట
ఆపాదాంతమందు క్రియావిశేషణముల నుపయోగించి వాక్యమును సంపూర్ణముగా భాసింప జేయుట.
గణవిభజనాదులకు భిన్నముగా రచనాశక్తి నాధారముగాచేసి లయను సమాకర్షించుట.

వచనపద్యతత్త్వాన్వేషణమునకు పూనుకొన్న డాక్టర్ చేకూరి రామారావుగారు వచనపద్యమునకు లక్షణములుగా చెప్పబడుచున్న నియమములేవియు లక్షణములు కావని అభిప్రాయపడిరి 27 వారి దృష్టిలో వచనపద్యము పద్యముకాదు. గద్యమే యగును. గద్యమునకు నియమములేవియు లేనట్లు వచనపద్యమునకు నియమములు లేవు నియమరాహిత్యమే వచనపద్యలక్షణము.

వచన పద్యము కేవలము వచనము గాదు. కేవలము పద్యముకూడ కాదు వచనములను చిన్న పెద్ద పాదాలుగా వ్రాసినంత మాత్రమున వచన గీతము కానేరదు లేక యే కంద పద్యమునందో గీతపద్యమునందో కొన్ని అక్షరములను, మాత్రలను తొలగించుట వలన వచనపద్యము కానేరదు. కవియొక్క శక్తివలన సామాన్యమైన వాక్సమూహమునందే పూర్వచ్ఛందోరీతికన్న భిన్న పద్ధతులలో ఛందో విచ్ఛిత్తి విశేషము కల్పితమయి చమత్కృతివంతమగు రచనా విశేషముగా రూపొందుచున్నది. ఇదియే వచన పద్యము. ఇక వచన కవిత్వములోని ఛందస్సును గురించి పరిశీలింతము.

వచన కవిత్వము ఛందో విభాగమునకు లొంగిన ప్రక్రియయే అని ప్రాచీన పండితులు కొందరు భావించుచున్నారు. లాక్షణికులు 1 మొదలు 26 అక్షరముల వఱకుగా గల ఛందములను విశదీకరించి యున్నారు. అంతియగాక ప్రస్తార క్రమ మనుసరించి లెక్కలేనన్ని ఛందోరీతులను సృష్టించుకొనవచ్చును. ఇవియగాక సమ విషమ భేదములుగూడ ఛందోగ్రంథములందు చెప్పబడినవి. పాదబద్ధతయను నియమమునకు విస్తృతార్థ మొసంగిన యెడల నేడు వెలువడుచున్న వచనకవిత్వ మంతటిని లక్షణ బద్ధము చేయవచ్చునని వారి అభిప్రాయము.

ఛందో రహితమైన కేవలము వచనములో 'భావలయ' ప్రధానముగా పలికెడి కవిత్వమునకు వచన కవిత్వమని ప్రచారమున్నది. గేయములో సంగీతాత్మకత యెక్కువ. సంగీతమునకు లయ ప్రాణము. ఈ లయ శబ్దముల కూర్పువలన సిద్ధించును. శబ్దముయొక్క కూర్పు, శబ్దము యొక్క భౌతిక నియమమేగాని అంతరంగిక నియమము కాదు అందువలన గేయములో కనిపించు శబ్దలయ వచనకవిత్వములో ప్రధానము కాదు. వచనకవితలో భావతత్త్వమే ముఖ్యము. శబ్దలయ క్వాచిత్కముగా నుండవచ్చును. వచనమువలె భాసించు మాటలలో కవితా స్వభావమైన భావానుభూతిని కల్గించు ప్రయత్నము వచనకవిత్వము. వచనమును స్వరూపముగా కలిగి యందులో కవితాస్వభావమును పట్టియిచ్చు కూర్పే వచన కవిత్వమగును.

వచనకవిత్వములో ఛందస్సు లేకపోలేదు. ఛందస్సనగా కేవలము గణములు, పాదనియమము, యతిప్రాసలు మొదలగు లక్షణములుగల పద్యరాశి కానేరదు. ఛందస్సు నేటికాలమున మిక్కిలి సంకుచితార్థమున వాడబడుచున్నది. ప్రాచీనులు కవిత్వమునకు పర్యాయముగా 'ఛందస్సు' అను పదమును ప్రయోగించిరి. తమ అభిప్రాయములను ఇతరులు అహ్లాదపూర్వకముగా గ్రహించుటకై కొన్ని నియమము లను ప్రాచీనులు ఏర్పరచుకొనిరి. అవియే గణములు, పాదములు మొదలగునవి. కాని వచనకవితలో స్వరూపమునకు సంబంధించిన నియమములుండవు. కవిత్వమునకు ప్రాణభూతమగు అనుభూతి వచనకవిత్వమునకు కూడ సమానమే. ఇప్పట్టున 'కవిత్వమూ-ఛందస్సూ' గుఱించి శ్రీశ్రీ పేర్కొన్నిన అభిప్రాయములు తప్పక పరిశీ లింపదగినవి.

"కవిత్వానికి ఛందస్సుఅనేది వాహనం పూర్వకాలములో రాజులకు రథాలు ఉండేవి. వాటిచక్రాలేవేరు. వాటికి గుర్రాలనుకట్టి ఈడ్పించేవారు. అప్పటి రోడ్లు అటువంటివి. తర్వాత ఈవాహనాలు మారుతూవచ్చాయి ... రాజుల కాలమునాటి రథాలుపోయాయని వాపోయేవారు ఉండవచ్చు ... కాని మనం బస్సులో కూచొని ప్రయాణం చేస్తున్నాము నాకవిత్వముకూడా బస్సుయుగములో వుంది. మనం ఇంకా విమానాలలోను ప్రయాణం చేయవలసి వుంటుంది ... కాబట్టి కాలాను గుణ్యంగా ఛందస్సు మారుతూ వుంటుంది. ఛందస్సు కవిత్వంకాదు. కవిత్వానికి ఛందస్సు వాహనం. వాహనం అనేక రీతులు.

– శ్రీశ్రీ సాహిత్యం – మూడు – వచన విభాగం – పుట 242

వచన కవిత్వమందు కవులు ప్రదర్శించు శైలివిన్యాసము భావానుగుణమగు శబ్దవైచిత్రి, ఉద్రేకానుగుణమగు పాదముల విరుపు మొదలగునవి ఛందస్సుయొక్క అస్తిత్వమును రూఢిచేయుట గమనార్హము.

### వచన కవిత – ప్రాదుర్భావము – తద్వికాసము :

తమిళ సాహిత్యములో వచనకవిత సంగకాలము నుండి కలదని కొందరు పండితులు పేర్కొనుచున్నారు. తొల్కాప్పియకర్త పేర్కొనిన 'ఉరైనడై చెయ్యుళ్' వచనకవితను పోలినదని వారి అభిప్రాయము. కాని డాక్టర్ ఎం. వరద రాజన్‌గారు ప్రాచీన చ్ఛందో మర్యాదలను వదలి, శీర్ (గణము) ఎదుగై మోనై (ప్రాస – యతి)లను పరిత్యజించి నవ్యకవితల వెలువరించినవారే వచన కవు'లని పేర్కొనిరి.[28] పద సంయోజనమునకు ప్రాముఖ్యము, నవ్య కల్పనలకు ఆలవాలము నైనది వచన కవిత. వచనకవుల రచనలు సరళ భాషలో నున్నను అర్థవైశద్యము లేదని డాక్టర్ ఎం. వరదరాజన్‌గారి అభిప్రాయము. నవ్యవచన కవులలో శ్రీ సి. ఎస్. సుబ్బయ్య శ్రీ ఎన్. పిచ్చమూర్తి, శ్రీ వల్లికణ్ణన్ ప్రభృతులు ప్రసిద్ధులు. కాట్టు వాత్తు, వళిత్తుణై, పుదుక్కురల్‌గళ్, కోడైవయల్ మొదలగునవి కవితా ఖండికలగును.

భారతియర్ రచనలందు 'వసన కవిదై' అనుపేర కొన్ని రచనలు కవిపించు చున్నవి. అవి యించుమించు ఆంధ్ర సాహిత్యమందు గల 'శ్రీ వేంకటేశ్వర వచన'

రచనలను పోలినవి. భారతియార్ 'వసనకవిదై'యందు సామాజిక చిత్రణము, నీతి బోధనలు చక్కగా ప్రతిపాదింపబడినవి. ఉదాహరణమునకొకటి.

"ఉడల్ నన్ఱు పులన్గళ్ మిగవుం ఇనియన ఉయిర్ సువైయుడై
యదు మనం తేన్ అఱివు తేన్. ఉదర్వు అముదం.
ఉణర్వే అముదం ఉణర్వేదైవం"

— భారతియార్ కవిదైగళ్ - పుట 233

పైన పేర్కొనబడినవి 'వసనకవిదై' కావని తిరుమతి డి. త్యాగరాజన్‌గారు నిట్లువ్రాసిరి

"Bharathiyar used new forms in poetry but not free verse. Some of his prose writings are mistaken for free verse because they are added in the volume of his poems."29

తమిళభాషయందుగల వచనకవితలకు నొకటి రెండుదాహరణములను పరిశీలింతము. కుష్ఠరోగిని గూర్చిన ఒకవర్ణన —

ఇన్దక్కన్దల్ పైయిలిరుందు
ఉయిర్ప్పదయల్
సిల్లఱైయాగ ఒఱుగికొండిరుక్కిఱదు
వాళ్విన్ వణ్ణమాళిగైయిల్ ఇన్ద
పొట్టువైత్త పూసనిక్కాయ్
దిరుష్టిక్కాయ్ తిరిసంగుసిలై కొండిరున్దదు
— ఇందియవిడుదలైయుంతమిళ్ ఇలక్కియముం - పుట 120

పై వచన కవితకు నా అనువాదము :-

ఈ చిల్లులుపడ్డ సంచి నుండి
ప్రాణ నిధి నిక్షేపం
చిల్లరగా స్రవిస్తున్నది —
జీవన చిత్ర సౌధంలో ఈ
బొట్టిడిన గుమ్మడికాయ
దృష్టి (దిష్టి)గా త్రిశంకునిలా వేలాడుతున్నది

పై పాటలో పద్యముల కుండెడి పాదనియమములేదు భావమెక్కడ పూర్తియగునో యచట పద్యము పూర్తియైనట్లే ఏకభావ ప్రదర్శనకై పై వచనగేయములో

మూడు పాదములు వ్రాయబడినవి. ఇచట యతిప్రాసలు లేకున్నను భావలయ వలన కవిత్వస్ఫూర్తి కలుగుచున్నది. ఇక డాక్టర్ ము. కరుణానిధిగారి వచన కవితను పరిశీలింతము.

కణ్ణై ఇమై కాప్పదు పోల్
ఎన్నై ఎన్నుం కాప్పదర్కు ఐంబాయిల్
ఇరుక్కిన్ఱ తో ళర్‌గళే
ఎణ్ణైయెన ఇరత్తత్తై ప్పెయ్‌దు తన్దు
తణ్ణిలవామ్ తమిళన్నై కాక్కిన్ఱ దీరర్ గళే
పెట్టివా ఎన్ఱురైత్తాల్
కట్టిచయం పీరర్‌గళే
పెట్టిక్కుళ్ ఇరుక్కిన్ఱ పణత్తై
ఏళై ఎడుత్తెడుత్తు ప్పార్తు మగిళ్ వదుపోల్
ఎనై అళైత్తళైత్తు మగిళ్గిన్ఱ నన్బర్ గళే
— కవియరంగిల్ కవిజర్ — పుట 91

పై వచన కవితలో కూడ పాదనియమము లేదు. కాని శబ్దలయకు అధిక ప్రాధాన్య మొసగబడినది. అనుప్రాస లెక్కువగా వాడబడినవి

కన్నడమున వచనకవిత్వమునకు 'నవ్యకవితె' 'అనిర్బంధపద్యరచనె' అను పేర్లు వాడుకలోనున్నవి. కన్నడ వచనకవులలో శ్రీవినాయక, శ్రీగోపాలకృష్ణ అడిగ, శ్రీచిన్నవీరకణవి మొదలగువారు ప్రసిద్ధులు. డాక్టర్ రాళ్ళపల్లి సుందరంగారు కన్నడమున 'దిగంబర సాహిత్యోద్యమును' ప్రచారమునకు కొనితెచ్చిరి.

కన్నడమునవెలువడిన ప్రాచీనవచనకవితలు మాత్రాచ్ఛందముల పూర్తిగా తొలగించుకొనలేదు. ఉదాహరణమునకు —

| | |
|---|---|
| తెరదిదె మనె ఓ బా అతిథి | 4 4 4 గురు |
| హొసబెళకిన హొసగాళియ హొసబాళను తా అతిథి | 6 6 6 |
| ఆవ రూపదొళు బందరు సరియె | 3 5 4 4 |
| బా అతిథి | 4 గురు |

ఆవ వేషదలి నిందరు సరియె 3 5 4 4
నీనతిథి 4 గురు
తెరదిదె మనెఓ బా అతిథి 4 4 4 గురు
హొసతానద హొసగానద రసజీవవ తా అతిథి 6 6 6 6

— కువెంపు (ప్రేమకాశ్మీర)

ఒక సామాన్యమగు లయ తద్భిన్నమగు లయతో సామ్యమొందుట పై కవిత్వములోని ప్రత్యేకత యగును.

పద్యబంధములను పరిత్యజించి ప్రాసవిన్యాసముతో చిత్తాకర్షకమగు లయ నుత్పాదించుట వచనకవితావికాసమున రెండవ ఘట్టమగును. ఉదాహరణమునకు —

హాడిదను గమకి
నాడు నలిదుదు రసద కడలినలి ధుముకి
ఆ అరణ్యాకాశగళ బృహన్మౌనదలి
కత్తలలి కనసాద విస్తీర్ణ ధాత్రియతి
చైత్రరాత్రియలి
మసగి తెరెతెరెయాగుతుబ్బి
హసరి నొరెనొరెయుక్కి హబ్బి
... ... ...
మొళగి బరె కవి కుమార వ్యాసనావేశమణి
రోమాంచనది వికంపిసితు సహ్యాద్రిశేణి

— కువెంపు - హాడిదవను గమకి

పై కవితలో హెచ్చుతగ్గులుగల పాదములున్నవి. అంత్యప్రాసకు ప్రాధాన్య మొసగబడినది. శ్రుతిరమ్యమగు శబ్దలయయున్నది. ఇక అంత్యప్రాసరహితము. భావలయప్రాధాన్యము, వ్యావహారిక భాషాప్రయోగాధిక్యముగల వచనకవితను పరిశీలింతము.

హొగె బెంకి
అయ్యో హోళాగొ —
ఉరి, శఖె, తాప
హొరగె రణరణబిసిలు, ఒళగె మారణబెంకి

మలగిత్తు మన చితెయ మేలె ఆఫీసినలి
భూతగన్నడి చిసిల మచ్చుచుచ్చితు తలెయ
మిదుళు-బచ్చు హండెయల్లి బేయువ ఆమె
ఎద్దెద్దు బిద్దు ఒద్దాడుత్తిత్తు

— గోపాలకృష్ణఅడిగ - చండెమద్దళె

గద్యలయలో శైథిల్యమెక్కువ. భావాభివ్యక్తికి గద్యలయ యెక్కువగా నుపకరింపదు. సహజముగా ప్రేరితమగు లయకవిత్వమున కనుకూలము. స్వరాందోళనము భావస్పందనలకు సహాయకారి. వచనకవిత్వము ఇతర సాహిత్యప్రక్రియలకేమాత్రము తీసిపోదని కన్నడ విమర్శకుల అభిప్రాయము.

తెలుగులో వచనకవిత్వ ప్రాదుర్భావమును గుఱించి శ్రీ నూతలపాటి గంగాధరంగారు చక్కని సమన్వయమును ఇట్లు చేసిరి.30

"నన్నయ పద్యానికి గద్యానికి దాంపత్యం చేకూర్చాడన్నమాట. ఆ దాంపత్య సంతానమే నేటి వచన పద్యం. పద్యాన్నీ గద్యాన్నీ నన్నయ చంపూ కావ్యంలో శారీరకంగా కలిపాడు. నేటి కవి ఈ రెంటిని మానసికంగా ఒకటి చేశాడు తన వచన కవితా రూపంలో"

భావకవులలో వచన గేయములు వ్రాసినవారిలో కవికొండల, రామచంద్ర అప్పారావు, మల్లవరపు, దువ్వూరి పేర్కొనదగినవారు. కవికొండలవారు 'వచన గీతిక అను పేరుతో 'నక్కాస్వామిగాడు' అను కవితను రచించిరి.

నక్కాసామిగాడు
వాడొక మాలవాడు
రాజుగారికమతంలో పాలేరువాడు
... ... ... ...
ఆ కథలో లీనమైపోయినాం
ఆ కబుర్లలో కలసిపోయినాం
ఆకాడే ఉండిపోయినాం
రేయి

— నక్కాసామిగాడు - కృష్ణాపత్రిక 17 జూన్ 1933

పై కవిత శుద్ధ వ్యావహారిక భాషలో సాగినది. ఇందు చమత్కారమైన అంత్య ప్రాసలున్నవి. ఆధునిక గేయములందువలె చరణ విభాగమున్నది. ఇట్లే 1938 లో మల్లవరపువారు ప్రచురించిన 'కళ్యాణ కింకిణి' లోని "స్త్రీ" అను శీర్షికగల కవిత చక్కని వచన గేయమే. కాని దీనిలో కూడ మధ్యమధ్య మాత్రాచ్ఛందోరీతులు తొంగిచూచినవి. దువ్వూరి రామిరెడ్డిగారు 1921–25 ల మధ్యచేసిన రచనల సంపుటి యగు 'నైవేద్యము'లో 'లూఠీ'అను వచన గేయమున్నది. కాని ఈగేయము చతురస్రగతిలో సాగినదని చెప్పుటకు వీలున్నది రామచంద్ర అప్పారావుగారి 'రక్త విహారము' అనుగేయము కొంతదూరము వచనగేయమైసాగి మధ్యలో తేటగీతిగామారి మరల వచనగేయమై కడకు గీతముగా ముగియును.

నే భయంకర కాముకుడ
నా కరాల చితిని
కన్యకలు వెన్నవలె కరగిపోదురు

| అట్టినను నీవు
| మోహపాశాలవలన
| పొర్లుకెరటాలనుబుగు కేశాలవలన
సొగసువలన ఆకర్షించి శాసింతువు
... ... ... ...
రెండు గులాబిపూలవోలె
కాః
ఈచంద్రికారహోనిశీథిలో, రహఃకేళిలో
కలసిపోదము
| తప్తశోణిత స్రోతములైనగాని పూలు
| యుగయుగాలను తావిముంచబోవు

— వైతాళికులు

పైన గీట్లుగల భాగములు తేటగీతిచరణములు. మిగిలిన గేయమంతయు వచనగేయ సదృశమైనదే. ఇట్లే శ్రీశ్రీ 'కవితా–ఓకవితా' అను సుదీర్ఘ గేయము వచనగేయఛాయ జెందినది.

కవితా : ఓ కవితా :
నాయువకాశల నవపేశల సుమగీతావరణంలో
నిను నేనొక సుముహూర్తంలో
అతిసుందర సుస్యందనమందున
దూరంగా విను వీథుల్లో విహరించే
అందని అందానివిగా
భావించిన రోజులలో
నీకై బ్రదుకే ఒకతపమై
వెనుకాడే నిమిషాలందు నిషాలందున
ఎటునే చూచిన చటులాలంకారపు
మటుమాయల నటనలలో
నీ రూపం కనరానందున
నా గుహలో కుటిలో చీకటిలో
ఒక్కడనై బ్రుక్కిన రోజులులేవా

ఇది మాత్రాచ్ఛందో గంధముగల వచనగేయము. ఈ గేయములోని అంతర్లయ సెలయేటి గతిని తలపించుచున్నది. ఇందు అనుప్రాసముల వేగవంతమైన నడక సజాతీయ శబ్దసమ్మేళనములున్నవి. శ్రీశ్రీ వచన గేయములలో చేసిన ప్రయోగ ములకిది చక్కని నిదర్శనము. 'నానాడుల తీగలపై సాగిన నాదబ్రహ్మపు పరి చుంబనలో, విలయా వర్తపు బలవత్ ఝురవత్ పరివర్తనలో" వంటి పాదములలో మాత్రా చ్ఛందో విధానము పెల్లుబికిన ప్రవాహము నొకచో తలపించు చున్నది. వచన కవిత్వ ప్రాదుర్భవకాలమున 'ఛందస్సుల సర్ప పరిష్వంగం వదలినా ఛందస్సు వాసనలు' పోలేదు అనుటకు పై ఉదాహరణములే సాక్ష్యములు.

ఇక వచనకవిత్వముయొక్క వికాసమునుగూర్చి సంక్షిప్తముగా పరిశీలింతము.

అభ్యుదయకవితోద్యమముయొక్క పరిణామక్రమములో 'వచనకవిత' యొక భాగము. భావకవిత్వముమీద సాగిన తిరుగుబాటులో సంతరించిన వినూత్నప్రక్రియ వచనకవిత. శిష్టాప్రయోగములు ఈ ఉద్యమపు ప్రారంభసంకేతములు. శ్రీశ్రీ, నారాయణబాబు, రుక్మిణీనాథశాస్త్రి, పఠాభి మొదలగువారు ఈ ఉద్యమనాయకులు. 1950 పిదప వచనపద్యము వికాసమొందినదని చెప్పవచ్చును. అబ్బూరి ఛాయాదేవి

సంపాదకత్వమున వెలువడిన 'కవిత' అను సంకలనములే అందులకు సాక్ష్యములు. శ్రీశ్రీ, ఆరుద్ర, అజంతా బైరాగులు, కుందుర్తి, కవిరాజమూర్తి, వరద, తిలక్ మొదలగు కవులు ఈ పత్రికలో పెక్కురచనలు చేసినవారే. వచనకవిత్వమే ఆధునిక కవితావాహికగా రూపొందునను విశ్వాసముతో రచనలు సాగించువారు మాదిరాజు రంగారావు, గోపాలచక్రవర్తి, రంగారావు రచనలలో ప్రతీకలకు ప్రాముఖ్యమెక్కువ. ఆరుద్రరచనలలో ఆంగ్లభాషా గ్రంథబంధురతకు ప్రాధాన్య మొసగబడినది. కాని కుందుర్తిరచనలలో ఈరెండును లేవనవచ్చును. వచనగేయములలో కూడ ఆలోచనలకు, అనుభూతులకు విందుకలిగించు సమగ్రకావ్యము రచింపవచ్చునని నిరూపించిన కవి కుందుర్తి.

1960 పిదప వెలువడిన వచనకవితలను రెండువిధములుగా వర్గీకరింపవచ్చును. మొదటిది అంతశ్చైతన్యమును, అద్దానికిసంబంధించిన సంఘర్షణలను వ్యక్తపరచునవి. ఈవర్గపు కవులలో రంగారావు, వేగుంట మోహన్‌ప్రసాద్, అరిపిరాల విశ్వం, రాధాకృష్ణ, దుర్గానంద్ ప్రభృతులు ప్రసిద్ధులు లౌకికమైన సుఖదుఃఖములను వెల్లడించు వచనకవితలు రెండవవర్గమున చేరినవి. బహూదా చర్చితమైన దిగంబరకవుల రచనలుగూడ వచన కవితలే. వచన కవిత్వము ఖండకావ్య రచనలకేగాక కథానిర్మాణ యోగ్యమైన కావ్యరూపములుగా పరిణతి చెందవలయునను ప్రయత్నములు గూడ సాగుచున్నవి. శ్రీశ్రీలా వీరరాజు కొన్ని కథలను వచన కవితగా కూడ రూపొందించిరి. పద్మశ్రీ బోయి భీమన్న పద్మశ్రీ నారాయణ రెడ్డివంటివారు కూడ వచన పద్యములకు వన్నె చిన్నెలను చేకూర్చుచున్నారు. వచనమే రూపమగుటతో వచనత్వమును నివారించుటకై కవులు వాక్యనిర్మాణములో మార్పులు – ఆద్యంతప్రాసలు, క్రొత్తయమకములు, కాకువులకు ప్రాధాన్య మొసగుచున్నారు

వచన కవిత ప్రాచీన కవితకేమాత్రమును తీసిపోదు. వచన కవితకు పాద నియమము లేకపోలేదు. భావమనుసరించి పాదముల కూర్చుట వచన కవిత్వ లక్షణమే. ఉదాహరణమునకు —

తెలుగు పలుకు సౌందర్యం తెలియనివారున్నారు
గట్టి సమాసాలు వినా గిట్టని వారున్నారు
రసచర్చల రంపపు పండ్లతో
గురజాడను కోసి కోసి

మట్టితో చేసిన మాంసపు ముద్ద
ఆత్మ కనిపించడం లేదన్నారు
హృదయపాత్ర లేకుండా
కవితా తటాకంలో దిగి
మంచినీరు ముంచుకోలేక
మరలారు వట్టి చేతుల యింటికి

— కుందుర్తి కృతులు - నాలోని నాదాలు పుట 468

ఇందులో కవి తానుచెప్పదలచుకొన్న భావమును ఒక్కొక్క Stanza లో కూర్చుటను పరిశీలింపవచ్చును.

"వచనగీతాలు రాస్తున్న ఈ కవులలో గణయతిప్రాసలు వెతకడం వ్యర్థ ప్రయత్నమే అవుతుంది. వీరిలో ఆవేశంఉందా అని చూడండి – నిజాయితీ ఉందా అని చూడండి ... ఏకాలంలోనైనా, ఏదేశంలోనైనా అందరూ కవుల్లోగుర్తించే లక్షణాలవి. ఒకప్పుడివి ఛందోరూపంలో సాక్షాత్కరించాయి. ఈనాడు కవిత్వంలో ఇవిస్వేచ్ఛారూపాల్లో కనిపిస్తున్నాయి" అని శ్రీశ్రీగారు పేర్కొనిరి.

కవిత్వమునకు శోభనాపాదించునవి అలంకారములు. మీదు మిక్కిలి శబ్దాలంకారములు పఠితల నెక్కువగా ఆకర్షించును ప్రాచీనకవియైనను అలంకారముల నాశ్రయించుట దోషముగాదు భూషణమే. తమిళ కన్నడవచనకవిత లందువలె తెలుగు నందును శబ్దవైచిత్రికి ప్రాధాన్యమొసగిన వచనకవితలు పెక్కుకలవు ఉదాహరణమునకు

"మహారాజ రాజపరమేశ్వర రాజమార్తాండవగైరా

మహారాజులంగారికి
ఖుషీచెయ్యటం కోసం
మంచినీళ్ళు మధువుగా మారుస్తాడు
వదరుకప్పల్ని వందిమాగధులుగా
బొద్దింకల్ని పోలీసువాళ్ళుగా
మారుస్తాడు
వంగిసలాం చేసి
వేళ్ళచివళ్ళ మల్లెపూలు పూయిస్తాడు"

— వి. ఆర్. వేలూరి - భారతి-అక్టోబర్ - 72

అనుప్రాసాదుల 'హడావిడులు' లేకను తమిళకన్నడకవులు వచనకవితలను రచించ టను ముందే గుర్తించితిమి. ఇట్టివి తెలుగు భాషలోను కలవు. శ్రీశ్రీ ఆకాశదీపంలో -

"గదిలో ఎవరూ లేరు
గదినిండా నిశ్శబ్దం
సాయంత్రం ఆరున్నర
గదిలోపల చినుకులవలె చీకట్లు"

సంద్రంలో తడిసిన నీలిమేఘాల మేలిమ సుగుల్ని
ఉరుములు పిండుతుంటే - వర్షం వస్తోంది
రా ! చినుకుల గొడుగుల్లో దాక్కుందాం
చిరునామాలేని వీలునామాలాంటి నాజీవితంలో
ఓదయామయీ
ఎన్నిసార్లు నా అశాంతి అగ్నిగుండాన్ని నీనగ్నశరీరంపై పేల్చివేశాను

— శ్రీ వై. శ్రీరాములు-సౌందర్యం-భారతి-ఫిబ్రవరి'77

పై తులనాత్మక పరిశీలనవలన వచనకవిత్వమునకు ఛందస్సు లేదనుట సరి గాదని గ్రహించితిమి. పాదములు భావానుగుణముగా సాగుననియు, అనుప్రాసరహిత ముగా వచనకవితలు వ్రాయనగుననియు తెలిసికొంటిమి. మాత్రాచ్ఛందోవాసనలుగల కవితలు, అనుప్రాసాత్మక కవితలు భావరమ్యతకుమాత్రము ప్రాధాన్యమొసగిన కవితలు తమిళ కన్నడాంధ్రభాషలందు సమానముగాకలవని చెప్పవచ్చును. మలయాళ వచనకవులలో శ్రీ కె. కె రాజా లలితాంబికా అంతర్జనం, మేరీజాన్ తొట్టం, ఎన్. గోపాలపిళ్ళ, శంకరకురుప్ మొదలగువారు ప్రసిద్ధులు. తమిళ కన్నడాంధ్రమల యాళ భాషలందు వచనకవిత్వమేకాకృతి నున్నదని ఫలితార్థము.

ఈ ప్రకరణమునందు తమిళకన్నడాంధ్ర మలయాళభాషలలో మహాకవులు ప్రాచీనకాలమునుండి ఛందస్సునకు సంబంధించి గావించిన నవ్యప్రయోగములను పరిశీలించితిమి. కన్నడభాషలో సీసము, షట్పది, రగళెఛందస్సులలో మాత్రము పెక్కు నూత్నప్రయోగములు కనిపించుచున్నవి. తెలుగులో గీతము, కందము, ద్విపదలందు గణసంఖ్య, పాదనియతులందు నవ్యప్రయోగములు చేయబడినవి. ఇందే జానపదచ్ఛందోరీతులకు తమిళ కన్నడాంధ్రమలయాళకవులు కావ్యగౌరవము కలిగించు

టను పరిశీలించితిమి. దాక్షిణాత్య భాషలందు వచనకవితా ప్రాదుర్భావము. తద్వికాస ములను పరిశీలించితిమి

ఛందఃపరిణామము చాల చిత్రమయినది గణబద్ధ ఛందస్సులనుండి మాత్రా చ్ఛందస్సులును, అందుండి స్వేచ్ఛావచనరీతులు వెలువడుటకు గల కారణములను విద్వాన్ విశ్వంగారు చాల చక్కగా నిట్లు సమన్వయము చేసిరి

"పదిమంది కలసి పనిచేసుకొంటూ పాడుకొనే రోజుల్లో వచ్చిన ఛందస్సులు వేరు. పదిమంది వింటుండగా ఒకరు చదివి వినిపించే రోజులలో వృత్తాల ప్రాబల్యం హెచ్చింది. మరి ఇవిరెండూకాక జీవితం మరీవైయక్తికంగా మారి ఎవరిగదిలో వారు కూర్చొని తమలో తాము చదువుకొనే రోజులలో వచనపద్యాలు, పద్యవచనాలు రూపొందసాగాయి."

— శ్రీశ్రీ సాహిత్యం : 3 వచనవిభాగం పుట 211

## సంఖ్యాసూచి

1. ఆధునికాంధ్రకవిత్వము - సంప్రదాయములు ప్రయోగములు - పుట 121
2 కన్నడఛందోవికాస పుట 261
3. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు పుట 499
4. కన్నడఛందోవికాస - పుట 204
5. ,, పుట 265
6. ,, పుట 260
7. కన్నడఛందోవికాస ప్రయోగయుగగళు 226, 240
8. ఆంధ్రసాహిత్యములో దేశికవిత్వోద్యమము - పుట 1
9 Malayalam and Tamil Metres. A comparative study
10. ,, ,, ,,
11. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు పుట 224
12. శ్రీశ్రీ సాహిత్యం 2 - 432
13. ఆధునికాంధ్రకవిత్వము - సంప్రదాయములు ప్రయోగములు - పుట 227
14. ,, ,, 228, 230
15. తెలుగు ఛందోవికాసము - పుట 289
16. శ్రీశ్రీ సాహిత్యం - 2 - 442
17. దశషట్పదిగళ - పంచ తిపుడెగళు - శరణసాహిత్య - 1944
18. కన్నడ ఛందోవికాస - పుట 290
19. ఆధునికాంధ్రకవిత్వము. సంప్రదాయములు ప్రయోగములు-పుట 503, 507
20. తెలుగు ఛందోవికాసము - పుట 293
21. ,, పుట 297
22. ఇంబియ విడుదలైయుం - తమిళ్ ఇలక్క్యియముం - పుట 120
23. కన్నడ ఛందోవికాస - పుట 215 - 216
24. పీఠిక - మార్చి 1977
25. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు ప్రయోగములు పుట 651
26. తెలుగు ఛందోవికాసము - పుట 311
27. వచనపద్యం-అభాస లక్షణ నిరాకరణం ఆంధ్రపత్రిక పరీధావి- 72-73
28. తమిళ్ ఇలక్క్యియ వ అలారు - పుట 346
29. **Trends in Modern poetry - A glimpse of Tami lology. The Academy of Tamil Scholars of Tamilnadu - page 81**
30. చీకటినుంచి - నివేదన - భారతి జూన్ 75

## ఉపకరించిన రచనలు :

### తెలుగు


అప్పారావు, పి. ఎస్ ఆర్ : నాట్యశాస్త్రము (అను)నాట్యమాలా ప్రచురణలు హైదరాబాదు - 1960.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి : దక్షిణ భారత సాహిత్యములు, హైదరాబాదు (1962)

ఆరుద్ర : సమగ్ర ఆంధ్ర సాహిత్యం, 1-12 సంపుటములు - యం. శేషాచలం అండ్ కంపెనీ - మద్రాసు.

ఈశ్వర చరణ్ ముదిగొండ : 'వడి-శబ్దార్థవిచారము' - భారతి జూన్ 1972

ఉమాకాంత విద్యాశేఖరులు, అక్కిరాజు : నేటి కాలపు కవిత్వము.

కమలాదేవి బుర్రా : ఛందోహంసి, విశాఖపట్నం, 1962

కాంతారావు, టి. ఎల్. 'వచన కవిత - వర్తమానతరం' ఆంధ్ర పత్రిక' విరోధి కృన్నామ సంవత్సరము - 1971-72

కామేశ్వరరావు, టి : 'మొదటి గేయ శాసనం, అక్టోబరు - నవంబరు, పరిశోధన 1954.

కుందుర్తి సన్మాన సంఘము : కుందుర్తి కృతులు, గుంటూరు 1975

కృష్ణమాచార్యులు వంగీపురం : 'ఆంధ్ర తమిళ ఛందస్సామ్యములు' **Vavilla Venkateswara Sastrulu Comme moration Volume, 1941, పుట 365-371.**

కృష్ణమూర్తి, గొట్టిముక్కల : కన్నడాంధ్రములు, భారతి, మార్చి 1956

కోదండరామయ్య, టి. ఆంధ్ర సాహిత్యములో దేశి కవితోద్యమము- పాల్కురికి సోమనాథుని పాత్ర - సిద్ధాంత వ్యాసము - అముద్రితము - శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము- 1968.

కోదండరామయ్య టి. 'ఇరుగుపొరుగు సాహిత్యప్రక్రియలు' ఆంధ్రప్రభ - దినపత్రిక-ఆదివారం అనుబంధం అక్టోబరు 10, 25 సెప్టెంబరు 13, 1970

గంగప్ప ఎస్ : 'హరికథ', తెలుగువాణి, ప్రపంచతెలుగు మహాసభల ప్రత్యేక సంచిక 1975

గంగాధరం, నూతలపాటి : 'వచన కవిత - ఒక స్టేట్‌మెంట్' భారతి మే 1975

గంగాధరం, నూతులపాటి : వచనపద్యపంచకం. భారతి, జూన్ 1975
గోపాలకృష్ణమూర్తి శ్రీపాద : కవిత్వానికి అలంకారమూ - ఛందస్సు
ఉండితీరాలా - భారతి, జూన్ 1964
గోపాలకృష్ణయ్య, వడ్లమూడి : జానుతెనుగు, కళాకృష్ణులు & ప్రొజెని, హైదరాబాదు 1972
గోపాలకృష్ణయ్య, వడ్లమూడి : మార్గ-దేశి, కళాకృష్ణులు & ప్రొజెని, హైదరాబాదు 1974
జోగయ్యశర్మ, కొమ్మనమంచి : తెలుగుఛందము - దేశిరచన
భారతి - నందనవత్సరము - ఫాల్గుణసంచిక
జోగారావు. యస్వీ : ఆంధ్రయక్షగాన వాఙ్మయచరిత్ర, ఆంధ్రవిశ్వకళా పరిషత్ప్రకాశితము - 1961
తమ్మయ్య, బంతాకు : "మార్గదేశికవితలు", ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - సం 40 - ఖరనామసంవత్సరము
తెలుగుభాషాసమితి : విజ్ఞానసర్వస్వము 3, 4 తెలుగుసంస్కృతి విజ్ఞాన సర్వస్వము 6 - విశ్వసాహితి
తెలుగు విభాగము, స్నాతకోత్తర విద్యాకేంద్రము : విమర్శిని సంపాదకులు డా॥ కె. వి. రామకోటిశాస్త్రి, వరంగల్లు 1976
దిగంబర కవులు 1, 2, సంపుటములు, సెంట్రల్ పాయింటు 510, ట్రూప్ బజారు, హైదరాబాదు 1966.
దీక్షితులు కె. వి. ఎస్ : 'యతి ప్రాసములు', భారతి, ఆషాఢ 1931
దొణప్ప, తూమాటి : జానపద కళా సంపద (ప్రథమ సంపుటము)
నిర్మలా పబ్లికేషన్స్, విశాఖపట్నం - 3 - 1975
దొణప్ప తూమాటి - 'తెలుగు హరికథా సర్వస్వం, నాగార్జున విశ్వవిద్యాలయము, గుంటూరు (1978)
దొరసామిశర్మ, రావూరి : 'అప్పకవీయ భావ ప్రకాశిక, త్రివేణి పబ్లిషర్స్ 1967.
దొరసామిశర్మ, రావూరి : 'ఛందోదర్పణ సమీక్ష' సాహిత్య పరిషత్పత్రిక 32 - 37.

దొరసామిశర్మ, రావూరి : 'పాల్కురికివాని ప్రాసత్వం' పరిశోధన 9-10
దొరసామిశర్మ, రావూరి : 'తరువోజ - అర్ధబిందు ప్రాస' ఆంధ్రప్రభ 2-7-50.
దొరసామిశర్మ, రావూరి : తెలుగు భాషలో ఛందోరీతులు మదరాసు 1962.
దొరసామిశర్మ, రావూరి : 'దండక వాఙ్మయము', ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక 1957-58.
దొరసామిశర్మ, రావూరి 'నన్నయవళి ప్రాసములు' ఆంధ్రపత్రిక, ఉగాది సంచిక 1955-56
దొరసామిశర్మ, రావూరి : విశ్వనాథవారి ప్రయోగవక్షత భారతి, జనవరి 1962.
నాగయ్య, జి : దాక్షిణాత్య సాహిత్య సమీక్ష (మొదటి సంపుటము) నవ్యపరిశోధక ప్రచురణలు, తిరుపతి 1976
నాగయ్య జి : ద్విపదవాఙ్మయము-ప్రకాశకులు : గ్రంథకర్త, తిరుపతి, 1967
నాగరాజు, బండి : 'వచనపద్యం - ఒకపరిశీలన' భారతి, నవంబరు'73
నాగరాజు, బండి : 'వళి' - భారతి - అక్టోబరు 72
నాగరాజు, బండి : 'సామెతలు - ఛందస్సామ్యములు' - భారతి, మార్చి'66
నాగలింగ శివయోగి : 'సివాళిపాట', భారతి, డిసంబరు 1963
నారాయణరావు చిలుకూరి - 'నన్నయయతులు', భారతి, జూన్ 1927
నారాయణరావు చిలుకూరి - 'మాత్రాచ్ఛందస్సులు', వ్యాససంగ్రహము. గిడుగు వెంకటరామమూర్తిపంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవసంచిక - సం॥ తెలికిచర్ల వెంకటరత్నం 1933
నారాయణరెడ్డి. సి : ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు, ప్రకాశకులు, గ్రంథకర్త, హైదరాబాదు 1967
పద్మనాభశర్మ, ఉమాపతి : 'పాఁదులుఁగు-యతి' భారతి, ఆగష్టు 1967
ప్రభాకరశాస్త్రి, వేటూరి : తెలుఁగుమెఱుఁగులు, ఆంధ్రగ్రంథమాల మదరాసు, 1948
ప్రభాకరశాస్త్రి, వేటూరి : 'నన్నయకుఁబూర్వపుఛందస్సు', రాజరాజనరేంద్ర పటాభిషేకసంచిక

పాండురంగాచార్య వైద్య : కన్నడసాహిత్యదర్శనము (అను) కప్పగంతుల లక్ష్మణశాస్త్రి – ఆంధ్రప్రదేశ్ కన్నడ సాహిత్యపరిషత్, లింగంపల్లి హైదరాబాదు 1965
మాధవశర్మ పాటిబండ : ఆంధ్రమహాభారతము – ఛందఃశిల్పము అభినవ భారతీ ప్రచురణము, డిసంబరు 1966.
రమణారెడ్డి కె. వి : 'తెలుగులో వచన కవిత్వం' – భారతి–జూన్ 67.
రాఘవాచార్య కె. వి : 'కవిత్వము – ఛందము' భారతి–ఫిబ్ర 1964
రాజగోపాలనాయడు, పి : పాటలలో ఛందస్సు – భారత ప్రచురణలు గిరింపేట – చిత్తూరు 1971
రాజగోపాలరావు, దేవుమళ్ళ : ఛందశ్శాస్త్రము, ప్రకాశకులు : రచయిత, 1902
రాజగోపాలరావు, టి : 'ఛందశ్శాస్త్రమున నేను కనిపెట్టిన నూతన విషయములు', ఆంధ్రపత్రిక, ఉగాది సంచిక 1911
రాజగోపాలరావు, టి : 'ప్రాచీనాంధ్ర కవిత్వ లక్షణము', భారతి, ఆషాఢ మాసము 1925.
రాజగోపాలరావు, టి : 'సీసపద్యములు, వానివలన తెలియనగు ఛందోవిషయములు' శారద, రక్తాక్షి, ఆశ్వీజము – 1924
రాజగోపాలరావు, వి : 'మన పద్యముల వర్గీకరణము – ముత్యాల సరములకు మూలము' – భారతి, మార్చి 1967.
రామకృష్ణ, మిరియాల : 'గేయకవితా ప్రస్థానం' మహతి యువభారతి ప్రచురణ 1972
రామకృష్ణయ్య, కోరాడ : దక్షిణదేశ భాషా సారస్వతములు – దేశి కోరాడ ప్రచురణాలయము. మద్రాసు, 1954
రామకృష్ణశాస్త్రి, శిష్టా : ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము, మదరాసు విశ్వవిద్యాలయము 1957
రామయ్య పంతులు, జయంతి : ఆధునికాంధ్ర వాఙ్మయ వికాస వైఖరి, ముక్తేశ్వరం, 1937.
రామరాజు, బిరుదు : తెలుగు జానపదగేయ సాహిత్యము. ఆంధ్ర రచయితల

సంఘము, హైదరాబాదు 1958
రామారావు, చేకూరి : 'పద్యం, గద్యం, వచనపద్యం వగైరా' భారతి, జూలై 1975
రామారావు, చేకూరి : 'వచనపద్యం – ఆభాసలక్షణ 'నిరాకరణం' ఆంధ్రపత్రిక – పరీధావి, 72–73
రామారావు, ఎస్. వి : తెలుగులో సాహిత్యవిమర్శ – అవతరణ వికాసములు. పసిడి ప్రచురణలు. హైదరాబాదు
లక్ష్మీకాంతము పింగళి : సాహిత్యశిల్పసమీక్ష – బాలాజీపబ్లిషర్స్, తిరుపతి, 1966
విశ్వం ఆరిపిరాల : "వచనకవితామహోద్యమం" పీఠిక 1–3 మార్చి, 197'
వీరభద్రరావు కొత్తపల్లి : తెలుగుపై ఇంగ్లీషు ప్రభావము ఢిల్లీ – 1960
వెంకటకృష్ణారెడ్డి దేవరపల్లి : 'తెలుగుకవిత్వం ఎప్పటిది?' భారతి, జనవరి 1962
వెంకటకృష్ణారెడ్డి దేవరపల్లి : నన్నిచోడకవిచరిత్ర, రచయిత. ఉలవపాడు – 1951
వెంకటరావు నిడదవోలు : ఆంధ్రకర్ణాటసారస్వతములు 1960
వెంకటసీతాపతి గిడుగు : తెలుగులో ఛందోరీతులు – విశాలాపబ్లికేషన్స్ - హైదరాబాదు 1961
వెంకటావధాని దివాకర్ల : ఆంధ్రవాఙ్మయారంభదశ, 1960
వెంకటరావు నిడదవోలు : ఉదాహరణ వాఙ్మయచరిత్ర 1950
వెంకటరావు నిడదవోలు : తెలుగుకవులచరిత్ర 1956
వెంకటేశ్వరశాస్త్రి, జొన్నలగడ్డ – మలయాళ భాషాసాహిత్యాలు ఆంధ్ర సారస్వత పరిషత్తు. హైదరాబాదు 1968
శివకుమార్ : 'వచన కవిత్వం – ఒక పరిశీలన' – భారతి జూలై 1971
శ్రీనివాసులు సెట్టి, కె : 'పదకవిత' భారతి – మార్చి 1975.
సంగమేశం, ముట్నూరి : 'తెలుగులో యతి ప్రాసములు' సాహిత్య సమితి వ్యాసావళి – 2, తిరుపతి.
సంపత్కుమారాచార్య, కోవెల : తెలుగు కన్నడ ఛందోరీతులు – ఏకత్వము

లోని భిన్నత్వములు' భారతి, జనవరి '75.
సంపత్కుమారాచార్య కోవెల : తెలుగు ఛందోవికాసము, కులపతి సమితి, వరంగల్లు 1962
సంపత్కుమారాచార్య, కోవెల : 'ద్విపద గణములు' భారతి, జూన్ '67
సాహిత్య అకాడమి – సమకాలిక భారతీయ సాహిత్యాలు 1965
సీతారామయ్య, కుడుగంటి - నవ్యాంధ్ర సాహితీవీధులు 1942
సుందరం, రాళ్ళపల్లి – తెలుగు కన్నడ జానపద గేయాలు – అముద్రిత సిద్ధాంత వ్యాసము – మైసూరు విశ్వవిద్యాలయము.
సుందరం, రాళ్ళపల్లి – తెలుగు సాహిత్యములో దేశికవిత, మానస సరోవర ప్రచురణలు, మదరాసు – మె 1970.
సుప్రసన్న : 'వచన కవిత్వం' – మహతి యువభారతి 1972
సులోచన : 'పాత తెలుగు పద్యాలలో యతినియతిలేదా' భారతి జూన్ 67
సూర్య ప్రకాశరావు బెల్లంకొండ : 'ఉదాహరణ వాఙ్మయము – వినూత్న విషయములు' భారతి, మార్చి 1972.
సూర్యనారాయణమూర్తి తటపర్తి ఛందశ్శాస్త్రము భారతి, మార్చి '57

త మి ళ ము

అమితసాగర : యాప్పరుంగలం : కళగం ప్రచురణ, 1973
అమితసాగర : యాప్పరుంగలక్కారికై, కళగం ప్రచురణ, 1967
అరంగసామి డి : 'అదికారముం – అడిగముం' A O R, Madras Vol 17 - Part I - 1961
అరుణాచలం ము : తమిళ్ ఇలక్కియ వరలారు, గాంధీవిద్యాలయ మాయవరం – తమిళనాడు
కవియరంగిల్ కవిజర్- కవియరంగిల్ కవిజర్, కలైజర్ నూలగం మదరాసు 6
కృష్ణమూర్తి ఏ : 'పాట్టుం అదన్ పొరుళుం', సెందమిళ్ సెల్వి శిలంబు 21-3
జ్ఞానమూర్తి టి. ఏ : 'తొల్కాప్పియరిన్ ఇలక్కియవడివం' All India Tamil Teachers Association – 1972, పుట 81–87
జ్ఞానమూర్తి, టి. ఏ : 'సంగక్కాల ఇలక్కియ కొళ్గైగళ్' All India Tamil Teachers Association – 1973 పుట 270 – 278

చంద్రశేఖరన్, ఆర్ : 'పుదుక్కవిదై - ఒరు మదిప్పీడు',
All India Tami Teachers Association - 1970
చిదంబరనాథచెట్టియార్, ఎ. సి. 'చెయ్యుళ్ ఇలక్కియవరలారు' కలై
క్కళంజియం, తమిళ్ వళర్చిక్కళగం, Vol 5-497, 1958
చూడివాణన్ : 'ఎదుగైయుం మోనైయుం'
All India Tamil Teachers Association 1973
జయరామన్, ఎన్. వి : 'కలివెణ్బా', All India Tamil Teachers
Association - 1973 - పుట 675-681
పులవర్ కుళందై : తొడైయదికారం, పారినిలయం, 59, బ్రాడ్వే,
మదరాసు - 1 ప్రథమముద్రణ 1967
పులవర్ కుళందై యాప్పదికారం, పారినిలయం 59 బ్రాడ్వే,
మదరాసు-1, 1959
పూవాణన్ ; సిఱువర్ ఇలక్కియచ్చెల్వర్‌గళ్. వానతి పదిప్పగం - 1976
బుద్ధమిత్రణార్ : వీరచోళియం కళగం ప్రచురణ, మదరాసు - 1970
మృదులకుమారి టి ఎ : 'సంబందర్ తేవారం' All India Tamil
Teachers Association 1973.
రాజగోపాలాచ్చారి : ఇలక్కణ విళక్కం (యాప్పియల్) స్టార్ ప్రచురం,
మదరాసు - 1962
వరదరాజన్, ము. వ : తమిళ్ ఇలక్కియవరలారు, కేంద్రసాహిత్య అకాడమి
1972
వరదరాజన్, ము. వ : 'సంగ ఇలక్కియ యాప్పు' An insight into
Tamilology, First impression, August 1972.
వీరభద్ర ముదలియార్, టి. విరుత్తప్పావియల్ or The Prosody of
Tamil Viruttams - 1939.
వెళ్ళైవారణన్ : తొల్కాప్పియం, అణ్ణామలై విశ్వవిద్యాలయము 1970
వేంకటసామి మయిలై మఱైన్దు పోన తమిళ్‌నూల్గళ్ శాంతినూలగం మదరాసు
1967
వైయాపురి పిళ్ళై, ఎస్ : ద్రావిడ మొళిగళిన్ ఆరాయ్చ్చి. మదరాసు
ప్రీమియర్ పబ్లికేషన్స్, 33. బ్రాడ్వే, 1947
శ్రీనివాస రాఘవాచార్య శిరోమణి, బి. ఆర్ : యాప్పొళి, T. T. D.

శౌరిరాజన్, పి : 'భారతియిన్ చిందుప్పావగైగళ్' **All India Tamil Teachers Association '1973,**
సుబ్రమణియన్, ఎస్. వి : తమిళిలుం మలయాళత్తిలుం మొళికట్టురెగళ్ ఉలగ తమిళ్ ఆరాయ్చ్చి నిరువనం, మదరాసు - 26.
సుబ్రమణియన్, టి : తమిళగ నాట్టుప్పాడల్గళ్, తమిళ్ పుత్తగాలయం మదరాసు - 75.

## కన్నడము

అనంతనారాయణ : ఎస్ 'ఆధునిక కన్నడ కావ్యప్రకరగళ ఛందస్సు' హొసగన్నడ కవితెయమేలె ఇంగ్లీష్‌కావ్యద ప్రభావ మైసూరు 1962
ఈశ్వరకవి : కవిజిహ్వాబంధనం, పరిష్కర్త॥ పంచముఖి, ఆర్. ఎస్., కన్నడ పరిశోధనసంస్థె, ధారవాడ, 1950
కర్కి, డి. ఎస్ : కన్నడ ఛందోవికాస భారతబుక్‌డిపో మత్తు ప్రకాశకరు హుబ్బళ్ళి, 1970
కలబుర్గి ఎమ్ ఎమ్ : 'అంశగణద ఇతిహాస' - కర్ణాటకభారతి సంపుట 8 సంచికె 7, 1975, పుట 65-72
కలబుర్గి ఎమ్. ఎమ్ : శాసనవ్యాసంగ, కన్నడ అధ్యయనపీఠ, కర్ణాటక విశ్వ విద్యాలయ, ధారవాడ, 1974
కాళీగౌడ, నాగవార : త్రిపది, రగళెమత్తు జనపదసాహిత్య, సామాన్యనిగె సాహిత్యచరిత్రె - 7, బెంగళూరు విశ్వవిద్యాలయ, 1975
కులకరణి, పి. జి : 'కెలవు కర్ణాట విషయభాషాజాతిగళు', కర్ణాటక భారతి 5-3 : జనవరి 1973
కృష్ణభట్ట కుక్కిల : 'దేశీయ ఛందస్సుగళమూల - ఏలె', మానవిక కర్ణాటక, సంపుట 1, సంచికె 3, 1971, పుట 33-59
కృష్ణమూర్తి మతిఘట్ట : 'జనపద ఛందస్సు - త్రిపదియన్నుకురిత ఒందు వివేచనె' ప్రబుద్ధకర్ణాటక 53-1, ఏప్రిల్ 1971, పుట 63-83
కృష్ణరావ్, కె. ఎమ్ : 'దాసరపదగళఛందస్సు' జగన్నాథదాసరు, మైసూరు, పుట 337-350

కృష్ణరావ్, కె. ఎమ్ : 'యక్షగానగళల్లిరువ ఛందస్సు', యక్షగానసాహిత్య ధారవాడ, 1956, పుట 80-87

బసవప్ప పట్టేద : 'కన్నడషట్పదిగళు', కన్నడసాహిత్య పరిషత్పత్రికె, 14-4, జనవరి, 1930

కేశవభట్ట, టి : 'ఛందస్సుమత్తు గురులఘుగళరహస్య' ప్రబుద్ధ కర్ణాటక, 44-2, 3 - 1962

గద్దగిమఠ, బి. ఎస్ : 'జనపదఛందస్సు' కన్నడజనపదగీతెగళు, ధారవాడ 1963 పుట 217-225

గోవిందపై. ఎమ్ : 'కన్నడషట్పదిగళు', జయకర్ణాటక 9-2,3 జనవరి 1930

చంద్రశేఖరఐతాళ గుండ్మి : 'కన్నడదల్లి త్రిపదికావ్యగళపరంపరె, ప్రగతి మత్తుప్రభావ', ప్రబుద్ధకర్ణాటక 51-2 పుట 95 - 124

చిదానందమూర్తి : ఒనకెహాడు – ఒందువివేచనె సంశోధనతరంగ – 2

చిదానందమూర్తి : 'రగళె, సరళరగళె మత్తుమహాఛందస్సు' సహ్యాద్రి – పుట 566 – 587

దేవీరప్ప. హెచ్ : 'జయకీర్తియ ఛందోనుశాసనమత్తు ప్రాచీనకన్నడ ఛందస్సు' – కన్నడసాహిత్యపరిషత్పత్రికె 40-1, 40-2 – 1955

నరసింహాచ్చార్ డి. ఎల్ : 'మానసోల్లాసదల్లిఛందస్సు' పీఠికెగళు – లేఖనగళు పుట 688

నాగవర్మ : ఛందోంబుధి పరిష్కర్త కిట్టెల్ ఎఫ్. మంగళూరు 1875

నాగరాజయ్యహంప : 'సాంగత్యద ఉగమ, లక్షణ, వికాస' సాంగత్యకవిగళు సామాన్యనిగె సాహిత్యచరిత్రె – 9, బెంగుళూరు 1975

నాయక హా. మా. కన్నడ ఛందస్సిన చరిత్రె, కన్నడ అధ్యయనసంస్థ మైసూరు 1980

నృపతుంగ : కవిరాజమార్గ, సం॥ A. వెంకటరావు, పండిత H. S. శేషయ్యంగార్, మదరాసు ప్రాచ్యపరిశోధన ప్రచురణ – 1929

పంచముఖి, ఆర్. ఎస్ : 'ప్రాస-యతి-వడి' కవిజిహ్వాబంధనం – ఉపోద్ఘాత 1950 పుట XII - XXX

పరమేశ్వరభట్ట ఎస్ వి : త్రిపదియచతుర్ముఖ, పలచంవిప్రకాశన
మంగళూరు - 3-1970
బసవరాజు, ఎల్ : కన్నడ ఛందస్సంపుట, గీతా బుక్ హౌస్ మైసూరు 1974
బేంద్రె ద రా : 'అష్టషట్పది', ఉయ్యాలె, మైసూరు 1050, మున్నుడి
మరియప్పభట్, ఎమ్ : 'కన్నడ ఛందోగ్రంథగళు' కన్నడ సంస్కృతి
బెంగళూరు, 1967
మరుళసిద్దప్ప, కె : షట్పదీ సాహిత్య, సామాన్యనిగె సాహిత్యచరిత్రె - 6
బెంగళూరు విశ్వవిద్యాలయ. బెంగళూరు 1975
మల్లారి మేవుండి : 'కందద చక్కంద', జయంతి, 26-9, మార్చి 1964
మాధవపై, ఎమ్ : రగళె ఎందరేను ?, 'సాధనె సంపుట 3 సంచికె 2,
1974, పుట 154 - 159
ముగళి, ఆర్ : కన్నడ సాహిత్య చరిత్రె, ఉషా సాహిత్యమాలె,
మైసూరు - 1, 19
రామచంద్రరావ్ పట్వారి : కన్నడ కవిత్వదల్లి ప్రాస వసంత సాహిత్య
శారదా మందిర, మైసూరు 1973.
రేణుకాచార్య. డి : 'ప్రాసద చరిత్రె' శరణ సాహిత్య 1-10
లింగణ్ణ సింపి, ఉత్తర కర్ణాటకద జనపద గీతిగళు, ఐ. బి. హెచ్. ప్రకాశన,
బెంగళూరు, 1977
వెంకట కృష్ణారావు, యు. 'కన్నడదల్లి లావణిగళు' జీవన 18, పు 453.
వెంకట నారాయణప్ప. బి. 'పిరియక్కరం - మహాక్కర' కన్నడ సాహిత్య
పరిషత్పత్రికె, 17-4, జనవరి 1933.
వెంకటరాయకవి, 'కన్నడ దొళ్ ప్రాసమైచ్ఛికం', శరణ సాహిత్య 3-2
వెంకటరావు, ఎ. కవిరాజమార్గ, ఆనందాప్రెస్, మదరాసు 1930.
వెంకట సుబ్బయ్య, అ. 'కర్ణాటక విషయజాతి ఛందస్సు' కన్నడ సాహిత్య
పరిషత్పత్రికె 20-3, అక్టోబర్ 1935, పుట 229-242.
వెంకటాచలశాస్త్రి, టి. వి. కన్నడ ఛందస్సు, డి. వి. కె. మూర్తి ప్రకాశన
మైసూరు - 4, 1976.

వెంకటాచలశాస్త్రి, టి. వి. కన్నడ ఛందః స్వరూప డి. వి. కె. మూర్తి ప్రకాశన, మైసూరు 1978
శరభయ్య, ఎం : 'యతి' జయకర్ణాటక 12-8 పుట 12-17
శివరామఐతాళ : అక్కర - నడువణక్కరగళు - సాధనె, సంపుటి 4 - సంచికె 1 - 1975, పుట 145 - 148
శివరామ ఐతాళ : కన్నడ ఛందస్సినపరిచయ, డి. వి. కె. మూర్తి ప్రకాశన, మైసూరు, 1971
శివరామ ఐతాళ : 'జానపద ఛందస్సు', కన్నడవిశ్వకోశ, 7వ సంపుటము, 678 - 682
శివరామ ఐతాళ : 'హొసగణవృత్తాంత', కన్నడసాహిత్యపరిషత్పత్రికె, 49-2, డిసంబరు 1964-1-19
శ్రీకంఠయ్య, టి. ఎన్ : 'మాత్రె, ముడి, వద్మగణ', సమాలోకన, మైసూరు, 1958 పుట 205-221
శ్రీధర బి. హెచ్ : 'హొసగన్నడ ఛందోవికాస' కన్నడసాహిత్య పరిషత్పత్రికె, 41-1, 2; జూన్, డిసంబర్, 1956
శ్రీనివాసరాఘవాచార్య : 'కర్ణాటక ఛందస్సు', కన్నడకైపిడ 1-2, మైసూరు విశ్వవిద్యానిలయ, మైసూరు, 1936
సదానందనాయక : కన్నడ సాహిత్యదల్లి కావ్యప్రభేదగళు, ప్రతిభా గ్రంథమాలె, ధారవాడ, 1974
సీతారామ జాగీర్దార్ : 'కన్నడ రగళె ఛందస్సుగళు' ప్రబుద్ధకర్ణాటక 51-1, 1969
సీతారామయ్య, ఎమ్. వి : 'ఛందోగ్రంథగళ ఇతిహాస', శాస్త్రసాహిత్య సామాన్యసెగె సాహిత్యచరిత్రె - 3, బెంగుళూరు, 1975 పుట 111-149
సీతారామయ్య వి : యక్షగాన, ఐ బి. హెచ్. ప్రకాశన - 1975
సుందరం ఆర్. వి. ఎస్ : 'కన్నడమత్తు ఇతర ద్రావిడభాషాసాహిత్యగళు' కన్నడ అధ్యయన సంస్థెయ కన్నడ సాహిత్యచరిత్రె 1 Vol - 1974 (మైసూరు)

# ENGLISH


| | |
|---|---|
| Achyuta Menon | Ezuttaccan and His age, University of Madras |
| Anujan, O. M. | Metrical Structure of the South Indian Languages - Indian Literature, vol. 16 Indian Institute of Advanced Study, Simla, 1972. |
| Anujan, O. M. | Malayalam and Tamil Metres - A Comparative Study D. L. A. S,, Seminar on Metre, 1974. (Typed Copy) |
| Arumugam, K. | Rhythmic Adjustments in Tamil and Malayalam Metres. D. L. A. S. Seminar on Metre, 1974 (Typed Copy) |
| Besse, S. J. | A Grammar of High Tamil Latin Test with English TRANSLATION By B. G. Balington, 1917. |
| Brown, C. P. | The Prosody of the Telugu and Sanskrit Languages Explained. S. V. University, Tirupati, 2nd Ed. 1977. |
| Chengalvaraya Pillai, V. S. | History of the Tamil Prose Literature. Kalagam Publications. |
| Chidambaranadha Chettiyar, A | Advanced Studies in Tamil Prosody, Annasamalai Univ. 1949. |
| Damodaram, G. | Commonness in the Metres of Tamil and Telugu (Typed Copy) D. L. A. Seminar on Metre, 1974. |
| Gnyana murthi, T. E | Tolkappiyar's Literary Techniques. All India Tamil Teacher's Association, IV, 1972 |
| Ilakkuvanar, S. | Tolkappiyam in English with Critical Studies, Pub. Kural Neri Publishing House, Madurai - 6, 1963. |
| Karanth, K. S | Yakshagana - The institute of Kannada Studies University of Mysore, 1975 |

Kedillaya, A. S — Commonness in the metres of Kannada and Telugu. D L. Seminar on Metre, 1974 (T}ped copy)

Kor, W. P. — Form and Style in poetry, Lecturers and notes Ed. by R. W. Chambers, London, 1966

Kishore Chaitanya — A History of Malayalam Literature Orient Langmans - Madras, 1971

Kodanda Ramaiah, T. — The Commonness in the Metres of Tamil and D. L. A. Seminar on Metre, 1974 (True Copy)

Kodandaraman — 'Concept of acai in Tamil Prosody' AIUTTA 6th Conference, 1974.

Krishnamacharya, K — History of Sanskrit Literature

Krishna Warriar, N. V — A Study of Malayalam Metres, M Litt These, Madras University, Aug. 47 (un-published)

Kundanagara, K G. — Karnataka Vishyajati B. U J. Sep. 40, 1xp 2 170-181

Mariappa Bhatt, M — Dasi element in Kannada Literature, 11th Session of All India Oriental Conference.

Meenakshi Sundaram, T.P — History of Tamil Literature, Annamalai Univ. 1965

Meenakshi Sundaram, T.P — The Theory of Poetry in Tolkappiyar, Prof. T.P.M. 61st Birth Day commeoration Volume

Meenakshi Sundaram, T. P — Tolkappiyam's Literary Theory, Tamil Culture XII 1960

Nagaiah, G — Common features of Desi Metres in Kannada and Telugu, D.L.A. Seminar on Metre, 1974 Typed Copy)

Parameswara Nair, P. C — History of Malayalam Literature, Sahitya Academy, New Delhi

Radhakrishna Sarma, Challa — Tamil Elements in Telugu Literature, M. Litt These University of Madras, 1964, (un - published)

Raja, K. K. The Influence of Sanskrit on the Dravidian Literature with Special Reference to Malayalam Indian Literature, Indian Institute of Advanced Studies Simla, 1972.

Rajagopal Rao, T. A Comparative Prosody of Dravidian Languages, 1913

Ramachandra, V. The Commoness in Sanskrit and Telugu Metres, D. L. A, Seminar on Metre, 1974 (Typed Copy)

Ramakoti Sastry, K. V. Common features in the metres of Telugu and Kannada languages, D. L. A S. Seminar on Metre 1974, (Typed Copy)

Ramakrishnaiah Korada Proceedings and translations of the 10th All India Oriental Conference at Tirupati in 1940, Published in 1941

Ramakrishnaiah Korada Telugu Literature outside the Tamil Country. Annals of Oriental Research, Volume I, 1941

Ratnam, K. P. Development of Tamil Prosody. A. O. R., Madras, 1957

Rice, E. P. A History of Kanarese Literature, 'The Heritage of Indian Series, 1921, Calcutta.

Richard, I. A. Principles of Literary criticism, London, 1952

Saradakrishnan O. T. Malayalam Prosody, A.O.R., Madras, 1937

Sarada Krishnan, O. T. The Metre of Vatakkan Pattugal A. U. O. R. Vol. II, 37-38.

Singh, J. N. Contribution of Hindi Poets to Prosody, Allahbad University.

Thani Nayagam Apperception in Tamil Literary Studies. Tamil Culture, Volume 12 1966.

Thayagaraj, D. Trends in Modern Poetry, A Glimps of Tamilology. The Academy of Tamil Scholars of Tamil Nadu, 1968.

Venkatachalem, K. Commonness in the metre of Tamil and Malayalam, D. L. A. Seminar on Metre, 1974,

Venkata Rao, N. Selected Telugu Inscriptions, (Telugu and English) University of Madras, 1952.

# ఒప్పుల పట్టిక

| పుట | పంక్తి | ఒప్పు |
|---|---|---|
| 1 | 8 | శబ్దోఽస్తి |
| 9 | 14 | ఛాందోగ్యోపనిషత్తు |
| 14 | 1 | ఛందశ్శబ్దము |
| 14 | 14 | in its |
| 20 | 7 | యాప్పు |
| 20 | 18 | సమకూర్పలేదు |
| 23 | 11 | త్రిష్టుప్ |
| 27 | 8 | Kannada |
| 45 | 11 | తోదకము |
| 45 | 17 | 1977 |
| 46 | 8 | ప్రకటితము |
| 47 | 19 | నెడుంగాడి |
| 49 | 7 | డా. టి. వి. మెత్యూ |
| 60 | 22 | దళాక్షి |
| 61 | 2 | కరణీ |
| 68 | 17 | వివరణలేదు |
| 71 | 22 | గురవశ్శేషాః |
| 85 | 12 | యథావృత్త |
| 89 | 8 | మాండవ్యా |
| 89 | 16 | రీడితం |
| 89 | 17 | శ్రవణ |
| 90 | 7 | పాదా |
| 101 | 8 | ధాత్రీ |
| 103 | 22 | భరదిం |
| 115 | 22 | సరోజాంబ |
| 124 | 16 | ముత్తే |
| 126 | 24 | మామియునీ |
| 128 | 6 | పిరియక్కరె |
| 129 | 24 | కండ |
| 134 | 10 | హాడు |
| 144 | 1 | ధవ |
| 170 | 14 | అనవద్యం |
| 173 | 11 | మణిపణ్ణకా |
| 173 | 23 | శ్రేష్ఠా |
| 180 | 6 | త్రిభువన |
| 180 | 8 | భువనోపకార |
| 181 | 20 | చంద్రతారంహా |
| 182 | 7 | కేశితాః |
| 193 | 12 | అథవా |
| 195 | 25 | చిత్రకవి |
| 202 | 20 | పద్యాన్నిశేషు |
| 206 | 5 | పురుష |
| 206 | 24 | ఎంటెసళ |
| 214 | 11 | ఓ ఎగంటి |
| 227 | 26 | దుష్ట |
| 238 | 25 | నాథాయ |
| 240 | 3 | తపవోజ |
| 256 | 2 | శతమాత్ర |
| 256 | 4 | బాగథనా |
| 259 | 8 | కొట్టితు |
| 265 | 6 | భరదించెర |
| 265 | 11 | కేళెరడు |
| 265 | 19 | పలనాఋను |
| 272 | 17 | ప్రముఖాది |
| 274 | 21 | ఆటవెలది |
| 275 | 21 | గండపెండ |
| 290 | 21 | చుట్టుక |
| 290 | 25 | ఏకాశి |
| 292 | 22 | తుడుచుకో |
| 293 | 6 | ఆడివద్న |
| 293 | 14 | తసిచ్చొప్పెన్ |
| 302 | 12 | కుచచూ |
| 306 | 6 | ఇష్టేను |
| 320 | 17 | ద్వివిధంస్మృతమ్ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 321 | 20 | వయిట్రు | 345 | 18 | తావు |
| 322 | 17 | దశావతారచరిత్ర | 346 | 3 | సీమోల్లంఘనె |
| 324 | 12 | ఆడిరూంజల్ | 347 | 2 | బెంబెడు |
| 326 | 12 | ఉరముపై | 357 | 4 | క్రొత్త |
| 329 | 16 | సుండెదమిక | 361 | 24 | హోగ్గిని |
| 330 | 16 | సంగీత | 362 | 17 | కుణియోణ |
| 330 | 16 | నందనార్ | 362 | 20 | కుణియోణ |
| 330 | 17 | ముత్తుస్వామి | 369 | 4 | కాలయోనిలో |
| 330 | 24 | వందపినై | 373 | 5 | కూగువ |
| 331 | 5 | వేండుం | 382 | 18 | లకుమబరు-వగురెప్ప- |
| 334 | 22 | మాడోణ | | | లనువిప్పె-రాయనికి- |
| 341 | 8 | తొనప్పను | | | పోవుప్రాణమువచ్చె |